శ్రీమత్పరదేవతాయై నమః

# నానారాజసందర్శనము.

తిరుపతి వేంకటీయము.

2 వ ముద్రణము.

కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1931.



పోస్టేజీసహా.



శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము.

చదువరులారా !

నానారాజసందర్శనమను నీపొత్తము మీకుఁ జిరపరిచితమే యగుటచే నిందునుగూర్చి విశేషించి చర్చింపనవసరము లేదు. ప్రథమ ముద్రణమునందు దీనికిఁ గొండొకదీర్ఘమైన యుపోద్ఘాతము లిఖింపఁబడుటయే కాక యందు మాజాతకచర్యనుండి కొన్నిభాగములుసయితము [illegible] యుదాహరింపఁబడినవి. కొలదికాలములో నాపొత్తముగూడ ముద్రింప నిశ్చయించుటచే నిప్పు డాభాగముల నుదాహరింపలేదు. వెనుకటిముద్రణమునాఁటికి మావయస్సు సుమారు నలువదికి దాదాపు. ప్రస్తుతమో? అఱువదికిమించినది. కావున నప్పటికన్న నిప్పుడెన్నియో పద్యములు పెరిఁగినవి. ఇప్పటికిఁ బదివత్సరములకు మున్ను మా యిరువురలో నొకరు స్వర్గస్థులైనవిషయము మీ కెఱుఁగనిది కాదు. అయినను, "తిరుపతివేంకటీయము"ని యే గద్యాదులలో వాడుటకు దూరదృష్టిగలవారు సంశయింపకున్నను గొందఱేని సంశయింపకపోరు. ఈపొత్తము మాటకేమి దీనిలో నిరువుర కవిత్వముకలదు గాన నట్లు సమాధానము చెప్పికొననగు. కేవలము నొకరే రచించిన పొత్తములయందుఁగూడ నట్లు వ్రాయుట కర్థమేమేనిగలదా? యని యందురేని వినుఁడు.

"ఒక్కరురచియించిరేనియును గాదగుఁ దిర్పతివేంకటీయమై"

అని నేను జాతకచర్యలో వ్రాసియే యున్నాఁడను. మాయేర్పాటట్టిది. మేమిరువురము గలిసి సంచారమొనర్చుకాలమునందలి రచనలు విడఁదీయ శక్యముగాకున్నను నిటీవలి రచనయందలి విషయములనుబట్టి యాయాకర్తృత్వము విజ్ఞులకు సుబోధమే గాన దానికై యిందుఁ గొన్నిపంక్తులు వ్రాయవలసిలేదు. ఇప్పటిముద్రణమున మునుపటికన్న రెట్టింపుగ్రంథము పెరిఁగినది. కాని యిప్పుడేని యాయాప్రస్తావములయందలి పద్యములన్నియు నిందు సేకరింపఁబడినవని యనుకొనరాదు. మామాంశ్రద్ధాలోపమువలన నెన్నియో పద్యములంతరించినవి. వెనుకటిముద్రణమున గ్రంథభాగమునఁ జేర్ప మఱి

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 8 | దాకిన | దాఁకిన |
| 8 | 26 | యుంట | యుంటి |
| 9 | 4 | పోత్క | పోల్క |
| 10 | 8 | రాజ్ఞ్ఞప్రాప | రాజ్ఞప్రాప |
| 12 | 5 | నగ్గర | దగ్గఱ |
| 14 | 9 | యోగాపూ | యోగారూఢి |
| 14 | 20 | దేవ | దేశ |
| 15 | 4 | త్రైతోక్య | త్రైలోక్య |
| 18 | 8 | వృత్యా | హృత్యా |
| 22 | 1 | రెమ్మని | లిమ్మని |
| 22 | 12 | అర | అఱ |
| 24 | 24 | చేతఁ | చేఁత |
| 25 | 16 | కివి | ఠివి |
| 26 | 10 | భాగ్యది | భాగ్యతి |
| 27 | 1 | నీలీలఁ | నీలీలల్ |
| 33 | 6 | నిరిక | నిఱీక |
| 34 | 9 | నూలుర్వ | నూపుర్వ |
| 35 | 11 | జెప్ప | జెప్పు |
| 35 | 12 | లగాఁకొని | లగాంకొని |
| 36 | 17 | దీంద్రించు | తీఁద్రించు |
| 40 | 18 | సరిని | సిరిని |
| 45 | 5 | నాద | నాదరంబె |
| 45 | 10 | విడియు | విడిచియు |
| 45 | 13 | గుదినహా | గుదిరనహా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 90 | 4 | వచించుగదసా | వచించుచునుజో |
| 91 | 2 | నహ్పాతె | నస్నాతె |
| 92 | 5 | భవానీ | యుష్మా |
| 93 | 21 | తద్జ్ఞ | తజ్ఞ |
| 95 | 17 | నాటి | నాఁటి |
| 96 | 4 | మ్రాగున్ | మ్రాకున్ |
| 96 | 6 | పాలిగాఁ | పాలిఁగా |
| 98 | 1 | తృష్ణగతు | తృష్ణక్త |
| 99 | 23 | గాండీద | గాండీవ |
| 105 | 5 | తలప | తలఁప |
| 106 | 7 | విద్వా | విద్యా |
| 106 | 25 | రయించి | రచియించి |
| 109 | 10 | గాలెవ్వరి | గాలువ్వర |
| 109 | 14 | ఫాలస్స | ఫాలస్ను |
| 110 | 20 | ఉద్య | నార్య |
| 111 | 10 | యంతుగ్రి | యింతుగ్రి |
| 111 | 26 | మహాహో | మహాహా |
| 114 | 27 | వృగాం | చుభ్భం |
| 116 | 8 | సగ్రి | సంగ్రి |
| 116 | 12 | సఘా | సంఘం |
| 117 | 5 | పిర్నిసి | పర్నిసి |
| 118 | 4 | లోకసువ | లోఁకువ |
| 118 | 8 | తరి | తలరి |
| 120 | 10 | వినము | వినుము |
| 120 | 16 | తుంబాటిఁ | తుఁటాటిఁ |
| 121 | 2 | నాకాభ్యహా | నాభ్యహా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 122 | 4 | సెచితిన్ | సెంచితిన్ |
| 124 | 24 | వగృహా | నవగృహా |
| 125 | 2 | మహాత్య | మహాత్వ |
| 125 | 9 | మూాత | మూాఁత |
| 125 | 20 | గాడోఁ | గాఢోఁ |
| 126 | 13 | వపత్రి | వనపత్రి |
| 126 | 18 | వాని | వానిఁ |
| 131 | 7 | ఏలిం | నేలిం |
| 131 | 27 | బ్రబల | ప్రజల |
| 136 | 25 | జేయు | సేయు |
| 140 | 7 | కిని | కిన్ |
| 140 | 20 | తలంపన్ | తలఁపన్ |
| 145 | 8 | బొంద | బొంగ |
| 151 | 4 | నసగ | సీనగ |
| 152 | 22 | దృటి | దు్రటి |
| 153 | 22 | ద్విజ | ద్విజ |
| 156 | 10 | వ్రాతల్ | వ్రాఁతల్ |
| 157 | 12 | భాంధ | బాంధ |
| 157 | 27 | కింవదంతి | కింవదంతిక |
| 158 | 6 | యెతోఁ | యెంతోఁ |
| 161 | 3 | తాలూాకా | తాలుకా |
| 161 | 10 | ములందు | మందు |
| 161 | 11 | వనవం | నవనవం |
| 161 | 11 | గ్రిధ | గ్రంధ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 162 | 15 | డయ్యుఁగా | డయ్యునాయెడలఁగా |
| 162 | 21 | బ్రాకం | బ్రాఁకం |
| 163 | 19 | బధిష్టం | బహిష్ఠం |
| 168 | 18 | గారెద | గోరెద |
| 171 | 6 | పా గాక | పాఁగాక |
| 173 | 4 | నిఁబతి కను | నిఁబత్రికఁ |
| 174 | 7 | టముఁన్ | టముఁల్ |
| 178 | 15 | బుచ్ఛ | బుచ్చు |
| 178 | 18 | మీాన | మీాస |
| 178 | 24 | యునేతా | యనేతా |
| 179 | 20 | ద్యమో | ర్యమో |
| 180 | 26 | నెద తొందర | వెంద లందల |
| 183 | 28 | సగ్రత | సస్థిత |
| 187 | 8 | మించువాఁడని | మంచివాఁడను |
| 187 | 10 | ననుగుఁ | ననుఁగుల్ |
| 188 | 16 | మనున | నుమన |
| 191 | 3 | చుటఁ | చుటల్ |
| 191 | 23 | టుబాఁ | టవో |
| 192 | 8 | నినిః | నిల్ |
| 192 | 26 | మాత్ర ? | మీాత్ర ? |
| 192 | 30 | పుషట్ | సపుత్రా ? |
| 193 | 4 | నర్ధఁగా | నర్థగా |
| 193 | 12 | చాటుఁగ | చాలుగ |
| 194 | 2 | తాదు | తోదు |

## ౮ దవ అర్జీ.

1. సీ॥ పరదేశసంపాదనరతి మీకు నరేంద్ర? పరదేశసంపాదన రతి మాకు
లసదుత్తమపదాభిలాష మీకు నరేంద్ర? లసదుత్తమపదాభిలాష మాకు
సకలసత్యశ్లోకసక్తి మీకు నరేంద్ర? సకలసత్యశ్లోకసక్తి మాకు
మనుమార్గవర్తనం బనువు మీకు నరేంద్ర? మనుమార్గవర్తనంబనువు మాకు

ఆ॥వె॥ మీకు రాజపదము మాకును గవిరాజ, పదము కలదిఁ కేందుఁ గొదవ లేదు
గాన సామ్యమిచ్చి మానించుటొప్పదే?, ముద్దుకృష్ణయాచభూవరేణ్య. ౨౬

2. సీ॥ కఠినమ్ములగు బాళ్లు కలిపి కట్టినరామభజనాలయమ్ములే పడక గాయెఁ
జాకినమాత్రానఁ దనువు కళ్లుగఁ జేయఁ జాలినచలినీట స్నాన మాయె
నుడికిరయు నుడుకని కడువేడి మెతుకులే యాఁకొన్న కడుపున కడ్డమాయెఁ
"ప్రభు విచ్చె వేమాటుపదియూలు" లనునట్టి స్వప్నమ్ములే ధనార్జనములాయె,

తే॥గీ॥ వీని నన్నింటి గోపాలవిభుఁడు దీర్చె, మరల నీలాటికష్టముల్ మాకు దూర
తగములైయుండఁ జేయుమి త్రతతినిఁ, గీర్తి, సాంద్ర? శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప?

3. సీ॥ పరదేశములఁ దివ్యతరదేశములు గాఁగఁ, బరుల గ్రామములు కాఁపురము గాఁగఁ
బరగేహములు సౌఖ్యకరగేహములు గాఁగఁ, బరులయన్నము పుష్టికరము గాఁగఁ
బరసజ్జనావళుల్ పరమబంధులు గాఁగఁ, బరులసంపదలు సంపదలు గాఁగఁ
బరులకష్టసుఖమ్ము లరయువారలు గాఁగఁ, బరులెల్లఁ గార్యతత్పరులు గాఁగఁ

తే॥గీ॥ జేసి పుట్టించినట్టి జేజేలపెద్ద, పండితశ్రీలనొప్పు మీవంటినృపతి
మణులఁ గొండఱ సృజియింపమఱచిపోయె, నేమనందుము? ముద్దుకృష్ణేంద్ర? విధిని.

4. సీ॥ ఏరాజు కవిరాజు నేనుంగు నెక్కించి యూరేఁగఁ జేసె నీయూరియందు
నేరాజు కవిరాజుచే గజితశతావధానమ్ము చేయించి పూనెఁ గీర్తి
నేరాజు వేదాంతసారబోధక సుప్రబంధముల్ రచియించి వన్నెకెక్కె
నేరాజు "సర్వవిద్యారా" జటఁచూను గవులచే సన్నుతి గాంచి మించె

గీ॥ నట్టివిద్వత్కుమారభూపాగ్రగణ్య, పూర్వకృతపుణ్యరాశి? యోముద్దుకృష్ణ?
స్వాగతంబుగ దర్శనం బీఁ గదయ్య? ఘనతఁ దిరుపతివేంకటకవులకిపుడు.

5. సీ॥ శ్రీనాథముఖకవిశ్రీనాథు లేవంశసంస్థానమందు నాస్థానకవులు
రాయవేశ్యాభుజంగాయితసింగభూపాలుఁ డేవంశసంపత్కరుండు
ఖడ్గనారాయణఖ్యాతి గాంచినపోతభూపాలుఁ డేవంశభూషణంబు
మఱియు నెంతయు మహామహులై చెలంగిన రాజన్యు లేవంశరాజిమణులు

గీ॥ అట్టివెలుగోటివంశభూపాగ్రగణ్య, పూర్వకృతపుణ్యరాశి? యోముద్దుకృష్ణ?
స్వాగతంబుగ దర్శనం బీఁగ దయ్య? ఘనతఁ దిరుపతివేంకటకవుల కిపుడు.

6. ఉ॥ దేవరయాజ్ఞ వైకొనక తెంపున నెల్లూరిపట్టణమ్ము ముక్
బోవుట మంచి గా "దయినఁబోవుట కేమినిమిత్త?" మన్న నో
భూవర? శుద్ధవైదికులబుద్ధి మహత్త్వపటుత్వసంపదల్
దేవరవారిచిత్తఘనశిలిక్ జొరఁబాఱి ముదమ్ము సేయఁగన్. 30

7. ఉ॥ ఎచ్చట నుండె నీనగర? మెచ్చట మాధవశేశ్వరుఁ? డహో!
యిచ్చటి కేగుదెంచు నెడ నెందఱు వద్దఁ గలారు రాజ? తే
మచ్చటి కేగ కిచ్చటికి నచ్చుగ వచ్చుట కిచ్చఁ జాడ నీ
సచ్చరితంబ కాక నృపసత్తమ? వేఱొక హేతు వున్నదే? 31

8. క॥ ఎచ్చట గోదావరి? మఱి,యెచ్చట నీవేంకటగిరి? యింకేవఱుకు నీ
సచ్చరితము విని కాదే? వచ్చితిమి నృపాల? సుకవిపండితపాలా? 33

9. క॥ ఈగ్రైలుబండిపొగచే, దారిని దొరకొన్నయట్టితాపము నీస
త్కారుణ్యామృతశీతల, ధారలఁ బో నడఁపఁబలయు ధరణీపాలా. 34

10. క॥ కవులవలనఁ బ్రభువులకుఁ బ్రభువులవలనఁ గవుల కిలను భూరియశము సం
భవమందుఁ గానఁ గవులఁ బ్రభువులత్యాదరముతోడఁ బూజింత్రు నృపా!

11. క॥ ఈవిషయం బంతయుఁ దమ, కే విశదము వేఱె చెప్పనేల? యయిన నీ
మావైదికచాదస్తం, బీవిధమున వ్రాయఁ జేసె నిపుడు నృపాలా? 35

## అవధానకవితా విషయకమగు నుత్పలమాలిక.

1. ఉ॥ వీనుల విందు సేయఁ గలవిద్య కవిత్వము దాని కెంతయున్
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగఁ గావలెన్
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగుకాల మం
దైనను బంధచిత్రకవితాదులు సెప్ప నతిప్రయాస మౌ

శుభమస్తు. అవిఘ్నమస్తు.

శ్రీమత్పరదేవతాయై నమః

# నానారాజసందర్శనము, పూర్వార్థము.

తిరుపతివేంకటీయము.

## వేంకటగిరిలో శ్రీరాజావారి భావమఱఁది చెలికాని గోపాల రావుగారికంపిన అర్జీపద్యములు.

1. సీ॥ దర్శనీయంబు గోదావరీతీరంబు వాసంబు సద్గుణావాస? మాకు
సద్గర్వనిర్వేద సద్బ్రహ్మయజ్ఞశాస్త్రి గురువరేణ్యుఁడు ధరాధర? మాకు
అమృతావధానసత్క్రియ మంచినీళ్ల ప్రాయము కళానిపుణ? మాకు
శబ్దశాస్త్రప్రశస్త ప్రభావంబు లతిప్రియమ్ము గవ్యచారిత్ర? మాకు,
తే॥ గీ॥ పండితప్రీతి నొప్పు మీ వంశకర్తృపతులు, లధికదివ్యప్రతాప? మాన్యమ్ము మాకు
వినయసుగుణరాజ్యధారాకవిత్వసరణి, కేళికాభూమి మాకు గోపాలరాయ?

2. సీ॥ కావ్యసహస్రాగ్రి కావ్యమ్ములు రచించి కాళికృపం గొంచుం గాంచినాము
ధాతురత్నాకరోద్గ్రామ చంపు రచించి పాణినీయస్తుతుల్ వడసినాము
వేదమా పాణినీయాగమమ్ము పఠించి మించి దేశికుల మెప్పించినాము
కాకినాడాదినగరమ్ముల శతావధానమ్ము చేసి కీర్తిఁ బూనినాము.
తే॥ గీ॥ "ఇంకను భవదీయసన్నిధి నెపుడు మన్న, నలుల కొంచు" నటంచు నిన్నాళ్లనుండి
కాచియున్నాము శ్రీచెలికానివంశ, వారిధిశశాంక? రాజగోపాలరాయ?

3. శ్లో॥ రాజానో విరళాస్తతోఽపి గుణినస్తత్రాఽపి విద్వత్ప్రియా
స్తత్రాఽప్యుత్తమపండితైః పరిచితా గోపాలభూమీపతే
విద్వాంసో విరళాస్తతోఽపి కవయస్తత్రాఽఽశుధారాంకితా
స్తత్రాఽప్యవధానినస్తదుభయం దైవేన రాశీకృతం॥

4. శ్లో॥ యస్యాఽఽస్తే బుధతత్త్వవిత్త్వమతులం సోఽయం దరిద్రాయతే
యస్యైశ్వర్య మతీవ భాతి స పుమాన్ విద్యావిహీనాయతే
శ్రీగోపాలనరేంద్ర సర్వత ఇదం స్వాభావికం దృశ్యతే
కిం త్వస్మాక మదృష్ట మద్య ఫలితం యత్త్వం ధనీ పండితః. ౪

## ప్రసంగవశమునఁ జెప్పినది.

1. మ॥ "సభ చేయించునో లేదో" యంచు మొదలన్ సందేహ మావిూఁద "నీ
సభలో నేమిటు లోప మౌనో" యనుచున్ సందేహ మావిూఁద "నీ
సభలో నింతకు లాభ మేమొ?" యనుచున్ సందేహ మూహింప నీ
సభలన్ జేసెడివారె పో! జగతిలో సందేహసంగతుకుల్. ౫

## అంటుజోడిచ్చినప్పుడు చెప్పినది.

1. క॥ శ్రితహితకార్యరతుం డను, నతికిన్ గోపాలరాయ! నూనముగా నీ
వ తగుదు వీసంగతి స, త్కృతి గను నాశ్రితులఁ జూడఁ దెల్లము కాదే?

## సెలవుసమయమున జెప్పినది.

1. సీ॥ పండితుం డనెడిశబ్దము కర్ణపథమునఁ బడిన మాత్రన పిల్వఁ బంపునతనిఁ
బంపియాతని కెంతపాండితీపటిమంబు గలదో యంతయును దాఁ దెలియఁ జూచుఁ
జూచి యాతఁడు తన్నుఁ జూడ నేమిపరిస్థితి గానో యట్టి సంగతుల నడుగు
నడిగి యాతనికోర్కెకధికమ్ముగా నిచ్చియును "గొంచెమిచ్చితి" ననుచుఁ గుందు,

తే॥గీ॥ గుంది తిరిగియు నిచ్చు ద్విగుణముగాఁగ, నిచ్చినరలయు నిచ్చు నిట్లిచ్చి యిచ్చి
మరల నిచ్చును మఱియిచ్చు మఱియు నిచ్చు, నహహ! గోపాలవిభు వదాన్యత్వమహిమ

## వీరితో తిరుపతి వెళ్ళినప్పుడు స్వామిసన్నిధిని జెప్పినవి.

1. సీ॥ కాసుచొప్పున నింతిగా నార్జనముచేసి తెంతె దెచ్చినను మాకింక లేదు
గడగడలాడి నిన్ గానంగ నేతెంచుతుగానఁ బోయినమమ్ముఁ గాంచుటరిది
ప్రీతితో నీవు సర్పింతు రంతైన మాకింతయిచ్చియు నెంతు రంతో యనుచు
శిలించి నీవు వాంఛితము లిత్తురు సేవకాపించినను మాకుఁ గాసు నీరు,

తే॥గీ॥ వేయిమాటలఫలమేమి? వేరులొక్క, రైన నీదృష్టములు వేలు రై వెలంగు
సరస తిరువది వేంకటేశ్వర కవీంద్ర, శరణ తిరుపతి వేంకటేశ్వర కి నమోఽస్తు.

2 సీ॥ ఆసించెదేలొకో? కాసులార్జింపంగ శుద్ధదారిద్ర్యవిస్ఫూర్తి తనర
లక్షించెదేలొకో? లంచమిచ్చినవారిఁ బత్తుపాతివిధమ్ము బయలుపడఁగ
హింసించె దేలొకో? ఋణమిచ్చి నృపకోటిఁ బెద్దకోమటిసెట్టివిధము దోఁప
వసియించెదేలొకో? పర్వతాగ్రమ్మునై వేఁట లాడెడిబోయసాటి దెలియ

తే॥గీ॥ నాకు నివి యన్నియును నవ్వనడక లంచు
దోఁచు నీచిత్తమున కేమి దోఁచు నొక్కొ?॥ సరస? తిరుపతి॥

## సంస్థానాధిపతి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రులు. (అర్జీ)

1. చ॥ తిరుపతివేంకటేశకవిధీరుల మేము శతావధానముల్
సరసము రచింపఁగాఁ బటిమ సన్నిన వాసము శబ్దశాస్త్రధీ
వరులము సర్వపాపభయభంజన రాజనఖండ గౌతమీ
సరిమధ్యతీరవాసులము సాకకళాకర? యాచభూపతీ! ౧౦

2. ఉ॥ పండితమండలీహృదయపంకజభాస్కరుఁడంచుఁ బండితా
ఖండలు లెల్లనిన్నుఁ గల నఖండనవస్యళ ముగ్గడింపఁగా
నిండుమనమ్ముతోడ విని నేఁటికి నీనగురాజధానికిన్
బండువుగాఁగ వచ్చితిమి పాలనసేయుమి? యాచభూపతీ! ౧౧

3. సీ॥ ఒకనాయ వికచాంబుజాకనాక చికనాక పకికాచణాక్షౌనుజమ్ము లొప్ప
నొకదండ మతిచండిమ కరండబాండమండనపండితోద్దండు లొప్ప
నొకపక్కి శుకతజ్జ్ఞ కనారసజనకనాకకవీంద్రసదకవిప్రకర మొప్ప
నొక పోటు సకలవాగ్వికసన ప్రకరశలవ్యంది మాగధజనుల్ వలులు మండ,

తే॥గీ॥ వెంకు వేరోలగమ్మున నుండునిన్నుఁ, బండువుగఁ గాంచు భాగ్యమ్ము పండె మాకు
నిపుడు, శ్రీరాజగోపాలకృష్ణయాచ, భూప! ధీవర! మహారాజ! భూరితేజ!

## ఎమటఁ జదివినవి.

1. సీ॥ ఆవాస మెన్న గోదావరీతీరమ్ము కుల మెన్న బ్రాహ్మణకులము మాకు
వయసు నెన్నంగ నిర్వదికించుమించు వర్తనము నెన్నఁగఁ గవిత్వమ్ము మాకు
గురువు నెన్నఁగ బ్రహ్మగురుపండితుండు శాస్త్రమ్ము నెన్నంగ శాబ్దమ్ము మాకు
దారిద్ర్యమెన్న విస్తారమ్ము మతికుటుంబమ్ము నెన్నఁగ విస్తృతమ్ము మాకు,

తే॥గీ॥ దానపాత్రులమేముదాతలంచుమీరు, పైనిమీచిత్తమునుమాదుభాగ్యమునర
రేంద్ర? శ్రీరాజగోపాలకృష్ణయాచ, భూప! బహదర్ మహారాజ!భూరితేజ!

2. సీ॥ అలభోజుఁ జెప్పంగ నారంభమును జేసి కాళిదాసునిఁ జెప్పి గాని మాన
రలవిక్రమార్కుయోగ్యత చెప్పఁగాఁ బూని భట్టిఁ జెప్పకమున్నె గట్టిపెట్ట
రల్లరాజనరేంద్రు నారంభమునుజేసి నన్నయఁ జెప్పకమున్నె మాన
రలకృష్ణదేవరాయలఁ జెప్పఁగాఁ బూని పెద్దనఁ జెప్పక రద్దుసేయ,
తే॥గీ॥ రిప్పటిది గాదు మీకుఁ గవీంద్రులకును
గలదు సంబంధ మిది పూర్వకాలమున న,రేంద్ర! శ్రీరాజ... ౧౪

3. సీ॥ ఆహ్లాదమునఁ జంద్రుఁ డని తెల్పఁ జంద్రపర్యాయమై తనరారు రాజపదము
ఐశ్వర్యమున నింద్రుఁడని తెల్ప దేవేంద్రవాచకం బైనగోపాలపదము
శ్రితరక్షణమ్మున శ్రీవిష్ణు వని తెల్ప విష్ణువాచక మైనకృష్ణపదము
యాచించువారల కభ్యనుజ్ఞ నొసంగు నర్థిసంబోధ్యమౌ యాచపదము.
తే॥ గీ॥ మండలాధీశ్వరునకొప్పుమహిమలన్ని, నామమే తెల్పనౌర ? కర్ణాటధారు
ణీంద్ర? శ్రీరాజగోపాలకృష్ణయాచ, భూప!బహదర్ మహారాజ!భూరితేజ!

4. చ॥ వెనుకను బుష్యమాసమున వేఱొకపత్రికఁ బంపుకొన్నయం
తన "యిదిబత్తె" మంచుఁదగుద్రవ్యమునంపిరి దానిచేతనే
మన మతితృప్తి నొందె నిఁక మాకున నొక్కటి చిత్తగింపు మో
జనవర! చూడఁ గోరెద మసాధ్యవిచిత్ర శతావధానముల్. ౧౬

5. ఉ॥ దేవరవారిసన్నిధి నతిప్రతిభాపటిమమ్ము మీఱఁగా
నేవరనైన నొక్కపరి యీయవధాన మొనర్చ కోర్కె చే
నీవఱకీ పురమ్మునన యిచ్చ వసించుచు నున్నవార మో
భూవర! నిన్నుఁబోలు నృపపుంగవుఁ డెంతటివారి కబ్బెడున్. ౧౭

6. ఉ॥ ఎందఱఁ జూచినారము మఱెందరియొద్ద శతావధానముల్
పొందుగఁ జేసినార మిఁక భూవర! తావకమైన సత్సభన్
దందరలేక యొక్కయవధాన మొనర్చిన దానిఁ బోలునే?
గంధసుమమ్ముఁబోలుటకుఁ గోటిసుమమ్ములకైనఁ జెల్లునే?

7. ఉ॥ గంటకు నూఱుపద్యములు గట్టిగఁ జెప్పఁగ జాలినట్టి మా
వంటి కవీంద్రసంతతిని బండితులై తన రాజు నట్టి మీ
వంటి ధరాపురందరు లవారణ కారుణికత్వ మేర్పడన్
గంటికి నప్పరీతిగను కన్గొను టొప్పును గాదె? భూవరా! ౧౯

8. ఉ॥ ఎచ్చటనో భవాదృశనరేంద్రులు కొందఱు పండితేంద్రులన్
మెచ్చుచుఁ బూజ సేయుటకు నిచ్చ వహించుచునున్నవార లీ
సచ్చరితమ్ము మీకిపుడ సంభవ మందెను? మీదువంశమం
దెచ్చటఁ జూచినన్ గల దిదే నృపధర్మము గాదె? భూవరా! ౨౦

## శ్రీ ముద్దుకృష్ణయాచేంద్రులు. మొదటి అర్జీ.

1. క॥ తిరుపతివేంకటసూరుల, మరయంగ శతావధాన మష్టవధానం
బులువడిగఁ జేయుదురు వ్యా, కరణపు శాస్త్రమున బ్రజ్ఞగలదు నరేంద్రా! ౨౧

2. చ॥ అరయ శతావధానముల నచ్చటనచ్చటఁ జెక్కుసార్లు మే
మరుదుగఁ జేసినారము మహాయశముం గనినార మైన మీ
దరి నొనరింప లేదనుట దక్క మఱొక్కటి లేదు లోపమీ
వఱకును, దీనిఁదీర్చి మముఁ బాలనసేయుట చెల్లదే? నృపా! ౨౨

## నెల్లూరు వెళ్లుచుఁ జెప్పికొన్నవి.

1. శా॥ ఈశుండో? హరియో? చతుర్ముఖుఁడో? దేవేంద్రుఁడో? యీముద్దుకృ
ష్ణేశుం, డీతనిదర్శనమ్మునకుఁ గా నింతేల? చింతింపఁగా
గాశీసేతులమధ్య నిట్టి నృపతిశ్రేష్ఠమ్ము జన్మించెనే?
ఆశా! నన్నిటు లేల వేఁపెదవు నీ కాయాసమున్ బుట్టదే? ౨3

2. మ॥ "శని తాఁ బట్టిన నేడువత్సరములే వల్పాదియై బాధ సే
యును నీవో? పదునాలుగేం" డ్లనెనుసామ్యోక్తుల్ స్మరింపంగఁ జే
సె నహా! ముద్దులమూఁటు కృష్ణుఁ డితనిన్ సేవింపఁగా రా" దటం
చన వోయాశ? దురాశ నీకుఁ గడుఁ బెద్దైయుండఁ గాన్పించునే. ౨౪

3. మ॥ కరు లర్పించునొ? యగ్రహారములు దాఁ గల్పించునో? వాజులన్
గర మిప్పించునొ? సేలుజోడుల నొగిన్ గప్పించునో? యొక్కడా
సిరులందించునొ? యేఁకూరక యిటుల్ శ్రీముద్దుకృష్ణేశు భా
స్వరసందర్శనపుం బ్రసక్తి విడ వాశా? యెందులేరే? నృపుల్, ౨౫

## ౭ డవ అర్జీ.

1. సీ॥ పరదేశసంపాదనరతి మీకు నరేంద్ర? పరదేశసంపాదనరతి మాకు
లసదుత్తమపదాభిలాష మీకు నరేంద్ర? లసదుత్తమపదాభిలాష మాకు
సకలసత్శ్లోకసక్తి మీకు నరేంద్ర? సకలసత్శ్లోకసక్తి మాకు
మనుమార్గవర్తనం బనువు మీకు నరేంద్ర? మనుమార్గవర్తనంబనువు మాకు

ఆ॥వె॥ మీకు రాజపదము మాకును గవిరాజ, పదము కలదిఁ కెందుఁ గొదవ లేదు
గాన సామ్యమిచ్చి మానించుటొప్పదే?, ముద్దుకృష్ణయాచభూవరేణ్య. ౨౬

2. సీ॥ కఠినమ్ములగు రాళ్లు కరఁగి కట్టినరామభజనాలయమ్ములే పడక కాయెఁ
డాకినమాత్రానఁ దనువు కట్టుగఁ జేయుఁ జాలినచలినీట స్నానమాయె
నుడికియుఁ నుడుకని కడువేఁడి మెతుకులే యాఁకొన్న కడుపున కడ్డమాయెఁ
"ప్రభు విచ్చె వేమాటపదియాలు" లనునట్టి స్వప్నమ్ములే ధనార్జనములాయె,

తే॥గీ॥ వీని నన్నిఁటి గోపాలవిభుఁడు దీర్చె, మగల నింకొకకష్టముల్ మాకు గూర
తగములై యుండఁ జేయుమి త్తఱినిఁ, గీర్తి, సాంద్ర? శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప?

3. సీ॥ పరదేశములుఁ దివ్యతరదేశములు గాఁగఁ, బరుల గ్రామములు కాపురము గాఁగఁ
బరగేహములు సౌఖ్యకరగేహములు గాఁగఁ, బరులయన్నము పుష్టికరము గాఁగఁ
బరసజ్జనావళుల్ పరమబంధులు గాఁగఁ, బరులసంపదలు సంపదలు గాఁగఁ
బరులుకష్టసుఖమ్ము లరయువారలు గాఁగఁ, బరులెల్లఁ గార్యకర్తృవరులు గాఁగఁ

తే॥గీ॥ జేసి పుట్టించినట్టి దేశేలకెల్ల, పండితప్రీతినొప్పు మీవంటి నృపతి
మణులఁ గొందఱు స్వామియై పనులఁచిపోయె, నేమనందుము? ముద్దుకృష్ణేంద్ర? విధిని.

4. సీ॥ ఏరాజు కవిరాజు నేనుంగు నెక్కించి యూరేఁగఁ జేసె నీయూరియందు
నేరాజు కవిరాజుచే నాజిశతావధానమ్ము చేయించి పూనెఁ గీర్తి
నేరాజు వేదాంతసారబోధక సుప్రబంధముల్ రచియించి వన్నెకెక్కె
నేరాజు "సర్వవిద్యారం" జటంచు కవులచే సన్నుతి గాంచి మించె

గీ॥ నట్టివిద్వత్కుమారభూపాగ్రగణ్య, పూర్వకృతపుణ్యరాశి? యోముద్దుకృష్ణ?
స్వాగతంబుగ దర్శనం బీఁ గదయ్య? ఘనతఁ దిరుపతివేంకటకవులకిపుడు.

5. సీ॥ శ్రీనాథముఖకవిశ్రీనాథు లేవంశసంస్థానమందు నాస్థానకవులు
రాయవేశ్యాభుజంగాయితసింగభూపాలుఁ డేవంశసంపత్కరుండు
ఖడ్గనారాయణఖ్యాతి గాంచిన పోతభూపాలుఁ డేవంశభూషణంబు
మఱియు నెంతయు మహామహులై చెలంగిన రాజన్యు లేవంశరాజిమణులు

గీ॥ అట్టి వెలుగోటివంశభూపాగ్రగణ్య, పూర్వకృతపుణ్యరాశి? యోముద్దుకృష్ణ?
స్వాగతంబుగ దర్శనం బీఁగ దయ్య? ఘనతఁ దిరుపతివేంకటకవుల కిపుడు.

6. ఉ॥ దేవరయాత్ర సేకొనక తెంపున నెల్లురిపట్టణమ్ము ముక్
బోవుట మంచి గా "దయినఁబోవుట యిమినిమిత్త?" మన్న నో
భూవర? శుద్ధవైదికులబుద్ధి మహత్త్వపటుత్వసంపదల్
దేవరవారిచిత్తఫణితిన్ జొరఁబాఱి ముదమ్ము సేయఁగన్. ౩౧

7. ఉ॥ ఎప్పుడు నుండె నీనగర? మెప్పుడు మాధవశేశ్వరుఁ? ఒహో!
యిప్పటి కేగుదెంచునెడ నెందఱు పద్యఁగిలారు రాజు? లే
నప్పటి కే నిప్పటికి నచ్చుగ వచ్చుట కిప్పుఁ జూడ నీ
సచ్చరితంబ కాక నృపసత్తమ? వేఱొక హేతు వున్నదే? ౩౨

8. క॥ ఎప్పుడు గోదావరి? మఱి,యెప్పుడు నీవేంకటగిరి? యింతవఱకు నీ
సచ్చరితము విని కాదే? వచ్చితిమి నృపాల? సుకవిపండితపాలా? ౩౩

9. క॥ ఈగైలుబండిపోగచే, దారిని దొరకొన్నయట్టితాపము నీస
త్కారసహ్యావృతశీతల, ధారలఁ బో నడఁపఁబడియె ధరణీపాలా. ౩౪

10. క॥ కవులవలనఁ బ్రభువులకుఁ బ్రభువులవలనఁ గవులకు లను భూరియశము సం
భవమందుఁ గానఁ గవులఁ బ్రభువులత్యాదరముతోడఁ బూజింత్రు నృపా!

11. క॥ ఈవిషయం బంతయుఁ దమ, కే విశదము వేఱె చెప్ప నేల? యయిన నీ
మావైదికచాదస్తం, బీవిధమున వ్రాయఁ జేసె నిపుడు నృపాలా? ౩౫

## అవధానకవితా విషయకమగు నుత్పలమాలిక.

1. ఉ॥ వీనుల విందు సేయుఁ గలవిద్య కవిత్వము దాని కంతయున్
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగఁ గావలెన్
మానస మన్యకార్యముల మగ్నము గాక చెలంగుకాల మం
దైనను బంధచిత్రకవితాదులు సెప్ప నతిప్రయాస మౌ

గాన సువృత్తవర్ణనలు గా రచియింపఁ డటంచుఁ గోరఁ డో
మానవులార! మీరు మతిమంతులు దీని నెఱుంగకుందురే?
వాననె కోరు హాలికుఁడు సైరు ఫలింపఁగ, నంతె కాని యెం
తో నినదమ్ముతోఁ బిడుగు లుప్పతిలం బడఁ గోరునే? “మతి
స్థానము గాసిపెట్టు నవధానమునం దెటు లా చతుర్విధా
నూన కవిత్వముల్ సలుప నూకొను టౌ?” నని శంకనొంద “క
ల్లైనను బంధచిత్రకవితాదులు సెప్ప” మటందు రక్కటా?
సూనము తన్మరందరసచోరమధువ్రతపాదఘాతమున్
మానుగ సైఁచు నంచనెడిమాటలు విందుము కాని యెచ్చటన్
గానము “దుష్టపక్షిపక్షఘాతము సైఁచు” నటన్న మాట, లు
త్తానశయాను లొమ్మన నధర్మముగా బరు వెత్తినట్లు “బం
ధానఁ గవిత్వ మల్లు నవధానమునం” దన మర్త్యకోటి నె
వ్వానికి శక్య మౌను? కలవాణికివాణికిఁగాక, పెద్ద “లౌ
నౌ” నన సర్వపండితు “లహో!” యనఁగోరుఁడు తప్పత్రోవలన్
మానసవీథిఁ బైకొనుట మంచిది గాదు యథార్థపుంగతిం
బూనిన మీకు మాకు మనభూపునికిన్ యశ మబ్బివే యమా. ౪౦

బహుమానానంతరము చెప్పినది.

1. చ॥ ఒకఁడిడె నింద్య మైనయెము కొక్కటి, వే రొకఁ డిచ్చెఁ జర్మ, మిం
కొకఁ డిడె మూఁడుపాదముల కూనముగా భువి, వీరు దాతలా?
సకలకవీంద్రసంతతులినిఁ జా లనిపించెడి ముద్దుకృష్ణరా
జకులవతంసుఁ డెవ్వదను జంకక యిందఱిలోన దాత గా. ౪౧

2. సీ॥ “పలువురుతనుఁ జవ్వఁ బసులఁగాచినవాఁడఁ బరికింపనిది యొక పరువుగాదు
పాలీయవచ్చిన పడఁతిఁజంపినవాఁడ బరికింపనిదియొక పరువుగాదు
గోపాలకుఁడనయ్యుఁ గోవుఁజంపినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు
గొల్లకోఁపలవెన్నఁగొని తిట్లఁబడినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు,
తే॥గీ॥ ఇఁకనుగొన్ని యకృత్యము లేయొనర్చి, యుంటనీలోపములు దీర్చుటొప్పఁగాదె?”
యనుచు సుగుణంపుఁ బ్రోవయియలరుముద్దు, కృష్ణుఁడైపుట్టఁబోలు శ్రీకృష్ణుఁడిపుడు,

## శ్రీ వేంకటకృష్ణయాచేంద్రులు అర్జీ,

1. సీ॥ చాతకప్రకరమ్ము జలదోదయముమాడ్కిఁ జక్రవాకములుభాస్కరునిపగిది
నాఁకొన్నమానవుం డన్నమ్ముభంగిని హాలికుల్ మేఘోదయమ్ముపోలె
వనధిశుక్తులు స్వాతివర్షోదయము వ మావిగున్న వసంతుమహిమకరణి
దారిద్ర్యఖిన్నుండు ధననిదానముపోల్కె మహాని శ్రీవిష్ణుధామమ్ము వరుస
తే.గీ॥ నీదుదర్శనలాభమ్ము నెమ్మిఁగోరి, యిచటవసియించియున్నారమింతదనుక
నేఁ దర్శనమిప్పించివిపులమైన, సభనుమాశక్తిఁ గనుటొప్పఁ బ్రభువరేణ్య! ౪౩

## ఎదుటఁ జదివినవి.

1. సీ॥ సుగ్రీవుఁడయ్యును నరునకొక్క, నిక సారథ్యమ్ము చేసినట్టు పోవ
శూరుఁడయ్యును నొక్క సుందరిప్రాపంది గణమొనర్చినయవగుణము వోవ
విజితేంద్రియుండయ్యు విధవిరామము లేక జారుఁ డైనట్టిసచ్చరిత పోలంకఁ
బహుపత్నీమ్యుండయ్యుఁ బసులఁగాచుచు నలుగురనోళ్ళలోఁ బడ్డగుణముతవోవ
తే॥ గీ॥ నొక్కయెడజన్మమందివేఱొక్కయెడను, బ్రాణగతుకుఁ జనినలోపమ్ముపోవ
నాసవెలుగోటిపంకాప్తచంద్రుఁడే మునుఁ గృష్ణుఁడిప్పుడు వేంకటకృష్ణుఁడయ్యె.

2. సీ॥ ప్రాసాదనిర్మాణశక్తి మీకు నృపాల? ప్రాసాదనిర్మాణశక్తిమాకు
సాధువృత్తవిధానసక్తి మీకు నృపాల? సాధువృత్తవిధానసక్తి మాకు
నవరసాసంపాదనరతి మీకు నృపాల? నవరససంపాదనరతి మాకు
సతతసద్గుణగణాసక్తి మీకు నృపాల? సతతసద్గుణగణాసక్తి మాకు
ఆ॥ వె॥ మీకు యాచబిరుదు మాకును యాచక, బిరుదు గలదు వర్ణభేదమాత్ర
ముండె విని నెన్నఁ గొనఁగుమీ? వేంకటకృష్ణయాచభూప? యివుడు సమత.

## (సమస్య) గానమువంటి విద్య నికఁ గానము.

1. ఉ. జ్ఞానవిహీనులం దనుపు జ్ఞానులఁ దన్పును రాగహీన్యలో
మానులఁ దన్పుఁ గ్రూరఫణిమండలిఁ దన్పును సర్వపక్షిసం
తానముఁ దన్పుఁ గుజ్జులను దన్పు నృగమ్ములఁ దన్పు నెన్న నీ
గానము వంటివిద్య నికఁ గానము వేంకటకృష్ణభూవరా. ౪౫

## వసుచరిత్రలో "తమ్ములు పదానుజన్మలై" అను సీసగీతికిఁ దెలుఁగు

2 శ్లో॥ జహునరమాయాశ్చక్రే, పాల్యా కింవా కనిష్ఠసముదాయః
తత్పాదకనీయాక్ కిమ్, ప్రణవాని తదీయనఖాంశవః కిమ్? ౪౬

## (సమస్య) రాగములలోన మేఘమల్లా రనంగ.

3. తే॥గీ॥ శ్లేష్మములుమూఁడు వేంకటకృష్ణభూప? నాగములలోన నైరావణం బనంగ
యోగములలోన లంబికాయోగ మనఁగ, రాగములలోన మేఘమల్లారనంగ.

## (విశాఖపట్టణం గోడే గజపతిరావుగారు అర్జీ.)

1. ఉ॥ సంగరశక్తి లేదు వ్యవసాయము సేయుట సున్న సంతలో
సంగడి వేసి యమ్ముటది యంతకు మున్నె హుళిక్కి, ముష్టికిన్
బొంగు బుజాన వైచికొని పోయిన మెక్కెడికేని ముష్టిచెం
బుం గొని పెట్టు మెక్కటి యమోఘు మిదే కద! దంతిరాణ్ణృపా. ౪౮

## అచ్చుటి డిప్యూటీ కలెక్టరు జయంతి రామయ్యగారు.

1. సీ॥ ఒకనాఁడు రాజరాజాస్థానదివ్యసీమలలోన సంతోషకలన గనుట
యొకనాఁడు దుర్గంధయుతపట్టణముల దోమలతోడసంగ్రామకలన గనుట
యొకనాఁడు సర్వభోగోన్నతుల్ గల్గువారలపంక్తి మృష్టాన్న కలన గనుట
యొకనాఁడు చేయిగాల్చుకొని వండినవంటకము మెక్కయాయాసకలనగనుట
గీ. యొక్కరోజున సారటు నెక్కితిరుగు, టొక్కరోజుననడచుట యొక్క విషయ
మందుననునిశ్చయము లేక యలయుకేతన, [illegible]డియకొకరీతి మాజాతకములరీతి.

## (మొదటిసంవత్సరం గద్వాలసంస్థానము.)

1. శా॥ శ్రీరస్తు శ్రితరక్షణక్షణగుణశ్రీరస్తు నిత్యోత్సవ
శ్రీరస్తు ప్రథమానకీర్తివిభవశ్రీరస్తు గీరస్తు తే
శ్రీరస్త్వత్యతివేలపండిత వచశ్శ్రీరస్తు భూరస్త్వహో
శ్రీగద్వాలపురోత్తమ ప్రభుమణే శ్రీరామభూపాలక॥ ౫౧

2. సీ॥ భూదేవతాగారగోదావరీతీరకంకణగ్రామమ్ము కాపురంబు
రమణీయషట్శాస్త్ర రత్నసంచయవారిరాశి బ్రహ్మయశాస్త్రి దేశికుండు
అత్యద్భుతప్రభావాష్టావధాన శతావధానములు స్వాభావికములు
గురుపాదసేవనాదరలబ్ధ మగువిద్య నాగరాజము ఖోదతాగమంబు
తే॥గీ॥ లలితకవితావిలాసిని వలపుసాని, దర్శనీయులు మీవంటిధరణిపతులు
తిరుపతాఖ్యమ్ము కాశీపదమ్ము నాకు, దళితపండితలోప? గద్వాలభూప!

3. సీ॥ శతఘంటికవనమ్ము పల్కుపంగతి యన్నఁ "గరతలామలకమ్ము" గాదె? మాకు
అష్టావధానకష్టావలంబన మన్న "నంబికొండయువండనంబు" మాకు
ఆశుధారాకవిత్వాడంబరం బన్న "నల్లేరుపైబండినడక" మాకు
సత్కావ్యనిర్మాణ చాకచక్యం బన్న "షడ్రసోపేతభోజనము" మాకు,
తే॥గీ॥ వ్యగ్రమగువాదములలోన నచ్చవట్టివారి, దంబమణఁగించు టాపోశనంబు మాకు
దానరాధేయ? కవిసుమవాయ గేయ? పండితవిధేయ? రామభూపాలరాయ?

4. సీ. ముద్దుముద్దుగఁ జెప్పఁ బూనితిమా? వన్నెలాఁడితీయనిమోవి లంచ మిచ్చుఁ
గరిసమ్ముగాఁ జెప్పఁగడఁగితిమా? ప్రౌఢకాంతవక్షోజముల్ కాన్కలొసఁగుఁ
దీక్ష్ణరీతిని జెప్పఁ దేకొంటిమా? వాలుఁగంటిలేఁజూపు సుంక మొసఁగు
మిశ్రరీతినిఁ జెప్ప మేకొంటిమా? బోఁటి బిగువుకౌఁగిలి పన్నుఁ బెట్టి తీఱు.
తే॥ గీ॥ నాశుధారాకవిత్వమ్ము నందుకొంటి, మెరియభిసారికయు వండమిచ్చితీఱు
నాంధ్రగీర్వాణభాషలయందు మాకు, దళితపండితలోప? గద్వాలభూప?

5. సీ॥ విద్వాంసుఁడమమాట విన్నంతమాత్రన, మనమున నానందఘనత చెందుఁ
జెంది "యెవ్వఁడు తన్నుఁ జేర నెవ్వఁడువచ్చునో?" యటంచును మదినూరుచుండు
నుండి యాతం డాయుదండకే తెంచిన "నిల్వు" మంచును బ్రిధానికిని జెప్పఁ
జెప్పి యాతఁడు తన్నుఁ జేరవచ్చినయప్పు డతనిసాంతయును సత్కృతునిఁ జేయు
తే॥గీ॥ నను మనీక్షింపనియుటకరుగుదెంచి, నారమోరామభూపాల? పేరువినుము
తిరుపతియతండు వేంకటేశ్వరుఁడ నేను, వెరసి తిరుపతివేంకటేశ్వరుల మేము.

6. సీ॥ కోటిబ్రాహ్మణులలోఁ గొమరొప్పనొక్కండు చదువుకొనంగ నిచ్చను వహించుఁ
జదివినవారు లక్షలుగల్గినను నందుఁ బండితుండొక్కండు బయలుదేరు
నట్టిపండితులలో నరయ వేయింటి కొక్కరుండు కవీశ్వరుండుండు నేమొ
అట్టికవీశ్వరులందు నూటికి నొక్కరుం డవధానియై యుండు నేమొ,
తే॥గీ॥ అట్టియవధాను లెల్లవహ్వా! యనంగ, సలుప నేరుతు మవధానసరణి మేము
గాన సభఁ జేసి మాశక్తిఁ గాంచవలదె?, దళితపండితలోప? గద్వాలభూప?

7. వ॥ ఒకచరణం బతండు మఱి యొక్కటి నేను మఱొక్క టాతఁడుగా
సకలకవీంద్రసంతతులు సమ్మతిచేఁ దల లూచి మెచ్చఁగాఁ
బ్రికటతరాశుధార దనరగ రచియింపఁగ నేర్తుమయ్య? నూ
టికి సెలగయ్య? నిక్క మిది డెబ్బదిమాటలు సెప్పనేటికిగ?

8. ఉ॥ చెప్పిన మొక్కమాటు కడుఁ జేవ దలిర్పఁగ నోనృపాగ్రణీ?
గుప్పితి మేనిఁ బద్యములు గుంపుగ నగ్గురుఁ డాహవమ్ములోఁ
గుప్పలుగాఁగ బాణములు గప్పినరీతిగ, నెవ్వఁడేనిఁ దాఁ
జెప్పఁగఁజాలఁడే? "వాహ్వ" యని చెప్పినఁ జేయుమె? శృంగభంగమున్. ౫౮

9. సీ॥ పండితులను గౌరవము సేయుటకు మంచిపండితుల్ దగ్గఱనుండవలయు
నుండిననేమి యాయుండుపండితకోటి పరులయున్నతి సహింపంగవలయు
సైఁచిననేమి? యాసత్పండితులమాట లింపుగా రాజు మన్నింపవలయు
మన్నింపనేమి? యాపన్నులను నొద్ద నుండునివాను దానొప్పవలయు,
తే॥గీ॥ "నిన్నియును గల్గురాజ వీవే" యటంచు, వచ్చినాగము లేకున్న వత్తువయ్య
దానరాధేయ? కవిసమువాయగేయ?, పండితవిధేయ? రామభూపాలరాయ?

10. సీ॥ పికకాకములకు నొప్పినభేదమునె? భేదమ్ము స్వరముచేఁ గాక రూపమ్ముచేత
హంసబకములకు నమరుభేదమునె? భేదమ్ము నడకచేఁ గాక వర్ణమ్ముచేత
నుప్పుకప్పురముల కొప్పునె? భేదమ్ము రుచులచేఁ గాక స్వరూపమునను
స్ఫటికవజ్రములకు స్ఫురించునె? భేదమ్ము రంగుచేఁ గాక భారమ్ముచేత
తే॥గీ॥ పండితకవీంద్రులను నిర్వివేకులను, సమవిధియె? భేదమెన్నంగ నలఘుతరగు
ణత్వచేఁ గాక వేషాదికరీతిచేతఁ, బండితవిధేయ? రామభూపాలరాయ?

## సభ చేయకయే సన్మానించినప్పుడు చెప్పినవి.

1. ఉ. ఏకవినెట్టివాఁడనొ? యతఁ డేకవి కట్టివిశేషపండిత
శ్రీలకు నేలనో? విచారణము సేయుటయే కనకాభిషేక మౌఁ
గాక తదన్యపద్ధతి జనమ్ము సమస్తము ధారవోసినన్
జేకురునే? ముదమ్ము, పరిశీలన సేయుమి రామభూవరా. ౬౧

2. ఉ॥ పండితులైనవారు ప్రతిభాతిభాసితులౌట సర్వభూ
మండలి నుండురాజులను మన్నన సేతురు వారిఁ బండితా
ఖండితులైనవారలె సభాస్థలి నీవలెఁ బూజ సేయురా
జుండునె? రామభూవర? సమున్నతదానవిధానధీవరా. ౬౨

ని మనమ్మందున నుంచి యెన్నఁటికిఁగానీ పూర్తి చేయంగ భా
రము మీమీఁదను బెట్టినారము సుఁడీ? రామపరిధానాగ్రణీ. ౧౯

## (శ్రీ మహారాజావారి యెదుటఁజదివిన పద్యములు.)

1. సీ॥ అలపతంజలికృతం బైనభాష్యమునకే పరిఢవిల్లును మహాభాష్యపదము
అలదేవదేవుఁడై యలరాయంపునకే తేజరిల్లును మహాదేవపదము
అలత్రివిష్టపవిభుం డైనపాకారికే యెన్నంగఁ దగును మహేంద్రపదము
అలకాళిదాసుఁ డౌకవీశ్వరునకే గణన కెక్కును మహాకవిపదమ్ము
గీ॥ రమణఁ బరికింప నలమహారాజపదము, నీక తగుఁ గాక యన్యులౌ లోకపతుల
కొకరికైనను జెల్లునే? యోగరూఢి. విజయనగరమహారాజ? విపులతేజ. ౨౦

2. సీ॥ రాజురాజనఁగనే రాజాయనే? చంద్రుఁ, డలరాజశేఖరు నాశ్రయించె
రాజురాజనఁగనే రాజాయనే? యింద్రుఁ, డగ్యమాత్మజుని దానడిగికొనియె
రాజరాజనఁగనే రాజరాజా? కుబేరుఁడు కింనరేశత్వరూఢిగాంచె
రాజరాజనఁగనే రాజరాజా? సుయోధనుఁ డధికగర్వత్వ మనుగమించె,
గీ॥ రాజనిన రాజరాజన్న రాజులందు, నీక తగుఁ గాక యన్యులౌలోకపతుల
కొకరికైనను జెల్లునే? యుర్విలోన, విజయనగరమహారాజ? విపులతేజ. ౨౧

3. శ్లో॥ తత్త్వంచం చంద్రార్తిహాఽయం, నను భవతి దివాఽప్యస్య కస్మాత్ప్రతాప,
స్సత్వా చ్చంద్రస్య, సత్వేఽ ప్యరుణకిరణతోఽ జాగరూక స్సదోఽయం,
నోచే దానందదంతీశ్వరవిపులయశ, స్సాఽ, మిత్యాదివాక్యై
శ్శాస్త్రార్థంకుర్వతే త్వద్యశసి నృపమణే తార్కికా స్తర్కకీర్త్యా. ౨౨

4. తే॥గీ॥ అగ్రవర్తిని యనధీనమని సమస్త, దేవసంగతుని యయు నదేహామనియు
నగ్రవర్తున్నాత్రమందు నీయశముకొంత, ఘోషముగఁ జెప్పెఁబాణిని కవలయేశ.

5. శ్లో॥ ఆయాతో పద్రవేవ ప్రజసి నను దివా కింను భోశ్చక్రవాకి,
భ్రాంత శ్చంద్రోఽయ మస్య కిల విజయపురే జాత ఆనందనామా,
సూర్యాలోకస్య స్సముద్ఘే, నను పర మపరో వర్ధతే కీర్తిచంద్ర,
స్సోఽపి శ్రీ పక్రనరాజను, రితి కవయ శ్చక్రవాకైస్య వదంతి. ౨౪

6. శా॥ నీకీర్తిప్రతతుల్ ధరాతలము నిండే నిండ నందొక్కఁ డా
యాకాశమ్మున కేగి పుష్పవతియై యాపూర్వపశ్చాద్గిరి

వ్యాకీర్ణం బగుచుండు వాయుగతిచే నద్దానఁ "ఇంగ్రోటియ" మి
త్యాకారభ్రమ నొందుచుండు జగ మోయానందభూపాలకా! ౨౫

7. శా॥ తా నా? రాజు, సుతుండు కోమటి, కళత్రంబెన్న నక్షత్ర, మెం
తో నైల్యమ్ము, నిశాకరత్వమును, క్షేత్రోపాధియుం, గల్గుతా
రానాథుం డన దేహగేహవితతత్రైవర్ణ్యసాంకర్యకుం
డౌనా? యెన్నటికిన్ భవాదృశుఁడు, కాఁడానందభూపాలకా! ౨౬

8. ఉ॥ విత్తగణితాంకృతప్రభుఁడు విశ్వజనీనకళాకరుండు స
ద్వృత్తపథచారి సౌమ్యగురుఁ డీవృపుఁడీతనికిన్ ధరాస్థలిన్
బ్రతిమను జెప్ప నోపను బరాకుగఁ జెప్పినరాజు తోడుగా?
ప్రతిసురభూజమా? విజయ రామనృపాలక పుణ్యపుంజమా! ౨౭

9. సీ॥ దీనపోషకుఁ డన్న తేటమాటకు మహారాజ? నీనగరి కాలేజి సాక్షి
విద్వత్ప్రభు వటన్న విఖ్యాతి కోశాంతనిధి? భవన్నగరపండితులు సాక్షి
శ్రితపోషకుం డన్న వితరకీర్తికి మహామతి? భవన్నగరహర్మ్యములు సాక్షి
ఆనందమున కాలయం బన్న మాట కోదారుప్రతాప? నీపేరు సాక్షి
తే॥గీ॥ నీయశము దేశములనిండ నిండెననుట, కితరదేశాటకుల మైనయేము సాక్షి
పూషవాహకులాంభోధిపూర్ణచంద్ర, శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర. ౨౮

10. క॥ కొందఱు పద్యాద్యంతం, బందురు మఱికొంద ఱన్నయాద్యంతంబే
యందురు మే ముభయం బని, యందుము నీనామధేయ మానందనృపా! ౨౯

11. శా॥ ఏభూవిభుం డున్నిఁ జూడఁ బోయినను నీవే పద్యముల్ జెప్పి నీ
వే భావమ్మును జెప్పికోవలయు నిం కేభూవిభుం డన్నఁ దా
నే భావమ్ము గ్రహించువాఁ డగుట నీకే కష్ట మీఁదే కలి నా
హా! భోసత్కవిపూర్వజన్మ సుకృతంబా? నీకు దీర్ఘాయు వౌ. ౩౦

12. సీ॥ విక్రమార్కునితోడ వెంచేయ కుండునే? భోజభూపాలుండు పుట్టఁడేని
భోజభూపాలుతోఁ బోకుండునే? రాజభూపాలవర్యుండు పొడమఁడేని
రాజరాజనరేంద్రుతోఁ జనకుండునే? కృష్ణరాయలు జన్మమెత్తఁడేని
కృష్ణరాయలతోడనే పోకయుండునే? భవదీయవంశమ్ము ప్రబలదేని,
తే॥గీ॥ భావుకంబైన భవదీయవంశ్యగరిమ, ధరణినిండారఁ సత్కవితావధూటి
నిలిచియున్నది నిలుచును నిలువఁగలదు, శ్రీమదానందగజపతిక్షితిపతేంద్ర. ౩౧

13, చ॥ తిరుపతి వేంకటేశ్వరులని ధీరులు పిల్తురు మమ్ము, బ్రహ్మ స
ద్గురువరు పాదసేవన మకుంఠితసత్కృప మాకు నిచ్చె వ్యా
కరణము, నీకవిత్వమనఁగా నది పిన్నటనాఁడె పుట్టె న
బ్బురముగఁ బెంచుకొంటి మిది పొమ్మనినన్ మఱి పోదు భూవరా! ౧౨

14. ఉ॥ ఒక్కొకచోట నొక్కొకని యొద్ద నొకొక్కొకమాట చొప్పునన్
జక్కఁగ సంగ్రహించితిమి శాస్త్రము మీఱఁగ నెప్పుపజ్ఞ, నొ
క్కొక్కఁడె యొక్కరోజున కొకొక్క ప్రబంధము సేయ నేర్తు మిం
కెక్కుడ దాఁపనేల? వచియించెద మున్నది యున్నరీతిగా. ౧౩

15. ఉ॥ ఎందఱఁ జూచినేని వరియింపదు మాకవితాకుమారి, క
న్నందుకు దేశముల్ దిరుగుచుంటిమి సౌఖ్యము లేకపోయె నా
నందనృపాల? నీదు సుగుణమ్ములు చెప్పఁగ నాలకించి వెం
టం దలయూఁచెఁ గావునఁ దటాలున నేఁడిఁక బరిగ్రహింపుమా? ౧౪

16. మ॥ కవితామాధురిఁ గ్రోలి గ్రహించి "యిది శ్లాఘ్యం బిద్ది శ్లాఘ్యంబు గా
దు విశేషంబిట నిర్విశేష మిట మాధుర్యంబిటన్ వహ్వ రే?
కవిరాజా?" యని మెచ్చియిచ్చు నృపుఁ డొక్కండైనఁ గల్గఁడేచోఁ
గవియై పుట్టుటకన్నఁ బాపపరిపాకం బుండునే? భూవరా! ౧౫

17. సీ॥ చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్మును వీక్షింపఁగా వలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణులసభల్ పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ బడవలెఁ బడరాని పాటులెల్ల
వినఁగావలెను బూర్వవిద్వచ్చరిత్రముల్ దర్శింపవలెను సంచారపరిశీలన,
తే॥ గీ॥ కవులు కవులన్నమాత్రాన కవులుగారు, ఎంతభారమ్ము గలదో కవీశ్వరులకు
నెఱుఁగఁగలరందురే? మీవంటి నృపతిమణులు, శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర?

6. సీ॥ పురుషాయితమొనర్చు పూఁబోణిముద్దుచేష్టలరంగులొక్కొక్కసమయమందుఁ
బ్రణయకోపాకులప్రౌఢకాంతామనఃపాటవం బొక్కొక్కపట్టునందు
ఈషదుచ్ఛలితాగ్రవమృదితాధరోష్ఠద్యుతిలీల లొక్కొక్కవేళయందు
అనునీతఖండితాహావభావాదిసాంకర్యమ్ము నొక్కొక్కకాలమందుఁ
తే॥గీ॥ దవిలి కీర్తించుమాకవితావధూటి, రసము తెలిసిన మీవంటి రసికవరుల
కే తగునుగాక యన్యుల కెట్లుతగును? శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర!

19. మ॥ "కనుఁగొంటిన్ గవులార? మి మ్మిఁకట, నాకష్టంబు గట్టెక్కె ర
మ్మనె నానందనృపాలకుండు? మిము, నే నానందభూపాలకీ
ర్తిని దేఖోహంకు" మంచు నిచ్చె ననురక్తిన్ బత్రికన్ దానఁ జ
య్యన నే తెంచితి మయ్య? వాస్తవ మిదే, యానందభూపాలకా. ౨౨

20. సీ॥ అమ్మవంకను జుట్టమా? యేమి భోజభూపాలవర్యున కల్ల కాళిదాసు
అబ్బవంకను జుట్టమా? యేమి విక్రమపతిభువరేణ్యున కల్లభట్టి సుకవి
అత్తవంకను జుట్టమా? యేమి రాజధరాధీశ్వరునకు నన్నయ్యభట్టు
మామవంకను జుట్టమా? యేమి కృష్ణరాడ్ధరణీశ్వరునకుఁ బెద్దన్నగారు.
తే॥ గీ॥ కవి యయినవానినెల్లను గారవింప, రా జయినవానికెల్లధర్మమ్ముగాక
పూసపాడకులాంభోధి పూర్ణచంద్ర? శ్రీ మదానందగజపతిక్షితితలేంద్ర.

21. సీ॥ "అష్టావధానమా? యానందదంతీంద్ర జనపాలుదర్శనం" బనెడివారు
"ఆశుకవిత్వమా? యానందదంతీంద్రజనపాలుదర్శనం" బనెడివారు
"శతఘంటకవనమ్ము సల్పుటా? యానందజనపాలుదర్శనం" బనెడివారు
"ఆకాశపుంబురాణ మల్లుటా? యానందజనపాలుదర్శనం" బనెడివారు,
తే॥గీ॥ కాని సులభమటంచు నొక్కరును జెప్ప, రట్టిభవదీయదర్శనం బాచరించి
ధన్యతను జెందె మాకవిత్వప్రశంస, శ్రీమదానందగజపతిక్షితితలేంద్ర.

22. మ॥ కవులెల్లన్ దలపోచి మెచ్చ బుధలోకం బెల్ల వహ్వా? యనం
గ విచిత్రమ్ముగ వందమంది కయినన్ గాదేని యష్టావధా
నవిశేషం బయినన్ రచింపఁగల మానందక్షితీశాన? మా
యవధానమ్మును జూడుమా? మనములో నానందమున్ జెందుమా? ౯౧

23. ఉ॥ స్థైర్యము లేనిచిత్త మవధాన మెఱుంగనిసత్కవిత్వ మౌ
దార్యము లేనిహస్తము యథార్థత లేనిరసజ్ఞ మంచి మా
ధుర్యము లేనిగానము మృదుత్వము లేనివచః ప్రసంగ మై
శ్వర్యము లేనిభోగము నసారము లయ్యవి దంతిభూవరా? ౯౨

24. సీ॥ కాళీసహస్ర మొక్కటి చేసితిమి భవాదృశులెల్ల విని వహ్వారే? యనంగ
ధాతురత్నాకరోద్గ్రంథ మొక్కటి చేసితిమి శాబ్దికులకు మోదముఘటిల్ల
వీధి నొక్కటిని సంస్కృతిఁ జేసితి మెల్లరసికాగ్రిణులు నద్దిరా? యనంగ
శుకరంభికావాద మొకటి చేసితిమి వేదాంతిశ్రేష్ఠుగారు లౌరా? యనంగ,

తే॥గీ॥ సంస్కృతమ్మనినివి, తెల్గుసరణి శ్రవణ,నందనముచేసినారమానందముగను
దక్కఁగలచాటువులకిఁక లెక్కలేదు, విజయనగరమహారాజ? విపులతేజ. ౨౩

25. క॥ సుగుణావతంస యానం,దగజపతీ? సత్యమైనదానినిలోకా
నుగతి నొడివితిమి కానీ, జగ మెఱిఁగినబ్రాహ్మణునకు జందెం బేలా? ౨౪

26. క॥ మాపసమా నీసాగమ, గాపసమా మాపధాపగాగమనిసమా
మాపస నీపస గని గా, దా? పరిపరి తుష్టి చెందె నానందనృపా. ౨౫

27. శ్లో॥ అస్మాస్తమానవహయో నగజాఽధినేతాఽ
వ్యత్యాగమోదితయశా అపదాతిభూపః
శంభు ర్భవేదపి తథా కిము రాజవాళి
రానందభూమిపతి రేవహి రాజవాళిః ౨౬

## (క్రొత్తపల్లిలో శ్రీ రావు జగ్గారాయనింగారు.)

28. ఉ॥ దూరపుదేశముల్ దిరిగి లోగముగా గడియించునిచ్చచే
వారకపోయి యచ్చటను బత్తెము వెట్టుక యుష్ట్ర నాజమీం
దారులవర్ణనమ్ము లతిదారుణకష్టముచేతఁ గాని యె
వ్వారికినైనఁ గా వటుల వారలదగ్గర మెట్టులేనిఁ జే
కూరిన వారిపండితులకున్ "గడుఁ బండితు" లంచు వీరిపై
గౌరవబుద్ధి గల్గు టతికష్ట మటుల్ సమకూరె నేని యా
సూరిజనంబుపల్కు విని సొంపుగ నాతఁడు వీరియందు వి
స్తారపుభక్తితోడ సభ సల్పుట కల్గదు కల్గె నేని యా
భూరమణుండు తద్రసము పూర్తిగ నాకలనమ్ము చేయువాఁ
డై రహినుండఁ డొక్కెడ నట్లు రసగ్రహణం బొనర్చు భూ
మీరమణుండు గల్గిన నమేయముగా ధన మీయఁ జాలఁ డే
స్లై రహి నెక్కడో ధనము నిచ్చిన నందున మూఁడు భాగముల్
దారిని రైలుకడ్డునను దాఁపవలెన్ దరువాతిభాగమున్
జోరులపాట్టఁబెట్టకయ సూటిగ నింటికిఁ దెచ్చెనేని యా
యూరివ నుండునప్పులకు నొప్పఁగఁ జెప్పవలెన్ గవీంద్రసం
సారపుఁజర్య లిట్లగుట సౌఖ్యము సున్న భవాదృశుల్ జమీం
దారులు దూరదేశములదారులు త్రొక్కఁగ నీక స్వీయసం

సారములోనఁ జేర్చుకొని సాలునకున్ సరిపడ్డఖర్చు వి
స్తారపుభక్తితోడను నొసంగుచుఁ బోషణ సేయఁగావలెన్
భూరియశోధనుం డయినభోజుఁడు రాజనరేంద్రకృష్ణరా
డ్భూరమణుల్ కవీంద్రులను బోషణ చేయుటచేతఁ గాదె? వి
స్తారయశశ్శరీరములఁ దాల్చి వెలుంగుచున్నవార లీ
ధారుణిలో భవాదృశ సదస్యులలో, నవధాన మిప్డు డీ
టీయనఁదీయగా జరగె ధీవరు లద్భుతమందఁగా జమీం
దారులిఁకెవ్వ రింతవడి తాలిమిఁ బూని కవీంద్రులన్ మహో
దారగుణమ్ముచేతను ముదమ్మునఁ దన్పెడివారు? "మీరు సా
టేరును లే" రటంచు వచియించెడి తిర్పతివేంకటేశ స
ద్ధీరుల శక్తిసంపదలు తెల్లముగాఁ గనుఁగొంటి కాఁగదా?
వీరలు పూర్వదేశముల వెంబడి పోక యిఁకొక్కచో జమీం
దారులరీతి నుండఁగ ముదమ్మునఁ జేసి యశమ్ము నొందుమీ
శ్రీరమణాంఘ్రియుగ్మసరసీరుహబంధురితాంతరంగ ? వి
స్ఫార యశోనుషంగ? నరపాలశిఖామణి? జగ్గభూపతీ? ౧౦౪

## చిత్రాడలో శ్రీచెలికాని జగన్నాధరాయనింగారు.

1. సీ॥ భవదీయసత్రాన్నభక్షణమ్మునఁ జేసి చదివినారము శబ్దశాస్త్రమెల్ల
భవదీయమిత్రులౌ బ్రహ్మశాస్త్రులవారి శిష్యత్వమునఁగీర్తిఁ జెందినాము
భవదీయవంశ్య గోపాలరాయాఖ్య భూపతిచేత మెప్పును బడసినాము
"భవదాశ్రితుల" మంచు నవనీపతులసభలందుఁ జెప్పుచు ముదంబందినాము,
తే॥గీ॥ భవదనుజ్ఞనె యీచెన్నపట్టణంపు, సీమ నెల్లనుజూచి ప్రసిద్ధిఁ జెంది
నారమిఁకనొక్కచోనుంట న్యాయముకద?, నయగుణవిధేయ? శ్రీజగన్నాధరాయ.

## రెండవసంవత్సరం గద్వాల.

1. చ॥ వినుమొకమాట రామపృథివీవర ! పోయినవత్సరమ్ము మి
మ్మును గనినార మేము పనిఁబూని, భవన్నికటమ్మునందు నాఁ
"డనవరతావధానుల" మటంచును దెల్పిన నాలకించి మీ
రును "నవధానశక్తి నొకరోజునఁ జూచెద" మంచు నాజ్ఞ యి

చ్చిన నది నమ్మ మేము నివసించితి మిచ్చటఁ గొన్నినాళ్లు, వీఁ
డను నొకరాజకార్యమునఁ దామును వేఱొకయూరి కేగ నా
దినమున మేము మాదురదృష్టపురేఖకుఁ జింత నొందుచుం
జని మఱి "మాఘమాస మిఁకఁ జయ్యన నెప్పుడు వచ్చు?" నంచు నె
మ్మనమున నూహ సేయఁగను మాసుకృతమ్మున వచ్చె నిప్పుడై
నను మముఁ జుల్క సేయక ఘనమ్ముగఁ జూచి శతావధాన రీ
తిని నొకరోజు చేయుట కతిప్రమదమ్మున నాజ్ఞ యిచ్చి దా
నినిఁ గని మంచిచెడ్డల గణించి బహూకృతి సేయుమా? యదే
మనఁ? బ్రతివత్సరమ్మును ననంతముగా ధన మిచ్చి పుచ్చినన్
"బనిఁగొనివచ్చువార" పని చుమ్మఁ దలంపకుమయ్య? యొక్కరో
టను నిటు కేగుదెంచు టకటా? కడుఁగష్టము మానివాసమే
డను? భవదీయ రాజ్యమకటా యిది యేడను? నెంతదూరమో
మనమునఁ జూడఁ దెల్లము గమారమి డెబ్బదియామ డుండు నై
లను నిటు కొన్నిగామడకు లోపున లేదిఁక మాదుకష్ట మిం
తని వచియింపఁగాఁ దరమె? తప్పక మామొగముల్ గనుంగొనం
గను విశదమ్ము దేవరకుఁ గాఁగల దింతటికష్ట మోర్చియై
నను నిటు కేగుదెంచుటకు "నారద శారద నీరదోపమం"
బనఁ దగునీదుకీర్తియె సుమా? యొక కారణ, మన్యకారణం
బనినను జెన్నపట్టణము నాదిగ శ్రీవిజయాభిధాన ప
త్తన మదియంతమందుఁ గలధారుణి నున్న నృపాలచంద్రులన్
గని యవధానముల్ సలిపి కానుక లందియు వీరిలోఁ బురా
తన మగుకీర్తి గల్గియు నుదారగుణమ్మున నొప్పి శాంతమే
ధనముగ నెల్లవిద్యల యథావిధిఁ జూడఁగఁ గంకణంబు గ
ట్టిన నినుఁబోటిరాజుఁ గని త్రోవి దలిర్ప శతావధాన రీ
తిని నొనరింపకుండు టది ధీరులు మెచ్చరటన్న మాటయే
కనుక మదీయశక్తి గనఁగావలె నంచు వచించు వేంకటే
శునిఁ దిరుపత్యభిఖ్యుని వసూయ నెఱుంగనియట్టి మంచి స
జ్జనములచేఁ బరీక్షగొని సమ్మద మందుమి? నెమ్మనమ్మునన్. ౧౧౩

## ప్రవేశ పరీక్ష—త్రిపాద సమస్య.

శ్లో॥ రామాయ రామభద్రాయ, తపస్స్వాధ్యాయనిరతం, వేణీసంహార నాటకం.

1. శ్లో॥ తపస్స్వాధ్యాయనిరతం, గురుం నత్వా౽ కరోత్కృతిః
   రామాయ రామభద్రాయ, వేణీసంహారనాటకం. ౧౧౪

## కేళాకూళిని వర్ణించుట.

2. చ॥ పనిగొని లోపలన్ దిగుడుబావిఁ జెలంగుజలంబు నింటిలోఁ
   గొనఁగ శిలోపలమ్ము లొడఁగూర్చి రచించినయంత్రరాజమున్
   మనమున నెంతు రాయ నరనాయకు దానము నాలకించి ల
   జ్జను గొని సేవఁజేయ సరసుఁ బయి వచ్చిననీరదం బనన్.

## అవధానము విఘ్నమైన తత్క్షణము చెప్పినది

1. సీ॥ ఆవాసమా? గౌతమాపత్యతటినీతటీరాజితం బైనయూరు మాకుఁ
   పాండిత్యమా? నవప్రౌఢగీర్వాణాంధ్రకవితావిలాసినీకలన మాకు
   సహవాసమా? శాస్త్రపరిపాఠ నాగతతీక్ష్ణనిక న్యాయసిద్ధి మాకు
   సౌజన్యమా? సమస్తభువనస్థ సుజనస్తవనీయవాక్యభాజనము మాకు

పంచపాది.

తే॥గీ॥ అట్టిమే మిట్టిగద్వాల కరుగుదెంచి
కుటిలధర్మాధికారివాక్కులను వినిన
రాజుచేమన్ననలుపొందరాక యూర
కేగుచుంటిమి మాశక్తి యీనృపాలు
చెవిని వేయుమి యాహ్లైవఁ గేశవ! మహాత్మ! ౧౧౫

## అప్పుడా సంస్థానములోనున్న ఆదిపూడి ప్రభాకరకవిచే సమయోచితముగఁ జెప్పబడిన శిఫారసు పద్యము

1. సీ॥ "కనకాభిషేకమ్ము గావింపు" మనలేదు వెయ్యారులిమ్మని వేఁడలేదు
   "భోగాలనిచ్చి యూరేగింపు" మనలేదు సింహాసనమ్ము లాసింపలేదు

"పల్లకీలిచ్చి సంభావింపు" మనలేదు పడగదెమ్మనిరైన నొడువలేదు
"గండపెండేరమ్ము గావలె" ననలేదు మాన్యమ్ములిమ్మను మనవిలేదు
తే॥గీ॥ ఒక్కసభచేసి తోఁచినవక్కలాకు, లిచ్చిపంపించుమనుటకే యింతలాయె
నిలఁగవీశ్వరులనుట సభ్యులకుఁ జేటు, కాకయేమున్నదయ్య? యీ కాలమందు."

## అవధానమునాఁటి ఉపన్యాసము.

1. ఉ॥ భూసురవర్యులార! పరిపూర్ణకళాకలనాభిరాములా
రా! సరసమ్ముగాఁ గవన మల్లుట యన్నఁ బురాభవమ్మునన్
జేసినపుణ్యలేశమునఁ జేసికదా? లభియించు గట్టియ
భ్యాసముజేసినన్ గలుగునా? యిది వేదమ? లేక శాస్త్రమా?
రోసము లేల? జందెముల ప్రోవులు వ్రేళ్లకుఁ జుట్టఁ బెట్టి పే
రీసునఁ గ్రిందుమీఁదుఁ బడి యెంతయుఁ దన్నుక చచ్చెనేనియున్
వీసము గాని లేక యరవీసము గాని కవిత్వధార రా
దే? సరి! యెట్టకేలకుఁ బదింబదికట్టలు కాగితాల్ వృథా
చేసి కవిత్వ మల్లిన రుచించునె? యయ్యది గడ్డిపచ్చడిన్
జేసినయట్లు లుండుఁ గడుఁ జిన్నెలు వన్నెలు గల్గి యెంతయున్
భాసిలుబాలికామణికిఁ బ్రాక్కృతకర్మవశమ్ముచే రసా
భాసపుదున్నపోతొకఁ డభాగ్యుఁడు దాపరమైన వానితో
నాసతి యాస లూరఁ గడునందముఁ జందము చూపునే "వృథా
యాస" మంటచు*ఁగో నొగులు నంతియకా కొకవేళఁ జూపినన్
రోసి యసహ్య మూని "యిసిరో? యివి యేమిటి కంచు నెంచి యా
కాసర మార్చుఁ గాని యివి కాంతలవింత లటంచు నెంచునే?
భాసురరీతి నొక్కఁడు ప్రబంధముచేసినఁ దద్రసమ్ము నెం
తో సరసమ్ముగాఁ గొను బుధుల్ పచరించినపుణ్య మన్యమే
వేసరి కొంద ఱన్నఁ బదివేలు పఠించినఁ గాని గ్రంథముల్
చేసినఁ గాని సత్కవులు చెప్పినపద్యములన్ రసంబు పే
రాస గ్రహింప లేక తమయజ్ఞత బైటకుఁ బెట్టుకైవడిన్
దోసము లేనిచోటులను దోసము లున్నవటంచుఁ బల్కుచున్
దోసము లున్నచోటులను దోసము లే దని సంతసించుచున్

---

* పాఠాంతరము "నూరకొను"

హాసము చేసినంత సరి యౌనె? మహాకవితావివేచనా
భ్యాస మనంగ నంతఁ బయిపైఁబడి యున్నదె? యద్దియున్ జను
ర్వ్యాసనయే సుఁడీ? యదియు వారలు వారలు చేయుభాగ్యమున్
జేసి లభించు నట్టిపరిశీలన గల్గినవారి కేము వే
యేసినమస్కృతుల్ సలిపి యెంతయు భక్తి నుతింప కుందుమే. ౧౨౮

## అవధానశక్తింగూర్చిన యాక్షేపణల కుత్తరము.

1. చ॥ బళి బళి యెంత వింతయొ? సభాసదులార! వినుండు నూనుడిన్
గలియుగరీతి యౌ? కవిత గానని హేతువు చేతనో? "మహా
త్ముల మని పేరు పూను తనుబోఁటులగౌరవ మూఁడు" నంచునో?
తెలియద దేమొ కాని కడుఁ దేలిక యౌనఁట వందమందికో
ర్కులు మది నూని వారలు వరించినవృత్తములన్ గ్రహించి వా
రల కొకపాదము న్నొడివి వ్రాసినపిమ్మటఁ దక్కుపాదముల్
గలయఁగఁ జెప్పి పిమ్మట నఖండము గాఁగను నూఱుపద్యముల్
బలువడి నప్పగించుపని పల్కఁగ వచ్చును గాని చేయుటల్
చులకన గాదు వేఱొకటి చోద్యముపుట్టె నదేమనంగ? "గం
టలు పది పైనిఁ బట్టునె? తటాలున గంటకొ లేక రెండుగం
టలకొ రచింపఁగా వలె హుటాహుటి" నంచు వచింతు రంట వా
రల మతి చాకచక్య మది రాజసభన్ బ్రకటమ్ము సేయఁగా
వలెఁ దమయింట [1] డాఁగికొని పల్కుట కష్టము గాదు చేయువా
రలమొగ మెన్నఁడైనఁ గనిరా? వినిరా? యలనూజవీటిలో
పల నలమాడభూమిపకులపావనుఁడై తనరారు వేంకటా
ర్యులు రచియింప లేదె? బుధు లుబ్బి నుతింపఁగఁ, బీఠికాపురిన్
సలలితరీతి నాతఁడొక సారి యొనర్పఁడె? కాకినాఁడలో
పల నమలాపురమ్మునను బందరు నెల్లురు చెన్నపట్టణ
మ్ముల విజయాఖ్యపట్టణము ముఖ్యముగాఁ గలరాజధానులన్
బలుమరు మే మొనర్పఁగ సభాసదు లందఱు మెచ్చి మెప్పులన్
దెలియఁగఁ జేయుపత్రిము లనేకము లీయరె? వారిబుద్ధి లీ
తెలివికిఁ జాలవే? మఱియుఁ దెల్పెద నింకొకమాట "లోకము

---

(1) పాఠాంతరము "గూరుచొని"

దలిపలుకవస్తువుల్ గొని యథావిధి గాఁగ సమస్తవృత్తముల్
గలయ రచించి యుంచి తమకమ్మున నిప్పుడు గోరువారిక
గ్గలముగఁ జెప్పుచుందురు గాని నవీనముగా రచించువా
ర లెటుల వీర లౌదు" రని రాజసభన్ బలుకంగ వచ్చునే?
యిలఁ గలప్రాణికోటులకు నెల్ల నొకానొకపద్య మల్లినన్
గలుగును గోట్లసంఖ్యకు నగణ్యముగా గను వృత్తముల్, జగం
బులు పదునాలుగుం దనదుపొట్టను బెట్టిన దేవుఁడైనఁ దా
నిలుపఁగ నేర్చునే? యటుల నిల్పెడివాఁడును గల్గె నేని ని
స్తులుఁడతఁడౌ నటంచు మదిఁ దోఁచదు పాప మదేమొ కాని యా
ర్యు లగుమహానుభావు లిసిరో? యిటులాడిన నన్యులాడరే? ౧౩౭

## రాజుగారి ప్రశ్నకుత్తరము.

1. సీ॥ పురుషాయిత మొనర్చుపూఁబోఁడికటివిూఁదనాట్యమ్ము సల్పుపుణ్యమ్ముకొఱకొ
ఘనవితంబస్థలం బను పెన్నిధానంబు బహుభద్రముగను గాపాడుకొఱకొ
తా నాశ్రయించుకాంతకు వెన్కభాగమ్మునను గూడ సౌందర్యమునుపుకొఱకొ
పదిమందిదృష్టులుపడినఁ గంటకమంచునూహించి కనుపడకుండుకొఱకొ
తే॥గీ॥ వేణి కాంతల వెన్నంటివ్రేలుచుండె, లేక యుండిననిధువనలీల కుపచ
రించుసంగమ్ము లెదుట నేసంచునించ, దానికట్లుండ నేయుపద్రవమువచ్చు ?

## పైదానినే భంగ్యంతరముగాఁ జెప్పుట.

2. మ॥ ఎదుటన్ వర్తిలునట్టి యంగములకెంతేని స్తనాదికతా
పద పల్లాత్ములను గల్గుసంగతినిఁ దాఁ బ్రత్యక్షమున్ జూచి నె
మ్మదిలో భీతిలి "చాటుచో"టనుచు సంభావించి వెన్నంటుచున్
బొదలన్ బోలును వేణి, లేకునికిఁ దా ముందుండ కట్లుండునే? ౧౩౮

## మేమును అవధానము చేసెదమని తప్పిన వారింగూర్చి చెప్పినది.

1. సీ॥ నాలుగామడదాఁట నానేర్పు మీఁద నాచేతఁగాదను నొక్కకోఁతిగాఁడు
ఎన్మిదామడదాఁట నేనేర్తు మీఁదనాచేతఁగాదను నొక్కకోఁతిగాఁడు
పదియామడైన నేఁ బరతెంతు మీఁద నాచేతఁగాదను నొక్కకోఁతిగాఁడు
పండ్రెండయిన నాదుపనిగాని మీఁద నాచేతఁగాదను నొక్కకోఁతిగాఁడు

ప్పిన తిరుపత్యభిఖ్యకవి వేంకట సత్కవులన్ గణించి టీ
కను నొనరింపఁ జేయఁగఁ దగన్ మనమందున నిచ్చగింపుమా. ౧౮౧

## శ్రీ చిన్నదొరవారి పట్టాభిషేకముంగూర్చి.

1. శా॥ శ్రీరామాపతియున్ దుషారగిరిపుత్రీప్రాణనాథుండును వా
ణీరామాపతియున్ శచీపతియుఁ దన్నీరేజనేత్రిన్ సదా
నీరాజ్యమ్మును నిన్ను బంధుజనుల న్నీయాశ్రితానీక మా
తారార్కమ్మును బ్రోచుచుండుదురు సీతారామభూపాలకా. ౧౮౨

2. శా॥ తల్లిందండ్రియు నీదు వైదముల కత్యంతప్రమోదమ్ముచే
నుల్లంబందునఁ బొంగ బందుగులు నెంతో మోదముం జెంద సం
పల్లీలారమణీమణీవృతుఁడవై భాగ్యాదిసౌభాగ్యత
త్తల్లాభమ్ముల వృద్ధిచెందు మిఁక సీతారామభూపాలకా ! ౧౮౩

3. మ॥ ధరణీదేవతలెల్ల దేవతలుగా దైవమ్ముతోడ్పాటుగా
గురువుల్ సెప్పినమాట వేదములుగాఁ గోపమ్ము దూరమ్ముగా
సిరి ముంగొంగు పసిండిగాఁ దగునటన్ శ్రీకేశవస్వామి సా
దరుఁడై ప్రోవఁగ రాజ్యమేలు మిఁక సీతారామభూపాలకా. ౧౮౪

4. మ॥ జనులన్ గాసిలనీక బందుగులవిశ్వాసమ్ము పోనీక దు
ర్జనులన్ జేరఁగనీక శత్రువులు నుద్యన్ బొందఁగానీక బు
ద్ధిని బల్ త్రోవఁ ద్రొక్కనీక తగురీతిన్ ధీరు లాభీలపురా
తన రాజన్యులఁ బోలి యేలు మిఁక సీతారామభూపాలకా! ౧౮౫

5. మ॥ కవులేతెంచిన గారవించుచుఁ దదుద్గ్రంథమ్ము నే గొంచుఁ స
ద్వివిధార్థమ్ములు విచారించు వారల నతి పేర్మిసన్ గనుంగొంచు మం
చివివేకంబలరార వార లిడునాశీర్వాదముల్ గొంచు ని
త్యవిభూతిన్ ధర నేలుమయ్య! యిఁక సీతారామభూపాలకా. ౧౮౬

6. శా॥ బాలుండంచును బాలకుల్ బుధులు విద్వాంసుం డటంచున్ ఖలుల్
కాలోత్తంసుఁ డటంచు రాజులు, కృపాసాంద్రుండటంచున్ బ్రియ
స్త్రీ లా మన్మథుఁ డంచుఁ జేరఁగ సుప్రసిద్ధిగా నిన్నుమన్ నిజా
ప్తాలన్ రాజ్యము సేయుమయ్య! యిక సీతారామభూపాలకా. ౧౮౭

**7.** శా॥ నీలీలన్ కవులెల్లఁ జూచి కడు వర్ణింపన్ జగంబెల్ల నీ
శీలమ్మున్ గని సంతసింపఁగను నీశ్రీ చూచి దేవేంద్రుఁడా
హేలాపమ్ములు సేయ నిత్యమును గళ్యాణమ్ములే పొంగ గ
ద్వాలన్ రాజ్యము సేయుమయ్యా! యిఁక సీతారామభూపాలకా. ౧౪౯

**8.** శా॥ నీరాజ్యమ్ము రమావిలాసవతికిన్ నీరేజమై యొప్ప నీ
పే రుద్యత్కవిరాజమండలి బహుప్రీతిన్ జపింపన్ మహా
వీరాగ్రేసరు లెల్ల నీదుబలిమిన్ వేనోళ్ల శ్లాఘింపఁగా
ధారాళమ్ముగ రాజ్య మేలు మిఁక సీతారామభూపాలకా. ౧౪౦

**9.** మ॥ కనకక్ష్మాధరకూటతుల్య మగుబంగారంపుసింహాసన
మ్మున సామంతనృపాలకుల్ గొలువఁ గర్పూరంపునీరాజనా
లను ముత్తైదువ లీయ సత్కవులు పద్యమ్ములన్ బ్రశంసింప స
త్యనిదానమ్ముగ రాజ్య మేలు మిఁక సీతారామభూపాలకా. ౧౫౧

**10.** సీ॥ సామంత రాజన్యసంఘమ్ము లొకవంక నొకవంక రాజబంధూత్కరంబు
తులలేనిమంచియుద్యోగస్థు లొకవంక నొకవంక దివ్యవైదికగణంబు
సకలభాషాకవిత్వకలాపు లొకవంక నొకవంకఁ బ్రథితవైణికకులంబు
శాస్త్రమర్యాదావిశారదు లొకవంక నొకవంక గాంధర్వయువతిచయము
తే॥గీ నిండుపేరోలగమ్ముననుండి కొలువ, మేలుగా నేలుకొనుము గద్వాలపురము
"పట్టినదియెల్ల బంగారు ముట్టినయది, ముత్యముగ" రామభూపాలుముద్దుతనయ!

**11.** సీ॥ హరునియంకమునందుమురువు మీరఁగ వసించుబాహులేయునికాంతిపటిమ మించి
కమలలోచనునియంకమునందు వసియించుచిలుకబాబారౌతు చెలువు గాంచి
యింద్రుపెంగోడమీఁద నింపు గులుకుచు జయంతునిముద్దులేచెల్వ ననుసరించి
యలకాధిపతియంకతలమందుఁ జెలువొందు నలకూబరునిసౌరు లయఁ గాంచి,
తే॥గీ॥ రామభూపాలరాయధరాసుమేరుగిరి, నంకసీమమ్మునందున నధివసించి
మేలుగా నేలుకొనుము గద్వాలపురము, పద్మదళనేత్రి! రామభూపాలపుత్రి!

**12.** సీ. కనులు విప్పిననాఁడె కరుణారసకటాక్షవీక్షణాప్యాయమహావృష్టి గురిసె
చేతు లెత్తిననాఁడె శ్రితబహుశ్రుతకవిప్రతతిదారిద్ర్యభావమ్ము సడలె
పాటు లాడిననాఁడె మహనీయ శివస్వామినామప్రభావము చెలఁగె
నడుగు వెట్టిననాఁడె యరిరాజగుమశంకలిరాకోటియుల్ గడలఁ దొచ్చె

తే॥గీ॥ ననుచు జనులెల్లనుతియింప నలరితౌర! రామభూపాలరాయపురాకృతప్ర
శస్తభాగ్యస్వరూప! విశాలరూప, మాకుమార! మహాలక్ష్మ మాకుమార!

13. సీ॥ గర్భస్థితుండ వైనకాలమందుననె భక్తి నొసంగఁ బోలు మీ కేశవుండు
జాతకర్మ మొనర్చుసమయమ్మునసె దాతృతను నేర్పఁ బోలు మీతండ్రిగారు
వ్రేలిని గుడిపించువేళనే లోకమర్మము దెల్పఁ బోలు మీమంత్రిసాని
మించుటుగ్గును రంగరించువేళనె కవిత్వరుచి నీఁబోలు మీతల్లిగారు
తే॥గీ॥ లేకయుండినఁ నేఁడేండ్లలేఁతవయసు, నందె యీకవులెటులబ్బె"ననుచుఁగవులు
రమణ నుతియింప నలరితౌరా! మనోజ, భవ్యతరగాత్ర! రామభూపాలపుత్ర!

14. సీ॥ అతఁడుభాస్వత్కులుండితఁడుభాస్వత్కులుండాతఁడీతఁడో లేకయాతఁడతఁడో
అతఁడుబుధస్తవ్యుఁడితఁడు బుధస్తవ్యుఁ డాతఁడీతఁడో లేక యాతఁడతఁడో
అతఁడుదుష్టవిరాముఁడితఁడుదుష్టవిరాముఁడాతఁడీతఁడో లేక యాతఁడతఁడో
అతఁడుసీతారాముఁడితఁడుసీతారాముఁడాతఁడీతఁడో లేక యాతఁడతఁడో
తే॥గీ॥ అనుచు నుతియింప నపరరామావతార, మహిమనొప్పిన నిన్నెన్నమాతరంబె?
రామభూపాలరాయపుత్రా! సురూప! మాకుమార! మహాలక్ష్మమాకుమార!

15. సీ॥ మత్స్యధ్వజప్రభల్ మదనమూర్తి యటంచు, శంఖచక్రములు కేశవుఁడటంచు
జైవాతృకత్వంబు చందమామ యటంచు భువనబంధుత్వంబు రవియటంచు,
బుధపాలకత్వంబుపురుహూతుఁడేయంచు రత్నాకరత వారిరాశి యనుచు
రమణీయమగు పేరురామమూర్తియటంచుఁజతురాస్యతసరోజజాతుఁడనుచుఁ
తే॥గీ॥ దెలుపునినుఁ బోల్తు రెల్లరుదేవతలును, రామభూపాలరాయపురాకృతప్ర
శస్తభాగ్యస్వరూప! విశాలరూప, మాకుమార! మహాలక్ష్మమాకుమార! ౧౫౭

16. సీ॥ పుట్టించెనెవ్వాఁడు భువనత్రయము సృష్టి సేయఁజాలినయట్టిచిన్నికొమరుఁ
గలిగించెనెవ్వాఁడు తులలేనికలుషముల్ హరియింపఁ జాలినయట్టికూఁతు
ధరియించె నెవ్వాఁడు దారిద్ర్యభారమ్ము సడలఁజేయఁగఁజాలుచానమిన్న
వహియించె నెవ్వాఁడు భక్తకోటికిఁ గొంగుబంగారమై యొప్పుభవ్యముద్ర
తే॥గీ॥ ధరణి గద్వాలకోటలోవఱలునెవఁడు, మీకుఁగులదైవతంబయి మెలఁగునెవ్వఁ
డట్టికేశవమూర్తిమిమ్మరసిబ్రోచు, భవ్యతరగాత్ర! రామ భూపాలపుత్ర!

## బహుమానసమయమునఁ జెప్పినవి.

1. శా. ఎంతోమంది నృపాలకుల్ గలరు వారెంతేసి రాజ్యమ్ముల
త్యంత ప్రాభవరీతిఁ జేసినను విద్వాత్సతుకు పాత్రమ్ము లిం
తింతల్ గల్గెనె? వింతకాదె? యిది, నీవే నీకు సాటెన్నఁగా
సంతోషించె మనమ్ము రామనృపతీ! సత్యప్రభావాకృతీ! ౧౫౯

2. శా. దూరమ్మందున నుండి వచ్చు మనమందన్ జూడఁగాఁబోకు మో
శ్రీరామ క్షితిపాల? సన్నిధికవిశ్రీనాథులంజూచునా
యూరీతిన్ మముఁజూడఁ గోరెదము నిత్యమ్మున్, గటాక్షాళికిన్
దూరమ్ముంచును దగ్గరంచుఁగలదే? దూరమ్మె ముఖ్యంబగున్. ౧౬౦

3. ఉ. పెద్దనకిచ్చె మున్ను పృథివీపతి రత్నము కృష్ణరాయ లం
చద్దయ గండపెండెరము, సత్కవులెల్లరు మెచ్చ మీఁగలన్
దద్దయు మమ్మనుగ్రహవిధమ్మునఁ జూచి యొసంగినారుగా?
ముద్దుగ దానినన్ బిరుదముల్, భువి నింతటి దాత లుందురే? ౧౬౧

4. చ. సలలితకీర్తి! రామనృపసత్తమ! శ్రీకర! మీఁగ లిప్పుడే
సెలవు నొసంగినారు గద? చెచ్చెరఁ దేశము చేరి మా ఖమా
సలలితపూర్తిగన్ జపము సల్పుచు వచ్చిన తోడ వేగ మి
మ్ములఁగనఁ గట్టిబల్ సుకృతమున్ గొనివచ్చెదనయ్య! క్రిమ్మరన్. ౧౬౨

5. ఆ.వె. ఎట్టి దాతకైన నిలలోన వెలఁదెచ్చు, వచ్చుఁగాని కవులపద్యములకుఁ
బ్రభుకటాక్షమునకుఁ బరికింప వెలలేదు. గాన రామభూప! దానినిమ్ము. ౧౬౩

## మొగల్తుర్తిరాజుగారు

1. సీ॥ శిష్టరక్షణదుష్టశిక్షాకృతులకు బల్ దండివాకిళ్లు కలిదిండివారు
కోరువారలకు విస్తారసంపద లిచ్చుచుండు వాకిళ్లు కల్దిండివారు
గర్వించు శత్రువర్గములలో గుండెలోఁ బండు వాకిళ్లు కల్దిండివారు
కేతకీనావసాకేతపట్టణముసం దుండు వాకిళ్లు కల్దిండివారు

తే॥గీ॥ దివిజపతివైభవులు కలిదిండివారు, తేజమున సూర్యసములు కల్దిండివాదు
దివ్యకీర్తియుతుల్ కలిదిండివారు, తెలివిగలిగినవారు కల్దిండివారు. ౧౬౪

2. సీ॥ ఎఱుఁగమే? మీపూర్వు లెన్నియో యగ్రహారములిచ్చి కవుల గ్రంథములు గొనుట
ఎఱుఁగమే? మీపూర్వు లెన్నియో మాన్యమ్ము లిచ్చి పండితులఁ బోషించుచుంట
ఎఱుఁగమే? మీపూర్వు లెన్నియో దేవాలయములు గట్టించి ప్రఖ్యాతిగనుట
ఎఱుఁగమే? మీపూర్వు లెన్నెన్నియో ముఖాసాలు బాంధవుల కొసంగుచుంట
తే॥గీ॥ ఎన్నితరముల నెందఱే నేనిఁగాని, సర్వవిధములఁ బోషింపఁ జాలునవియె
యప్రతిహతప్రమోద! దైవప్రసాద, శ్రీకుమార! లక్ష్మీనరసింహభూప! ౧౬౫

3. ఉ॥ వారును వారు వారు మఱివారును వారును జేసినట్టి స
త్కారములుండుగా! ప్రళయకాలముదన్క నృసింహభూప! వి
స్తారధరాధిరాజసుఖసంగమలోలమనస్కుఁడైన యీ
వారవిలాసినీసుఖ మవార్యమె? శాశ్వతమే? సమగ్రమే? ౧౬౬

4. ఉ॥ పెద్దలు పెద్దఁ జేసి తమపెద్దలు పూర్వపుఁగాలమందు మా
పెద్దలుఁ గోరసీములనె పెద్దగ నిచ్చిన భూమిఖండముల్
హద్దులు పద్దులుంగలవె? యాఫలసాయము మాకుఁ జాలదే?
పెద్దలుఁ బిన్నలున్ మఱియుఁ బిన్నలుఁ గూడ సుఖింప భూవరా. ౧౬౭

5. చ॥ విను మొకమాట చెప్పెదము వీనుల కింపుగ, నెల్లవారలన్
గని వినుతింపఁ బోము పదిగంపలు కెంపు లొసంగుఁ గాక, లే
దని వినుతింప మానము రసాధికులన్, గవితామతల్లికిన్
ధనము ప్రధానమా? రసికతాధికతాసుఖతల్ ప్రధానమా? 168 ౧౬౮

6. సీ॥ అలమురారి మురారి నధిక స్తవము చేసె నతని కాతఁడు గంపెఁ డంపినాఁడె
యలవండి దశకుమారుల చరిత్ర వచించె నొకఁడైన నొకడబ్బ నొసఁగినాఁడె
యలపురూరవు నబ్బనామాత్యుఁడు నుతించె నతని కాతం డేమి యాదరించె
నలతమ్మనమనీషి యాళ్వారు నుతియించె నియపుర క్షేమైన నెఱుక గలదె
తే॥గీ॥ సత్కులీనుల సరసుల సజ్జనులను, సన్నుతించుట కవులకు సహజగుణము
అప్రతిహతప్రమోద! దైవప్రసాద, శ్రీకుమార! లక్ష్మీనరసింహభూప.

7. ఉ॥ క్షత్రియులందు భూభరణచాతురివక్కఁ గవిత్వచాతురీ
వేత్తృత లెంచు నేని గలవే? యనుసంశయమున్ హరించె సా
విత్రిచరిత్ర చెప్పె సుకవిప్రతతిన్ గరగించు దివ్యచా
రిత్రుఁడు రామరాజు, బళిరే! భవదీయుఁడు గాఁడె! భూవరా! ౧౭౦

8. మ॥ కవితాకన్యక లెందఱేనిఁ గల రీకాలమ్మునం దల్లవా
రు విచారింపఁగ గ్రుడ్డికన్నుగలవారో కుంటివారో సురూ
పవిహీనాత్ములొ కాఁగలారు వివరింపన్ సర్వసంపన్న మా
కవితాకన్య యటంచు నొక్కి పలుకంగా నేల? మీబోంట్లతోన్. ౧౨౧

## బహుమాన సమయమునఁ జెప్పినవి.

1. ఉ॥ మానవదేహధారులు నమానుషచర్యలు మీకులీను ల
న్న్యూనము గాఁగ నెవ్వనిమహోత్సవముల్ జరపింతు రట్టి ల
క్ష్మీనరసింహమూర్తి కలిమిన్ బలిమిన్ జెలిమిన్ గుమారల
క్ష్మీనరసింహభూప! కలిగించుత మీకు వరప్రదాతయై. ౧౨౨

2. చ॥ తిరుపతివేంకటేశ్వరు లతిప్రతిభాపటిమమ్ము మీఱ స
త్వరగతిఁ జేసినట్టియవధానముఁ జూచి నృసింహరాజు సా
దరహృదయాంబుజాతుఁడయి తద్జ్ఞులు మెచ్చ నొసంగె రెండు బం
గరు బిరుదమ్ములన్, స్థిరముగా దనకీర్తి ప్రకాశ మందఁగన్. ౧౨౩

3. ఉ॥ హాటకధామలన్ బిరుదు లాదర మొప్పఁగ నిప్పుడిచ్చియు
న్నా[illegible]చ్చితివి నూతనశుభ్రయశోవిశాల! యు
త్పాటితశత్రుమండల! యపారమహావిభవానుభావ! నీ
లాటినృపోత్తముల్ గలరె? లక్షలఁగోట్ల నృసింహభూవరా! ౧౨౪

## కొణితివాడ ప్రొప్రైటరు రామచంద్రజగన్నాథరావు గారు.

1. చ॥ పనిగొని వచ్చివారము భవన్నికటమ్మున కట్లు గాన మా
మనవినిఁ జిత్తగించి తగుమన్నన మీఱఁగ మావధానశ
క్తిని గనుమా? యదేమన? నకించనతాఘనతామరుద్ఘనా
ఘనత వహించుసంగతియ కా కిటువంటిశతావధానప్ర
జ్ఞను గని యుండియున్ గరము సాతురె? పిల్వని పేరటమ్ముగాఁ.
గనుఁగొను మిట్టివారలప్రకార, మఖండధరాపురందర
ప్రణుతులు గాంచు వారలసభాస్థలులం దవతంసభావమున్
గొని నివసించుచున్ సుఖము గొంటయు వారలకున్ యశంబుదా
మనిశము నిచ్చుచుంటయుఁ గదా? యటులాపఁగఁ గల్గురాజు లే
దను గన రామిఁ గాదె! యకటా! కటా! మాకవితాప్రవాహ మీ

సును గొని "మిమ్ము బోటిసరసుల్ పరిపూర్ణతఁ గొందుర్గాక" యం
చును జగతిన్ బడెన్ నిజము సుమ్మది వారును వారు వారు దీ
నినిఁ బ్రికృతవ్యయమ్మును గణింపక శక్తి కొలంది నాఁపుకొ
న్నను నిది వారివారికి ననంతముదం బొడఁ గూర్చి సంపద్వృ
ద్ధినిఁ గనఁ జేయకుండు నొకొ? దీని నుపేక్ష యొనర్చినన్ బునః
పునరభిసారికాత్వమును బొందునె? దీనిసమాన మౌనిద
ర్శన మొకఁ డుండె దానినిఁ బరాకును బూనక చిత్తగింపుమా
ఘనఘనసారపూరము లఖండము గాఁదనుఁ జుట్టుముట్ట నే
పును గొని వాయుసంచలిత పూర్ణతరప్రతిమాన శూన్యవే
గనియతరంగ దుజ్జ్వలితగాఢతరంగకమై తనర్చునీ
ఘనతరగౌతమీనదినిఁ గట్టియుఁ గట్టుగ లేక యున్న గం
డినిఁ బడఁ జేసి యెంతయు గడిందిగయమ్మున నూరు నూరుఁ జే
రినఁ గని ప్రస్తుతవ్యయమురీతిఁ గణింపక కొద్దికొద్దిగా
మునుకొని యాఁపుకొన్న నది ముందటిసాలున కెంతపంట పం
డునటులఁ జేయు నెంతటిపటుత్వము భూమి కొసంగు లాభమెం
త నయమదెంత యింత యని తప్పక చెప్పఁగ నెవ్వఁడోపు? మీ
రన? సరసాగ్రగణ్యు లిదియంతయు మీర లెఱుంగరే? ప్రసం
గనియతిఁ జెప్పఁగా వలసి కాదె? పనింగొని చెప్పినాఁగ మిం
కను భవదీప్సితం బెటులు గల్గునొ అట్లు లొనర్పమీ? యశో
ధన? ఘనకొత్తివాడపురధామ? బుధాశ్రయ? రామచంద్ర నా
మ? నిరుపమావధాన కవిమాన్యులఁ దిర్పతివేంకటేశులన్
ఘనముగఁ జూచి వారిసభఁ గన్గొన నిచ్చయొనర్పు టొప్పదే?

## పిఠాపురం - వాడ్రేవు వెంకటరత్నం గారు

1. చ॥ పనిగొని వాడరేవుకులపావన? వేంకటరత్నమంత్రి? మా
వినుచు విశేషమున్ విను వివేక మెలర్ప శతావధానముం
బొనరుచుటన్నఁ గష్టతరమో? సుఖమో? విబుధైక వేద్యమౌ
టను వివరింపఁ బూనుటిచటన్ బునరుక్తము గాదె? తత్ప్రశం
స నటు మూగించి యిప్పుడు ప్రసంగవశమ్మునఁ జేయుమా ప్రతి

జ్ఞను సభవారలందఱు నకారణ కారుణికత్వ మేర్పడం
గ నవధరింతురు? గీ. తగుకల్పన లాశుకవిత్వమందుఁ జె
ప్ప నిపుణుఁడైనయట్టి మగవాఁడయినఁ సభ కేగుదెంచి శ
క్తిని బ్రకటింపరాదె? తనధీబల మవ్యాలధీబలమ్ము గా
డను బయటఁ బడున్ మఱియుఁ డక్కరివేషము లెన్నియేని మూ
ల నిరికి వేయలేరె? సభలఁ బ్రకటింపఁగలేరు గాని, జా
మున కొకపద్యము నొక్కుడువుపూనికయుం గగినంబె? తా నొసం
గినయది తప్పా? యొప్పా? తనకే వివరింపఁగ రానివారలఁ
బనిచినదాన నేమగు? సెబా సనఁగా సభ కేగుదెంచి చె
ప్పినయది యాలకించి తమ పెద్దతికమ్మును దాచుకొంట నే
ర్పన కగులతుణంబు పనిఁబూని వివాద మొనర్ప నిచ్చఁ గ
ల్గిన "నిది నీవు చెప్పు మది లేనియెడ న్నను జెప్పుమంచుఁ బ
ల్కిన గచియింతు నే" నన "బళీ?" యని మెచ్చెద రెల్లవారు మూ
ల నిరుకునట్టివారికిఁ దలంకుడుమే? యదిగాక తాము యో
జనఁ గొని చెప్పి పంపినయసాధ్యపు శ్లోకమునందుఁ "దప్పు లే"
దని యనిపించుకోఁ దగినయంత సమగ్రతఁ గల్గి యట్లొన
ర్చినఁ దమ కేమునక్తి మొయిఁ గే సెదమీ సభలోన నిల్చి వే
యినతులు, వంధ్య పుత్రవతి పోలికఁజేసినఁ జెల్లుఁగాక తా
ము నెగనిపెంచి కష్టసుఖముల్ తుదముట్ట నెఱింగినట్టి మా
నిను లొనరింపఁ బూనఁదగు నే? యటు చేసిన వేఱొకప్పు త
న్ననుగని నవ్వకుండురె? కనుంగొనుఁడీ? యొకరేఁగాని "యి
ప్పని నిటు మే మొనర్తు" మనిపల్కిన "వారలకన్న మించి యే
మొనరుపఁ జాలువార"మని యోటమిలేక వచించుచుంటి మా
ధునికులు దీనికొప్పినను దుష్టియె మా,కటు లొప్పరేని "వే
ఱ్కను గొనిరండు వేగమె ముఖాముఖివాద మొనర్ప"నంచుఁ జె
ప్పినతిరుపత్యభిఖ్యకవి వేంకట సత్కవివాక్యముల్ వృథా
యనఁదగు శక్తి గల్గిన రయమ్మున డీకొని నిల్వరాదొకో? ౧౯౦

## మూఁడవసంవత్సరం గద్వాల

## తాతాచార్యులుగారి యవధానవిషయమునఁ జెప్పినపద్యములు.

1. శా॥ ఆర్యుల్ మెచ్చి బహూకరింపఁగను దా తాచార్యవర్యుండు ధీ
స్థైర్యం బేర్పడఁగా వధానకృతి నాస్థానమ్మునన్ జేసె నీ
చర్యల్ చూచినమాకు నెంతయును నాశ్చర్యంబు ప్రాపించె స
త్కార్యాలోచన తత్పరా! గురుయశస్కా! రామభూపాలకా. ౧

2. ఉ॥ ఈపనినే వచింతురు కవీశ్వరు "లష్టవధాన" మంచు మా
వైపున, దాక్షిణాత్యులిది వాకొనుచుందురు "శతావధాన" మం
చేపు దలిర్ప నూఱ్వురకు నెంతయు ధాటి చెలంగఁ జెప్పఁగా
దా! పలుకన్ వలెన్ "శతవధాన" మటంచును రామభూవరా. ౨

3. మ॥ గముతై పండితులెల్ల "వహ్వారె" యనఁగా సత్కవుల్ మెచ్చ దు
గ్గమదుర్గాకరుణాకటాక్ష విసరప్రాప్తాశుధాటీవిశే
ష మెలర్పంగ శతావధానకవితాసామ్రాజ్యపట్టాభిషే
కము వొందంగను మాకుఁ దక్కఁ గలఁడే? గద్వాలభూపాలకా. 3

### అష్టావధానవిషయకమగు చంపకమాలిక.

4. చ॥ నిరుడు శతావధానమును నేర్పుమెయిన్ బచరించి యుంటి మా
దరమునఁ గాంచి మాకు బిరుదమ్ముల నిచ్చితిగాదె? రామభూ
వర! యిఁక నొక్కమాటను సభాజనభాజనమై చెలంగు ని
ప్పరుసునఁ జెప్పఁబూనితిమి పండితులెల్లరు నక్కజమ్ముగా
నరయఁగ మే మొనర్పఁగల మష్టవధానము, దానిరీతి నే
ర్పఱచి వచింతు మెట్లనినఁ? బండితసమ్మతిగాఁ గవిత్వ మెం
ద ఱడిగిరేని యందఱికిఁ దప్పులు చొప్పడకుండ నాంధ్రమం
దు రహిని దేవభాషను సుమస్కరకల్పనలొప్పఁ జెప్పి యొం
దఱయినఁగాని కష్టపువిధమ్మున నెన్నిఁటినైనఁగాని య
క్కరము లొసంగిరేని యవి గైకొని తప్పక చెప్పి యంతఁ బో
క రయము మీఱ లౌకికప్రకారముగా వచియించువారి కు

త్తరము లొసంగి మీఁదను ముదంబలరన్ జదరంగ మాడి కొం
దలికి గురుత్వమూని పఠనమ్ములఁ జెప్పి పురాణగాథలన్
దుర మొనరన్ బఠింపఁగ నెదుర్కొని యర్థముచెప్పి పుష్పముల్
గరమున వీఁపుపై విడువఁగా సరిగా గణియించి ఘంటికల్
నెఱయఁగఁగొట్టు వానిని గణించి నిషేధ మొనర్చునట్టి య
క్కరములు మాని పద్యములు గల్పనచేసి మనోహరమ్ముగా
విరచనసేయ నేర్తు మిది వేఁడుక మీఱఁగఁ జిత్తగించి మా
కరువగునట్టి సద్యశము సర్వణచేయఁగ నీకుఁదక్క నొం
డొరులు సమర్థు లౌదురె? మహోజ్జ్వలరాజ్యరమాధురంధరా. ౯౯

5. సీ॥ కవనమ్ము చెప్ప సత్కవు లందఱును మెచ్చి యద్భుతానందమ్ము నంద వలయు
వ్యస్తాక్షరినిఁ జెప్పఁబడువున "నిదియేమియక్కజం"బని శంక నందవలయు
లౌకికాలాపమ్ము లూకొనివచియింప నద్దిరే యనిమోద మందవలయు
నాకాశపుఁబురాణ మల్లిన "నిదియేమి వైచిత్ర్య"మని తల లూఁచఁవలయు,

తే. గీ. తక్కనపరిశంసలకును మోదంబువిస్తరింపఁగావలె నట్లొనరించిసభ ము
దంబు గనఁజేతుమస్తావధాన కృతులఁగ్రియయౌ కేవలము త్తనంబయియొసంగు.

## మఱియొకప్పుడు చెప్పినవి.

1. మ॥ సుకవిశ్రేష్ఠుల నొక్కనాఁడు తగునాత్మీక్యమ్ము పెంపార గా
యకగానం బొకనాఁడు వైణికుల గేయం బొక్కనాఁ డిట్లు స
ర్వకలల్ చూచుచు వారికిన్ దగినమర్యాదాకృతుల్ సేయు నా
యకుఁడింకొక్కఁడు భూమిపైఁగలఁడె? రాజా? రామభూపాలకా. ౧౦౦

2. శా॥ ఏవంశమ్మునఁ బుట్టుఁగాక మఱివాఁడేవాఁడె యౌఁ గాక యౌ
ఁగావిద్యల్ పఠియించి మించి తను డాయన్ వచ్చినన్ జూచుచున్
దైవాజ్ఞప్తము నిచ్చి పుచ్చువసుధానాథుండు నీకన్నఁ బా
రావారావృతమేదినిన్ గలఁడె? రాజా? రామభూపాలకా. ౧౦౧

3. శా॥ దేవీభాగవతంబు తెల్గొనరుపన్ దీక్షాపరత్వమ్ము మా
కావిర్భావముచెందె నియ్యది మహాయాసమ్మునన్ గాని సం
భావింపన్ దుదముట్ట దిట్టికృతి చెప్పన్బూని యున్నట్టి మా
కీ వావత్సరభుక్తిం దగినదీవే? రామభూపాలకా. ౧౦౨

4. సీ॥ బ్రహ్మదేవుఁడు వ్రాయువ్రాఁతలైననుగాని తఱచుగా నప్పుడప్పుడు తిరిగి పోవు
హరుఁ డొసంగినయట్టి వరములైననుగాని తఱచుగా నప్పుడప్పుడు తిరిగి పోవు
ఫల్గునుం డొనరించు ప్రతినలైననుగాని తఱచుగా నప్పుడప్పుడు తిరిగి పోవు
సత్యవీశ్వరుల వాక్సరణులైననుగాని తఱచుగా నప్పుడప్పుడు తిరిగి పోవు.

తే. గీ. "రామభూపాలరాయభూస్వామి కవుల
కెలమి నొసరించువార్షికములకుఁ దిరుగు
లే" దనుచుఁ జెప్పఁగావచ్చు లేచియెంత
మందిగల సభలైన నిప్పుండరీతి. ౨౦౩

## మైసూరు రాజుగారు "నీకెన్నికోట్లు" వచ్చునని ప్రకృతప్రభువు నడిగినదానిం బట్టి చెప్పినది.

1. సీ॥ "కోటివచ్చెడిరాజకోటీరమణియైన నిటువంటిసత్కీర్తి నెనయఁగలఁడె
పదికోట్లువచ్చెడి పార్థివోత్తముఁడైన నిటువంటిప్రఖ్యాతి నెనయఁగలఁడె
నూఱుకోటులువచ్చు భూరమణుండైన నిటువంటివిఖ్యాతి నెనయఁగలఁడె
వేయికోటులువచ్చు పృథివీశ్వరుండైన నిటువంటిసద్యశం బెనయఁగలఁడె,

తే. గీ. బళిబళీ" యంచు నుతిసేయుపండితప్ర
కాండవచనంబులెల్లఁ గార్యాణ మయ్యె
భావుకంబైన నీదానపటిమచూచి
పండితవిధేయ! రామభూపాలరాయ! ౨౦౪

## ఆవత్సరమే చేయించిన వెండిద్వారము.

1. సీ॥ తనకీర్తికెనగాక మొనసివచ్చినయట్టి రజతపర్వతకాంతి రాశియొక్కొ
తనపవిత్రతకోడి మొనసిసేవ యొనర్చు గంగామహాదేవి కాంతియొక్కొ
తనదుశీతలభావమున కోడిపడి యున్నచంద్రికాకాంతి పరిసారమొక్కొ
తనదానపటిమ కెంతయునోడి వెలవెలఁబాఱి దీండ్రించునభ్రరుచియొక్కొ

తే. గీ. యనఁగ గద్వాలకేశవద్వారసీమ, రామభూపాలరాయఁడు రజతమయము
గా నొనర్పంగఁజేసి కైంకర్యవిధిని, దాపడముచేయఁ జేసిన ద్వారమొప్పు.

## శ్రీ చిన్నదొరవారి మీఁది పద్యములు,

1. మ॥ ప్రీతిసంవత్సరమాఘమాసమున శుంభద్డంబరారంభసం
భృతసంరంభభరంబు డంబలర నీవీటన్ భవద్వంశ్యు లు
ద్ధతిఁ గళ్యాణ మొనర్తు రెవ్వనికి నాతం డుత్సహింపంగ సం
తతమున్ రాజ్యము సేయుమయ్యా ! యిఁక సీతారామభూపాలకా. ౧౦౬

2. శా॥ కారుణ్యమ్ము మనమ్మునన్ బెరుఁగ నాకారమ్ము మారుం దిర
స్కారమ్మున్ బొనరింపఁ బండితకవిశ్లాఘ్యప్రతిష్ఠాకరా
గారానూనయశోవిభూతులు సెలంగన్ శుక్లపక్షస్ఫుర
త్తారానాథునిఁబోలి యేలు మిఁక సీతారామభూపాలకా. ౨౦౭

3. శా॥ ఆరామమ్ములపెంపు సౌధములసొం పశ్వాదిసంపత్తియున్
నీరేజాక్షులడంబు సర్వంవిరాణ్నిత్యానురాగంబు సు
శ్రీరూపమ్ములతీఱు నిస్తులయశశ్శ్రీసౌరు నిండార సీ
తారామప్రభుఁ బోలి యేలు మిఁక సీతారామభూపాలకా. ౨౦౮

4. శా॥ వక్షోవాసితనీరజాలయుఁ డదభ్రస్వచ్ఛకీర్తిప్రభుం
డక్షీణక్షణదాయి భక్తజనపాపారణ్యదావానలుం
డుక్షారూఢసుహృత్తముండు సమవిధ్యుక్తుండు యావజ్జగ
ద్రక్షాదక్షుఁడు ప్రోచు నిన్నెపుడు సీతారామభూపాలకా. ౨౦౯

5॥ మ॥ కడునింపారెడిపద్యముల్ మదికి వేడ్కల్ నింప విద్వాంసు లె
క్కుడుమోదమ్మున సన్నుతింపఁగను నీకుం గావ్య మర్పింప నీ
యెడ మామానసమందుఁ దోఁచె నిఁక నీ వెంతే మదిన్ గోర్కె సం
దడి చేయం దగ నాక్షమా కిడుము సీతారామభూపాలకా. ౨౧౦

## ఎల్లప్పుడును నూటపదియాఱులే యిమ్మనుట.

1. శా॥ రానుం బోను రమారమీ ముగురకున్ రైల్ ఖర్చు లామీఁదటన్
నానాఖర్చులు గూడి యైదుపదు లుండంగా వలెన్ మీఁద మా
స్థానమ్మున్ దగఁ జేరి "చూపుఁ డలగద్వాలప్రభుం డిచ్చు స
న్మానం" బన్న మ టేమి చూపవలె ? రామారాయభూపాలకా. ౨౧౧

2. శా॥ మాకుంబూర్వ మొసంగినట్టియలసమ్మానంబు నేఁటేట మీ
రాకల్పమ్ముగ నిచ్చువా రనుచు నాయాసమ్ము లెక్కింపక కిం
దాఁకన్ వచ్చితి మట్లు గాకునికి నిందాఁకన్ వృథా వత్తునే ?
రాకాచంద్రియశోవిశాల ! గుణధీరా ? రామభూపాలకా.

3. ఉ॥ "అందఱి కిట్టు లీవలదె ? యాస యిటుండఁగ వచ్చునే ?" యటం
చుం దమరాన తీవలకు చూడుఁడు మావలె సుప్రసిద్ధుఁడై
యిందుల కింత దూరము సహించి మఱొకవి వచ్చె ! వచ్చినం
దందరలేక యెవ్వఁ డవధాన మొనర్చె ? నృపాలశేఖరా.

4. చ॥ "బడె బడె యి వ్మటం చదుగఁ బాడియె ? యేరికినైనఁగాని మా
కుడుగక తోఁచినంత యిడు మందుము తోఁచక యుంన్నయప్డు ను
మ్మడిగిన హెచ్చు సేయుదుమె ?" యంచు వచింపఁగ మీకుఁ జెల్లునే ?
"యడుగక యమ్మ పెట్ట"దనున్యాయము దేవరవా రెఱుంగరే ?

5. ఆ॥వె॥ నిరుడు ముందటేడు నీదర్శన మొనర్ప, నేగుదెంచి యచటి కేగ లేదు
ఆత్మకూరురాజు నరసి వచ్చెద మయ్య ? రామభూమిపాల ? రమ్యశీల ?

## మొదటి సం॥ ఆత్మకూరుసంస్థానము.

1. శో॥ ఇతోఽప్యధికసంపత్తి, రితోఽప్యధికసంతతిః
ఇతోఽప్యధికకీర్తి స్తే, సీతారామమహీపతే.

2. మ॥ సనకాద్యుగ్రమహామునిప్రార్థితపదాబ్జాంకుండు కంసాదిదు
ర్జనసంహారకుఁ డా[illegible]కగుణసమారంభప్రియంభావుకుం
డనిమిత్తప్రసరత్కృపారసవిశేషాలంబియౌ నందనం
దనుఁ డైశ్వర్య మొసంగి ప్రోచు నిను సీతారామభూపాలకా!

## రాజుగారుచాందినీని గూర్చి ఆశుధారలో నడిగినది.

1. శా॥ నీయౌదార్యము రాకపోన్ మిగులఁగా నీ విచ్చు పేరీ[illegible]
"యాయా వేళ నేమి కావలయునో ?" "యంచున్" సురా[illegible]ంబు నీ
[illegible]యే తెం[illegible] నటంచు [illegible] నే నానా[illegible], సోదరా
డ్డాయాదా ? నృపసార్వభౌమ ? నన్ సీతారామభూపాలకా. ఓ! శా.

## రాజుగారు పెద్దదీపమును గూర్చి ఆశుధారలో నడిగినది.

2. శా॥ "నా సోదర్యుల దాన ధర్మపటిమ న్నాతండ్రి గాంభీర్యవి
ద్యాసంపన్నతచే జయించితివి నే నాము న్నె సత్కీర్తిచే
గాసిం జెందితిఁ బ్రోవు"మంచు శశి యీ కాలమ్మునన్ దీపమై
తా సేవింపగవచ్చెఁ గన్గొనుము సీతారామభూపాలకా. వెం॥ శా॥

## సభ చేయించకయే సన్మానించెద మన్నందులకు

1. సీ॥ అనువత్సరము వచ్చునట్టివారము కాము చిల్లరకవులలోఁ జేరఁబోము
రసికులు గానట్టిరాజులఁ గనఁ బోము వ్యర్థవాదములకు భయముగొనము
ప్రతిఘటించిన నెంతవాఁడైన లక్షింప మనుకూలుఁడగువానికణఁగియుందు
మష్టావధానశతావధానమ్ములం దనుపమానప్రౌఢి నాచరింతు,
తే॥గీ॥ మింతయును నిక్క మిందునొక్కింతగ్గైన, లేదసత్యమ్ము, సభచేసి మాదుశక్తి
గాంచి యామీఁద మమ్మును గారవింపు, మాత్మకూరుపురీరాజ? యతులతేజ!

## సీసమాలిక.

2. ఆనందగజపతిక్ష్మానాథుసభలోనఁ గవనమ్ముచే మెప్పు గాంచినాము
శ్రీరాజగోపాలకృష్ణయాచమహేంద్రుసభ నవధానమ్ము సల్పినాము
కేతకీనగరభూనేతయాస్థానమ్మునందు నెంతయుఁ బేరు చెందినాము
గోపాలరాయభూమీపాలుసభలోన "నిరుపమాను" లటంచు నెగడినాము,
రావుజగ్గారాయరాజన్యుసభలోన శతఘంటకవనమ్ము సల్పినాము
కాకినాడాదిసద్గ్రామమ్ముల శతావధానమ్ముచేఁ గీర్తిఁ బూనినాము
కాశీసహస్రాదికావ్యమ్ములు రచించి కాశీకృపం జెందఁ జాలినాము
ధాతురత్నాకరగ్రంథమచంపు రచించి పాణినీయస్తుతుల్ వడసినాము

పంచపాది.

తే॥ గీ॥ నిరుడు గద్వాలరాజసన్నిధిని శత్రు
మధ్యమందు జయం బందె మహాప్రబల
బంగరుబిరుదులను జయపత్రికయును
బడసి యీయేఁడు నినుఁ జూడవచ్చినాము
మాత్మకూరుపురీరాజ? యతులతేజ?

3. తే॥గీ॥ నళ్ళమునసలాపురమ్మును గద్దవాల, పురము విజయపురమ్మునుబుచ్చికొనియొ:
జేయి కేతకీపురము గైసేసె నొక్క, చేయినీకయి మిగిలెఁ గైసేయు మధిప!

## మఱియొకనాఁడు చెప్పినవి.

1. శా॥ దేవీభాగవతాదిగ్రంథముల నెంతే యుక్తినైపుణ్యలీ
లావైచిత్ర్యము లొప్పఁగూర్చితిమి పోలన్ జూడ మీబోంట్లు గా
కేవా రింకఁ గలారు? యోగ్యులెపుడో యేవేళనో మీరు శ్రీ
ధ్రాపిస్ఫూర్తి వినంగ మామనవి, సీతారామభూపాలకా? ౧౨౪

2. శా॥ పాండిత్యమ్మున మించి యుపగుకవిత్వం బొప్పువాఁ డెట్లు భూ
ఖండమ్మందున మృగ్యుఁడో విభవసాకల్యమ్మునన్ బోల్చ బ్రి
హ్మాండమ్మైన తగువిద్యచే నెగడి దానాధీనుఁడో రాజమా
ర్తాండుం డట్టులె, నీకుఁ బట్టెనిది? సీతారామభూపాలకా? ౧౨౫

## రాఘవాచార్యులువారి గానమునుగూర్చి

1. శా॥ ఆర్యుల్ మెచ్చఁగఁదక్క గాయకులు వహ్వా? యంచునే గాన సౌ
కర్యమ్ముం గొనియాడ మూర్ఖులును వేడ్కన్ జెందఁగా రాఘవా
చార్యా? భైరవి నాలపించితివి నీచాతుర్యసంపత్తియున్
సైర్వైశ్వర్యములున్ మఱంబిడవె? సీతారామభూనేతకున్. వెం॥శా॥ ౧౨౬

2. క॥ "గరిసరిసమ" యని కీర్తన్, గరిసమగరిమ యని యొఱపుగలవిక్రమితన్
సరిరి ధనిసమ యనియెడు, కృరసీతారామభూప? కనుమీ! వీణన్. తి॥శా॥

## ఆలస్యమైనందులకు.

1. శా॥ శ్రీరంజిల్ల శతావధానమును మాచేఁ జేయఁగాఁ జేసి మ
మ్మారాధించుట సర్వసమ్మతము, లేదా? వేఁ మాదేశమున్
జేరం బోయెద మన్య మెల్లమిట గాసిం జెంద మాకేల? సీ
తారామావనిపాల? మాకు జయపత్రం బిచ్చి పంపింపుమా. ౧౨౭

## పరీక్ష.

(సమస్య) అఱవిరిపాన్పుచేరఁ జనరా? విటరాయఁడ? నేను వచ్చెదన్.

1. చ॥ మఱఁదియు బావయున్ మగఁడు మామయు నత్తయు నింటిలోనఁ జి
చ్చఱ పిడుగుల్ "సుఖమ్ము గొనసాఁగద" టంచుఁ దలంచి పాను పే
ర్చఱచితిఁ దోఁటలో, సగమురాతిరి పోయినమీఁద నీవు గ్రి
చ్చఱ విరిపాన్పు చేరఁజనరా? విటరాయఁడ? నేను వచ్చెదన్. ౨౨౯

(సమస్య) రంధ్రమ్మయ్యె శిలీంధ్ర మాంధ్రమున సైరంధ్రీపురంధ్రీమణీ.

2. శా॥ ఆంధ్రంబందు శిలీంధ్రశబ్ద మది తానా నేమొ? రంధ్రంబు, కా
దాంధ్రాభిఖ్య నెసంగుదేశమున వర్షాధిక్యమున్ జేసి నీ
రంధ్రప్రక్రియగా శిలీంధ్రము లెలర్పన్ మీఁద నద్దాన నీ
రంధ్రమ్మయ్యె శిలీంధ్ర మాంధ్రమున సైరంధ్రీపురంధ్రీమణీ. ౨౩౦

## రాజుగారికిఁ బుత్రికాజననము.

1. మ॥ "వనరాశిన్ జనియించి యాత్మధవుసద్వక్షం బధిష్ఠించి నిం
దను నైకొంటినిఁ జంచలాత్మయని, యాతప్పుం బెడంబాయ నే
రనె" యంచున్ దలపోసి భూమిపతివై రాణించు నీకడ్పునన్
దనయారూపముచే జనించె సిరి, సీతారామభూపాలకా. ౨౩౧

## శ్రీనివాసవిలాసమునుగూర్చినమాలిక.

1. చ॥ పరిలసదాత్మకూరునగపాలక! శీలకలాభిరామ! ము
క్కురకులరత్నదీపకలికాయిత! సోమనరేంద్రచంద్రభూ
ర్వరచితభాగధేయ! పరిపాలితసత్కవి సార్వభౌమ! మ
"మ్మరయుఁ" డటంచు మీ రొసఁగినట్టి మహాప్రకాలనామభా
స్వరకవిసార్వభౌమకృతచంపువు నింపుదలిర్ప నిక్కరా
తిరి పఠియించినార మది తియ్యనిపల్కులకెల్ల నెల్లి, వ
హ్వార? నుతియింపఁగాఁ దరమె? యారస మాసాగ సాచమత్కృతి
స్ఫురదురుభావ మాగుణవిభూతినవోదయ మాపదాదిసం
స్ఫురణవిశేష మాదురవగాహకల్పన లావిశేషచి

త్రిరచన లావిలోమకవితానిపుణత్వము లెట్టిసత్కవీ
శ్వరులయినన్ రచించిన ప్రబంధములందుఁ బొసంగునే? యొకొ
క్కరసవిశేష మొక్కొకప్రకారమునన్ వివరించుచుంటి మా
దరమునఁ జిత్తగింపుము పదంబులడం బలయాణిముత్తెపున్
సరములతోడఁ బోరి జయసంపదలం బొదలంగఁ జాలు వా
క్యరచన లామృణాళిలతికాకృతికాంగతి కానవెట్టు న
బ్బురపుసమాసమున్నఁ బుష్పబోణి మెఱుంగు హారంగురంగుని
బ్బరపు నుడుంగనుంగొనలఁ బాలునొయారపుఁజూపుకోపులన్
దరుమఁగ నోపు శయ్య మఱనప్రియదాసుమశయ్య తద్రసం
బరసినుతింప మాకుఁదరమా? పరమాదర మాని మానసాం
బురుహము దాన నోలకయి పోయి పదంపడి రాసమర్థతన్
బొరయక లోన నాటికొని పోనటుఁ గుత్తుకబంటియయ్యె నా
దర మెసకంగ "దీనిని బుధప్రకరంబు కరంబు మెచ్చఁగా
సరసముగాఁ దెలుంగునఁ బొసంగఁగఁజేయుఁ"డటంచు మాకు దే
వర తగ నానతిచ్చుటది భాగ్యముగాదె? నృపేంద్ర? యెంతయున్
బరుసదనమ్ము చే నొడి భావము శక్యముగాక యొప్పు ని
ష్పరమకృతిన్ దెలుంగొనరుపన్ దగుదార్ఢ్యము మాకు లేదుగా
ని రసికులైనమీరలు పనింగొని దీని రచింపఁజేయ సు
స్థిరముగఁ బూనినప్డు ప్రతిచెప్పఁగ నోపక యొప్పికొంటి మ
క్కఱగొని యిట్టిదాని నెసకమ్మునఁ బైనిడుకొన్న మాపయిన్
గురుమతివేంకటేశ్వరునకున్ దయలేకయపోవునే? జగ
ద్గురువయి యిప్పు డొప్పవసుదుర్గమువంశ్యుఁడు కృష్ణమార్యుడు
త్తరకవిసార్వభౌముఁడు ముదంబెదనొంది సహాయభూతుఁడై
కరుణయొకింతయైనఁ జిలుకం గలభారము బూనకున్నె? మా
గురువగుబ్రహ్మ పండితునకున్ దయదప్పునె? మాకు నెట్టిదు
ష్కరమగు కార్యమైనఁ గొనసాగఁగఁ జేసికెతల్లి కాళియున్
బరమకృపాగసమ్ము పయిపై వెదఁజల్లి యనుగ్రహింపదే?
ఈరచనచేసి తెత్తుమిది వేగ వెలర్పఁగ వచ్చునట్టిద

త్సరమునకుఁ రసారసవిచారము మాయది కాదు మిక్కుటం
పురసికులైన మీకెటులఁగఁబోలని దొక్కరసమ్ము గల్గునే?
తిరుపతివేంకటేశ్వరులధీబలచాకచక్యఁ గ్రహింపుమా. ౨౪౧

## మీసములంబట్టినూడ వీరుపండితులుగారన్నందుకు

1. ఉ॥ దోసమటం చెటింగియును దుండుడు కొప్పఁగఁ బెంచినార మీ
మీసము "రెండుభాషలకు మేమె కవీంద్రుల" మంచుఁ దెల్పఁగా
రోసము గల్గినన్ గవివరుల్మముఁ గెల్వఁడు గెల్తురేని యీ
మీసముదీసి మీపదసమీపములన్ దలలుంచి మ్రొక్కమే. ౨౪౨

## దేవీభాగవతములో "నాపలుకాలకింపుమ" యనుపద్యములో "గుణాలయ" అనుపదమును గూర్చినచర్చ.

1. సీ॥ ఆంధ్రభాషకు నన్నయ రచించినట్టిభారతము కవీంద్రసమ్మతమ యేని
అస్మత్ప్రయుక్త గుణాలయపదము భారతసుప్రయోగానుగతమ యేని
"అచ్చులోపం" బన్నయట్టి మీధర్మాధికారివాదము వట్టికల్లయేని
"మనపండితున కడ్డుమాటాడి"రని పట్టుదల నీమనమ్మునఁ దగిలెనేని,
తే. గీ. కుర్మతిష్మ్రధగస్వామి దుర్మతులకు, శిక్షకుం డయ్యెనేని మాచేయుప్రతిన
త్రిప్పివేయంగనల బ్రహ్మదేవుతరమె?, యాత్మకూరుపురీరాజ? యతులతేజ.

## రాజుగారు న్యాయముచెప్పక సభనుండి యరిగినందులకు

1. సీ॥ మదనాభిరామరాణ్మణి బిల్హణకవీంద్రుతో విరోధించితాఁ జేవచెడఁడె
రాజకళింగగంగ్రాజు భీమకవీంద్రుతో విరోధించి తాఁ జేవచెడఁడె
అల్లనీలాద్రిరా జజ్గసుకవీంద్రుతో విరోధించి తాఁజేవచెడఁడె
మున్ను దమ్మన పిండిప్రోలిలక్ష్మణకవితో విరోధించి తాఁ జేవచెడఁడె
తే. గీ. "యేము గల్చితి" మనుమాటు కీవెసాక్షి, తగవెటింగియుఁ బక్షపాతమ్ముపూని
మమ్ము నిరసించుటంత క్షేమమ్ముగాదు, అత్మకూరుపురీరాజ? యతులతేజ.

## "50 రూపికలను స్వేజ్జోడును మాత్రమిచ్చెదము సభ చేసెదరా" అని కబురంపినందుకు

1. కం. తక్కినబహుమానము మా,కక్కఱయే లేదు బత్తెమది చాలునయో?
నిక్కమిది "దంపినమ్మకు బొక్కినదే కూలిగాదె?" భూపలలామా?

2. సీ॥ శివుఁ డెవ్వరికినైన సేవనీయుఁడుగాఁడె? వైష్ణవోత్తములపాపమ్ము గాక
యబ్జుఁ డెవ్వరికైన నానంద మీయఁడే? సరసీరుహములదోషమ్ము గాక
మధు వెవ్వరికినైన మాననీయుఁడు గాఁడె? జాతిదౌర్భాగ్యలేశమ్ము గాక
విష్ణు వెవ్వరికైన వినతిహాళుఁడు గాఁడె? శైవులదురదృష్టసరణిగాక,

తే. గీ. మాదురదృష్టమునుబట్టి మమ్ము గారవింపకున్నంత నేమీకు వెలితియగునె?
వితరణాపరభోజ? పృథ్వీబిడౌజ?, యాత్మకూరుపురీరాజ? యతులతేజ.

## మాపండితులకును మీకును గలహమేల? యన్నందుకు.

1. శా॥ ఎట్టో విద్యలనభ్యసించికొని యాయాదూరదేశమ్ములం
బట్టుంబంచును బల్లెయం చనక విద్వద్ద్వేషముం బూని బల్
తిట్టుల్ తిట్టుచుఁ దిట్టులం బడుచు నిట్ దిప్పట్ ఫలంబేమి? యో
పొట్టా? నీదురదృష్ట మిట్లయినచో భూపాలకుల్నిందృ్యలే. ౨౪౮

## వివాదానంతరము చెప్పినపద్యములు.

1. సీ॥ భారతమ్ము తెలుంగుపఱప రాజనరేంద్రనృపతి నన్నయకవి కిచ్చినట్లు
రామాయణంబు "నాంధ్రముసేయు" మనిమారనృపతిభాస్కరకవికిచ్చినట్లు
కాశిఖండము "తెల్గు గావింపు" మని వేమనృపతి శ్రీనాథుని కిచ్చినట్లు
మాఘమ్ము తెల్గుగామార్చ వేంకటగిరినృపతి వేంకటకవి కిచ్చినట్లు

తే. గీ. శ్రీనివాసవిలాస మాంధ్రీకరింప,సరసతిరుపతి వేంకటేశ్వరుల కిప్పు
డానతిచ్చుటమిగుల భాగ్యమ్ముగాదె? యాత్మకూరుపురీరాజ? యతులతేజ.

2. మ. భవదీయమ్ముగు నానతిన్ సుభగశుంభడ్డంబరారంభసం
భవగంభీరవచోనిగుంభము లెలర్పన్ గాలికాసత్కటా
క్షవిశేషమ్మునఁ దెల్గొనర్చికొని వేశ్కన్ గుర్మతిశ్రీశును
త్సవకాలమ్మున కేగుదెంచెదము సీతారామభూపాలకా. ౨౪౯

3. ఉ॥ వేసవి దగ్గరాయె మిము వీడుటకున్ మనసొగ్గదాయె మా
వాసము దూరమాయెఁ బరవాస మొనర్చుట భారమాయె మా
కోసము తల్లిదండ్రు "లిదుగో అదుగో?" యని చూచుటాయె వి
శ్వాసమెలర్ప వేసెలవొసంగినఁ బోయెదమయ్య! భూవరా. ౨౫౦,

4. సీ॥ అల్లరాజశేఖరుఁ డలనన్నయకవీంద్రు సిరుల నొసఁగి పోషించినట్లు
అలసమస్తాధిపుఁ డలతిక్కనకవీంద్రుఁ బ్రాణమెత్తుగను గాపాడినట్లు
అలవేమభూపాలుఁ డల్లశ్రీనాథుని మించుసత్కృపను రక్షించినట్లు
అల్కృష్ణదేవరాయలు పెద్దనకవీంద్రు నంచితావృత్తి నాదరించినట్లు
తే॥గీ॥ సరసతిరుపతివేంకటేశ్వరసుకవుల, నెల్లకాలమ్ము నాదరించెసక మొసఁగఁ
బోషణమొనర్పఁ గోరిక పోయిరత్తు, మాజ్ఞయీవయ్య ? యోనృపాలాగ్రగణ్య ?

## మొదటి సం॥ కిర్లంపూడి స సాసము.

1. ఉ॥ చూచితి మెల్లరాజులను, జూచుచు నుంటిమి చూడనుంటి మా
నీ చతురబ్ధివేష్టితమహీవలయమ్మున నూత్నమన్మథుం
డై వెలువార నిట్టి విడిది యన్యుల కబ్బముగాదు రాజరా
డ్భావక ? చిన్నరాయనరపాలక ? శీలకళాసమంచితా ? ౨౫౨

2. మ॥ నృపతిత్వమ్మున మించరో ? కవుల నెంతే జేర్మి మన్నించరో ?
కృపణత్వమ్మును ద్రుంచరో ? మది మహానీవిట్టి బ్రోవంచరో ?
యుపకారమ్ము లొనర్పరో ? ప్రకృతరాజోత్తంసులందెందు నం
దపుఁ జందమ్మున నెవ్వరేని మనచిన్నారాయభూపాలురే ? ౨౫౪

3. మ॥ ప్రకటంబౌ నగుమోము గాంచిన మహారాజత్వసంప్రాప్తి, బో
ధక మా నేత్రయుగమ్ము శ్రీత్వము తత్సంప్రాప్తికిన్, మేము వ్యా
జక మౌ "బట్టిన దెల్ల బంగరగు నీ సన్మాన్యహస్తంబు" డన్నందు, కెం
తకు లాభ్రాగ్రణియో ? కదా ! నలువ, చిన్నారాయభూపాలకా. ౧౫౪

4. శా॥ "రూపమ్మిచ్చిన విద్యనీయఁ డది యారోపించినన్ సంపదల్
ప్రాపింపం డవి గల్గినన్ దగినయోగ్యత్వమ్ము చేకూర్పఁ డీ
పాపాత్ముం" డని తన్ను నెల్లజనులున్ బల్మాఱు నిందింప ని
న్నాపైఁ జేసె విధాత చిన్ననృపతీ ? యాలంబితాల కృతీ. ౨౫౫

5 సీ॥ "చందురు సృజియించి కందందుఁగల్పించె విద్వాంసులకు లేమి వెన్కఁ బెట్టె
రాజుల సృష్టించి రాజ్యమత్తులఁ జేసె సంపదల్ చేసి చంచలతఁ గఱపె
సతివలఁ జేసి నీచానురక్తతఁ జొన్పె సౌఖ్యమ్మునకు దుఃఖసంగమునిచెఁ
బ్రాయమ్మునకు జరాభారమ్ము జోడించెఁ గుసుమమ్ములకు వాడుగుణము వెట్టె

గీ॥ "ఎన్నియో మంచివస్తువు లెన్ని చేసి, యన్నిటికి నన్నియును గూర్చె నవగుణములు"
అనెడినిందను బాసెఁ బద్మాసనుండు, నిన్నుఁ జేసిన కతన నో చిన్నరాయ ?

6. శా॥ ధీరత్వమ్మున దాతృతామహిమ వర్ధిష్ణుత్వసంపత్తిఁ గం
భీరత్వమ్మున సత్కళాకలనఁ జేర్మిన్ గూర్మి నోర్మిన్ కృపా
పారత్వమ్మునఁ జాతురీగరిమ దివ్యద్భవ్యరూపమ్మునం
దేరాజన్యులు నిన్నుఁ బోలఁ గలరో యీ ? చిన్నరా యాధిపా. ౨౫౭

7. శా॥ క్షీరాబ్ధిన్ బురుడించి చందురునిసుశ్రీ మించి నీహారమున్
జేరం దీసి విభూతిరాజుమెయి వాసిన్ గ్రిందుగాఁ జేసి ము
క్తారోచుల్ గడకొత్తి వజ్రములపైఁ గాల్ దువ్వు నీకీర్తి, లో
నారీమన్మథ ? సత్కవిప్రవణ ? చిన్నారాయభూపాలకా. ౨౫౮

8. శా॥ నీవిద్యాంసులు వర్ణనీయులు కడు న్నీమంత్రు లత్యుత్తముల్
నీవంకం దగుచుట్ట లెల్లరును వర్ణింపం దగున్ వారు పా
రావారావృతమేదినీవలయమం దౌరౌర ? నిన్ బోలి సు
శ్రీ వర్ధిల్లెడిరాజులున్ గలిగిరే ? శ్రీచిన్నరాయాధిపా ! ౨౫౯

9. శా॥ రాజు ల్లేరొకొ ? వారికిన్ దగిన రాష్ట్రమ్ముల్ దగన్ లేవొ ? స
త్తేజం బొప్ప ధరిత్రి నేలరో ? ధనాధిక్యమ్మునన్ మించరో ?
భోజుం డొక్కఁడు దక్క విద్యలకు నామోదించెనే ? యిట్లు, సు
శ్రీఁ జెన్నారెద వింతకన్నను గడున్ శ్రీచిన్నరాయాధిపా. ౨౬౦

10. క॥ కనుఁగొంటిమి కన నుంటిమి, కనుఁగొనుచున్నాము కాని కలరాజులమా
కనుకొన్నదేశములలో, మనచిన్నారాయనృపతి మణిపూస సుఁడీ. ౨౬౧

11. శా॥ శ్రీ యింపారెడిభక్తి చెన్నలరు నీచే నిప్డు డత్యంతవి
ద్యాయుక్తిం బొగడొందునాత్రిపురసుందర్యంబ మేలెంచి దీ
ర్ఘాయుర్దాయమహానుభావఘన రాజ్యప్రాజ్యపూజ్యాత్మజ
శ్రీయోగంబు లొసంగి నిన్ను మనుచున్ శ్రీచిన్నరా యాధిపా. ౨౬౨

12. శా॥ శ్రీ రంజిల్లఁగ కాక పూర్వకవులు ల్శ్రీనాథముఖ్యుల్ సుక
స్తూరీముఖ్యపరీమళింపుసొబగుల్ తోరంపుబంగారపుం
గా రా మొప్పెడిచేలముల్ గలిగి వేడ్కన్ మించుటల్ "నాఁడు ను
న్నా" రంచున్ దెలుపున్ భవాదృశులు చిన్నారాయభూపాలకా.

1. క॥ ఈవా ? విద్యల భోజుఁడ, వావారాంగనయు గానమందున నేర్పన్
జేవయుఁ గలయది సభ్యులు, కోవిదు లోచిన్నరాయ ? కొదవయుఁ గలదే ?

2. చ॥ పురుషులు గానశాస్త్రపరిపూర్ణత గాంచియు నైనఁ బాడిరే
ని రసము గల్గు టబ్బురము, నీరజనేత్రలు శాస్త్రహీనల
య్యు రసము నొల్కఁజేయుట రహో ! యిపు డీసరసీరుహాక్షి శా
స్త్రరుచిరరీతిఁ బాడె నిది సజ్జనసమ్మతి గాదె ? భూవరా. ౨౬౫

3. క॥ ఈ పెక్కులాఁడి యెంతయు, నీటుగుగతిఁ బాడె నితని నేరుపు చెప్పన్
మేటియె యీమార్గంగిరు, పాటవ మొకకోటి సేయుఁ బార్థివముఖ్యా ! ౨౬౬

4. సీ॥ నీదానమున కోడి నిను నుతించుపయోదరవము గాని మృదంగరవము గాదు
నిను వసంతభ్రాంతి గని కూయుకోకిలాధ్వని గాని తంబురాధ్వనము గాదు
నిను మదనభ్రాంతిఁ గని కేరుచిల్కలరవము గాని ఫిడేలురవము గాదు
నిను నుతింపఁగ నింద్రుఁ డనిపిన యప్సరోవనజాస్య గాని రోవనిత గాదు

తే॥గీ॥ జనములందఱు "మద్దెల" యనియు "దఁబు,రా" యని "ఫిడే" లనియు "వెలఁమణి"
యనియుఁ, బల్కుచున్నారలీమాటవట్టికల్ల, చిన్నరాయనరేంద్ర సుశ్రీమహేంద్ర!

5. ఆ॥ వె॥ 'రాళ్ళకైనఁ గానరసము సోకినయంత, రసముగల్గు" ననుచు రసికు లండ్రు
వెన్నవంటిది మన చిన్నరాయనిమది, కరఁగెనను టదేమి ఘనము తరుణి! ౨౬౭

6. చ॥ అను వినయన్ మనమ్ములు రసాంబుధి నోలల నాడఁబోయె నా
మనముల వెంట నింద్రియసమాజము సేవయొనర్పఁబోయె నీ
జనములు సభ్యు లందఱును జంత్రపుబొమ్మల పోల్కె నైరి చె
ప్పనగునె ? నీదునైపుణి, సెబాసుగఁ బాడితివే మనోన్మనీ. ౨౬౮

1. ఉ॥ చేసినదోసముల్ బయలు చేసిన నీసునఁబోవుఁ గాన నే
నీసభ బాస చేతు నది యే మనఁ గా ? మనచిన్నరాణ్ణృపా
గ్రేసరుఁబాసి మత్కవితఁ గీసును బాసును లేక గ్రాసపుం
గాసులకోస మాసపడి కాసర కూసర చేసి రోసితిన్. ౨౭౦

2. శా॥ శ్రీ నొప్పారెడినీదువర్ణనకునై చేయూప శబ్దార్థముల్
"నేనేవచ్చెద నేనె వచ్చెదను నేనే వత్తు నే వత్తు నే
నేనే నే"యని వచ్చి మీఁదఁ బడు మే మెద్దానిఁ గైకొందు మె
ద్దానిన్ వీడుదు మోయి చిన్ననృపతీ ! దానప్రధానాకృతీ ! ౨౭౧

3. సీ॥ ఆశ్రయించినవారి నకలఁ బొమ్మని చెప్పు టన్యాయమని మదినరయువాఁడ ?
అభిమానము గలవిద్యావంతులకు దరిద్రత్వ మిక్కట్టని తలఁచువాఁడ ?
ధనహీనులకుధనంబునొసఁగుట మహోపకారంబనుచు మదిఁగాంచువాఁడ ?
"యెవరికిచ్చినను వీందుద్రిల కీకున్న యశమబ్బ" దనుమాట నరయువాఁడ ?

తే॥గీ॥ యిచ్చువేళలఁ జేతికి నెమ్మిలేని,వాఁడ ? యోచిన్నరాయఁడవ్ వన్నెకాఁడ?
నిన్నపన్నునిఁ జేసి మన్నించి పోచు, నాయుపన్నామహాదేవి యతిశయముగ.

4. సీ॥ కలికాలమున భక్తి గల్గి దేవీపూజఁ గావించుకాశ్యపీకాంతు లెవరో ?
చెన్ను మీఱు పదారువన్నెబంగారుమేల్ చాయ గల్గిననత్యసంధు లెవరో ?
సంగీతసాహిత్యసరసగోష్ఠుల నాదర మ్మెసఁగడిమహారసికు లెవరో ?
యీవివేళలఁ జేతికెమ్మి లేక యొసంగుధాటి గల్గినగొప్పదాత లెవరో ?

తే॥గీ॥ అనుచుఁ గట్టుకలల్ వేసికొనుచువిప్రు, లొనుచు దంపతులెల్ల నీగుణములెపుడు
చెప్పికొనుచుందురోయి? మాయప్ప? చిన్న,రాయభూపాల? విపులసామ్రాజ్యలోల!

5. సీ॥ "దాతృత్వమెల్ల నిన్ దవిలియుండుటనె? కల్పకమ్ముభూమిలోఁ బాతుకొనియె
గాంభీర్యమెల్ల నీకడన యుండుటఁగాదె ? కడలి పాతాళలోకమున కరిగె
ధైర్యమ్ము నీయంద దవిలి యుండుటఁ గాదె ? నగరాజు చదలనైకెగసి పోయె
సౌందర్యమెల్లనీయందె యుండుటఁగాదె? పంచబాణుఁడు కంటఁబడ టమానె"

తే॥గీ॥ అనుచుఁ గొనియాడుచుందురి నన్నఖిలజనులు
భాసురాకార ? వేంకయాంబాకుమార ?
రాజగోపాలవేంకటరామచిన్న
రాయభూపాల ! విపులసామ్రాజ్యలోల ! ౨౭౪

1. సీ॥ నిను ఁబురూరవుఁ డని కవచ్చినట్టి యూర్వశి గాని యిది వాఁవనిత గాదు
వెంటంటఁ బ్రభునాడ్దనీ చెచ్చు గంధర్వఘనుఁడు గాకిదిఁడగ యనుఁడుఁగాదు
అతనిసేనాంగమై యలర విచిత్రవాద్యమ్ము గాకిది మృదంగమ్ము గాదు
దాశిబత్తెము నక్కిలిల్లిద సీతామృతమ్ము గాని యిది గానమ్ము గాదు

తే॥గీ॥ తదమృతాస్వాదనాప్తి నెంతయును దనిసి
నాత్మసురతానుభూతికై యత్నమందు
నరులు సభ్యులు కేవలనరులు గారు
చిన్నరాయనరేంద్రా! సుశ్రీమహేంద్రా! [illegible]

2. క॥ తగునుషిడేలున కీతఁడుఁ, దగు నీమకుటయును బాడ., దగుగతి వాయిం
పఁగ నీతఁడు దగుదేవుఁడు, ముగుర్ల సమకూర్చె నేఁడు భూపలలామా! [illegible]

3. క॥ ఊబుములకవమో? యలహిమ, గిరిపై శివుశిరము నుండి కెరలిపడెడియా
సురనదియూర్మటియో? మృదంగరవమొ? వివరించిచెప్పఁగాఁదరమె? నృపా.

4. తే॥గీ॥ కోకిలల్ గూయఁదుమ్మెదల్ గుంపుగూడఁ గేకులుకుబించియమువిప్పి కేకలిడఁగ.
హాయి యనిపించె నారసింహాయిపాట; బుచ్చితమ్మయచిన్నరాడ్భూపులార!

1 సీ॥ అనుపమానప్రౌఢి నలరారునట్టిరమణ నొప్పరామలక్ష్మణులనంగ
విజయసంపత్తిచే వెలసి యెన్నఁడుగాని కవను వీడనికుశలవు లనంగ
శిష్టరక్షణబుద్ధిఁ జేసి భూస్థలి విహరించెడిబలరామకృష్ణులనఁగ
నధికబలస్ఫూర్తి నందిరెంతయుఁ బూర్తిఁ గొమరారుభీమఫల్గును లనంగ

తే॥గీ॥ నిందు పేరోలమున్న నుండి కాంచు, వారినెల్లను నానందవార్ధి ముంచు
మిమ్మువర్ణింపఁదరమె? యోమేటులార? బుచ్చితమ్మయచిన్నరాడ్భూపులార!

2. సీ॥ గోచి వెట్టక మున్నె కోమలకవిత చెప్పఁగ నేర్చితిమి ధరాపాలురార!
యన్నమ్ము ముట్టించునంతకు మున్నె దేశాలు చూచితిమి భూపాలురార!
శతఘంటకవనమ్ము సల్పినచోటు లేబదికెక్కు దగు ధరాపాలురార!
వెరస చేయఁగ మీము విరచించినవి లక్షపద్యముల్ గలవు భూపాలురార!

తే॥గీ॥ వయసు ముదిరినవిూఁద మాదయినబుద్ధి, నిల్చునో నిల్వదో గాన నేఁడె మాశ
తావధానము చూడుఁడో యనఘులార! బుచ్చితమ్మయచిన్నరాడ్భూపులార

3. ఉ॥ మాదకు మాడ రెంత్తులమాటలు నేరిచి సత్కవిత్వ మే
మీఁదుగ జోడుగాఁ జెవుల కింపుగఁ జెప్పఁగ నేర్చినాము మా
చూడనివారు లేరు మకుఁ జూడనివారును లేరు గాన మా
పోడిమి బుచ్చితమ్మయవిభూ! కనఁగా వలెఁ జిన్నరాట్ప్రభూ! [illegible]

4. సీ॥ పినతల్లి పెదతల్లిబిడ్డ లయ్యును సగర్భ్యులరీతిఁ జెన్నారుయోగ్యులార !
రమణఁగిర్లంపూడి రాజధానిగఁ జేసికొని యేలుకొనురాచగున్నలార !
పులిసైన మీసాలు మెలివెట్టి పెకలించుచేవ గల్గినజగ్గాజెట్టులార !
సంగీతసాహిత్యసరసవిద్యల నాదరమ్ము చూపెడిమహారసికులార !

తే॥గీ॥ కవులపాలిఁటికల్పవృక్షమ్ములార !
నిరుపమానప్రతిభనొప్పు నిపుణులార !
సరసతిరుపతివేంకటేశ్వరులమనవి,
నెమ్మదిం బెట్టి వారి మన్నింప వలయు. ౨౮౨

1. సీ॥ సుకవితారసమువాచో వెఱుంగనివారి కనుపమకవనమ్ము వినుట గల్గె
సంగీతరసము వా పవి యెఱుంగనివారి కెనలేనిగానమ్ము వినుట కల్గె
దేవతాభక్తి బొత్తిగ నెఱుంగనివారి కమితదైవతభక్తి యతిశయిల్లె
అంగనామయ మంచు నఖిలమ్ము ను దలంచుపుడమి తేఁడ్లకుఁగూడ బుద్ధివచ్చె

ఆ॥వె॥ కవుల మంచిమంచిగాయనగాయని, జనులఁ బిలిచి లోకజననివ్రాజ
సేయువేళ సభలు సేయించుచో నీవు, చిన్నరాయభూప ! వన్నెకాఁడ!

4. సీ॥ "పటుతరం బైనవేంకటనృసింహారాయపూర్వసంచితపుణ్యపుంజ" మనుచు
"తుల లేనిసద్గుణంబులకుఁ దానక మైనవేంకటరామాంబాతపోవిభవ" మనుచు
"వెలమవంగడమందువినుతికెక్కినమేటియిముగంటివంశపావనుఁ" డటంచు
"పుణ్యపుంజం బైనబుచ్చిసీతాంబికాదౌహిత్రరూపసాధుశ్రీ" మనుచు

తే॥గీ॥ నిన్ను జనములు గొనియాడఁ గన్నులార
గాంచఁగా నేఁడు మాకుఁ దార్కాణ మయ్యె
రాజగోపాలవేంకటరామచిన్న,
రాజసుగోపాల ! విపులసామ్రాజ్యలోల !.

8. సీ॥ ఉరువుపటుత్వగర్వయుతకుగుజ్జులచొక్క పుంజకరాల్చఁటిపోటుకన్న
వాడలోక్కటిగ నూది కిడమీనిపలినాఁటి విఁటజవ్వనికౌఁగిలింతకన్న
రతివేళ మెచ్చి మెచ్చితినంచుఁ జెలిమిన్నతనయిచ్చునధరామృతమ్ముకన్న
పొలమల్క విడిచి యొప్పులకుప్పయైనచెచ్చెలియొసఁగెడిమగ నేతకన్న

తే॥గీ॥ సాఁకు లమృతమకుటిత నీకాయము చూచి, నంటనే కల్గునది యేమి వింత ?
భోజభూపతివో ? లేక కృష్ణరాయభూమిపతివో ? చెప్పుమా ? తప్పకిప్పుడో చిన్నరాయ!

4. శా॥ నిన్నీరీతి మహోత్సవమ్ములపసం దీపింపఁగాఁ జేయుచూ
చిన్నారాయని సర్వసంపదలవాసిన్ బెద్దఁగా జేయుచు
ట్లున్నన్ మంచిది, లేక యుండినను నిన్నూరూరఁ జాటింప మా
కన్నన్ లేరిఁకఁ దిట్టులుం బడెదుసుమ్మా ? యమ్మ కామేశ్వరీ ! ౨౮౬

4, సీ॥ వేల్పురాసిరికన్న విభవాళియుమచే నలరాయనట్టిరాజ్యమ్ము గల్గి
రంభాముఖాప్సరోరమణీమణులకన్న మేలైనభోగినీస్త్రీలు గల్గి
పాలసంద్రమ్ములోపలినిగ్గుపసకన్న డాలు చెన్నారుగుఱ్ఱాలు గల్గి
యాకాశచుంబితాయతిచేత నొప్పారుతపనీయదివ్యసౌధములు గల్గి

తే॥గీ॥ కవులయెడఁ బక్షపాతంబు గల్గి మంచి,
బుద్ధిగల్గియు ననుపదవృద్ధి గల్గి
యెసక మెసఁగంగ నీరాజ్యమేలుకొమ్ము
చిన్నరాయనరేంద్ర ! సుశ్రీమహేంద్ర ! ౨౮౭

37. తే॥గీ॥ రాజసం బింత లేక గర్వమ్ము లేక
స్వయముగా దేవిఁ బూజించు సరసు లెవ్వ
రిట్టినినుఁ దక్క దేవి యింకెవనిమీఁదఁ
జిలుకుఁ గారుణ్యపూరమ్ము, చిన్నరాయ ! ౨౮౮

38. క॥ అనుసంవత్సరమీరీ, తిని యుచ్చైశ్వర్యగరిమ దేవీపూజం
బొనరించుము నాశ్రితులం, దనుపుచు వర్ధిల్లుమయ్య ? ధరణీనాథా ! ౨౮౯

## రెండవసం॥ ఆత్మకూరుచిన్న దొరవారిమీఁదిపద్యములు.

1. మ॥ ధరణీనాథులు రాజరాజనుచు విద్వాంసుల్ బుధుం డంచు సుం
దరులెల్లన్ మదనుం డటంచుఁ గరుణాధాముం డటంచున్ బ్రజల్
సరసుం డంచుఁ గవీశ్వరుల్ వొగడ రాజ్యశ్రీల వర్ధిల్లు ము
క్కరవంశాంబుధిచంద్ర ! నిస్తులయశస్సాంద్ర ! రామభూపాలకా ! ౨౯౦

2. మ॥ కరుణాశీతలదృష్టిపాతమును రాకాయామినీనాథ సుం
దరసుశ్లోకము దేహసౌష్ఠవము విద్వత్పక్షపాతంబు రా
జ్యరమాధిక్యము దానవృద్ధియును వాచాసుస్వభావంబు సు
స్థిరమై యొప్పఁగ నేలుమయ్యా? జగతిన్ శ్రీరామభూపాలకా ! ౨౯౧

8. మ॥ సరసంబై శుభమై మనోహరకలాసందర్భగంభీరమై
శరదంభోరుహపద్మసంభవసతీశాసప్రభాపూర్ణిమా
స్ఫురదిందుప్రతిభావిభాసి యగుచున్ బొల్పారి యుల్లద్వడున్
సిరుల న్నీనగ విచ్చుఁ బండితులకున్ శ్రీరామభూపాలకా! ౨౬౨

## శ్రీనివాసవిలాసమును వినిపించుసమయమునఁ జెప్పినది.

1. ఉ॥ కేవలవైదికుల్ మఱియుఁ గేవలశాబ్దికసార్వభౌములున్
కేవలతార్కికుల్ మఱియుఁ గేవలకావ్యవిదగ్రగణ్యులున్
కేవలగాయకుల్ మఱియుఁ గేవలు లెందఱునైనఁ గావ్యకృ
ద్భావము నిర్ణయించి రసపాక మెఱింగి సుఖించి మించి శ
హ్బా! శహబా యటంచు ముద మందఁగ నేరరు, కొద్ది కొద్ది యా
యావిషయమ్ము లన్నియును నారసి లౌకికచాతురీమతి
శ్రీవిభవమ్మునన్ జెలఁగి చేటున కాకర మానసూయకున్
భావము లొంగ నీ కనుభవమ్మున మించినమిమ్ము బోఁటి వి
ద్యావిదు లౌరసజ్ఞులకుఁ దద్రసముల్ పొడకట్టుఁ గాక దా
నే వచియించెఁ గాదె? తను నెంతయు మూర్ఖులు బాధ పెట్ట భో
జావనిపాలకోత్తమసభాంతరమందుఁ "గవిత్వతత్త్వమున్
భావము కేలిఁ గూడు నెడఁ బంకజగంధులమోవివాచవుల్
చేవ గలట్టిచన్నుఁగవచిక్కఁదనమ్మును సొంపునింపును
న్నావిరిచిన్నికన్గొనలవాఁడియు నా ననుభూతి లేనిచోఁ
గోవిదులైనన్ దెలిసికోనసమర్థు" లటంచు నిక్క మి
ఠీవి జగత్ప్రియమ్మునఁ బండిరసజ్ఞులయందుఁ గన్పడున్
కేవలశాస్త్రి లెంతయినఁ గ్రిందును మీఁదును బొర్లులాడినన్
భావ మెఱుంగలేరు తల బద్దలుకొట్టుక పోరి చెప్పినన్
శ్రీ వెలయంగ సత్కవిత చెప్పెడివాఁ డనఁ? బండితుండనన్
గావలె లౌకికోత్తరుఁడు గావలె బుద్ధివిశేషధుర్యుఁడున్
గావలె భోగి యోగియును గావలెఁ గొంటెలలోనఁ గొంటెయున్
గావలె మంచిచెడ్డ లనకన్ సకలమ్ము నెఱుంగఁగావలెన్

గావున నందఱున్ గవులు గాఁదగ రట్టికవీంద్రభావమున్
నేతలు లాదరింతురె? యిఁకెట్ వగలాఁడి రసానుభూతికిం
దోరిత యెఱుంగనట్టి యొకనూతన వైదిక సార్వభౌము తె
న్మోవిని నొక్క వాఁడు మొగమున్ గడకొత్తి "యిస్! తుగ్గూ తుగ్గూ
సీ? వెతెదాన మంచియుఁ జెడ్డయు నేర వహాత్రిరాల? నా
పావనమైనయోష్ఠమును బాడుగఁ జేసితివింతఁ గాశకిన్
బోవలెఁ బంచగర్భమును బుచ్చికొవ న్వత"నంచుఁ దిట్టుగా
నీ "వగలాఁడి చేష్టలివి యీ 'తిమ్మడు'" నటం చెఱుంగు నే?
భావజతుల్యరూప? కవిపండిత నుత్యయశోవిశాల? సో
మావనినాథపుత్ర? భరద్వాజ శ్రీమంపడి దెప్పిట్టియీ
పావనమైన గ్రంథమును బట్టి పలార్చి కలంచునట్టి దు
ష్కోవిదకోటితోఁ దగులుకొల్పక మంచి రసజ్ఞులైన వి
ద్యావిదులన్ యథార్థగతితత్పరులన్ బిలిపించి చక్కఁగా
భావము నిర్ణయించి పరిపాటిగమమ్మును గాఁపిదించి మీ
కోవిదులందుఁజేర్చుకొనఁ గోరెదవయ్యా? వృథావివాదమున్
భావము జొన్పుదయ్యా? వెపప్రశ్నల కోరుకఁ జాలవయ్యా? మో
దావహ మైనప్రశ్నలవు నచ్చగ నుత్తరమిత్తువయ్యా? రా
జా! వినలేనిమూర్ఖులు రసంబు విసంబుగఁ జూతురయ్యా? మా
కీవతి కొక్కవత్సర మదిందుకుఁ బట్టెఁగదయ్యా? రామరా
మా? విసువెత్తునన్న దిఁక మందులఁ జేర్పకుమయ్యా? మంచి దీ
దేవిరిగొట్టుప్రశ్నలకు ధీవరులొప్ప సహింతురయ్యా? మా
చేవయెఱుంగుమీ యెదుటఁ జెప్పెడిదేమిఁక మాటిమాటికిన్. 303

2. ఉ॥ మమ్ము నెఱింగి మావగుశ్రీమమ్ము నెఱింగి రచించినట్టి గ్రం
థమ్ము నెఱింగి దేశపువిధమ్ము నెఱింగి యనుగ్రహించి వే
గమ్మగ గ్రంథమున్ విని తగన్ మముఁ బంపవలెన్ "శుభస్యశీ
ఘ్ర"మ్మనఁగావలెన్ బరులకష్టసుఖమ్ము లెఱుంగఁగావలెన్, 304

1. సీ॥ చెవులు సుంజవరాలిచిన్నారిపొన్నారి ముద్దుపల్కులకునై మొగమువాచె
కన్ను లానసఁబోఁడిచిన్నిచెన్నెలమోము మురువుచెయ్వులకునై మొగమువాచె
చేతు లావాల్గంటిజిల్గుబంగరురంగుపొంగరుగుబ్బలకునై మొగమువాచె
వాలు కాశఁగలాఁడి డాలునుంజిగురాకు మోవితేనెలకునై మొగమువాచె
తే॥ గీ॥ మేను నాముద్దుసుద్దులమించుఁబోఁడి,సొగసుకీల్జడవేట్లకై మొగమువాచె
పోయివచ్చెదమయ్యా? నీపున్నె మాయెఁ,బంపఁ దవయ్యా? యాత్మకూర్వాగ్థిగేంద్ర

## గ్రంథమును వినునప్పుడు కుత్సితాక్షేపణలను జేయువారినిగూర్చి చెప్పినది.

1. మ॥ అలశిరివహ్నుఁడు వేదవాక్యముల కన్యాయార్థముం జెప్పి బా
ములపాలై చెడె, లుప్తమాసమును దమ్ముంజేయఁ బోరాడి పే
రలుకన్ జెందినయట్టి విశ్వపతి పాడాయెన్ బ్రమాణమ్ముగాఁ
గలదే? నీ వనినట్టిదోష మిట్టు, తర్కాంణింపు? మింతేటికిన్. 306

## అసూయాగ్రస్తులను గూర్చినది.

1. ఉ॥ ఔనె? యసూయ! నీదయిఁదయాగడమెల్ల నెఱుంగనాయె నీ
దీనత తెల్లమాయె ద్వదధీనులనుగ్గతి స్పష్టమాయె నీ
హానికరంపుఁజేష్టలవి యందఱకున్ విశదమ్ము లాయె నీ
జ్ఞానము గానవాయె నినుఁగాంచినకార్యము చక్కనాయె నీ
మానము గాలిపోను దగుమన్నన గల్గుపరిశస్తరాజసం
స్థానములందుఁ బూజ్యత నెసంగెడి పండితమండలిన్ నివా
సానుగుణమ్ముగాఁ దలఁచెదయ్యది మంచిదిగాదువిన్ము నీ
కేనొకమాట దెల్పెద నదేమన? ధర్మ్యము లైన రాజసం
స్థానములన్ వసించుబుధసత్తములన్ గలఁగించి యన్యులే
దే నొకసత్ప్రబంధము నహీనగసమ్ము లెసంగఁ జెప్పినన్
గాని త్వదీయచేష్టలవికారముచేఁ నయిపెక్కఁజేసి ఉప
ద్గానగుణమ్ము వోవిడిచి "తప్పులు చొప్పడఁజేతు" నంచు నెం
తేని యహంకృతిన్ జొనిపె దెయ్యెడలం దొసఁగుల్ పసంగక
న్యూనగుణాతిరేకమున నొప్పెడిమేటిప్రబంధమందు న
జ్ఞానికిఁగాని జ్ఞానికిదొసంగు లెసంగునె? నీకు ప్రేరణం

బూని "గుణంబు దోస" మని బొంకినఁ బోవునె? తర్కపండితుల్
దానిగుణాగుణంబులవిధం బది బైటకుఁ బెట్టరే? నిజం
బేని యొకండు కాదనిన నేమగు? వెన్నెలచూచి పంకజం
బూనునె? మోవ, మంతటనె యొడ్లకు నర్యాది నింద్యమౌనె? కా
నీ నిను మెచ్చవచ్చుఁ ద్వదధీనులు లోకులొనర్చు నిందకుం
గాని యసత్య మాడుటకుఁగాని యమార్గము లందుఁ బోకకున్
గాని యయుక్తవర్తనకుఁ గాని పరాపకృతిం బొనర్పఁగాఁ
గాని యిహమ్మునందయినఁ గాని పరమ్మునఁ గాని సందియం
బూనరు పాపమెంచరు మహోద్ధతులై చరియింతురి నానికిన్
స్థానబలంబె కారణము తత్స్థలమున్ విడనాడి యన్యసం
స్థానముఁ బొందఁ బోయినఁ బదంపడి వారల శక్తిసంపదల్
గానఁగరావె? వారి ననఁగాఁ బనిలేదిది నీమహత్త్వమే
మైనను భూమిపుత్రినది యాదిగ నిన్ గ్రహియించినట్టి యె
వ్వానికిఁ గీర్తివచ్చెఁ? బ్రవంచన సేయఁగ నెంచి దానిచేఁ
దానె వృథాగతిన్ మదినిఁ దద్దయుఁ బుం దిగులొంది సత్త్వశా
హీనతఁగాంచి సిగ్గుపడి యెంతయుఁ జింతఁ గృశించు నంతియే
కాని నినున్ గ్రహించినయొకండును మెప్పును బొందలేదు ని
న్నాని పరస్పరమ్ము దమయాత్మ లెఱుంగఁగలేక పంతముం
బూని నిరర్థకమ్ముగను బుక్కిటివాద మొనర్చి దానసం
స్థానములందు రాజుల కసహ్యత పుట్టఁగఁ జేయు పండితా
జ్ఞానులవల్ల విద్యలకు సత్కృతి దప్పఁగనున్న దింతకున్
భానునిమీఁద మంచువలె నైఁబడఁ జేసెదు తారతమ్యముల్
గానఁగ నీవు నీదయిన గర్వము సాగునె? మేటిబోటులన్
బో నినుఁ దాల్చ నేని బుధపుంగవుఁ డన్ దగుమంచిచెడ్డలన్
గానక రిక్తుఁడై యశముగాంచక తాఁ జెడిపోవు నిచ్చలున్. ౩౧౬

## బహుమానసమయమునఁ జెప్పినవి.

1. చ॥ పనిగొని నీవినమ్ము, కంఠమునఁ బ్రాణము లున్న యింతలోన నో
జనులార? యింతకన్న సరసమ్ముగ దీనిఁ దెలుంగు చేసినన్

వినయమున నమస్కృతులు చే యొనరించి భక్తద్వితీయ మహా
ధన మఖిలంబు నాతనికి దానముచేసి తరింపకుందు మే. 3౧3

2. ఉ॥ పానకమందుఁ బుల్లవలెఁ బండితకోటుల కిచ్చువేళ నే
మానవుఁ డైనఁగాని యనుమానమునన్ బహుమానమందునన్
న్యూనత గల్గఁజేయుటకు నాల్కనుఁ దద్వచనమ్ము లెక్కనే?
దానమునందుఁ గర్ణునకుఁ దాఁటిన చేతులయొద్ద భూవరా. 3౧౪

3. శా॥ ఊరేగించుట యూరాయలిచ్చుట మహోద్యోగమ్ము చెన్నార వే
యాటల్ బంగరుభూషణమ్ములు మణీహారమ్ము లిత్యాదిసు
శ్రీరంజింపుట వేయునేల? కవిదారిద్ర్యమ్ము పోఁగొట్టసీ
తారామావనిపాల? వేళయిది నీదాతృత్వముం జూపుమా? 3౧౫

4. ఉ॥ నూటపదార్లు తెచ్చినవి నూటికి నెక్కుడుఁ గాన మాకు నే
నూటపదార్లముచ్చటది నూతన మెంతయుఁ జాల నీవు మేల్
హాటక మీయ లేవొ? మణిహారము లీయఁగ లేవొ? నీకు నే
నూటపదార్లు లెక్క యగునో? యటు కాదో? నృపాలశేఖరా. 3౧౬

5. మ॥ ఒకసంవత్సర మూరకె నీదయిక పై రూహించి యూహించి "తా
రకమంత్రం" బని నిష్ఠఁ బూని జపముం బ్రారంభముం జేసి నే
టికి సిద్ధించె మదీయదేశనృపకోటిశ్లాఘ్య నీకీర్తి విం
తకుఁ బాత్రం బగునీవి చూపవలె సీతారామభూపాలకా. 3౧౭

6. ఉ॥ "రాజులసొమ్ము రాళ్ల" కని బ్రాహ్మణు లాడెడుమాట కర్థ మో
రాజవరేణ్య? "యెంతయుఁ జిరమ్ముగ దాఁల్లవలెన్ జెలంగి వి
భ్రాజితసత్కృతిం బ్రభువులహా" యని లక్షణఁ జెప్పఁ జేసి రా
భోజుఁడు కృష్ణరాయలును బూర్వపురా జగువిక్రమార్కుఁడున్. 3౧౮

7. మ॥ యశ నేతెంచి నిజాము రాజులను నీరాధీశన్ బ్రవర్తింపఁ జే
సితదా? యోగను నీవు "సత్కృతులకున్ జే సామరాజన్యులి
ట్టిక్రియన్ బూని లోనర్పఁడే? సుకవికోటిన్ మేటిగా" నంచు బో
ధక మాకీవి నొసఁగ్వఁగ వలయు సీతారామభూపాలకా.

8. క॥ నీవంటిరాజమణికిన్, గోవిదు లెల్లరును మెచ్చుకొనఁ గృతి నిడియున్
భూవర! యిం కొక్కరునిన్, జీవికకయి దేవిరింపఁ జెల్లునె? మాకున్.

9. ఉ॥ "పొట్టకుఁ బుట్టెఁ"డంచు జనముల్ వచియింతురు మాదుసీమ, మా
పుట్టలు నాల్గు మీరు నొకపుట్టెఁడు, భార్యలతోడఁ గూడ మా
పొట్టలు నాలుగింటికినిఁ బుట్టెఁడుధాన్యము వచ్చుమాన్యమున్
బట్టు నొసంగ నీవు తగవా? గ్రహియింపఁగ మేము చాలమా? 3౨౫

10. ఉ॥ దగ్గరనున్నవారలవిధమ్మున మమ్ము గారవింపఁగాఁ
దగ్గకృతిన్ రచించి బుధవల్లభు లెల్లరు మెచ్చ నిచ్చి మే
మొగ్గితి మిప్డు చేతుల, నహో! యన మా కిదు మగ్రహారమున్
దగ్గునె? యింతమాత్రమునఁ, దామరతంపరగాక భూవరా. 3౨౬

11. తే॥గీ॥ కుజుఁడుభూకారకుండఁటకుజునిలోన. రాజఁటయతండు వర్తిధర్మమ్మునందుఁ
జేయునఁటభూమిలాభముచేయఁడన్నె? జ్యోతిషమబద్ధమొనరింపఁజనునె? రాజ.




(వె॥ శా॥ జాతకము)
అప్పటికి కుజమహాదశ
లో చంద్రాంతరము.

## నెలవుసమయమునఁ జెప్పినపద్యములు.

1. మ॥ కరినెక్కించితి వృత్తి నిచ్చితివి బంగారంపుహారమ్ము లం
బరముల్ సేల్వాలునూలు లాలులును సమ్మానమ్ము గావించి మా
తరుణుల్ సంతస మందఁ జీరలు ప్రశస్తంబైన వర్పించి యా
దరముం జూపితి సంతసించితిమి సీతారామభూపాలకా, 3౨౭

2. ఉ॥ ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధు లంచుఁ బేరు గొనినారము నీకలనన్ సరస్వతీ! 3౨౯

(నాల్గవ సం॥ గద్వాల)

1. మ॥ గదవాలాఖ్యపురీసురాధిపదిశాఘంటాపథప్రాంతవా
సదశాభాసుర మై సమస్తజనులన్ సంతుష్టి గావించి మె
ప్పావవన్ వర్తిలునీకు నింబ మొకఁ డోహో! యెట్లు తోడయ్యె? సా
ఖ్యదమా? మాతమ? రామభూపతికి రంగారెడ్డి తోడౌఁగతిన్. 330

గద్య.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ
శతావధాని తిరుపతివేంకటేశ్వరులచే రచింపఁబడిన
నానారాజసందర్శనమ్మునందుఁ బూర్వార్థము.

# నానారాజసందర్శనము, ఉత్తరార్థము

రెండవ సం॥ కిర్లంపూడి.

1. చ॥ హితులు పురోహితుల్ బుధు లహీనవచోవిభవాభిరాము లు
న్నతులు కవీశ్వరుల్ యశమునం దగుమంత్రులుఁజుట్టు ముట్ట సం
గతముగ నెల్లలోకములు గాచెడిశక్తినిఁ బూజసేయునీ
ధృతి జగతీత్రియమ్మనను దెంపరి యై చరియించు భూపతీ. ౧

2. క॥ అవనీనాయకులుం గల, రవనీనాథులకు నెక్కుడైయొప్పెడివై
భవములునుం గల వయినన్, కవులకు నీవంటినృపతి కన్పడఁడు నృపా. ౨

3. ఉ॥ అన్నిఁటి కేమి గాని నిజ మాడెద నాగురువాన మేలుమేల్
చిన్ననృపాల ? యెక్కుడగుశ్రీఁ దులఁదూఁగియు నొక్కసారి నిన్
గన్నమనుష్యునిన్ వురలఁ గన్గొనినంతన పల్కరింతు నిన్
జన్నినబమ్మ వేలొకఁడు పార్థివులం దిటులెందుఁ గల్గునే. 3

4. తే॥గీ॥ ఇతరదేశాధిపులఁజూడ నేగియచటఁ, గలుగుమనుష్యఁపుఁగన్నుల కాఁక నేఁడు
నీశరీరమహాస్తపనీయభాసు, రాంజనము సోఁకఁ గడుఁ జల్ల నయ్యె భూప. ౪

5. ఉ॥ "కోడలు నత్తయున్ మిగులఁ గోరికలీరిక లెత్త నొక్కడన్
గూడి వసించుచుండు టోనఁ గూడ" దటంచు వచించుచుందు రీ
పోడిమి విద్యకున్ సిరికిఁ బుట్టినయిల్లుగ నొప్పు నీసభన్
జూడఁగ నన్యథాగతికిఁ జొన్పెడఁ జిత్తముఁ జిన్నభూపతీ. ౫

6. ఉ॥ ఏపును జెందనీ మఱియు నెంతయుసంపదఁ బొందనీ కడున్
రూపము నందనీ మఱియు రూఢికి నెక్కుయశంబు గాంచనీ
భూపతులందు ధైర్యమునఁ బోల్పఁగ నీకెనలేరు చిన్నరా
యా ? పరిపూర్ణసౌఖ్యముల నందెద వందునఁ జేసి నిచ్చలున్. ౬

1. చ॥ జనని జగద్విరోధిజనసంహరణప్రవణప్రభావమో
హిని పరతత్త్వరూపిణి మహేశ్వరి కామితదాత్రి యౌ జగ
జ్జననివిధాత్రి నీ కధికసంపద లిచ్చి సతంబు నాసుద
ర్శనునిఁ దమ్మునిన్ బ్రియ మెసంగఁగఁ బ్రోవుతఁ జిన్నభూపతీ. ౭

8. ఉ॥ ఎన్నఁగ సర్వభూపతుల నెన్నికలోఁ దలఁదాటి యీగిలో
నున్నతిలోనఁ బెద్ద యన నున్ననినున్ మది శంకఁ దక్కఁ జుక్
జిన్నృపాలుఁడంట శివి శేఖరులందఱి కన్న నీదునై
నున్నస్వతంత్రభావ మనిపోపిక సేయుము చిన్నభూపాపతీ. ౮

9. మ॥ పరదేశస్వరబాధచేత మిగులన్ బ్రాల్మలి నానాఁటి కు
క్కుటెు మాయాశుకవిత్వధార, యది నీ కన్గొన్నమాత్రానఁ జం
దురులన్ గాంచినచంద్రకాంతమణినాఁడోరంబుగాఁ గొంత కో
తరసమ్మంగనుచున్న దిప్పటికిఁ జిన్నారాయభూపాలకా. ౯

10. మ॥ అనుసంవత్సరమున్ యథోక్తముగ బల్యాదిక్రియల్ చొప్పడం
గను బూర్వమ్ము సుదర్శనాదినృపతుల్ గావించు చందమ్మునన్
దనివిం దీర్చిపూజ నీకతమునన్ దాఁ గాంచు నీదేవి నిం
దనపుత్రింబలెఁ బ్రోచు నెల్లపుడు చిన్నారాయభూపాలకా. ౧౦

11. సీ॥ సత్యవ్రతునిఁ బ్రోవఁ జాలె నేజగదంబ యఖిలవిద్యాప్రాప్తి నందఁ జేసి
యలసుదర్శనుఁ బ్రోవఁ గలిగె నేజగదంబ నేలనాల్గుచెఱంగు లేలఁ జేసి
శ్రీరఘురామమూర్తిని బ్రోచె నేయంబ రిపుని రావణుని హరింపఁ జేసి
బ్రహ్మాదిదేవతాప్రభుల సంరక్షించె నేయంబ సృష్ట్యాద్యు లెఱుఁగఁ జేసి;
తే॥గీ॥ అట్టిపరశక్తిమహిమంబునరసిపూజ, సేయుచునుఁ బ్రోవకున్నె? బల్ సిరులొసంగి
యింతకన్నను మఱియునిఁ కింతకన్నఁ, జిన్నరాయనరేంద్ర? సుశ్రీమహేంద్ర

12. మ॥ నిరుడే తెంచినయష్టపద్యములఁ గొన్నింటిం దగన్ జెప్ప శ్రీ
కరు న్నిప్పుఁ బ్రశంసచేసితిమి వేడ్కల్ మిన్నుముట్టంగ, మా
కిఁక వర్షాసను దీఱుదారియె సపు, డాకర్ణ్యంగఁ దీఱంగఁ గొం
తరహిన్ నేఁడు ప్రశంస చేసెదము చిన్నారాయభూపాలకా. ౧౨

13. మ॥ ఇనుఁ గంటిన్ నినుఁ గంటి భేద మొకయింతేనిన్ గనన్ రాదు సో
మునిఁగంటి న్నినుఁగంటి భేదము లవమ్మున్ గానఁగా రాదు మే
ఘునిఁ గంటి న్నినుఁగంటి భేద మరయన్ గోరంతయున్ లేదు మీ
యినుఁగంట్యన్వయ మెంతచేవ గలదోయీ? చిన్నరాయాధిపా! ౧౩

1. చ॥ ప్రియము నయమ్మునన్ సొబగు పెంపెసఁగన్ వినుమయ్య? బుచ్చిత
మ్మయ నరపాల! యొక్కఁడగు మన్ననఁ దమ్ముఁడు నీవుఁగూడి యా
చ్ప్రియమున నావధానము గరంబును జూడఁగ నిచ్చ సేయరా
దె? యిది యశస్కరం బనుచుఁ దెల్లముగాదె? నృపాలకోటికిన్. ౧౪

2. తే.గీ. నిరుడు మాయవధానంపు నేర్పు చూడ, ననుమతించియు రాజకార్యప్రసక్తి
పొసఁగుటం జేసి యది పొస్టుపోను జేసి, రది యిపుడు తీర్పవలయుఁ దమ్మయనృపాల

3 క. నిరుడూరకున్న కారణ, మరయన్ వినుమే నృపాలు నరయుట కై మే
మరిగిన నదేమొ? తొలివత్సర మవధానసభ లేదు చర్చింపంగన్.

4. క॥ అందఱు రాజులొనర్చిన, చందమున మాఱురీతి సంధింపక యీ
నందమున శతావధానకృతిం దాఁ గనుఁగొనుట కనుమతింపఁగ రాదే?

5. సీ॥ శంఖచక్రగదాది సాధనమ్ములు దాల్చి పాలించు నాల్గు బాహువులతోడ
క్రొక్కాఱు మెఱుఁగు నాఁగొమరారు పడియాఱు వన్నె బంగారు దువ్వలువతోడ
మకరాలనత్తు కెన్నిగని లేనగఁజాలు సొగసు గల్గిన చిన్ని నగవుతోడ
తనతోడఁ దులఁదూఁగఁ దగు నొయారమున గ్రియలరారు నెయ్యంపుఁ జెలులతోడ

తే. గీ. భక్తులకు నెల్ల వేళఁ జూపట్టు జనని, నిరుపదయ చేసి మిమ్ము రక్షించు నెపుడు
శ్రీమదినుగంటి వంశాబ్ధిసోములార! బుచ్చితమ్మయచిన్న రాడ్భ్రాతులార!

6. సీ. బంగారు సింగారమును గాఱు మీ దేహములసౌరు బలుల సన్న చెలువు దెలుపు
తమ్మిరేకులతోడ దొమ్మియుద్ధము సేయు మీ కన్నులాకర్ణమితము దెల్పు
మాటమాటకుఁ దేటమూటగట్టు మీ దుపల్కులు సురగవీపటిమ దెల్పు
చంద్రబింబములోడ సఖ్యమ్ము సేయు మీ మోములు రామాభిరామతఁ దగు;

తే. గీ. పండితులకును జగతిలోఁ బామరులకు, వేఱె వర్ణింపవలెనె? మీ వితరణంబు
శ్రీమదినుగంటి వంశాబ్ధిసోములార!, బుచ్చితమ్మయచిన్నరాడ్భ్రాతులార!

1. ఉ॥ మేరువునందుఁ జెన్నలరుమిక్కుట మైనపసిండి చాలునో?
తారకశైలదుర్గమున దండిగ నొప్పెడివెండి చాలునో?
గారవ మొప్ప నీవు కవికాంతులకుం దగ నిచ్చువేళ నీ
చేరువనుండె నేనొకటి చేతికి నడ్డమె? చిన్నభూపతీ! ౨౦

2. చ॥ ఇతరనృపాలకుల్ శతము లిచ్చెడివేళను గ్లుమోదమా
ద్భృతికి నివాసమైన నినుఁ దేటికనుంగొనినంతఁ గల్గు ని
చ్ఛ్రుతటి ముదం బదింత యనుచున్ వివరింపఁ దరంబె? సుందరా
కృతి వధికాదరోదయుఁడ వీగిని మేటివి చిన్నభూపతీ. ౨౧

3. మ॥ స్మరునిం జూడనిగొప్పలోపమును రంభాజారునిన్ జూడమన్
దురదృష్టమ్ము జయంతుఁ జూడ మనుకందున్ నిత్యసంపూర్ణుఁ జం
దురునిం జూడనిసేగియున్ జెలఁలకున్ దోడ్తోడ నే తీఱు సుం
దరునిన్ నిన్ గనుఁగొన్నమాత్రమునఁ జిన్నా రాయభూపాలకా! ౨౨

4. శా॥ "దారిద్ర్యజ్వరమున్ హరించుటకు విద్వచ్ఛ్రేణి కిగ్గంటి చి
న్నారాయాభిధమైనమం దొకటి విన్నాణమ్ముగా మంచిబం
గారమ్ముం గొని చేసె ధాత. యదియుం గన్నంత నేపాయు న
ద్దారిద్ర్యం" బని చాటు నీయశము విద్యాభోజ! చిన్నాధిపా. ౨౩

1. మ॥ కరుణాశాలిని వంచునిన్ గొలిచినన్ గార్యంబు చేకూరు ట
బ్బురమే? యంచు మదిం దలంచుకొనినిన్ బూజించుచిన్నావనీ
వరునిన్ బ్రోవక యుంటివేని నిను అవ్వన్ జేతు మోశాంకరీ!
గురుఁడున్ దైవములేఁడు సత్కవులకుం గోపంబు రా నీకుమీ? ౨౪

1. సీ॥ ఏకరంభాశుభాలోకంబు నాకం బనేకరంభాశుభాలోక మిద్ది
ఏకైకబుధకవిశ్రీకంబు నాకం బనేకసత్కవిబుధశ్రీక మిద్ది
ఏక వాసవచాతురీకంబు నాకంబనేక వాసవచాతురీక మిద్ది
ఏకనిర్జరగవీశ్లోకంబు నాకం బనేకనిర్జరగవీశ్లోక మిద్ది

తే॥ గీ॥ అనుచు నిర్జరలక్ష్మి దానగనిమీదు,కొలువులోపల నే పాడుకొనియెసంగె
శ్రీరుదినుంగంటి శంకాబ్ధిసోములార! బుద్ధితమ్మయచిన్నరాడ్భూపులార!

2. సీ॥ కోటిసూర్యుల కాంతి గోటు మీటఁగఁ జాలుడంబైన కాంతిపుంజంబుతోడ
చండముండాదిరాక్షసరాజసంహారకారకం బైనబింకంబుతోడ
పార్శ్వద్వయస్థాయుధ శక్తిపరిస్ఫూరితాకృతిమసద్దయాదృష్టితోడ
శ్రీముఖాకారశక్తిప్రేయసీయుత హరిహరబ్రహ్మాదిసురలతోడ

తే॥ గీ॥ పోతురక్కసుతోఁ బోరిపాలియఁజేసి, జగములేలిన చల్లనిజనని శక్తి
సిరుల దయచేసి మిమ్ము రక్షించుఁగాత, బుచ్చితమ్మయ చిన్నరాడ్భూపులార

1. సీ॥ చక్కఁదనమునందుఁ జర్చింపఁగాఁ జెక్కువింటివా రందటిక్కంటివారు!
శతృవిజయమందుఁ జర్చింపఁగా చేసికంటివా రంద టిక్కంటివారు
గాంభీర్య మందు సాగరమందు మోకాలిబంటివా రందటిక్కంటివారు
సర్వకార్యములందు సంపూర్తిగా నొంటిపంటివా రందటిక్కంటివారు

తే. గీ. వారిగోపాల మణిపూసవంటివాఁడు, తొంటిరాజులకీర్తులో గంటువాఁడు
మిక్కిలికిని నేలపనుగీర్తిఁగంటువాఁడు, శ్రీకరాకారసుకృతి మాచిన్ననృపతి.

2. సీ॥ నీకీర్తి కెనయఁగా నెగడిన బెల్లుపూవునకు సుగంధమ్ము పాలియఁజేసె
నీరూప మెనయఁగా నెగడిన సుమబాణుసిడము నట్టేటిలోఁ గలయఁజేసె
నీధైర్య మెనయఁగా నెగడినబంగారుపర్వతంబును నేలఁ బాతిపెట్టె
నీయీగి కెనయఁగా నెగడిన ధారాధరంబును దగ నీరదంబుఁజేసె;

తే॥ గీ॥ జగతిసెక్కుడువారితో సమతగోరు, నల్పులకు ధాతగర్వంబులణఁపకున్నె?
రాజగోపాలవేంకటరామచిన్న, రాయభూపాల! విపులసామ్రాజ్యలోల!

1. ఉ॥ ఈపికవాణి సేయుకృతు లెంతయు వర్ణనసేతు నన్న నా
కోపిక లేదు గాని యవియుణ్ గణియింపఁగ రావు నిక్క మా
యేపున నాఫణిస్వరము నింకొకమాటికి నొక్కమాటటం
చోపిక నిగ్గు జూచుటకు, నోనరనాయక! చిన్నభూపతీ. ౨౯

2. సీ॥ చెక్కుటద్దంగల చిఱుచెమటబిందులతోడ జూకాలముత్యాలు జూదమాడ
నైతికీర్తకలోఁబడియు సందుగొని చందోయి సభ్యులఁ దొంగి తొంగి చూడ
చందోయితాకుచే జడిసినమెడకంటె తలదాఁటి పాటిపోఁ దలఁచుచుండ
నరిగంచు గల్గెటచెఱఁగు పేల్లుడికట్టు మలమమాయకసౌఖ్య మొలుంకఁజేయ

తే॥ గీ॥ కందుకక్రీడ నంచి నాగస్వరంబు, సోయగముమించునచ్చనకారు లాట
పూలకోఁతయు మొగ్గలు మొదలుపనులు, చేసె నీసాని యెగ్గంటి చిన్నరాయ!

1. ఆ॥ వె॥ మేటిరాజ వయస్య మిత్రుండ వైతివి, మాకృపాములు సిరులఁ గూఁగకున్నె?
రాజు మిత్రుఁ డన్నరాణ కవీంద్రుల, కున్న యదియ కాదె! చిన్నరాయ.

2. మ॥ విను నెల్లప్పుడు నాశ్రయించెడిబుధానీకమ్ములన్ సంతతం
బును నీవేగతిఁ బ్రోవ నెంచెదవొ సంపూర్ణాను రాగమ్మునన్
దను నేఁటేటను బూఁడ నేయు నను నేతద్రీతి రక్షింపఁ బ్ర
స్నన నద్దేవి కెఱుంగఁ జేసెదము చిన్నారాయ భూపాలకా! 32

3. ఉ॥ రాజులలోన సంపదల రాజిలువారలు లేరె? నీవలెన్
తేజముసొంపు పెంపు జగతిన్నుతి కెక్కఁగఁ బూర్వకాల మా
భోజునిరీతి సద్యశము పొందఁగ నేరరు కాని వత్సరే!
రాజ! మనోజతేజ! కవిరాజిమణిస్తుత! చిన్నభూపతీ!

4. సీ॥ సపాలు సౌఖ్యఁబొసంగి జారుని వీడి చన సాఁగు నొక్కవిశాలనయన
మోము మోమునఁ జేర్చి ముద్దాడి బతిమాలి మెల్లనఁజను నొక్కపల్లవోష్ఠి
నీవి విప్పెడిజారునికరం బవలఁ ద్రోచి పరుగిడు నొక్కశంపాలతాంగి
ప్రేమఁగౌఁగిటఁజేర్చుప్రియు నొప్పఁజేసిపోవఁ జూచు నొక్కబంధరసవేణి

తే॥ గీ॥ తమ మెసంగెడి సంకేతితస్థలములు, యందుఁ గ్రీడించునభిసారి కాంగనలకు
త్వద్యశశ్చంద్రికల కెంతకీడుకవలసె? చిన్నరాయవరేంద్ర! సుశ్రీమహేంద్ర!

5 సీ॥ ఎటువు దీఁటుగఁ జేయుకవనమ్ము గలవారి చెలఁగుబంగారు మాచిన్నరావు
శాస్త్రిపరిసంగంబు పఠింపఁ గలవారిచెంబులోధనము మాచిన్నరావు
సంగీతవిద్యాప్రసంగంబు గలవారిచేతిహాంబట్టు మాచిన్నరావు
అభినయమ్మున నేర్పు నందంబు గలవారి కజ్జపై పైఁడి మాచిన్నరావు

తే॥ గీ॥ అంచుజాముల యందు నీయశము చాటుచున్నదయ్యర్థరాపాలచిన్నరాయ
సుఖముగానున్న దేమేగి చూచినాము, సరసతియుపతివేంకటేశ్వరుల వేము

5 మ॥ కన్నార న్నినుఁ గన్నకామినులకున్ గంజాస్త్రుచే బాధ నీ
యౌన్నత్యంబు నుతించు సత్కవుల కాహా? పారవశ్యంబుఁ టో

చిన్నరాయనృపాల! నీవెవరి మంచిం జూచుచున్నావు? నీ
పున్నెం బిట్లు జగత్ప్రసిద్ధి గనునేపుం గీర్తియుఁ గల్గుటల్. ౩౬

7. సీ॥ దీనాననమ్ముతో దేవనాథునివంక లోఁతుగాఁ జూచెఁ బులోమతనయ
అభినయించుచుఁ జేతులాడక రంభయు నిలువున నీరయి నిలిచిపోయె
భూలోకమున కేనుబోయి వచ్చెదనంచు సెలవుగోరెను లక్ష్మిజలజనయను
నశ్వినీనక్షత్ర మతిభీతిచేతఁ గుటుంబవైరంబు చేటునకుజంకె.
తే. గీ. నలజయంతుని యక్షరాజాత్మజాతు, సాంగిమదనాశ్వినేయులరంగుగాంచి
స్వార్గి నీవు వెంచేయుసమయమందుఁ జిన్నరాయనరేంద్ర! సుశ్రీమహేంద్ర!

8. ఉ. మంగళగీతి గాయకసమూజము పాడెడిపాటలా! శుభా
పాంగతరంగిరంగిహృదయంగమసంగధనాంగనాకలా
సంగతులా? ముదంబెద కొంసగడిసంశితమాళిగోష్ఠులా?
రంగగు నెల్లరీతులఁ గరమ్మును నీసభ చిన్నభూపతీ! ౩౭

9. సీ॥ ఆకారసర్వస్వ మరయ జేజేరాణిచంటివాఁ డొకఁడు నీవంటివాఁడు
అరిపురవిజయమ్ము నందెన్నఁ గొండరావింటివాఁ డొకఁడునీవంటివాఁడు
ఆశ్రితావనకృప నరయఁగల్ముల కల్కియింటివాఁడొకఁడు నీవంటివాఁడు
ఐశ్వర్యవిభవమ్ము నరయఁగా నెక్కుడుఃంటివాఁడొకఁడు నీవంటివాఁడు
తే. గీ. గాని యితరులు నీకెనగారుతలఁప, భాసురాకార! వేంకయాంబాకుమార
రాజగోపాలవేంకట రామచిన్న, రాయభూపాల! విపులసామ్రాజ్యలోల! ౩౮

10. ఉ॥ చందురుడందురీ కొందఱు, వసంతుఁ డితండని కొందఱందు రా
యిందురిఁ డటందురి కొంద, ఱలయిక్షుశరాసనుఁ డందురి కొంద్ఱ శ్రీ
చందమునకుఁ జగమ్ము పలుచాయలఁ బోలిక లెంచుఁగాని నీ
యందమునకుఁ శతాంశమున కందరు వారలు చిన్నభూపతీ. ౪౦

11. సీ॥ "ఊరెవలె నీశుభోత్సవమ్ములవెంటఁ గాళ్ళలోపల శక్తి గలఫలమ్ము
మాడంగవలె నీదుసుందరాకారమ్ము కన్నులలోఁబాప గలఫలమ్ము
ఎన్నంగవలె నీమహోన్నతవిభవంబు కవులకుఁ గవనమ్ము గలఫలంబు
పాడంగవలె నీదుపదముల నెంతయు గాయకులకుఁబాడఁ గలఫలమ్ము

తే. గీ. కాదె" యని భృత్యులును స్త్రీలు కవులుఁగాయ
కులును నిన్నె నుతింతురు గుణనిధుండ్రు
రాజగోపాల! వేంకటరామచిన్న
రాయ భూపాల! విపులసామ్రాజ్యలోల!

42. సీ॥ చెలికాని సూర్యునిఁ జేరియు వితతప్రభాయుక్తిఁ జెన్నొందఁగ బడఁగువాఁడు
సంతతభోగీంద్ర సహితుఁడయ్యును వింతవింతకళలచేత వెలయువాఁడు
పగలు సంప్రాప్తింపఁ బలిమాలు సాధించి వితతతేజస్ఫూర్తి వెలుఁగువాఁడు
సతతసన్మార్గసచ్ఛాయ గల్గియు వర్ణసాంకర్య మెఱుఁగనిసరణివాఁడు.

తే॥ గీ॥ అధికమిచ్చువాఁడు బుధసమ్మతుండును క్షయములేనివాఁడు కంతుగనుఁడు
చంద్రుతోడఁ బురుడుసల్పఁగవచ్చునే? చిన్నవెన్నప్రభువుఁ జిన్నరావు.

## ఉత్సవమునుగూర్చిన దండకము.

శ్రీ శ్రీమదిగ్గంటి వంశాబ్ధి రాకాశశాంకప్రభుం డేతాదృశస్ఫీత భూతిప్రకాశ స్ఫురద్రోదసీమండలుం డంగనాపంచబాణుండు దానాంబుధారాసరిన్నంగమాకంప దంభోధినుత్యుండు శ్రీ చిన్నరాయావనీనాథుఁ డేపేటఁ జేయించు దేవీశరద్రాత్రిపూజామహం, బందుఁ గోనన్ విలంబ్యబ్దమం దైనయీయుత్సవమ్మున్న దంతున్ మహా దండకం బొండుసంధించి, దీనన్ దొసంగుల్ తొలంగన్ క్షమింపన్ బుధానీకమున్ వేఁడెదన్ ముందుగా నిందిరానందసంధాయకంబైన యాస్థానశాలన్ గొట్టాయిగా నిర్మించి యద్దానికిం బైఁడిపత్రమ్ములన్ గొమ్మలున్ బొమ్మలన్ జిత్రముల్ చేసి యంటించి నల్దిక్కులందున్ గొలుగ్గుల్ల యొప్పారు వింతం బ్రకాశించు రంభాతరుల్ నాటి యాకోటలో దేవదేవిన్ మహాదేవురాణిన్ దయావారిరాశిన్ బ్రతిష్ఠింపఁగాఁ జేసి శ్రీతాళరూపంబు గాఁగన్ గటారిన్ హలుంగాయించి నిత్యంబు నుత్యంబుగా సత్వరతన్ బత్తి దివ్వెల్ప్రవర్తింపఁగా గ్రొత్తగా నాటిపం ట్లుక్కెరల్ చక్కెరగల్ నారికేళంబులున్ నాగవల్లీదళంబుల్ దళంబైన పూగంబులున్ జాతి పత్త్రిలవంగమ్ములున్ జాజికాయల్ మద్దిగాఁ సంభారముల్ గూర్చి వారాంగనల్ ప్రేమ మందంగ ముత్సాహ నాదంబుఁ బాడంగ రంగత్సుకీ మంగళారంభ వాదిత్రముల్ చిత్రమై మ్రోయఁగాఁ దేనియల్ సోనలం బూనఁగాఁ జాలునా శుద్ధ మొప్పం గవిశ్రేష్ఠ చెప్పంగ నొప్పంగ విశ్రేష్ఠ లార్యామహాశేవిఁ జైఁ బవ్య

ముల్ సెప్పుచుండఁగఁ బాండిత్యభూషావిశేషమ్ములం బోషిత మ్మైనవిద్వన్మహాసం
డలం బక్షవాదమ్ము మీఁదమ్ముగాఁ జేయఁ బూజించుతత్తద్విశేషమ్ములం జూచు
వారందఱున్ "చిన్నభూపాలరాయా! మహారాజ! నీయంతవారెంతభూమిన్ విలో
కించినన్ గానరా" రంచుఁ జంచన్మరందద్రవాసారపూరంబు తోరంబుగా
సన్నుతుల్ సేయఁగా గేయమోదంబుచేఁ గొంతకాలంబు సంగీతమోదమ్ముచేఁ గొం
తకాలంబు సాహిత్యమోదమ్ముచేఁ గొంతకాలంబు శాస్త్రార్థమోదమ్ముచేఁ గొంత
కాలంబు హాస్యప్రమోదంబుచేఁ గొంతకాలంబు దాఁ బుచ్చుచున్ నిత్యకల్యాణ మా
రీతిగాఁ గల్యమందున్ దివారాత్రి మేకప్రకారంబుగా సౌర తోరంబుగా దేవి
గారంబుగా నిన్న మొన్నైనరీతిన్ దగన్ బుచ్చుచున్ వచ్చుచుం బోవుచున్నట్టి
వా రందఱున్ యోగ్యరీతిన్ సపర్యావిధానంబు గావించి యాచిన్నరాయుండు దే
వీముఖంబు న్నివర్తించి యామీఁద నుద్యానసంబున్ దగన్ జేసి భేతాళునిన్ దేవినిన్
బల్లకీ నుంచి తా వెంచి సింగారముం గారుబంగారురంగారుసంగీ చెలంగన్ గరా
యీశిరమ్మందు నూల్కొల్పి సర్పేషు గీలించి ముత్యాలహారమ్ములం దాల్చి బల్
హీరపుంబీరముం జూపఁగా నంగరా లంగులీసంగతత్వమ్ముచే మించి మించుం
దుటాయింపఁగా మించు గాఁగా నిలాయీలునున్ గాగడాలున్ సహస్రేందు కాం
తస్ఫురచ్చంద్రికాబుద్ధి పుట్టింపఁగా బాణసంచాలలో గారకాయల్ తుపాకీలునున్
గూడ బ్రహ్మాండమంతన్ బగుల్పన్ మతిన్ గొన్ని మేల్తారజువ్వాల్ దగన్ మిన్ను
ముట్టంగ దానన్ దగన్ జాజిమిగ్గుల్లు చూడన్ సమాలోక నాయాతదేవాం నాహ
స్తవిభ్రాష్టరత్నప్రభాభ్రాంతిఁ జేయన్ సురేంద్రుండు దేవీముఖంబున్ బొనర్పంగఁ
దా సంతసం బూనుచున్ గాన్పఁగా నంపు నైరావణంబో యనన్ దీపకాంతిన్
సుధాశుభ్రమై యున్నతం బైనయాయేనుఁగున్ బైఁడిపుట్టమ్ములున్ బైఁడికట్ట
మ్ములన్ దొట్టికట్టించి యామీఁద నంబారి వేయించి యద్దానిపై నూనబాలుండు
నాఁగా నధిష్ఠించి యారేరు కోఁ శాకకాంతామణీశ సంతసం బూరఁగాఁ
జేరఁగా వచ్చి యామందమున్ జందమున్ సోయగంబున్ సహాయున్ సూచి
"యన్నన్న! కన్నుల్ జలేజమ్ములే నీకు రాకాశరచ్చంద్రుఁడే చేతులాజానులంబ
మ్ములే" యంచు "రావే" యటంచు "నిస్తోగా రేమియుం జేయదేనుండు నే చెల్లెలా" యమ్మ
"నప్పా" యటంచున్ దలన్ గొప్పలల్లాడ వేణీభరమ్ముల్ చలింపన్ గరంబుల్ పదం

బుల్ గగుర్పాటు చెందన్ మొగంబున్ గురుల్ గప్పఁగాఁ దప్పు కొంచున్ బదం
బందు ఘుల్ఘుల్లారవం బొప్పఁగా నందియల్ మ్రోయఁగాఁ బైఁటలున్ జాఱఁగా క్రీడ
చేఁగప్పికొంచున్ "మరుండో! కుబేరాత్మజుండో! సురేంద్రాత్మజుండో! వసంతుం
డో! యంచున్ బ్రశంసించుచున్ మించి యాయించువిల్కాని బారిం దగుల్కొంచు
నెమ్మోముఁ డాల్ సూచితే? కౌనుసింగారముం గాంచితే?" యంచు లోలోన నూహిం
చికొంచున్ దదేకాతురాయత్తచిత్తమ్ములో నత్తభీతిన్ విసర్జించుచున్ బ్రోవులై
చూడఁగా నంతలోఁ గొందఱత్తొంటకోడండ్రు భీతిం గృపాం బేగఁగా నెంచ వారిన్
మఱిం గొంద "ఱేమే భయం బేల? పో నాలు నే యత్తలుం దాము కాలమ్ములో
నీదృశంబుల్ విలోకింపఁ బోరే" యటంచున్ని వారింపఁగా నత్తయే తెంచి "మాకోడ
లిచ్చోట నే యున్నదా? యింటికిన్ రాదు కాఁబోలు" నంచున్ బ్రశంసింపఁగాఁ
జూచి యాగుంపులోఁ దాఁగుమన్ "లేమలే" దంచు నవ్వారిచేఁ జెప్పఁగాఁ జేయుచున్
జోడుగాఁ గూడు ప్రాఁబోడులన్ గూడుమన్ "జూడఁగా సందునీవే" యటంచున్
మఱిం గొంద "ఱీవేకసుంగొమ్మ పో" మ్మంచుఁ గోపించుచున్ దూరముం బోవుచున్
గోడలున్ మేడలున్ గూడఁ దా మంతఁదా మెక్కుచున్ నిక్కుచుం జూచు
చుండన్ మఱిం గొందఱత్యంతవృద్ధాంగనల్ దీవనల్సేయుచున్ సేసలం జల్లి
నీరాజనం బీయఁగా నొక్కపద్మాస్యకే లొక్కపద్మాస్య గీలించుచున్ జూచు
చున్నంత నూరేగి యాతోఁడు నారేయిలో నంత్యయామమ్మునన్ మేడలోఁ జొచ్చి
యచ్చోట భృత్యుల్మల్లందుందయా ర్చయఁగా మంత్రు లుద్యోగులున్ బండితుల్
సత్కవుల్ గొల్వఁగా నిందుకోల్వుండి యందున్ గవీంద్రుల్ నుతింపన్ మహావృద్ధు
లాశీర్వదింపన్ సదా దాసదాసీజనంబుల్ పదద్వంద్వమున్ మ్రొక్కఁగాఁ "బుత్ర
పౌత్రాభివృద్ధి స్సదా దాసదాసీసమృద్ధి స్సదాభోగవృద్ధిస్సదా త్యాగబుద్ధి స్తథా
స్తంచు దీర్ఘాయు ర" స్తంచు విద్వాంసు లాశీర్వదింపన్ ముద మ్మొప్పఁగా బైఁడి
పుట్టమ్ములున్ శాంకవమ్ముల్ ధనంబుల్ మఱిం గొన్నిఁ టిండెచ్చి యాపండితస్వా
ములన్ భృత్యులన్నిత్యసంతృప్తులన్ జేసి యీనేల పాలించుచున్నాఁడు! తల్లీ? బంగ
త్కల్పవల్లీ! సమస్తాయురారోగ్యసంపత్తులున్ బత్తు లేన్గుల్ గుఱాలంనగవాదాసదా
సీజనంబుల్ కడున్ వృద్ధిచెందంగ నేఁటనిన్నున్ సమర్చించుమా చిన్నభూపాలుపై
రాజగోపాలుపై దాన రాధేయుపై రూపసూనాంకుపై శీతలానూనదృష్టిప్రసారంబు
గావించి పాలింపవమ్మా? మహాదేవదేవీ! మనోహారిణీ! శాంకరీ! గౌరి! దుర్గే! నమస్తే
నమస్తే నమః॥

1. మ॥ అరవిందాసనుఁడాయు విచ్చి హరుఁ డష్టైశ్వర్యముల్ గూర్చి తా
మరసాక్షుండు ప్రభుత్వమిచ్చి నిను సంపత్కాముని౯ లోకసుం
దరుని౯ బ్రోచెద రాపయి౯ జనని నిత్యమ్ము౯ జయంబిచ్చి ముం
దర నీకుం బొడకట్టు నిక్కమిది చిన్నారాయభూపాలకా! ౪౩

2. క॥ అనుసంవత్సరమీరీ, తిని దేవీపూజసేసి దేవీకరుణ౯
గొనుమయ్యా? జయమ్ము సుద,గ్ననుకీతి౯ జిన్నరాయ?సగసవిధేయా! ।

## శ్రీపిఠాపురపు మైనరురాజాగారిగెల్పు.

1. సీ॥ భాష్యమయ్యఁగారి పాండిత్యమునకు వన్నియదెచ్చె నీగెల్పు నృపవరేణ్య!
మంగయాంబాతపోమహిమమ్మునకు సాక్ష్యమిచ్చె నీగెల్పు భూమీశమౌళి!
చెల్లయాంబిక నిన్నుఁ జేపట్టుటకుఁ జొల్పుగల్పించె నీగెల్పు కాశ్యపేశ!
అలజగన్నాథరాయనిపరిశ్రమము సమర్థించె నీగెల్పు మానవేంద్ర!

తే॥ గీ॥ నీదుపోరి పాసపడియెడినిఖిలరాజ, బంధువులకును గవుల కపారముద మొ
సంగె నీగెల్పు విజయానుషంగ? దివ్య,తేజ? శ్రీసూర్యరాయపృథ్వీడిడోజ?

## విరవ- రావువేంకటసూర్యారావుగారు.

1. మ॥ వినుమీ! వేంకటసూర్యరాయనృప? పృథ్విన్నిన్నుఁ బోలంగ న
న్యుల కెవ్వారికిఁ గాదు సత్కవులయందు న్నీకుఁ గా నింత యొ
ప్పునె? యానందము, ద్రవ్యమెంత యిడిన౯ బోకున్నె? యీయాదర
మ్మునకు౯ గోటులు సాటివచ్చునె? ధనమ్ముల్ మన్నన౯ దెచ్చునే? ౪౬

2. మ॥ కలిమి౯ లేమిని నొక్కరీతిగను బ్రఖ్యాతిప్రదం బైనజ్ఞా
నలత౯ బుష్పనుమై సుధీజనుల నానందమ్మున౯ జూచు నీ
యలసుస్రాభవగౌరవాదికము లాహా పుట్టఁగాఁజేయు యో
గ్యులకున్ వేంకటసూర్యరాయనృప! నీకుం దుల్యులే? యన్యులున్. ౪౭

3. ఉ॥ ఇచ్చిన నీయకున్న మన మిచ్చి తనుం దగ గౌరవించుస
ద్వ్యచ్చరితుండు సత్కవులధాటికిఁ దాళెడువాఁడుగాక నై
కిచ్చకమాటలుబ్బుచుతు నెక్కడ? సత్కవులేడ? ద్రవ్యమా!
సచ్చరితుం బొసర్చు విలసద్యశ! వేంకటసూర్యరాణ్మణీ! ౪౮

4. మ॥ ధనమున్నంతన సేవనీయుఁ డనినన్ దప్పౌనదేమన్న? ర
త్ననివాసమ్ములు గావె? వార్ధియు ధరాధ్రింబుల్, జనుం డెవ్వఁడే
నిని సేవించిన నించుకేని యిడునే! నీవంటిగాంభీర్యవం
తుని సేవించిన నెమ్మనంబు గడుసంతోషించు సూర్యాధిపా! ౮౯

5. ఉ॥ తా వచియించు సంగతులు తత్పరుఁడై విని నిన్నుఁబోలె వి
ద్యావిదులన్ గరంచునృపతల్లజుఁ డెవ్వఁడొ? నూటికొక్కఁ, డెం
తే విభవమ్ము గల్గియును దెల్వియుఁ దేటయు లేనివారిపై
లేవదు వాక్కు, లేచియుఁ జరించును వేంకట సూర్యరాణ్మణీ! ౯౦

6. ఉ॥ ఇంతకుఁ జెప్పమాట యొకయింతయులేదు మదీయకార్య మా
వంతయు లోటు లేక యెటులైనను దీఱు మనంబునందు న
త్యంతమునీకు నున్నతపదం బొడఁగూర్పఁగ నెల్లవేళ దీ
వింతు నుతింతు నాసిరిని వేమరు వేంకటసూర్యరాణ్మణీ! ౯౧

ఉండూరురికార్డు వదిలివేయఁబడినది.

## కోటరామచంద్రపురం, కాకర్లపూడి రామచంద్రరాజుగారు.

1. సీ॥ స్వస్త్యస్తు శ్రీరామచంద్రపురీరత్న సౌధనిర్మాణసంసక్త! నీకు
పుత్రపౌత్రాభివృద్ధి సంభూయమానసుకవిరాజమాన నామిత కీర్తిమాన్య! నీకు
దీర్ఘాయు రస్తు సందీపిత కాకర్లపూడివంశామృతాంభోధి! నీకు
జగదతీతాతిప్రశస్తి రస్తు ధరాసురాశీర్వచన సంభృతాత్మ! నీకు

తే॥ గీ॥ సంతతారోగ్యబుద్ధిప్రశస్తినీతి, భూతయుప్సంతురాజేంద్రపుత్ర! నీకు
అస్తు సత్సంగతిశ్చ విద్యాదరశ్చ, సత్కవివిధేయ! శ్రీరామచంద్రరాయ!

2. మ॥ సుకవుల్ రాజులఁ జూడకున్న యశ మస్తోకమ్ము గాకుండు రా
జకులై కాధరణుల్ భవాబ్ధకులు విశ్వాసమ్ము మై సత్కవిం
ద్రకదంబమ్ముల నాదరింపమియు నౌన్నత్యంబు దేకుఁడు నిం
తను నన్యోన్యసమాదరమ్మున యశంబౌ రామచంద్రాధిపా! ౯౩

3. మ॥ క్రమనాత్పృశ్వము పేర్మి సత్కవులచిత్తం బెక్కఁగాఁ జేసి పూ
ర్వమహీశుల్ కృతులంది నేఁడును నవాన్యంబౌ యశోరూపకా

యమునం బోల్చుట చూడ రాజుల కవశ్యమ్ముగాన్ గవీంద్రావన
ప్రమదంబున్ విధియించు నాగమము రేవన్ రామచంద్రాధిపా! ౫౪

4. చ॥ సదయుఁడు సద్గుణాకరుఁడు సత్కులజాతుఁడు నైనరాజు భూ
విదితయశస్కుఁడైనసుకవిప్రవరుండును గూడ నెన్నఁడో
యొదవెడిఁ దాదృశం బగుమహోదయవేళఁ దదాభిముఖ్యతన్
బొదలరె? రామచంద్రనృప? భూమిపతుల్ యశమిచ్ఛగించినన్. ౫౫

5. ఉ॥ తొల్లిఁటినాఁటనుండి కవిపూర్వహుళులన్ గరఁగించు నేర్పువా
టిల్లి యశంబునం దగి కడింది రసజ్ఞత మించు మీరలే
యెల్లరఁ బోలి సత్కవుల నేలకయున్నను రామచంద్రభూ
వల్లభ! వార లింకఁ గృషివంతులు గావలెఁ బొట్టకూటికై. ౫౬

6. ఉ॥ భూసురులందు హూణకలపాంతరుఁ బోక కవిత్వసత్కలా
భ్యాసము చేసి పేర్వడసి యాచకులై తిరుగాడువారి కే
గోసము లేనివార లని తొల్లిఁటి నుండి ప్రసిద్ధి గన్న మీ
కే శరణంబు గా కితరు లెవ్వరు సేవ్యులు? రామభూవరా! ౫౭

7. చ॥ వెనుకటిరీతి రాజ్యపదవిన్ దమ రుండిరయేని మాకుఁ గా
లిఁడక లేల? ఫాలమున లేఖన నేయు విధాత? రామచం
ద్రనరవరేణ్య! విష్ణుకులతల్లజుఁడై తనరారుకృష్ణమూ
ర్తిని కవికాధిరూఢు నొనరింపరె? మీ పెదతాత లుద్ధతిన్. ౫౮

8. మ॥ "శతసంగ్రాకవనమ్ము నల్పఁ గల బల్ సామర్థ్య మున్నట్టిధీ
మునుకు సౌవారికిఁ నైతమున్ గటకటా! యూరూర గోద్ర్రష్టియే
గతి యానే?" యనుదుర్యశమ్ము నకు మాకాలమ్ము గాకుండ ను
న్నతి కల్పింపఁగదయ్య! పాలితకవీంద్రా! రామచంద్రాధిపా! ౫౯

1. ఉ॥ సరసుఁడు గర్వదూరుఁడు ప్రశస్తగుణాఢ్యుఁడు పూర్వరాజభా
స్వరుఁడు విశుద్ధవంశజుఁడు పండితమాన్యుఁడు రామచంద్రభూ
వరుఁడు యశోర్థియై యిపు డవారణఁ జేయఁగఁ జేసె నొప్పుగం
దిరుపతి వేంకటేశకవిధీరులచే నవధానసత్క్రియన్. ౬౦

2. మ॥ "తమపూర్వుల్ కవు లెందఱెందఱొ సత్కారమ్ములన్ జేసి ని
ల్పి మహీయత్వము గాంచి" రంచు విని తల్లులన్ యశంబున్ వహిం

ప మదిన్ గౌతుక మంది సత్కవుల సంభావింపఁగాఁ బూనె న
త్తముఁడై యొప్పెడిరామచంద్రవిభుఁ డేతద్రీతి సామాన్యమే. ౬౧

3. ఉ॥ అందము గల్గుఁ గాక ధన మబ్బెడుఁ గాక జగమ్ము లన్ని యే
లం దగుఁ గాక యెక్కుడువిలాసము చొప్పడుఁ గాక యేరికే
నిం దగ నే? నిగర్వగతి నెక్కొను, టయ్యదిరామచంద్రరా
జేంద్రునియందుఁ జొప్పడియె, నియ్యది వంశపుఁ జేవ గాఁదగన్. ౬౨

4. చ॥ తెలియనిదవ్యవంతుఁ సుధీమణు లెల్లరుఁ గొల్చుకంటె మేల్
తెలివిచెలంగియున్ ధనము లేనినృపాలురమెచ్చులైనను
జెలువము దెచ్చు, మంచియును జెడ్డయు లేని యపాత్రురాలితోఁ
గలయికకంటె నేర్వరిని గన్గొనుపాటియె చాలు భూవరా! ౬౩

## క్రొత్తపేట, రామయ్యారుగారు,

1. శ్లో॥ జీవనదాతాఽపిఘనోఽప్యపరితహంతసత్పథపరిచారోఽపి
అచపలహృదయేన కథం, రామయ్యారుణా సమత్వమపిగచ్ఛేత్. ౬౪

2. శ్లో॥ మేఘుద్వారే వాసో, జీవనదాతు ర్ఘనా సమునిస ఇతి
రామయ్యార్ నామాఽగో, జీమూతః కోనసీమ్ని సంరేజే. ౬౫

3. శ్లో॥ శఖివరసంతుష్టికరో, వర్తితశుభశాలికో దయాసారః
మితభాషిణా కథం స్యా, ద్రామయ్యారుణా సమ స్సజీమూతః. ౬౬

4. శ్లో॥ రామయ్యార్ నామా సన్ డివిజన్నాఖీసమః కలాశాలీ
గోదావర్యోరుభయో, ర్మధ్యస్థాయాం చకాస్తి దేశ్యాయాం. ౬౭

## గురువుగారు.

1. మ॥ కలిమానంబొక యైదువే లరుగనేకత్రిస్థసత్పాత్రిహ
మ్మలకున్ శాంతి యొనర్చుచున్ శ్రీమలవమ్మక్ లేకయే బ్రిహ్మమక్
గలిసెన్ బ్రహ్మగురూత్తముండు, దశమీకంజాప్తవారంబు నా
ద్యులసత్పక్షముఁ గార్తికమ్మను వికార్యబ్దమ్మునం గూడఁగన్. ౬౮

## తామరాడ. ఆరిశజోగన్న.

చ॥ పదముల సౌష్ఠవమ్ము కవివర్ణ్యములై తగుమంచిరీతులున్
మదికి ముదమ్ముసంగు రసమాధురియున్ దగునట్టి వృత్తులున్

బొదలెడి కావ్యకన్యక నపూర్వకృపాపరతా మనీషతో
నిదె భవదంకితమ్ముగఁ గవీంద్రహితమ్ముగ నిచ్చినాఁడ మి
య్యది సరసప్రచారగతి నబ్బురపుక్ యశమబ్బఁజేయు న
భ్యుదయము నొందఁజేయుఁ గడుయోగ్యతయున్ బ్రబలింపఁజేయు స
మ్మదము పొనర్చు సత్ఫలమాన్యతయుం న్నెగడంగఁజేయు ని
య్యది యదినాఁగ నేమిటికి? నన్ని శుభమ్ములు దీనఁగల్గు ని
ట్టిదియని లోనెఱింగి కడుఁ గీర్తి దీనిఁ బరిగ్రహించి యె
న్నఁడగిన యాయువున్ సిరియునందుమ? యారిశజోగనాఖ్య? మ
మ్మెద మఱవంగఁబోకు మివియే పదివేలకు నీకు దీవనల్. ౨౧

## మూఁడవ సం॥ కిర్లంపూడి.

1. ఉ॥ కోపమొకింత లేదొకొక కొండెమునుక్ వినఁ జాలవైతి వే
సాపపుఁ గార్యముల్ సలుపు పద్ధతులక్ దొరవైతి బొక్కసం
బేపుగఁ గూర్పవైతి వొక యించుక గర్వము దాల్పవైతి వ
ధ్యాపతి వెట్లు లైతివి? సుధీజనవందన? చిన్నరాణ్మణీ. ౨౨

## పాలతేరులోని వివాహమునుగూర్చి.

1. సీ॥ ఇనుగంటివంశపావనుఁడు శ్రీబుచ్చితిమ్మయనృపాలకుఁ డతిమాన్యుఁడొకఁట
నీనృపాలునకు సుతత్వమ్ము నేయుఁడు చిన్నరాయభూపతి కవిప్రియుఁడొకఁట
పిఠాపురము మేటి ధీరుండు గారుండు వేంకటరావు ప్రవీణుఁడొకఁట
తద్జ్ఞాతివర్గమై తనరారు గామెరాన్వయజాతులైన భూవరులు నొకఁట

తే॥ గీ॥ వేడ్కఁ జెన్నారఁ బరిణయవేదిక గని, రాజమానగృహాంగణరాజమందుఁ
గూఁతులకుఁ బెండ్లి చేసెబల్ కోర్కె దనరఁ, గల్మికను వగు రీతి వేంకటవిభుండు.

2. ఆ॥ వె॥ ధీరులైన మేటిపాటూలసారుగం, భీరులయ్య వెలర వారిపేరు
చారుతరయశమ్ము సారెకుఁ జెన్నారుఁ, బాలతేరు మారుప్రాలతేరు.

3. క॥ ఆజనపదమున సన్నుతి, భోజనమగు దామె రాన్వయమ్మున నెం
తే జననుతుండు భూసుర, పూజనరతుఁడొక్క వెలమపుంగవుఁడలరుక్.

4. క॥ ఆవీరు పేరు వెంకట, రావందురు తనయలిద్దరకుఁ బరిణయముక్
గావింపనెంచి బంధుల, రావించె నతండు ప్రశస్తతరమ్ముగు పేర్మిక్. ౨౬

5. చ॥ సతియు సుతుండుఁ బుత్త్రికలు చారులుఁ వారులు గాయకుల్ బుధుల్
హితులుఁ బురోహితుల్ శ్రితు లహీనులు భృత్యులుఁ గొల్వ సోదరీ
సుతలవివాహపున్మహము చూడఁగఁ గన్గొమపూడి నేత నా
ప్తతముఁడు బుచ్చితమ్మయనృపాలుఁడు వచ్చెను బాలతేరికిన్. ౨౨

6. సీ॥ శతఘంటకవనంబు సారెసారెకుఁ జల్వ తిరుపతివేంకటేశ్వరులతోడ
సమ్మతింపు వెల్లి కన్నములఁ బోయఁగఁజాలు చకచక గల్గుగాయకులతోడ
దామెరాన్వయసముద్భవము చెందినసాధ్వి బహుమాన్యయగు ధర్మపత్నితోడ
నాజ్ఞానుసారులై యలరువందలకు వందలు దాసదాసీజనంబుతోడ,

తే॥ గీ॥ రాజగోపాలవేంకటరాయచిన్న, రాయభూపాలకుండు సామ్రాజ్యలీలఁ
దావివాహమ్మునకువచ్చె నధికమైన, గౌరవమ్మును మోదమ్ముఁ గడలుకొనఁగ.

7. ఉ॥ బెబ్బులిఁబోలువాఁ డహితభీముఁడు సౌమ్యుఁడు రాజమానితుం
డబ్బురమైన మేటిధన మార్జనచేసినవాఁడు వేడుకన్
బొబ్బిలినేలువాఁడు పరిపోషితభృత్యుఁడు వచ్చెఁ బెండ్లికై
నిబ్బరమైన పేర్మి ధరణీపరికేతన సింగరా వొగిన్. ౨౮

8. ఆ॥ వె॥ మఱియుఁ బెక్కుమంది మాన్యులు రాజబాంధవులు వచ్చి యొప్పుదవులఁ జేయఁ
కలనఁ బాలతేరు కళ్యాణమలరారు, పూలతేరుభాతిఁ బొలుపుమీఱె.

9. సీ॥ విద్వద్వరేణ్య సంవిద్గోష్ఠి యొకచోట నొకచోట శాస్త్రశోధకులగోష్ఠి
సుకవిరాజన్య భాషణగోష్ఠి యొకచోట నొకచోట మంచివైణికులగోష్ఠి
పారిహాసికపరస్పరగోష్ఠి యొకచోట నొకచోట పలవెలందుకలగోష్ఠి
వ్యావహారికవర్గ పరగోష్ఠి యొకచోట నొకచోట దాసికాయువతిగోష్ఠి

తే॥ గీ॥ వనరఁ దనరమ్యసంపదకనుగుణముగ, దామెరాన్వయవార్ధిసుధామరీచి
యైనవేంకటరావుప్రఖ్యాతియెసఁగ, సరసులెంచ నాఁ బెండిలి జనులుమెచ్చ.

10. క॥ తరువాత జన్యులందలు, దగలి ననిరి పిడప సరసతరకవులగు నా
తిరుపతివేంకటకవులు, ఘనముగఁ జేసిరి శతావధానము పేర్మిన్. ౩౨

## దామెర చినవెంకటరాయనింగారు.

1. శ్లో॥ అనవదంకానా నృపా సుకవిః శాన్తాంతికశ్చ మేధావీ
దామెరచిన వేంకటరాడ్జయతి పయోరాఘసమాఖ్యకే గ్రామే. ౩౩

2. శ్లో॥ జాతోఽయం కిల పద్మనాయకకులే గర్వం నధత్తే తథాఽ
ప్యాశీర్వాద మపేక్షతే సుకవి రఘ్యుర్వీసురాణాం ముహుః
ఈషచ్ఛ వ్యసనే మతిం నకురుతే విద్యాసు తత్తంతనో
త్యేష శ్రీకర దామెరాన్వయమణి శ్శ్రీవేంకటాఖ్యోవిభుః. ౨౪

3. శ్లో॥ జాతోఽపి పద్మనాయక, వంశేఽనూచానసంపదభిరామే
జ్ఞాతా యేనతు దైవీ భాషా, తత్రాఽపి ప్రాప సుకవిత్వం. ౨౫

4. శ్లో॥ శ్రీఫలసఫలీకరణే, చాతుర్యం యేన సాక ముత్పన్నం
యస్య శ్రవణె నామ్నః, ప్రకుపితరోగోఽపి రోగిణాం త్యజతి. ౨౬

5. శ్లో॥ సరసా సుగుణా సుపదా, సాలంకారా సువృత్తరీతిశ్చ
చకమే కవితాకన్యా, యంకృతినం ప్రాక్కృతేన సుకృతేన. ౨౭

6. శ్లో॥ యః స్సిద్ధాన్త వ్యాప్తః, జాతకవిషయం సమస్తమపి లేభే
అయ మయ మిద మితి యత్రాం, సర్వం ప్రాప్తం చమత్కృతా యేన.

7. ఉ॥ దామెరవంశసంభవుఁడు నారగుణాఢ్యుఁడు చిన్నవేంకటా
ఖ్యామహితుండు మామహితుఁ డార్జితసత్కవితాలతావృతా
రామవిహారహారి కృతిరంజితసూరి మనోంబుజోల్లస
ద్భాస్కరి చిరాయువుచ్ఛ్రితసంపదలన్ బొదలున్నితాంతమున్. ౨౮

8. సీ॥ సాహితీగ్రంథముల్ పఠ్చ సేయఁగ నేర్చుఁగవనంబుమిగులఁ జక్కఁగ రచించు
శిల్పవిద్యయందుఁ జెల్వుమిక్కిలిగాంచు వైద్యమ్మునందుఁ బేర్వాసి చెందు
వినయమ్మునందు మేటి నయమ్మునందు మార్దవమందు నెక్కుడౌ రాణ గాంచు
తనకన్న గొప్ప విద్వద్వరేణ్యుల సంశయంబులు వివరించి యడుగుచుండు

తే॥గీ॥ గర్వమూరుండు సంపత్ప్రకాశమానుఁ,డవనిపాలకబాంధవుఁ డమలదామె
రాన్వయాభరణంబు శ్లాఘ్యతరకీర్తి,పటుతరవిభుండుచిన్నవేంకటవిభుండు.

## గజపతినగరము.

1. సీ॥ ఆర్జించుచున్నాఁడు యశము రాజులకన్న నధికమౌ ధర్మకార్యములొనర్చి
పోషించుచున్నాఁడు బుధులను గవులను దగుగతి నెలను జీతము లొసంగి
చెప్పించుచున్నాఁడు శ్రీమించు నాటకప్రకరంబు తగునట్టిబాలకులకు
పెట్టించుచున్నాఁడు ప్రీతిమైఁ దనసత్రమందు శాల్యోదన మతిథి తతికి

తే॥ గీ॥ నెవరి నెటు గౌరవించిన నెసఁగ నోయ, శంబు తద్రీతి నెఱిఁగిన సజ్జనుండు
ఘనుఁడు పాట్రాన్వయుం డేఁక యసుతుండు, హాళిఁ జెన్నారుఁ బెద్దచ్చ నార్యుఁ డెందు.

## విశాఖపట్టణం—విక్రమదేవవర్మ గారు.

1. సీ॥ ఆంధ్రభాషయుఁ డెల్గుహూణభాషయు సంస్కృతమును నేర్చినయట్టిధన్యతముఁడు
అన్నిభాషలయందు ననుగుణంబగురీతిఁ గవిత చెప్పఁగ నేర్చుఘనయశుండు
జయపురంబేలు రాజన్యులసద్వంశమందు జన్మించినయనఘమూర్తి
దృశ్యప్రబంధమ్ము లెన్నొ నిరచియించి ప్రజలకుఁ జూపించు భవ్యయశుఁడు,
తే॥గీ॥ భూవరాగ్రణి విక్రమదేవవిభుఁడు, మమ్మ సభఁ జేయ రావించిమన్చె నేఁడు
గాన మిమ్మిటఁ దన్పు భాగ్యమ్ము గల్గె, సరసతరచర్యులార! యో సభ్యులార!

## వీరవరము- తోఁట సర్వారాయఁడు.

1. చ॥ సరసత నాత్మఁ గూరు నృపసత్తముఁ డొక్క ప్రబంధరాజమున్
విరచన చేయఁ జేసి యదవిద్యదఁ బోసవటంచు మెచ్చి యా
దరమునఁ జంద్రహారములు ద్రవ్యము నేలువ లిట్టులుండ ది
క్కరి కెనయైన యేన్గయి గ్రంథముతో మముఁ బ్రోవుకోట్ల వె
త్పురవర మేగఁ జేసి యిదె భూమియుఁ గొండొక శాశ్వతమ్ముగా
వారి వాడ రేవుకుల వెంకటరత్నము కప్పమొక్క ప్పే
తిరుపతి వేంకటేశ్వరసుధీద్వయి చేఁ గృతిగాంచి ద్రవ్యము
సిరమని యెంచి కొంత యదితేఁకువ నిచ్చియు నంతఁ బోక సు
సిర యొకకొంత యిచ్చెఁ బిఠాపురి యారిశ నాగనాఖ్యుఁడి
క్కరణిఁ గృతిగ్రహించి కలకాలము కీర్తి నిల్పనెన్నఁగా
ధరణి యొకింత యిచ్చుటకు గానపుఁబ్రేమ వ్రాసియిచ్చె శ్రీ
కరుఁడు జమీనుదారుఁ డొకకప్పము వేంకటకృష్ణరావు నా
విరచనచేయఁ జేసె నదివిన్కలి సేయుదు మెల్లనేఁట, నా
సగసవతంసుఁడున్ వెసనొసంగఁ దలంచియె యున్నవాఁడు మే
ల్తరమగు భూమిఖండ, మవలాపురవాసియు న్యాయవాదియున్
ధరణిసురాగ్రగణ్యుఁడును గాఁగయు శ్రీ యిచటూరి వంశ్యుఁడున్
గురువతి యయ్యనాస్తిగాఁడు గొండొకకప్పము గోరి "మాకు నిం

జరపును మీానివాసమునకు సన్నిధినొప్పెడి కాటరేవు కో
న రసనాసంగి గ్రంథము గొనంబడు కాలమునందు మిమ్ము బం
గరుపని పల్లకీనునిచి గ్రామము నేగంగం జేయువాఁడ" నం
చు రహిం బ్రతిజ్ఞ చేసెం గడుశూరుండు దుగారుండు మేటి సద్గుణా
కరుం డినుగంటివంశతిలకం బగుచిన్న నృపాలమౌళి మొ
క్కరమున మున్ను గోరెనొక కబ్బ, మతండది స్వీకరించు వే
ళ రస నాసంగుటన్న నొకలక్ష్యమె? యీనృపమౌళి కిచ్చు భోఁ
గరమున కెమ్ము లేనెడి గౌరవ మెవ్వరెఱుంగ? రింతరుణ్
జగణ్యవాగ్రగణ్య! సరసా! వరసాహితి! సర్వరాయ! సు
స్థిరముగు కబ్బమిప్పగిదిఁ జేకొనినందుకు నీవు మాకునుం
దిరమగువృత్తికొంత యిడితేని యశంబు కృశంబుగాక యీ
ధరగలయంత కాలముసు దానెగడున్ మఱియొక్కమాట, భూ
సురులకు నాస యెక్కుడను చున్ మదినెంచెదవేము? దీని కి
ట్టిరి నిటు సేయుటె యుభయతారకమంచు వచించినార మం
దటివలెఁ గాక యెక్కుడగు ద్రవ్యము భూమియుఁ దెల్పితేటలన్
సరసతయున్ మహాకవనసార మెఱింగిన సాహితీధురం
ధరతయుఁ గల్గునీకిది మనమ్మున దోఁచకయున్న నన్యు లె
వ్వరికిది దోఁచు? నిక్కువుల వైఖరి నీ కెఱుఁగంగరానిదే.

## కాకినాడ—శ్రీమహారాజ్ఞిగారి మృతివిషయము.

1. ఉ॥ కడుపెదుబిడ్డలం గను సెకాళ జగంబులనెల్ల నేలి యే
ల్బడి నిసుమంతయైనఁ బొరపాటనునట్టిది లేక లోకులం
గడుపునఁగన్న వారిగతిఁ గాచెను "ఎంప్రెసాఫిండియా"ను గో
ల్పడితి మటన్నవార్త దెలుపన్వలసెంగద? నేఁటి కక్కటా! ౧౦౧

2. చ॥ పసిదంచుం దలపోయ కుద్ధతధరాభారంబు మోయించినా
రిసిరో! భూజనులారం గరంచుపని మేలే? యంచుఁ బట్టాభిషే
కసమారంభమునందె యేడ్చె నదయాక్రాంతాత్మ యెత్తాదృశ
ప్రసు వింకన్ మనయుండినూరు లభియింపన్ బోదు నిక్కంబుగన్. ౧౦౨

8. సీ॥ పసితనంబునఁ దల్లిపనుపుఁ జేయుచు మెప్పుగాంచిన కన్యకాగౌరవంబు
తారుణ్యమున భర్తృదాసివై చూఁ బొగడ్తఁగన్న జాయాపత్యగౌరవంబు
వైధవ్యమునఁ బతివ్రతవై మహాకీర్తి గాఁగొన్న జితమనోగౌరవంబు
వార్ధక్యమునఁ బుత్రపౌత్రిదౌహిత్రాదిధన్యాలఁ గాంచినగౌరవంబు
గీ॥ నొజ్జలకు నెల్ల నొజ్జయై యొక్క ధర్మశాస్త్ర మొనరింపఁగాఁజాలు జనులకొఱకు
మేలుబంతివి నూ? నీవె స్త్రీలకెల్ల, నో మహారాజ్ఞి? విక్టోరియామతల్లి !

9. సీ॥ "ఏను గిరిస్తుమతంబుదాన నైనను మీమతములవారికి రాను తాము పదవి
నందఁగాఁ గనువారలైన నిచ్చెదఁ గాని లేమలేమవర్ణభేదంబుఁ జూడ
వీరుమావారను భేదంబుఁ జూడ కందఱిపై సమంబుగా దయనునిచెద
మీతృప్తి నాతృప్తి మీవృద్ధి నావృద్ధి మీకృతజ్ఞపుఁ జేఁత నాకుఁగొప్ప
తే॥గీ॥ బహుమతి" యటంచు మున్ను మాపదమునకును
జక్రవర్తిని వగునాఁడు సలిపినప్రతి
నలకు నలుసంత భేదంబు నలుగకుండ
నవని భరియించి మిగులకృతార్థవైతి
వో మహారాజ్ఞి! విక్టోరియామతల్లి !

## ఉత్పలమాలిక.

వారనికాలధర్మ మనివార్యమటంచుఁ దలంచినం గుణో
దారుల పూర్వరాజులకు నెల్లలపోసిన నీవయస్సుమా
చారముఁ గన్న నీసుయశంబును విన్న భవత్కృతరాజ్యవి
స్తారముఁ జూచినన్ భవదుదారభుజాబలసంచితావనీ
సారముఁ జూడ జాతివిచారముఁ గూడను గూడిమాడ నీ
మారకమంతగాఁగఁ బెనుసూర్యములోనికి మానసంబులం
జేరఁగనీక మేధ్వృతి చెదరఁగఁ జేయుచుఁగాని నీవలెన్
ధారుణి నేలి సుంతయును ధర్మముఁ దప్పక సౌఖ్యరాశిఁ బెం
పారఁగ మర్త్యకోటికిఁ గడుసారఁగఁ గాంచినతల్లిపోలికం
గూరినపేర్మిఁ బ్రోచుచు నసుంధరమాకరుణారసంబు నే

కూరఁగ వారికిం బోడము కోరికలెల్లను దీర్చునట్టి యా
కారము మాకిఁకెట్లుదొరకంగల దన్నవిచార మెట్లు చ
ల్లారును తల్లి? నీవహరహం బుపదేశముఁజేయు యోగ్యతా
కారుణికత్వబుద్ధికుశలత్వములం బడిపెద్దపెద్ద నీ
కూరిమిబిడ్డ మాయెడలఁ గూర్మియుఁ జేర్మియుఁ జూపి యెప్డు నీ
తీరుపు తప్పకుండఁ గడతేర్చినఁ దాదృశలోపమెల్లఁ బో
కారునుగాని యింతకు నొకండు కొఱంత యదేమిచేసినం
దీఱదు తీఱ దేదియునఁ దెల్పెదఁ దొల్లిటిరాజచంద్రు లే
వారును జేయలేనిసిరిఁ బండఁగఁజేసి సమస్తసౌఖ్యసం
భారముమీఱఁజేసి యశుభంబులుమాపి శుభంబులిచ్చి యుం
బేరు సమస్తదిక్కులను బెంపువహింపఁగ నేలినట్టి నీ
కారహి నిండియాను గనునంతటిపుణ్యము నిన్నుఁజూచి పెం
పారుట యిండియాప్రజకు నాస్తియొనర్చిన మాలదైవముం
దూరనివార లుందురె! మనుష్యులకాయువు వందయేండ్లు గా
సారససంభవుండు మితిఁ జక్కఁగఁజేసియు నట్లు నీకుఁగా
నీ రచియింపఁడయ్యె గణనీయమె తన్మితికాలమేలొకో?
దారుణమైనగండములు దాఁపరమైనను వానినెల్లఁ బో
కార్చి నిన్నుఁబ్రోచిన జగంబులపుణ్యము నేఁడు నేడకుం
జేరెనొ? మాపయిం గరుణచెల్లుట న్యాయమె? లేట్పదంబు నే
కూరెనె? నీకునుం బ్రజలకున్ ఋణబంధము తీఱిపోయెనే?
గౌరవ మిట్టులెవ్వరికిఁగల్గెను? రాచవెలందులందు, వి
క్టోరియ? ముగ్గురాలినపటోలఫలంబనమ్రిగ్గితే! త్వదా
కారము లండనందుఁ గలకాలముఁ జూచెడి జాతివారికిం
దూరమునయ్యెనే? యకట తోరముగాఁ దలపోయ మేమె య
వ్వారలకంటె బల్సుకృతవంతుల మేమనఁగా? భవచ్ఛుభా
కారము మున్నుగన్నటులె కాంచుచునుంటిమి చిత్రిమంద, వి
స్తారముగాఁగ లండనునిధానులపై దయగల్గుదానిఁగా
మోరకులెల్ల నిన్ననుట మోసముగాని నిజంబుగాదు మా
వారలపైని నీకు దయ వాస్తవ మెక్కుడు గావునం ద్వదా

కాగము మేముచూడఁగ నొకప్పుడునైనను నిండియూరు నీ
చేకమిగ్లె మాపుత్రికుసిద్ధికి నేఁటికి మాకు లోటు లే
దూరక నీదుసద్గుణసమూహము లోనఁదలంచి యెన్న నే
వాకలువింగుసి ? మానవులవారు,లు నీదరి కెట్లువచ్చు ? నీ
కెరివలోకమందు గుణసింధులతో సహవాస మబ్బి చే
కూరుచుగాత ! నీకుసుఖగుంభము, నీపెదబిడ్డ మేలుకీ
ర్లోకసి యేలుఁగాత జనమంతయు, మాపుజకెల్ల మేలు చే
కూరుచుగాత నేఁడు దొరకొన్న మహోనమగంపువేఁడి చ
ల్లారుచుగాత నీకొడుకునందు భవత్ప్రభుశక్తి కీర్తియుక్
జేరుచుగాత నీకొడుకు నీవలె హాయిగఁ బెక్కువత్సరాల్
ధారుణి యేలుఁగాత కుశలంబగుగాత భవత్కుటుంబపు
న్వారలకెల్ల, ధర్మములు వర్ధిలుఁగావుత లేకపోవుఁగా
కేరికి నీవులేనికొద వెన్నఁడు తెంపరిసత్తిండియూమణీ ! ౧౨౩

## పోలవరపు జమీందారుగారు.

1. మ॥ సరిగా గోడలు లేచె ద్వారములతో, సత్త్వవర్తా ! యింకఁ బై
కురువేగా ? దనవాయి, దానికగుకల్పన్ వేగ నిష్పించినన్
ద్వారలో లోగిలి టికొంట యది సందర్శించు మీదైన స
త్కారతాప్యక్తికిఁ బాత్రిభూతులకు నేతత్కార్యమెంతో ? నృపా ! ౧౨౪

2. మ॥ పాకన్ వాలము ప్పు టొక్క టట్టుపై భార్యాసమాయోగ మె
ట్లో కాలమ్మును గడ్పుచుండుటకునై యూహింపఁగా నంత వ
ర్షాకాలమ్మరు దెంచె నీపయి నుపేక్షన్ జేసినన్ గోడ లే
నీఁకన్ నిల్చును ? గృష్ణరాయ నృపతీ ! వేవే కటాక్షింపవే. ౧౨౫

3. క॥ కృతులన్నిర్మించుటకున్, శతావధానములు సారెసల్పుటకున్ మా
ప్రతిభలు చెల్లుగానీ, యితరకృతులం మాకుశక్యమే ? నరనాథా ! ౧౨౬

4. మ॥ ధనవంతుం డవు రాజ్యవంతుఁడవు విద్యావర్తియున్ రూపవ
ద్ఘనమాన్యత్వము గల్గుపోడవు నినున్ శ్లాఘింపగా నేల ? నీ
యనురాగమ్మున కాలవాలములమై యానందమున్ జెందుమా
జననమ్మున్సఫలంబునుం చుకొందు మింకఁ గృష్ణరాయ విద్వత్ప్రభూ ! ౧౨౭

6. క॥ వేదాంతమునిన నెట్టిను, హాధీనులకేని దెలియు టది దుర్లభ మే
లా ? దానియందు లక్ష్మాంబా? దార్ఢ్యము నీకుఁగలిగె నని మది నెంతుక్.

7. ఉ॥ స్త్రీపరిపాలనమ్ము గలచిన్న జమీనులఁ బెద్దవోల్లు నె
న్నోపరికించి చూచితిని నొక్కెడ నిక్కడఁగల్గునంత వి
ద్యాపరిశీలనంబు వతిగాత్మ్యతయుక్ గనఁ బోల దింతయుక్
శ్రీపతి సాక్షి, నిక్క మిటు చెప్పుట నీస్తుతి గాదు! లక్ష్మమా! ౧౩౫

8. తే.గీ. ఏను జూచినరాజులందెల్ల నొక్క, విజయనగరమహారాజు వేత్త, రెండు
పోలవరంపుజమీందారు బూటకమ్ము, గాను స్త్రీలను నీకన్న లేదు నిజము

9. సీ॥ అధికాన్న దాతృవై యలరారుటకు నీవు తగ నిల్పినట్టిసత్రమ్ము సాక్షి
బంధుగులక్ బోషించుటందు వన్నెందుసు సవిధాన మంధుబంధువులు సాక్షి
విద్యాభివృద్ధి సల్పెడ వన్నమాటకుఁ బూరిగ లాగడను విబుధులు సాక్షి
కవులయం దాదృతి గలదాన వనుట కస్మద్గత మగుబహుమతియె సాక్షి

తే॥గీ॥ వైదికులఁబోషించువనుటకువారె సాక్షి, యింతయుందిపోష్యులుగల్గు టెంతవారి
కబ్బు! నొకపట్టణించుకొంటున్నగంజె! లలితగుణజాలంబ! శ్రీలక్ష్మమాంబ!

10. క॥ ధన మిచ్చెదు న్రుపతులును, గ్లను వేలును మంగురిగాక గదియింపరు! యీ
తనిశక్తి యెట్టిదని యెంచి, గీర్వాణిం బోలెఁ గవులు కేవలధనులే. ౧౩౬

11. క॥ సంతోష మయ్యెడ నది కా, గ్యాంత సమ్మదధాన మగుచి యంతటితోఁ బో
కెంతటి శక్తియొ యెఱుఁగుట, వింతా! మఱి వింతకన్న వింతా! చెప్పుమా!

## బహుమానసమయమునఁ జెప్పినవి.

1. శా॥ బాల్యమ్మున నే ననుక్ విడిచి తా ప్రౌఢిగ దారిద్ర్య మే
మూలంగో నొఁచెము డాఁగియుండినను నీవుగాలాన నీనాఁటితోఁ
దూరంబై నగ నరయుక్, మనమ్మునకు సంతోషమ్ము వాటిల్లె నే
లా! లక్ష్మీకృపగల్గు పండితుల నాలంబించు ? దారిద్ర్యముల్. ౧౪౨

2. శా॥ వారుం గంటిమి లేము బండితులమై వర్తించు టిల్లింతగా
గారాబంపుఁ విత్త మిల్లు టతిగఘ్రి మ్మందుగో ధారుణా
భార మొప్పచు యిన్ని గల్గుకతనక్ వారికి నామ్మకు నే
లా? రాజిల్లెడి నంతరం బని మహాలక్ష్మమ్మాంబ? వారొప్పరో. ౧౪౧

3\. ఉ॥ వాగలొందర్పవట్టిపని వారక యే నొనరించి సర్వముం
దీటుప నేర్తు నాపనిని దీర్పఁగ వారికి శక్యమే? మహా
ధీరత గల్గుమీమదికిఁ దెల్లము గాని దొకండుగల్గునే ?
వారిని మమ్ము నొక్కటిగఁ బార్థివు లెవ్వరు చూతు రంబికా ! ౧౮౫

4\. క॥ ఈలాటివార్షికమ్ముకు, కే లక్ష్యము చేసి మేము కావల మేగం
జాలుదుము కాని మాడు మ,హాలక్ష్మ్యంబా? స్వల్పము లరయుట కలదే.

5\. ఆ॥ వె॥ ఆత్మకూరురాజు నడిగిన నిచ్చె మే,ల్వసతి రెండునూర్లు వచ్చె నదియు
నొక్కయేటి కయిన నొట్టుచు మీ? శస్తు, కొలది నేగ లేదు కువలయేశ !

6\. తే॥ గీ॥ ఒక్కకిగ్గనపూడికిఁ దక్క వార్షి,కమున కంచును మే మొటకయినఁ జనుట
యిప్పటికి లేదు పండుగు లెల్ల వచ్చె,స్థలము గాన నిచ్చటికి రాఁదలఁపు గలిగె.

7\. చ॥ ఒక నెలరోజు లేము మఱియొక్కెడ కేగిన రెండు మూఁడు పే
రుకలుగు సత్సభల్ జరగు రూపికలున్ ద్రిశతమ్ము వచ్చు వా
ర్షిక మనఁ బత్త వహా నదియుఁ జే ముసుగన్ దగ లేక యున్నచో
నకట! వృథాప్రియాస మని యాత్మ మమున్ వెనుదీయఁ జేయదే. ౧౮౬

8\. చ॥ "నెలకొక మూఁడువందలను నేరుము మై మఱి మీరు తెచ్చినన్
గలుగును వేలసంఖ్యకు నఖండధనం" బని యందు రేమొ నేఁ
బలుక నసత్య మిప్పటికిఁ బ్రాఁతధనం బొకచిల్లిగవ్వయే
నలవడ దున్నచోఁ బయన, మాటయె కల్గను లక్ష్మమాంబికా ! ౧౮౭

9\. క॥ అడిగితి నటంచు మదిలో, బెడిదమ్ముగ నెంచుకొనక పేశలకరుణన్
దడిసిన మదిలో మము నెప్పుడు చూడఁగ వేఁడికొందు మమ్మాటికినిన్.

10\. క॥ అడుగుట మంచిది కా దని,నొడివి యడుగు టంత యుక్తి నొప్ప దనుచు మీ
రడుగ రొక్కవేళ నడిగిన, "నడుగనిచో నమ్మ పెట్ట"దను టెఱుఁగనిదే.

11\. క॥ అక్షరలక్షలు తెచ్చెడి,దక్షత సుకవులకె కాక తక్కొరులకు లే
దీక్షింపు లక్ష్మమాంబ! వలక్షయశోనిర్మలితకలానిధిబింబా !

(ఈయుర్లామునందే దివాన్ గారింటి విందులో చెప్పినపద్యము.)

1\. మ॥ కురపామందుదివాను తండ్రి మఱి నీ కుర్లామునం దత్పదం
బగవిందాసనుఁ డిచ్చె నందుకు ఫలంబై యొప్పు పేరొప్పునన్

వరవిద్వత్కవిరాజను త్యయశముఁ బ్రాపించి నీదౌ సమా
ఖ్య రహింప స్థానము సేయుచుంటివి ప్రకాశా! బోడపాడన్వయా! ౧౫౨

(ఆరోజున నీయన చెప్పించిచిన పద్యము.)

1. ఆ॥వె॥ వారు వీరు నెల్లవారును గుమి గూడి, శతవధానకవికి జడతగూర్ప
గాఁ బ్రియాత్మ మంది కడకుఁ దద్భక్తి వాం, తపరిచలిత శారదఘను లైరి.

(మందసాసంస్థానం దివాన్ గారిమీఁది పద్యములు.)

1. చ॥ బల మగుపాండితిం దగుదివా నఁటు యెవ్వరి కెందు నేని యుం
దలఁకనిసత్కవీంద్రుఁ డఁటు దాతలకెల్ల శిరోవతంసమై
తెలివియుఁ దేటయుం గలుగధీరుఁడు రాజఁటు యిటికూట మో
చలపతిశాస్త్రి? యెవ్వఁడు యశమ్ము గడింపక పోవఁ జేర్చునే? ౧౫౩

2. తే॥గీ॥ అపుడు మీరాజుఁ జూడ మే నుబుకుదెంచి
నదియు మొద నీనృపునిఁ జూడ నాత్మ నెంతి
యేని యూహించి, యా కొండ్లకిపుడు రాక
నృపునిఁ గన నేగు టెట్లు! చలపతిశాస్త్రి, ౧౫౪

3. క॥ సరసు లగురాజు లెచటనొ, పరికింపఁగ నూటి కొకరు పండితు లచ్చో
టెఱిఁగి యతిదూరదేశము, లరిగి వృథాచనుట యెంతయన్యాయమ హో.

4. చ॥ చలపతిశాస్త్రి! ముఖ్య మగు సంగతి చెప్పెద రాజటంచు నే
మెలమినిఁ జూడ నెచ్చటికి నేగిన "నూఁగక పోం" డటంచు వా
క్యాలుకుట లేదు మిక్కుటపుఁ గట్టు భవాదృశుఁ డిచ్చటం దగన్
గలిగియు నట్టిలోటయును గల్గునె? సత్సభ కాక పోవునే. ౧౫౫

5. చ॥ అలరెడివేడ్క నొక్కసభ యైనను జేయఁగఁ జేసి దానిలోఁ
గలిగినపట్టు నాదయినకైత నృపాలునిచిత్త మెక్కఁగా
సలిపి విశేషమై తగుయశమ్ము గొనన్వలె నంచుఁ గోర్కె వి
స్ఫులకులవేప! నీ కెటులఁ గఁ జాలు దొక్కవిశేష ముండునే! ౧౫౬

శ్రీ వాసుదేవరాజమణిరాజదేవుగారు.

1. శ్లో॥ రాజానశ్చ మయా దృష్టా, స్తథాచ కవయ స్తథా
మాదృశా బహవో రాజ, న్నత్వాదృ గుపలభ్యతే. ౧౫౭

2. శ్లో॥ ఏకోదరస్య పరిపూరణతో న దత్తం, రాజ్యం ప్రజావనపరేణ నరేశ్వరేణ
యస్త్వన్యథా వదతి తేన గతాధరాణో, దాతా న తేన తు కిమప్యతికించదాస్య?

3. సీ॥ తగ నాత్మకూరు సీతారామభూపాలుఁ డేన్గునెక్కించి యూరేగఁ జేసె
నానందగజపతిక్ష్మానాథుఁ డెక్కుడుకవిచంద్రు లని మెచ్చి కానుకలొసఁగె
గద్వాలరామభూకాంతుండు జయపత్రి నటుబుండ బిరుదు నూతారు లిచ్చె
వేంకటగిరిలోన విభుఁడుం దదనుజులుఁ జేరి వేనూటపదాఱు లిడిరి.

తే॥గీ॥ ఆంధ్రగీర్వాణములఁ గవు లభినుతింప
శతవధానాదిచిత్రముల్ సల్పుచుంటు
లుండ సగసకవిత్వమ్ము నొప్పఁ జెప్పు, టిప్పటిక
వీందుృలందు మాకిచ్చె వాణి, సుందరారాజ! రాజదయుండ తేజ!

3. శ్లో॥ ఆస్తాం శ్రీః కిము తావతా జలనిధా గత్వా నివో నా నకిం
గోత్రే కాంచనవృద్ధి గంధ కవి గ్యః కోఽపి నైనం నతం
యో రాజాఽపి న విద్వదీడ్ధరితో దాతా గ యుష్మాగ్దృశ
స్తస్మైస్త్వా ద్భగనా నతీవ ధనద శ్రీగుండసాభూపతే! ౧౬౧

4. శ్లో॥ కింవా బాలక పద్యతే వద, నయోగీర్వాణభాషా, తతో
లాభో నాస్తి, కుతో, యతో జగదిదం గాంధాస్త్రహాలంబితం,
రాజానోఽపిన సంతి, వాసులస్కో నన్నోఽపి గాయితా,
ఏవం మావద విద్వగాద్భుతచణ శ్రీమంగసాభూపతిః॥ ౧౬౨

## ఆలస్యమగుటచేఁ జెప్పినశ్లోకము.

1. శ్లో॥ దేశో సూనరరో యువాఽప్యహం మహాన్ శ్రద్ధా గురూ గేహినీ
నూత్నాఽ యాంచ బుధు హ్లాస్రచుర ఏషోఽస్త్రత్ర నీత శ్రీమాత్
విద్యాజ్ఞానవతశ్చ దేవ భవతః కిం వస్తు సిరాహేను హే
భావ్యం బుద్ధిమతా పరేంగితవిదా శ్రీగంధసాభూపతే. ౧౬౩

## (5 వ సం॥గద్వాలసంస్థానం.)

1. మ॥ ప్లవసంవత్సర చైత్రమాసమున శుక్లైకాదశిన్ దిగ్గురు
ద్దివసమ్మందు నగారతాఖ్య మహాతేజస్వి శ్రీరామభూ
పవరుం డాశ్రితపత్రపాతి గని నిర్వాణంబు, వేదమ్ములున్
గవితల్ శాస్త్రము లెల్లవిద్యలును నింకన్ వృద్ధి నెట్లొందునో? ౧౬౪

2. ఉ॥ ఏబదితొమ్మిదేండ్లు ధర నేలి యఖండవదాన్యుఁడై కలా
శ్రీబహుమాన్య లోకవులచే యశముం గొని తమ్ముఁ డీఁగ సు
శ్రీబలు నొక్కయాత్మజునిఁ జేకొని రాజ్యమునందు నిల్పియున్
దాఁ బరమాత్మునిం గలిసె ధన్యుఁడు గాఁడొకొ? రామరాజిలన్. ౧౬౭

3. శా॥ శ్రీరామక్షితిపాలుఁ డిట్టిఁ డని నేఁ జెప్పన్ దొరంకొంట యే
లా? రాజన్య లెఱుంగుదు ర్బుధులు వాలాయమ్ము దా మెగ్గదు
గ్జారల్ చోరు లెఱుంగుదు గ్మజియుఁ గోశం బెగ్గు నేతాదృశ
శ్రీ రాజిల్లిన రాజులుం గలరె? ధాత్రిన్నిక్క మెక్కాలమున్. ౧౬౮

4. ఉ॥ ఆతఁ డొనర్చుసత్కృతుల నన్నిటిఁ దెల్పఁగ భారతమ్ము గా
దే? తగుశ్రంగి జెప్పఁ గలఁ డెవ్వఁడు? తద్ఘన మింత దిన్న నా
కీతతి నిర్బుద్ధి జనియించె వచించెద గూత్రిరీతిఁ బ్రి
ఖ్యాతికి వీనిఁ బోలునృపకాంతులు లేరు నిజమ్ముగా భువిన్. ౧౬౯

5. సీ॥ ఎవ్వానిభార్య లోకైకపావనశీల లలితసద్గుణ మహాలక్ష్మమాంబ
యెవనితమ్ములు కవీంద్రేడ్యులు భీమిరెడ్డియును రంగారెడ్డి నయవినమితు
లెవనిస్యాలకులు సర్వవిధాల నిజముగాఁ గృతకృత్యు లగురామిరెడ్డిముఖ్యు
లెవనిబంధుగు లట్టి రిట్టివా రని తెల్ప నలవి కానిప్రశస్తి నందుఘనులు,

తే॥గీ॥ ఎవనిస్వీకృతపుత్రుఁ డీయెల్లజగము, నేలఁగలసద్గుణమ్ములకెల్ల అట్టి
రామభూపాలుఁ వర్ణింపరాదె? యతఁడు,మృతిఁగనుటకల్ల నిక్కమ్ము బ్రతికియుండు

6. ఉ॥ కీర్తి లేనిభూపతు లకించనులై జనియించినప్పుడే
ధారుణి లేనివా రని యథార్థము చెప్పఁగ వచ్చు కీర్తిఁ జె
న్నారెడిరాజచంద్రులకు నాశము గల్గుటయెట్లు లక్కటా!
యేరికె శాశ్వతంబె? తను వెప్పుడునిల్చు యశమ్ముచాన్పవన్. ౧౭౦

7. క॥ కీర్తి గల్గుటయును నా, నారీతుల నైన నందు నానాకవిరా
డ్వాగణసత్మానమ్మున, సారయశము గల్గు నదియు శాశ్వతమునగున్.

8. తే॥గీ॥ కవులుకవులన్న నెల్లరుకవులుగారు, నృపులునృపులన్న నెల్లరునృపులుగారు
చిన్నతనమున నేనీకుఁ జెప్పినాఁడఁ, దపనధామ? సీతారామనృపలలామ

9. ఉ॥ కానఁ గవీంద్రులన్ మిగుల గౌరవబుద్ధినిఁ జూడు మెల్లరున్
మానక కర్హులే ద్విజులు, మంచికవీంద్రులు రిక్తు లంచు నీ
మానసమందుఁ జూచు టది మానుము చూచితివేని రారు లే
వీనియమమ్ము లియ్యెడఁ బరీక్ష యొనర్చెడివేళ భూవరా. ౧౭౩

10. శా॥ రాముం డెవ్వఁడొ కృష్ణుఁ డెవ్వఁడొ ధరన్ రక్షించిరో లేనొ యే
భూముల్ పెట్టిరొ యెవ్వరిం దునిమిరో పొల్పొంద వాల్మీకి యు
ద్దాముం డౌనలవ్యాస సత్కవియు సీతారామభూపాల ? సు
శ్రీ మీఱన్ గృతి గూర్పకున్నఁ దరమే ? చెప్పంగ నెవ్వారికిన్. ౧౭౪

11. శా॥ ఈరాజ్య మ్మరుదెంచి పండితుల మేమెంతే దిగం ద్రొక్కి సు
శ్రీ రంజిల్లుట దక్క నింటి కెపుడున్ జే మున్నద్రవ్యమ్ముతోఁ
జేరన్ లే దది యేమనన్ ? వినుము వాసిన్ బొల్చువాఁ డొక్కఁడే
నీరాఁ డియ్యెడ, కేగుదెంచినను వారిన్ లేవనీ ర్పండితుల్. ౧౭౫

12. క॥ ఒకవేళఁ జైకి వచ్చిన, సకలోన్నతవార్షికం బొసఁగరు మఱి వా
ర్షిక మది పొట్టకు సరిపడు, నకటా ! తిరిపమ్ము రైలు కావల వలయున్.

13. మ॥ కనుఁగొ మ్మోనరపాల? పూర్వమున రంగారెడ్డిగా ర్మొకు మీ
జనకుం డెప్పుడు నిచ్చుచుండు దినవెచ్చ మ్మడ్డుచేయించె దా
నన కాదే యిటు వచ్చు టుగ్గితిమి నీనాఁటన్ సమస్తంబు గొం
ద నగుం గా ? యని నేఁడు రాక వినుము సీతారామ భూపాలకా. ౧౭౭

14. శా॥ గోచీ పెట్టినదాది నేఁటితుద గన్గొందున్ నృపశ్రేణి, నన్
గాచంబున్ మణి నొందు గాఁ గనుగతిం గన్గొను మీతండ్రి యు
న్నాచంద మ్మెఱుఁగున్ గవీంద్రుఁ డనినన్ నాగేంద్ర మన్నన్ దులన్
దూఁచన్ వచ్చు నెఱుంగు మిద్ది మనమందున్ గద్వాలాధిపా. ౧౭౮

## శ్రీరాణీగారి మీఁదిపద్యము.

1. మ॥ తన కిమ్మంచు వచించు కన్నను వచోదైన్యమ్ము వే ఱెందు లే
దని యే నెగ్గదు నైన నాయెడల మీ రత్యంతమున్ బేర్మి గ
ల్గినవా రంచును నేను గోరినయెడన్ లేదంచు వాక్రుచ్చ రం
చును నీరీతి వచించితి న్మదికి వచ్చుంగాక లక్ష్మ్యంబికా. ౧౭౯

(శ్రీచిన్నదొరవారికోరికచేనప్పటిస్థితినిగూర్చి చెప్పినవి.)

1. సీ॥ నిఖిలేశ్వరుం డైననీతండ్రి రామభూపాలుండు స్వర్లోక మేల నేగ
నీతల్లి లక్ష్మమ్మంబ నెగులున నేమియుఁ దోఁచక మిన్నక చూచుచుండె
జనకతండ్రియు మఱి పినతండ్రియును నేమియును జేయఁజాలనియోగ్యులైరి
మేనమామలు సాధుతామానులేరికి నించుక చెప్పలే కరఁ దలంకి

తే॥గీ॥ రట్టియెడఁ గేశవస్వామి యాత్మభక్తుఁ, డనుచు నిన్నాత్మ నెంచి తాఁ నఖిలమును సు
ఖమ్ము గావించె నీకు భాగ్యమ్ముకతన, తపనధామ? సీతారామనృపలలామ.

2. సీ॥ జనము లేలి మహేంద్రసముఁ డైన రామభూపాలుండు తపనునిపగిది నస్త
మయము చెందినమీఁద నతనిపుత్రుండు సీతారామభూపతి నాకనాథ
పతిమాడ్కి నభివృద్ధి వడసి ప్రకాశించునంతఁ మధ్యవయము నందుఁ
దమముపోలికఁ గలకాములు రామండ లక్ష్మిదేవి రామభూమిపతిపత్ని

తే॥గీ॥ సుజనపూజ్యుఁ గాంతిభాస్వరముగాఁగ, రాజ్యము రచియెల్లప్రజల నేలఁ
జాలు సామర్థ్యమిచ్చి నిష్కంటకముగఁ, గేశవస్వామి? యని రక్షింపవయ్య.

(3 సం॥ ఆత్మకూరుసంస్థానం.)

1. వ॥ విని విని సంతసమాత్రమున "వీనులవిం"దని పరితసించి న
య్యాన లిఖియింపఁబోవలయు నంటివేని వినుము బోక నవ్వు ద
న్నాను బరియింపఁగానపలె ననంతరమందు సమస్తవేళలన్
బనిఁగొని దానినే మదిని భావనసేయవలెన్ గరిమకరిచు
మ్మన గనమెుక్క్రై మలపునుద్దులు గొల్చెడివన్నె లాఁడిసాం
దును బలెఁ జెప్పనొప్పనివినోద మెుసంగవలెన్ గతాంతసం
జనిత సుఖమ్ము వోలె వివశత్వమ్ము చూపవలెన్ వసంతవే
ళను వనమధ్య నొప్పెడివిలాసపు మంటపమందునన్ బసం
దునఁ దగుకమ్మఁదెమ్మెరలు సోఁపఁగ వాగ్వధూమతల్లికా
భినయవినోదమున్ బలె నవీనముదం బొసఁగన్ వలెన్ దనం
తన తనసంగతిన్ మఱచి తానెవరో పరు లెవ్వరో యొఱుం
గనియటు లుండఁగావలె నొకానొకఁ డెవ్వఁడు గాని తన్నుఁ బి
ల్చిన నిఁక వాని కుత్తరము లేదు సరే కద? పల్కనేని "యే

మనఁ దగు నాగసంబు సహహా? మహనీయగుణాఢ్యుఁ డెవ్వఁడో
వినుతికి నెక్కఁ గ్లోకవిత్వమహత్త్వపటుత్వసంపదన్
గని రచియించె లేనికిఁ గల్గునె? యిట్టిసుప్రసార, మం
చును నదియే వచించుగద సొమ్ముడు సోలుచు వెఱ్ఱివానిరీ
తిని మదిరారసంబుచవిఁ గ్రోలినపూరుషుభాతి మందుపో
ల్కొనఁ గనుపట్టిచొప్పడవలెన్ మఱియెద్దియు నేనిఁ గారణం
బున నొకవేళ నద్దియుఁ డుపుం గనుదుగ్గళ మూఁడే నేని మిం
చినతమిఁ దన్నుఁ బూర్వము వశీకృతుఁ గా నొనరించి యెన్నియో
దినము లభేదరీతుల మదిన్ గరఁగించి యసారాణంబ త
న్నును విడనాడి పోయినయనుంగుఁ దెలిన్ దలపోయునట్టిజా
రునిగతిఁ దద్వశీకృతిపురోగముగా చరియింపఁ గావలెన్
వెనుకటిరీతి నద్దృ స్వాపేధఁ దగులొన్నినప్పు డెంతయున్
దనరుఁ ద్రియమ్ము గ్లవనితా మణి యల్లన వచ్చి గుచ్చి య
క్కునఁ జేర్చు సంతులకున్ సరిగావలె సత్కవిత్వము
న్నను, సుకవిత్వమో? వినుజనమ్ము మనమ్మునఁ బెట్టునే? యొకో
వినఁ దగుకర్ణపేయమున విన్నను నెరాన్ మొఱంగునే? రసం
బు నెఱుఁగనట్టికాముకుల నిందులు విందులుగాఁ గఁ జాలునే?
పనమున లేనిపోనియవమానపురీతులు నోఁచుఁ గాని, యొ
క్కనిధనమా? కవిత్వమునఁగా? నది యొక్కనియం దొకొక్కరీ
తినిఁ బ్రసరించు దానిఘనతన్ వివరింప విరించికైన నో
పనియపు డన్నరాగలకుఁ బాటిలునే? రసికుల్ ఘనాకృతుల్
గనుఁగొనువారు గాక కవికష్ట మదెట్టి దటంచుఁ బూర్వమే
వినివిని యింతయు న్నెనియు వీరలమాటలు నమ్మి పుస్తకం
బును బరికించపకుండుట దిగ పోల్పనితోఁ జెనె? పాణ్డవేంద్ర? నీ
రనిననోసంగులం దొకటి యైనను నిన్నడరె మొ చూచితే!
వినవుగదే యనీప్రతిన నక్కఁట విందురు గాక పండితుల్. ౧౯౧

2. క॥ "చచ్చి నవధాను లిఁక పన, వచ్చును మన" మనుచుఁ దలఁచి వచ్చితివో? నీ
మచ్చరముడఁగింపుటకునై, వచ్చితి మిదె మాకల దిగుము వాదమ్మునకున్.

3. చ॥ అభినవరామలింగబిరుదాంకుఁడ నాకవనమ్మునందు నీ
యభణపుఁగాంగ్లు తప్పు లిడ నర్హులె? కాదనితప్పు దిద్ద మా
యుభయులలోన నొక్కఁడు మఱొక్కనికిం దగుఁగాక యీర్ష్యచే
నభము శుభమ్మునుం దెలియ కార్చెడిదేబెలు మాకు లెక్కయే?

## పాలఘాటు వారి సంగీతమునుగూర్చి

తే॥గీ॥ నూఱుమంది గాయకులకు మీఱొసంగు, బొక్కతల వీరలకొసంగుబొక్కతలయు
టంచు లేనిస్వాతంత్ర్యమ్మునాత్మ నూని, మనవిసేసెద నీతోడ మానవేంద్ర.
తే॥గీ॥ మాయులోఁ బరబ్రహ్మము మణగుకరణి, నీశ్వరయ్యగాత్రమ్మున నెల్లగాత్ర
ములు నిముడుఁ దదనుజునిదౌ తెలివిచూడ, స్వరమువేసెడిపట్లనసాధ్యమధిప?
౨. శా॥ ఈవా? దాతవు వారు గాయకులునీకే వారికే చెల్లునా!
నీవే మెచ్చఁగ లేవు? వారు మఱి దా మెప్పౌనికిం జాల? రో
సేవా? ముక్కరవంశరత్న? యిది కీర్తిం దెచ్చునన్మాటు నీ
తో నే మాఱువచించు టొక్కటిసుమీ? దోసంబు మాబోట్లకున్

## వనపర్తి సంస్థానం.

1. సీ॥ గళమున నిరుకులు పైసేసె వనలపూర్గుర్హాలవిజయనగరపురములు
దానికే యాత్మస్థైర్యపుఁ దేగ నెక్కించునప్పుడొసఁగెఁ జంద్రహారములను
కడిచేతి కొకగిరు నెదియె నంతకునున్న మొగలుతుర్గిస్తుసింహాభూవరుండు
ఎవనుచేతికె మున్ననిడె గాటికొండ రామారెడ్డి మేల్మిబంగారుమురుగు
తే॥ గీ॥ నిట్టి సంస్థానములవంక కేగిపరి, తిష్ఠ నీకదక్కింప మదిని దలంచి
గండపెండారమొక్కటిపైకొసంగఁ, గాలెదురుచూచుచున్నదో కాశ్యపేంద్ర

2. చ॥ ఎనిమిదియేండ్లు లాయె నిటు కేగ మొదల్గొని మేము, నిన్నఁగ
ర్గొనుట యదేమొ నేఁటికొనఁ గూడెఁ దగంగ నొకప్పు డట్టి యి
ట్లను గొని వచ్చి నేఁకమెడదన్నులపోలిక శీతలజ్వర
మ్మున మును పే రొకించుకయుఁ బొందక యేగతియయ్య భూవరా. ౧౯౩
3. మ॥ కవు లెన్నంగ శతావధానులను వేడ్క జూచెదో లేక య
ష్టావధాన షమ్మది చాలునో నొడువు " మేట న్వచ్చు వా " రంచు నీ

కవులన్ జూడకు "కొండుభొట్లకుఁ బరీక్షా?" యంచు లోనెంచె దే
నవధాన మ్మది యేల? మాకొసఁగు నూటా ర్లిమ్ము రామేశ్వరా. ౧౯౯

4. మ॥ "కృతి కైకొంగఁ దలంచినాఁడ" నని మున్నే పల్కి తేమయ్యె నా
యతనం, బిప్పుడు చెప్పుమయ్య యది నీవాసించుచో నిక్కమై
నతటిన్ వీడ్య మొసంగు మిచ్చిన భవానీదేవి చెప్పించి నిన్
గృతకృత్యున్ బొనరించుచోఁ బాల్యవనస్తరి స్ఫూర్తి? రామేశ్వరా. ౨౦౦

5. సీ॥ అలపిఠాపురభూవరామాత్యతనుజాతునకుముద్దుయిచ్చినాఁ మొకతనూజ
నలపోలవరపాలుఁ డగుకృష్ణరావు బి య్యే. కొక్కకన్యక నిచ్చినాము
పలుగండములుదాఁటి బ్రతికినకన్య నర్పించినాము మాత్మరూప్యపృథివిపతికి
నఖిలలక్షణయుత యగుపెద్దదాని దేశికునకే యిడి పెండ్లి చేసినాము

తే॥గీ॥ కోరియుంటిమి నగునట్టిధీరమతిని, నీకు నొకకన్నె నీకున్న నేర మగు న
టంచు నీనెంచి యిట్టు లేగుదెంచి నార,ముడుగుమిది తటి రామేశ్వరావనీప.

6. శా॥ ఘోషా లేదఁటు "రాజదాట్ప్రథలకున్ గొంపొమ్ము న"న్నెంచుఁ దన్
బోషించుజనము గాసివోబునట్టి రేభూపాలుఁడిం జూపరన్
"దోషంబే కల" దంచు నెంచునట్టి యీరాగద్రోహిణి కన్నియన్
బోషింపం దగురాజు మృత్యుఁడు సుమీ? భూమిశ? రామేశ్వరా ౩౦౩

7. ఉ॥ గ్రుడ్డిది గా దొకించుకయుఁ గుంటిదిగాదు కురూప గాదు మా
బిడ్డ, సమస్తదేశపృథివీపతిసత్సభలందు మంచి పే
ర్వడ్డది దీనిఁ గైకొని నృపాలురలో యశ మందుమయ్య!మా
పడ్డపరిశ్రమమ్ము ఫలవంతముగా వనపర్తిభూవరా. ౨౦౩

(అత్యాశుధారలో నెదుట వ్రాసినవి.)

1. చ॥ "అరుగుఁడ వస్తు"వంచును "మహాకవు" లంచును గోటిరాజులం
దొలుఁకవధానశక్తి యని నూఱులు వేలు నొసంగి" రంచు నీ
వెఱిఁగియు మేటిదాత వయిరమే పదిరూపికలిచ్చినావుగా!
తిరుపతి వేంకటేశకవిధీయుల కో వనపర్తిభూవరా?.

2. ఉ॥ "అన్నము లేక వచ్చితి" మటంచు మనమ్మున నెంచినాఁడవో?
"చిన్నరఁ జూచుచో యశము సేయ"నటంచుఁ దలంచినాఁడవో

వన్నెయు వాసియుం గలుగుసాహిత్యపుం దేవ్వండు మమ్ము నిట్లు చూ
చెన్నరనాథ? నీవ యిటు చెల్లెను జేయున నేర్తు మిమ్మెయిన్. ౨౦౫

3. చ॥ కలరిల వేనవేలు నృపకాంతులు వందలు వేలు నిచ్చు ను
జ్జ్వలతరదానశాలు, లటువంటివదాన్యుల వీడి యియ్యెడన్
సలలితశక్తిం జూపంగ నసాధ్యుల మే మరుదెంచి ముష్టికిం
దుఱ యగు గౌరవమ్ముం గొని తొల్గిన పోవుట యుక్తమే? నృపా. ౨౦౬

4. తే॥గీ॥ "మాటలను జూడ మాయమ్మ మాద్రిగాని, చేతులకు డేమొకో? కొంతచేటువచ్చె"
ననెడిసామెత విస్పష్టమాయె నిచట, రమ్యగుణసాంద్ర! రామేశ్వరక్షితీంద్ర.

5. సీ॥ అనుభవించితిమి దివ్యభోగములను రాజాధిరాజులకన్న నధికముగను
సంచరించితిమి రాజ్యస్థానములం బూర్వకవులకన్నను నిరాఘాటముగను
ఆర్జించితిమి యింత యతిఘనులకైన మేము ననుభవింపంగం జాలునట్టివృత్తి
రచియించితిమి వచోరమణి తోడుతం రసవంతమ్ములైన ప్రబంధములను
తే॥ గీ॥ రాజమిత్రుల మదిగాక రాజబంధువులము కవిరాజులము పదువుర గలట్టి
కొలమువారము మాకెందుం గొదవలేదు, కీర్తికై రాక చుమి! వనపర్తిభూప.

6. తే॥గీ॥ కవితయందలి రసము పక్కంగం దెలియుట, కనుగుణమ్ము గు నీవిదానమురె నేని
పూవునకుం దావి గల్గినపోలెం గాదె? యెఱుంగుమిది ప్రశంసితని రామేశభూప!

7. తే॥గీ॥ నూఱుమందికిం గవనంబుసాగదాయె, వలలం జెప్పెడిమాకిది బహుమతి యని
తమకుం దోంచుట మేముస్వప్నముననైన, నెఱుంగ కేతెంచితిమి క్షమియింపుభూప

8. తే॥గీ॥ పదుపురకూటికి నీవు పాలుపడినయేని, కడుపు నిండనియప్పుడికొక్కనికి కేము
కక్కుఱితిచెందుటయుం గొంత కానిపనియు, టంచునూహించెదరులోకులవనినాథ.

9. క॥ "అతుకలతుకులందెచ్చిరి, పతుకులు సుకవు" లని మున్ను తజ్జ్ఞులనుట యీ
పతమున వ్యవహృయను మేం, మీక్షింపంగ వలసినవ్వాయేనియు లేమిన్.

10. తే॥గీ॥ నూటికొక్కండుచక్కనిధారణి గల్గి, సరసకవనమ్ము చెప్పెడిచతురుండుండ
నట్టివారలలో వేయికమరు నొకండు, శతవధానాదికమ్మును సల్పజాణ.

11. తే॥ గీ॥ వారిలో నెల్లం జేర్గొని దూరదేశ, మనక వచ్చినవారి నిట్లనయుటయును
గౌరవమ్మని తమమదిగాంచినప్పు, డేమియున నేనుకును వచియింపుభూప.

**12.** తే॥గీ॥ఎందుకే తెంచితివటంచు నెడదదుఃఖ, పడుటయే నేటిలాభమ్ము పార్థివేంద్ర
దర్శనమిదియేల్లకైకొమ్ము దయయెచాలు, దానికింతయనెడి వెలతనరదధిప.

**13.** క॥ కైకొని సంతోషింపని,మాకిడుదర్శ్యమ్ము వమ్ము మహిపాల! వృథా
యాకరణి వెచ్చఁబుచ్చిన లోకులు మెచ్చుదురె! నిన్ను లోఁకనుమిదియుఙ్

**14.** తే॥గీ॥దాతయన్నప్పుడెవరినేరీతిఁగన్న,ననువగునొయట్లు మాచెడియతఁడుగాక
కాచమణులను నొకరీతిఁగాంచునతఁడు,కాఁడని[ప్రమాణముగఁజెప్పఁగలము మేము

**15.** తే॥గీ॥మాకునూతారులిచ్చుట నీకులెక్క, గాదుమాకదియును లెక్క గాదుగాని
యుభయులకునుయశమ్మదియొసఁగునిపుడ కాక యీభువియున్నంతకాలమధిప

**16.** తే॥గీ॥కవిత యాశునఁజెప్పిన కారణమునఁ,దప్పులుండెడినయ్యని తమదుపండి
తులును దమకెదురాడినదుడుకుతనము, తామునుక్షమింపుటకువేఁడెదమునరేంద్ర

**17.** తే॥గీ॥సివిలు మొదలగునధికృతి చెలఁగువిూర,లేమియొుఁరించినను మంచిదే య
టంచు, సంతసింతుము మాకట్లుసంభవించె, నేని యదిహెచ్చుగౌరవమింతకన్న

**18.** క॥ గానమ్మకన్నఁగవన,మ్మేనాఁడేనియును దక్కువే? నగవగ? నీ
వీనియతి విడిచియిచ్చిన, నే నేరుని సమ్మతింతు నెటిఁగి యెటిఁగియుఙ్.

**19.** క॥ రంగాచార్యులవారి,సంగతిని నెఱుంగునట్టినతురులె యట్లునై
నంగాని చెప్ప సంశయ,ముంగాంతురు శ్రితులకదియు ముఖ్యముకాదే.

**20.** క॥ ప్రతివత్సరమును రామని,మతినెటిఁగియు విూగ విల్లు నూకిచ్చుట "దు
ర్గతికిఙ్ రావులు కవులని, ప్రతిజ్ఞ సేయుటయకాదె? వసపత్రిన్పా.

**21.** క॥ ప్రభువొకచో రసికుండగు, నఖిసలొకఁట రసికు లగుట సంభవమగు నీ
యుభయులును రసికులగుటది, నభస్సుమమురీతి చుమి? వసపతిరాజా.

**22.** తే॥గీ॥వేలకొలఁదిగ నేసేసి విప్రవరుల,కిచ్చి పుచ్చెడినిను దాతవే? యటంచుఁ
బల్కెదనుగాని యెవరికేవసుపనీయవలయునొయెఱుంగవని చెప్పవాఁడభూప

**23.** తే॥గీ॥ఇచ్చెదవుగాక నూనెన వేమికొనవ,మాకవిత్వపరీక్ష పన్యశ్తిని గ
చింపు మేకథనేనియుఁ జెప్పఁపుడు,చేయి యాపిన నదితెఁవేయు మధిప.

**24.** క॥ పదిగాను వేయిపసులను,నిదియే చాలునని యెంచఁడే యెటిఁగెన స
ద్విదితుఁ డగునరవరుఁడు నీ,మదిలో నవి యొల్లఁజూడుమూ? భూవిూశా.

**25.** తే॥గీ॥ ఎందులోఁ జేరకుండెడిహీనుఁడెల్ల, కవులలోఁ గలఁడయ్యెడఁ గలియుచుండ్రు
ఎల్లవర్ణమ్ములనుగూడి యుంచుకంత యంతరము లేక తురకలయందుఁ గలియు.

**26.** తే.గీ. కానఁ గవులకు నీలాటిగతులు వచ్చెఁ, గాని నీలోపమేమియుఁ గానఁబడదు
ఎఱుఁగఁ గొక్కింతవాఁడిసితినింతవట్టు, నెఱిఁగితెఁ మియింపు నయ్య? రామేశ్వరయ్య.

**27.** తే॥గీ॥ కాగితమ్ములు లేనట్టి కారణమున, నింతతో విరమించితి నిపుడ యొక్క
కబ్బ మొనరింపఁ జాలినకవిని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి నా పేరు నృపతి.

(దారిలో ప్రసంగవశమునఁ జెప్పికొన్నవి.)

**1.** తే. గీ. పొండు గద్వాల కాత్మకూరునకును
ఏమొసంగిన సరసులా భూమిపతులు
వినఁడు మామాట నైనెందుఁ జనకుఁడయ్య!
పాకనాటినృపాలు రెవ్వట్లలేరు. ౨౩౧

**2.** సీ॥ కవులచేతను మేటికవనమ్ము చెప్పించి విని మొండిచేయి చూపించువారు
"పాటకువినుటయే బహుమతి తలయూఁపిసందుకుఁ దంబురా" యనెడువారు
దగ్గరపండితుల్ దమకేది యేని చెప్పిన నగి నెడచెవిఁ బెట్టువారు
మాటలచేతనే మంచిప్రతిష్ఠ నార్జించు మార్గమ్ము యోచించువారు
తే॥ గీ॥ లేరు నీయందు, నిదగు పేరువిన్న, యంతనే పోవు దారిద్ర్య మహహ? పాక
నాటిరాజవంశంబ? యీ నాటినృపతు, లందు నినుఁ జెప్ప చెప్పరాదన్య నొకని

**1.** మ॥ మును సౌగంధికపుష్పమున్ గొనఁగ భీముండేఁ డైలిన్ బోవుతో
వనసాక్షాత్కృతిఁ జేసి ఖడ్గమృగముల్ వారింపఁగా సంజ నా
తనయుం డెక్కుడు పేర్మి నిచ్చి నపరార్ధం జేసుమా! యీపయిన్
జనువాఁ డాజ్ఞ నసేయు వెంకటకవీ! సారస్యమట్లుండుటల్. ౨౩౩

**2.** మ॥ ఒక యేగానికిఁ జిన్నకిట్టనికి నాయుష్కర్మ చేయించి గా
నికినై కాని యొసంగి "యెక్కుపమనుల్ దె" యన్నన్ "నాచేత లే
దకటా?" నాఁగను షష్ఠ్యబ్దపూర్తికిఁ దానఁగీకృతిం జొన్ప లా
భ్యకులాయ మ్మగుమ ద్ధరాలి చరితం బాలించితే! తిర్పతీ? ౨౩౪

## ఆత్మకూరు సంస్థానం గద్వాల.

1. మ॥ కరుణత్వన్నృపతి న్నుతించితిమి తత్కార్యార్థి భూమీధరా
కరకారుణ్యసమాగతామితవసుశ్రీపాలకత్వస్ఫుర
త్తరభాగ్యోదయు నాశ్రయించితిమి సీతారామభూపాల! మీ
కరుణామూర్తికి దయసేయుమయ్య! మతిమాగుణ వృత్తిసత్తావతిక్. ౨౨౫

2. తే॥గీ॥ ధరణినాయక! మావాగుదారధార, పాటి పండించు సరసకేదారములను
తాద్భుతం బగుమీవాఁ గుదారధార, పాఱగాఁవలె నూఁదు కేదారములకు.

(ఒకసమయమునఁ బ్రసంగవశమునఁ జెప్పిననిందాస్తుతి.)

1. సీ॥ నీమీఁదఁ గృతిచెప్పి నిను నుతించినకృష్ణమాచార్యవరుఁడు సన్యాసియయ్యె
నీదుసంస్థానపండితుఁడైన యలశ్రీనివాసార్యవరుఁడు ప్రవాసియయ్యె
నీనాయకుఁడ నంచు నెగ్గియై రాఘవాచార్యుఁ డూరూర యాచనకుఁ డిరిగె
నీ కిలవేల్పైన యామన్మతిస్వామి యడవిగుట్టల నంగలార్పఁ దొడఁగె,

తే॥ గీ॥ నెవ్వఁ డియ్యనునీకుఁ గృతినిచ్చుగురునునీషులెల్లయఁ దిరుపతివేంకటేశ్వరులెకాక
నీదులోప మొక్కింతయు లేదు నమ్ము, మాత్మకూరుపురీరాజ? యతులతేజ.

(గద్వాలలో మధ్వస్వాములవారి దర్శనము.)

1. శ్లో॥ పశుపతిదయితాన్వయయాత్రో, తిరుపతివేంకటశాస్త్రినౌకవీంద్రౌ
పరిణమత ఇహా సత్యధీగతీర్థం, సకలజగద్గురునాయకం భవతం. ౨౩౮

2. శ్లో॥ స్వామిన్ త్వత్పదపద్మశాస్త్రజలధీ భూతప్రభావస్ఫుర
చ్ఛ్రద్ధబ్రహ్మమహేంద్రసాంద్రకరుణాసుపాత్రీస్తవిద్యాధరా
ధన్యాశ్రీపతివేంకటేశ్వరకవీశ్రీసత్యధీరపరిభో?
విద్వన్మండ్యశతావధానచతురా త్వత్పాదసందర్శనాత్. ౨౩౯

3. శ్లో॥ శ్రీరామోఽస్యేఽహ మన్యోఽస్తిహి మహ దుఃఖయో గంతరం చేతిచేత
స్యాస్తాం యుష్మాకే మేమత్వ మితినతి మిమా మస్వయే యుష్మదంఘ్రి
ద్వైతాద్వైతాదిశబ్దైః గల మధకతరం యత్ర తేజస్సదైవ
స్వమోస్యామ్యా యతీంద్రపరిణతపదగజ స్సత్యధీరార్యవర్య. ౨౪౦

4\. శ్లో॥ భుక్తిం దదాత్యపి చముక్తిమథాపిశక్తిం,భావత్కదర్శనమనేకశుభానిదత్తే
బ్రిహాస్మదిభిః కిమహమాశ్రితకల్పవృక్షం, సేవేభవంతమనఘంగురుసత్యధీరం

5\. శ్లో॥ ఆబాల్యాద్రాజరాజా నతులశతవధానాదిభి స్తోషయిత్వా
య న్నాగారోపణై ర్నిస్తులతరవసుభి ర్భూషితా భూషణైశ్చ
త త్సర్వం నైవతుల్యం భవతి భవదనుగ్రాహ్యతాగౌరవేణ
స్వామిన్ శ్రీసత్యధీర ప్రభుతిలక గురో రాజరాజార్చితాంఘ్రే. ౨౪౨

6\. సీ॥ అతిబాల్యఏవచీవ్యతాకపట్టణే కింకవిగజసింహకీర్తి మాప్య
తద్వయస్యేవ సంపద్వత్యమలపురే విద్వత్కవీంద్ర సద్బిరుద మాప్య
తదధికే వయసి బృందావనే పట్టణే బాలకలానిధిపద మవాప్య
తద్వయస్యేవ విద్వద్వతి హరిపురే బాలసరస్వతీపద మవాప్య.

తే॥గీ॥ ఆంధ్రగీర్వాణభాషయో రపరిమిత సు
పద్యగద్యమయాని కావ్యాని నైక
విధరసాని విధాయ భోబుధవరేణ్య?
వందనాయ సమాగతో వందనీయ?
తిరుపతి ర్వేంకట స్సత్యధీరతీర్థ!. ౨౪3

## శ్రీవారిసన్నిధికంపిన పత్రిక.

1\. శ్లో॥ శ్రీసత్యధీర తీర్థానాం, గురూణా మనఘాత్మనాం
సన్నిధౌ విద్యమానా భోః, పండితా దృశ్యతామిదం. ౨౪౪

2\. శ్లో॥ (శ్రీరామోఽన్యో హ మన్యోఽస్తి హిమహదు
భయోరంతరంచేతిచేత, స్యాస్తాం యుష్మాకం.) ౨౪౫

3\. శ్లో॥ హ్యాస్నా యూహానిపద్యేఽస్మిన్, పదంయుష్మాక మిత్యదః
దుష్టమిత్య వదన్ త్సర్వే, భవంతః కృతి బుద్ధయః. ౨౪౬

4\. శ్లో॥ ఇదం జన్మసహస్రేఽపి, శబ్దశాస్త్రాధికారిభిః
నానాకావ్యవిదేశా నైర్దుష్టం కర్తుం నశక్యతే. ౨౪౭

5\. శ్లో॥ భవత్ప్రతిజ్ఞాం యది పాలయేర,న్నిదం యథాదుష్ట మభూత్తదర్థే
విచార్యపత్రం లసదుక్తిపాత్ర, మాశాస్మహే ప్రేషయితుం మహాంతః. ౨౪౮

6. శ్లో॥ నచే దభినివేశస్తు, తూష్ణీం తిష్ఠంతు తా శ్రుతిః
భవదజ్ఞాన వైరస్యే, వయంతు శతధానుమః. ౨౭౮

ఇతిసజ్జనవిధేయా తిరుపతివేంకటేశ్వరౌశతావధానీత్యాది బిరుదాంకితౌ.
ఆవాంపరశ్వఏవజిగమిషూ,తతస్సత్వరం ప్రత్యుత్తరం దీయతామితిప్రార్థ్యంతే

## (మొదటిసంవత్సరము నూజివీడు.)

1. శ్లో॥శ్రీమంత స్తనయా, స్సతీగుణవతీ విద్యా ఽ నవద్యా మహా
దారిద్ర్యం తే సకలం చ కాస్తిక మతః కామ్యం నృణాం సంస్కృతౌ
అస్త్యేవాస్తు సుఖస్య సుస్థితి రహో శ్రీరామచంద్రాప్పరా
డన్యస్యాఽపేక్షవే దవాప్తి రథ యద్యత్తే హృదే రోచతే. ౨౮౦

2. సీ॥ నన్ను నేఁ డతిప్రియత్నమున రావించుటే కవితాభిమానసంగతికి సాక్షి
వేమూరి శ్రీరామవిబుధుఁ బూజించుటే నిర్వ్యాజదాతృతాన్వితికి సాక్షి.
ఆడంబరంబించుకైన లేకుండుటే సులభుఁడీతఁడటన్న స్తుతికిసాక్షి
అతిమితభాషణస్థితి నెప్ప డొప్పుటే యని తప్ప దనుయశమ్మునకు సాక్షి

తే॥గీ॥విరవవేంకటసూర్యరాడ్విభుఁడు మాటి,మాటికిఁ బ్రశంససేయుటే నేఁటిరాజు
లందువిద్వాంసుఁడనెడినియతికిసాక్షి, యఖిలకవిగేయ! రామచంద్రాప్పరాయ.

3. సీ॥ ఆస్తికత్వమునఁ జెన్నారువాఁ డనుటకుఁ దావకంబైన వర్తనమెసాక్షి
అతికరుణారసాన్వితుఁ డీతఁ డనుటకు ధర్మార్థమైన వైద్యంబెసాక్షి
దీనపోషణము సంధించు వాఁడనుటకుఁ బంగ్విఁధకుబ్జాదిపటలిసాక్షి
రామనామోపాసనా మాన్యుఁ డనుటకు ముమ్మాటికిని రామమూర్తిసాక్షి

తే॥గీ॥కార్యకృత్యము లెఱుఁగనిధీరుఁడనుటు, కడతెగక వోఁకతోఁటనానెసఁగియొసఁగు
చును నెసఁగనున్న నీదగుసుతులుసాక్షి,యఖిలకవిగేయ! రామచంద్రాప్పరాయ.

4. శ్లో॥ ఇంద్రశ్చంద్రస్స మసినసమ స్సర్వథా తే జగత్యా
మిత్యేవం యే పునరపి పున స్సంస్తువంతిః కవీంద్రాః
తేషా చోరా ర్భుణు పర మిదం యస్స్వభావోక్తిముంచు
స్సోఽయం శ్లాఘ్యోభవతి విదుషాం రామచంద్రాప్పరాయ? ౨౮౩

5. ఉ॥ ఆవల నెవ్వ డేని గవి యల్లినపద్దెములన్ బఠించుచో
"నీవిధమెల్ల నిశ్చయము యానులికిజ్ దగు నీతఁ"డంచు సం

భావన గల్గఁగా వలదు భావ మటుల్ గనుపట్టుచున్న వా
దేవిరిగొట్టుపద్దెముల దీవన లేమిటి? కప్పరాడ్విభూ. ౨౫౪

6. ఉ॥ ఏ నవధాని నంచు మఱి యీవు ప్రేంఘ్రుఁడవంచుఁ జెప్పఁగా
నూనుట యొప్పనొక్కొ పునరుక్తికిఁ బెద్దలు సమ్మతింతురే?
దాని నటుండనిచ్చి కవితారసముఁ జవిఁ జూచుపొంటె న
న్యూనములైన మాకృతులనుఁ వినఁగోరెద నప్పరాడ్విభూ. ౨౫౫

7. ఉ॥ దొమ్మరిసాని యెంతయును దుష్కరమొయిఁ గడనెక్కి యాడుపో
లిక్కమ్మతిబల్మికల్మిఁగడు లేమిడిచే నవధానముఁ బొన
ర్చు మ్మనుజుండు, దానినొక చోద్యముగా గణియింపఁ బోక స
త్సమ్మతిగా నెసంగు కవితారసముఁ జవిఁజూడు భూవరా. ౨౫౬

8. శ్లో॥ శ్రీమద్రామం మనసి నితరాం సేవసేఽత్యంతభక్త్యా
శ్రీమద్రామస్త్వ మసి స పున స్స్వాధికాపత్యశాలీ
త్వం చైతాదృ క్సతు పరిచితో ధర్మకర్మ ణ్యతీవ
త్వంతాదృక్షు స్సన కథయవే రామచంద్రప్పరాయ? ౨౫౭

(ఈయనరాణింగూర్చి చెప్పియుంపినది.)

1. సీ॥ నీభర్త సుశ్లోకుఁడై భూమి నేలువిద్యాశాలి రామచంద్రప్పరావు
నీయన్న విద్యావినీతిప్రధానుండు రావువేంకటసూర్యరావువిభుఁడు
నీదు సంతానం బనేతాదృశము చిరాయుష్కమైశ్వర్య వృధ్యన్మఖంబు
నీదుశీలమ్ము వర్ణించెడి కవులకు సీతాదిసాధ్వుల స్మృతికిఁ దెచ్చు

తే॥గీ॥ నొక్కఁడననేల? సకలమ్ము దక్కనైన, ఫక్కినొప్పెడినిన్నెన్న వశమె? మాకు
రామచంద్రప్పరాయ సామ్రాజ్యలక్ష్మి? వృద్ధినందుము శ్రీలక్ష్మి వెంకమాంబ

(1వ సం॥ ఖాసింకోటలో తోటలోనైన యుత్సవముంగూర్చి చెప్పినది)

1. సీ॥ గాడెదన్నై సవాగ్గావించు చందమ్ము సిగ్గు మాలినవానిచేష్ట తెలిపె
తాళితోడను బెన్గులాట యరసమైన పల్లవి తెగఁబాడుపగిదినొంచె
తొలఁగు నీర్కుండలతోఁ బరుగెత్తుట యల్పవిద్యావంతు నహకరించె
క్రొవ్వుఁ బూసినవాఁడు రోకయెక్కుపట్టుట స్వశక్తిగాననివాని చందముయ్యె

తే॥గీ॥ శ్లోకఁడు ముందెఁదఁదనుకనెన్నో విధములు, దప్పటీఁతలు గొట్టుటపిప్పికైత
ముల్లె నల్లి యాశుకవుల మీఱసెంచు, సారదోఁపించె వేంకటాచలనృపాల.

## (తోట్లవల్లూరు జమీందారు శ్రీ భాష్యకార్లనాయఁడుగారు)

1. సీ॥ శ్రీరస్తు సంతతశ్రీయోఽస్తు కలియుగాబ్దములొకనైదువేల్ పైనినాల్గు
జరగుచో శోభకృత్సంవత్సరమున మాధవమాసమందు శుద్ధ మగుపక్ష
మునను నేకాదశి ననఘుహా సుత్తరానక్షత్రమందుఁ బూర్ణబలయుక్త
మగు వృషలగ్నమ్మునందు మహోత్సవంబలరార వల్లూరఁగలిమిమిగుల

తే॥గీ॥ బమ్మదేవరసద్వంశవర్ధనుండు, ఘనగుణాఢ్యుండు శ్రీభాష్యకారనృపతి
పుత్రవతి సతి తన దరిఁబొలుపు దెలుప, శ్రీధవునికృపఁ బట్టాభిషిక్తుఁడయ్యె.

2. సీ॥ బమ్మదేవర నెమ్మి గ్రిమ్మ యాయువొసంగు బమ్మదేవరకులాభరణ! నీకు
శ్రీభాష్యకారు లశేషవిద్యలొసంగు శ్రీభాష్య కారాఖ్యఁ జెలఁగు నీకు
ఇలువేల్పు గోపాలుఁ డిల యేలఁగాఁ జాలుశక్తి నీకిచ్చు సువ్యక్తతేజ?
ఆదేవుభార్య లక్ష్మీదేవి నీ కిడు నింత కెచ్చగుసిరుల్ నృపతివర్య?

తే॥ గీ॥ అనఘులగు బ్రాహ్మణులును మహానుభావు, లైనకవివర్యులును ముదమందిదీవ
నల నొసంగుదు రెల్లప్పు డెలమినీకు, ఘనతరాటోప! శ్రీభాష్యకారభూప.

1. చ॥ చెలులును మంత్రులున్ సుతులు శ్రీకర యోషితియున్ మహామహో
జ్జ్వలు లగుచుట్టలున్ గవులు సన్నిధి మేల్మి నలంకరింప రై
తులు జయపెట్ట తూర్యములు తోరముగా మొరయన్ మృదుస్వనం
బులు సెలఁగంగ నెల్లెడల బోగపు టింతులు నాట్యమాడ భృ
త్యులు కడుమోద మొప్పఁగ నోహో! యని హెచ్చరికల్ పొసఁగ వం
దులుఁ నుతియింప నెల్లర మనోరథముల్ ఫలియింపఁ బూర్వ మం
దల రఘురామమూర్తి జనకాత్మజతోడ నయోధ్యఁ బట్టమున్
సలలితరీతిఁ గట్టికొను చాయ యెలర్పఁగ నేఁడు భాష్యకా
రులు నృపపుంగవుం డతినిరూఢిని బట్టపుభద్రపీఠమం
దెలమి చెలంగ నొప్పె సకలేశ్వరుఁ డానలగోపబాలుఁ డ
య్యలఘుని కింతకన్న సిరి యంతకు మించినమేటిసంపదల్
బలమును బుత్రసంతతియు భాగ్యము భోగ్యము లైనవస్తువుల్
గలుగఁగఁజేసి ప్రోచుఁ గలకాలము కంటికి ఱెప్పరీతిగన్.

[illegible]

## శ్రీ రామచంద్రాప్పరావుగారు.

1\. చ॥ పదియవను దొమ్మిదౌదినము బందరు చేరక తప్పదిప్పు వి
ఘ్నదశ ఘటించె గేహినియున్ సకలమ్మును దేటతెల్లమౌఁ
గద? యిఁకనాఁటి పొద్దుట నె కాయెకి నియ్యెడనుండి పోయి యి
ర్వదికయిన్ జనన్ వలయు బందరు, దేహము నమ్మికొన్నయ
ప్పిది విహితంబు కాదె, తమ కియ్యది యొండొరు లేల చెప్ప, ని
య్యది భవదీయసంశ్రితులమౌ మముబోంట్లను నెంచి చూడ గో
ప్పద మనరాదె? సొప్పు గుడివాడకు దేవరవా రొసంగ న
య్యది కడువే రీతిమై యిపోయిన్ దేహము నొచ్చకుండఁగా
నుదరములోని నీర్కదలకుండఁగ నయ్యెడ దింపె నేని య
య్యెడనున యెట్ల బండిపయి నానిశి యెల్లను బోతిమేని మే
ముదయము కాకమున్న చనియుందుము బందరు, సూర్యులు వేళయో
పది పదకొండుగంటలకుఁ బైనగుఁ "చెప్పఁగ నేల? దీని, మీ
రొక్కరు లిటు వచ్చియేగు నెడ మోదము మై నిటు లిచ్చి పంపమే
యిది యొకరాచ కార్యమె? కవీంద్రుల కియ్యక యేరికిత్తు" మం
చుఁ దమ రసంగవచ్చు నిది సూనృతమే యగుఁ గాని యిప్పు డీ
య్యది దయచేయుటెంతయును నాఁ బదివే లని లోన నెంతు నే
మిది యనియందురేని" తునగేంద్ర ముఖం గొని తేర మొన్న నే
కద! తమరంపి యుండిరిది కన్నులనిండఁగఁ గాంచి కోరఁగా
నెద యొకకొంతసందియము నే కనె, నైనను, గార్యసక్తిచే
నిది విధియయ్యె, రాజు లెద నెంచిన దేనికి నేని లోపమే
పదిలము గాఁగఁ బోయెడి యుపాయము చూచితిఁ గాని, లేనిచో
గుఱుపునకోర్చినన్ దొరకు గోడిగ బండ్లిటు నెన్నియేని, య
య్యదరది యింతగూరము నహం బదియెల్లను బొంది సైంచు న
య్యద నదివోయె, దేహమిది యార్తదశాపరిభూతమౌటచే
బదిఁబది విన్నవింపఁదగు వాఁడను మీరు నుగారుగాన నిం
కిది విరమింతు దేవరకు నింతగ విన్నప మాచరించుటే

మొన లవివేక మిత్రకును మోటుగుఁ జెంచి వచింపఁ బూనినన్
సదయ! కవీడ్విధేయ! విలసద్గుణ! శ్రీకర! యప్పరాడ్విభూ!

## 3 వ సం॥ నూజివీడు.

(వెంకటరంగయ్యప్పారావుగారి సభలో చెప్పినది.)

1\. మ॥ స్వామి వచించుసంగతులు సత్యములే యగుఁగాని యొక్కఁ డ
న్నామము వెట్టుకన్నను ననామునిఁగాఁ బరు నిర్ణయించుఁ దా
నేమత మద్ది హిందువులకే యనఁగాఁ బని లేదు సర్వులున్
దా మది సమ్మతింతురి పరతత్త్వవిదుం డగువ్యాసమౌని యే
మీ మతి యన్య లేమి తమ రేకృతులన్ రచియించి రందుఁ గా
రామహితాత్మనామ మది యచ్చట నచ్చట భిన్నరీతిగా
నే మెఱయింపఁ జొచ్చి రది యెల్లను జూచియె శంకరుండు ని
ర్నామునిఁగాఁ బరాత్పరుని న్యాయముగాఁ దగ నిర్ణయించె నా
యీమతమే విదేశములనెల్లెడఁ బొందు వివేకయోగి స
ద్ధీమహితుండు లోకము నుతించుఁ దిరన్ వెలయించె శైవు "లా
స్వామి విభూతిరాయ" డని వైష్ణవు "లాతఁడు తిర్మణిన్ సదా
నామముగా ధరించు" నని "న్యాయ మిదే" యని మాధ్వు లవ్విధా
గా మది కెవ్వఁ డట్లు గను గారణముల్ వచియించి "మీది త
ప్పే మతి మీది త"ప్పనుచు నెంతయు వాద మొనర్తురొప్పమై
వేమరు క్రైస్తవుల్ తమవివేకము గన్పఱతుర్ మహాత్మ దు
ర్ధామమతస్థు లింకొకవిధమ్మున బోధ యొనర్తు రిన్నియున్
శ్రీమహితంబులే సకలజీవులకున్ ముద మిచ్చు నట్టివే
యీ మతముల్ సమస్తమును నేకమె యన్న విశేష మేమతం
బీమహిఁ జెప్పు నయ్యది మహీశ్వర! శంకరు లానతిచ్చి రే
రామత మాదరింతురొ సమస్తము వారికి మిత్రి మా మతిం
కేమతమున్ వహించినను నెక్కడి కేగిన నక్కడే విరో
ధామయ ముండి తీఱవలె నందఱికిన్ విశదంబ యీస్థితుల్
శామదిఁ దోఁచినట్టిదిది నన్ను క్షమింతురుగాక పండితుల్,

## తేలప్రోలు మేనేజరుగారు.

1. మ॥ అధికారమ్ము వహించినార మని గర్వాంధ్యమ్మునం బొల్చువా
రు ధరన్ వేలకువేలు గల్గుదురు పేరున్ మంచియోగ్యత్వమున్
బుధమాన్యత్వము దీనపాలకతయున్ బొల్చారువాఁడెక్కడో
పదికో నూటికొ వేయికో యొకఁడు గన్పట్టున్ బ్రపంచమ్మునన్.

2. చ॥ మనుజుల కీక యెవ్వరికి మాన్యతనుం బధికార మిత్తు రి
చ్చిన వెనువెంటనే మనుజచేష్టల వే దిగఁద్రావి కొంద ఱో
య్యన తమపూర్వజాతి దయినట్టికపిస్థితి గాంతు రక్కటా!
ధన మధికార మెవ్వరిని దాఁ బడఁద్రోయదు సర్వభంగులన్.

3. క॥ గొప్పతనకబ్బుకొలఁదిని, ముప్పనిసుదినెలుఁగు బుధుఁడు, మూర్ఖుం డదియే
యొప్పనుమఁబొంగి సంపూర్ణాప్పతిసుతుభంగివెనుక కరుగుఁగ్రిచుమునన్.

4. చ॥ వెనుకవిధమ్ముగా కపుడు నేత్రృత హెచ్చుట పక్షపాతవ
ర్తనమనుగంటి లంచములు తగ్గుటయున్ వ్యవహార్తలందుఁ గ
ల్గె ననుట సర్వసమ్మతమె కేవల మీవిభునందు నద్ది హె
చ్చని వచియింతురెల్లరు నహా? యిది యూరక కల్గనేర్చునే?

5. చ॥ ఇతఁడు మహామనీయుఁడయి యెల్లగ నొక్కగతిన్ దయోదయ
స్థితి గనుఁగొంచు దగ్గఱవసించెడివారలఁ బేర్మి నోర్మి నా
క్కతతినిసైన నాగ్రహము గాంచకయే కనుఁగొంచుఁ బూర్వ పం
డితు లధికార మన్నది గణించుదురు దాము పిశాచమంచుఁ ద
ద్గతి మనయందుఁ గన్పడుట గా దనిపోలె నిగర్వియై క్రమా
న్నతిఁ బ్రతిపత్క్రశౌనిధి యనం దనరారుచుఁ దా ధరించు భూ
పతి కభివృద్ధి సాఁరకును శాశ్వతమౌగతి సంతరించుచున్
మతి గలవారలెల్లఁ దను మాటికిని న్నుతియించునట్టులో
ప్పి తనరు "సైదుబంగ్గి" యను పేరునఁ జెన్నగు సత్రమున్ గృపా
న్వితుఁడు పరాత్పరుండు కరుణించుత సర్వవిధమ్ములన్ దగన్.

6. క॥ మొగముసెదుట స్తుతియించుట, తగునెల్లర, కిమ్మహాత్ముదళరయెట్టిదియో
సుగుణాఢ్యుఁడంచు దూరగు, లగుసుజనులు గూడనెంతు రదిమ్పృహయగునే

## శ్రీపోలవరపు జమీందారుగారు.

1. చ॥ వెనుకటిరాజు లిట్టులు నవీనకృతుల్ గొని పండితేంద్రులం
దనిపినసంగతుల్ తమకుఁదామె యెఱింగినమీకుఁ జెప్పవా
రనఁగలరే? పరిశ్రమ మెఱుంగుమిమున్ కృతినాథుఁ జేసి మే
మనవరతంబు వేఱొకరియాశ్రయణమ్మునఁ బొట్ట నింతుమే!

2. ఉ॥ భూములు గోరలేదు పరిపూర్ణధనమ్మును గోరలేదు మేల్
గ్రామము గోరలేదు తమ కారుణికత్వ మొకండెకోరి మే
మీమహనీయ మైనకృతి నిచ్చితి మిందలిలాభమున్ మమున్
బ్రామికొనంగఁ జేయఁదగుఁ బార్థివసత్తమ! దానవిత్తమా!

3. మ॥ కృతినాథుల్ కృతులంది యక్షతమునన్ గీర్తిన్ వహింపంగఁ ద
త్కృతికర్తల్ కృతినాథు లిచ్చుధనమున్ గీర్తిన్ మఱిందాన సం
గతమౌ లాభ మశేషముం గొనుటయే కాదా? తగున్ ధర్మ మో
మతిమచ్ఛేఖర! మీ రెఱుంగనివి ధర్మమ్ముల్ మహింగల్గునే!

4. క॥ పుస్తకము లమ్మికొనుట ప్రశస్తముగా దనెడివెఱ్ఱిసందేహపుఁ జా
దస్తమునమున్న మే మీ, పుస్తకవిక్రియపుఁ బనికిఁ బూనము నృపతీ!

5. క॥ ఎటు కేగిన నూటాఱులు, తటుకునఁదెచ్చికొనుమాకు ధనమియ్యది ము
న్నటిరోజులలో లెక్కగు, పుటకుఁ దటస్థింపదయ్యె భూమీశమణీ!

6. క॥ ఒకచోటనుండుకారణ, మకటా! మాయిరువురకును నాయీవృత్తుల్
సకలముచేయించెడి నేఁటికి సంసారంపుభరము దెప్పర మగుటన్.

7. క॥ వచ్చెడిజీతము పొట్టకు, వచ్చెడిమాయిరువురకును బైమును ఋణముల్
దెచ్చినవి కలవు మే మింక, నెచ్చటఁ దెచ్చెదము? వాని నీయఁగ ధనమున్.

8. క॥ కావున మీ కీవిషయం, బై వెఱవిద్దాని నొకటినగుపఱచి దయా
శ్రీ విభవ మెసఁగఁగఁ జూపం, గావలె నని వేఁడిలమి తగన్ మిము నృపతీ!

9. ఉ॥ ఇప్పటిసత్కవీశ్వరులకియ్యఁదరే యొకవృత్తి యయ్యె మే
మిప్పటికిందుఁ జొచ్చితి మి దేఁత్రినైనను సాగఁజేయ మీ
గొప్పదనంబుఁ దోడుపడఁ గోరితిమియ్యది మీకుఁ జెల్లదే?
అప్పతి కేమి లెక్క? యొకయంబుదమిచ్చెడి వర్షబిందువుల్.

1. సీ॥ ఆత్మకూరు నృపాలుఁ డవనియిచ్చెనుగాని యది దూరమగుట మేమరుగలేము
రైతు దుర్మార్గుఁడై రానీఁడు వాఁడేత్రువ వారిచ్చుభూమిపైఁ బైసయేని
తోఁటసర్వారాయఁ డేటికో "భూమియిచ్చెద"నని చెప్పి వంచించె మమ్ము
"నిది యిట్టులుండఁగా నింకేందు" కని తాటికొండ రామారెడ్డిఁ గోరలేదు

తే॥ గీ॥ తమరు భూమినొసంగుచేతలపర్తి, మమ్ముఁగవులఁజేసినట్టి యమ్మాలధాత
ననవలయుఁగానియెవరి నేమందుమయ్య? రామచంద్ర వేంకటకృష్ణరాయ చంద్ర

2. ఉ॥ కర్మముచాల కెయ్యదియొ కానుకగాఁ గృతివేళ నిచ్చి యా
మర్మమెఱుంగనట్టి మొగమాటపు టిక్కలమం చెఱింగి మా
శర్మముఁ జూడ కక్కృతులు సర్వము మీరలె విక్రయించుటే
ధర్మమె? యిట్టులేని గృతిదాతల కేమిఫలమ్ము? చెప్పఁడీ. ౨౯౬

3. శా॥ అచ్చొత్తించితి మందురేమొ యటులే యౌఁగాక యాసొమ్ము మీ
న్వెచ్చింగాదె? యిఁకేనిమా కొసఁగఁగా వచ్చున్ జమీందారు లీ
వెచ్చమ్ముల్ గణియింపఁగావలయునే? వేవేలకున్ మీరు భా
గ్యవైచిత్రిఁ గనంగావలెన్ మఱియు మేమో? చూచి మెచ్చన్వలెన్.

4. చ॥ ఒకకృతి నెవ్వఁడో నృపతి కొక్కనికిచ్చి మహాగ్రహారముల్
సుకరి రథాశ్వముల్ మొదలు మాఱులు గొన్న కవీంద్రు జా
తికెన్ని కృతుల నెంద ఱెందఱికి నేని యొసంగిన నేఁటికాలమం
దకట! యొకింత పొట్టకును నన్నము చాల దదేమిపాపమో! ౨౯౮

5. ఉ॥ ఇచ్చినదేమొ పుచ్చుకొని "యింతియ చా"లని సంతసించి పై
వచ్చుఁగదా? పరీక్షకది పాఠము పెట్టినయప్పు డంచు మే
మిచ్చఁ దలంపుచుంటి మది యిప్పటికబ్బ ననుగ్రహించి మా
కిచ్చుట న్యాయమా? యిడక యీఁగతి మిన్నకయుంట న్యాయమా?

6. ఉ॥ "అమ్మిననైకమంతయును నాపయి మీకె యొసంగువాఁగ నేఁ
మిమ్మెయిఁ గోరనేల?" యని యూరక యుత్తురొ? యేమి లాభ మీ
రెమ్మెలు సర్వమింగనిరొ యీకిరియ వ్రాయఁగ బుద్ధిపుట్టె లో
కమ్మిది వేలు నేఁడు కవిగాఁడగ దింతకు వేయు నేటికిన్. ౩౦౦

7. చ॥ తిరుపతిశాస్త్రి కిచ్చెడిభృతిన్ బునరార్జనసేయుటో ? కృతీ
శ్వరతకు నిచ్చు ద్రవ్య మది సంగ్రహణం బొనరించుకొంటో దే
వర యిటు లాచరించు టది భావ్య మటంచును నాకుఁ దోఁప దె
వ్వరును జమీనుదారు లిటువంటికృతుల్ గొనరందు నెన్నఁడున్. 301

## 4 వ సం॥ నూజివీడు శ్రీవానమామలస్వామి.

శ్లో॥ స్వామిం శ్రీశ్రీకరదర్శనం ప్రిభవతాం యుష్మాదృశాం మాదృశాం
సంతాపం హరతే దదాతి విజయం విద్యా వవద్యేతరాం
సంపత్తించ తనోతి కీర్తిం మతులాం కల్యాణ పారంపరీం
సర్వం సిధ్యతి యద్భవాన్ భగవత శ్రీశస్య రూపాంతరమ్ 302

శ్లో॥ తాదృశో భగవతోఽ వతోగురో, ర్దుర్లభం భవతి యత్నత స్స్వయం
దర్శనం తదిహ రామచంద్రితః, కేవలం సులభ మద్య సంభృతమ్ 303

శ్లో॥ దేవో భవాన్నరపతిర్భృదీవయభక్తోఽ, ప్యారాయభూపతిరథాఽపివయంకవీంద్రాః
అన్యోఽన్యగౌరవవశాద్భవసంతికాప్తి, ర్భక్త్యాశ్రయోదిశతి భావుకదేవతాప్తమ్

శ్లో॥ క్వతో తాద్రిఃక్వ వా యూయం, క్వవయం ధృతకోద్యతాః
పూర్వజన్మార్జితం పుణ్యం, కస్మైనామనకల్పతే 304

శ్లో॥ శ్రీరామానుజదేశికేంద్ర భవతా మేషా నతిః కేవలా
ద్వైతేనాఽపిమయా నిరంకహృదయే నానందతో దీయతే
యుష్మద్భక్తగణేషు యాదృశదయా తాదృగ్దయా మయ్యపి
స్వామిన్తుల్య చరాచరేణ భవతా కార్యా యతిశ్రీపతే 305

శ్లో॥ యతీనాం రాజాహి ప్రభవతి యతీ రాడితి మహాన్
కవీనాం సందేహో భవదుదయసందర్శనమితః
యతో వైరాగ్య సంపది భగవతా చాఽత్రిభవతా
సమం పారమ్యం సంభృత మనఘ రామానుజగురో 306

ఉ. ఇప్పటి కెంతలే వనిన నేఁబదిగ్రంథము లాంధ్రమందు సాం
పొప్పెడు సంస్కృతంబునను నున్నవి మాఁరయించినట్టి వో
యప్ప ! భవత్సమీపమున నన్నియును న్వినిపింపఁగా మదిం
గొప్పకుతూహలంబు పురి కొల్పెడు మీఁరలు విన్ను లోటచేన్. 307

మ. అవధానమ్ము లనేన్నియో సలిపి ధీయాయాస మట్లుండ భూ
ధవుఁడౌ జూడఁగ దేశము ల్దిరుగుటౌ దార్ఢ్యంబు దేహంబున
న్నిరువులం దగ్గెను దానఁజేసి యొకట న్నెమ్మెట్టులో యుండి యీ
వ్యవసాయంబె పరిత్యజించితిమి జియ్యా! అయ్యా! రామానుజా!

సీ. దర్శనంబునన యెంతటి మూర్ఖుఁడేని విద్యావంతుఁగాఁజేయుధన్యు లనియు
తప్పైన నొప్పగాఁ దగలగింపఁగఁజాలు నోర్పుకల్గిన మహాయోగ్యులనియు
ఇపుడెట్టులైనను నిద్దానిఁ బట్టి పూర్వపుశక్తి గుర్తించువార లనియు
రాజు లెందఱేఁ జూచి రాణించినను భవద్గౌరవంబున కీడు గా దటనియు

తే. గీ. రామచంద్రాప్పరాయ లూరకయ రఁడ
టంచు వారి సెడువారుగా రనియు వచ్చి
నార మిరువురమును మిమ్ము నారయుటకు
వానమామలజియ్యా? రామానుజయ్యా! 300

## శ్రీరామచంద్రాప్పారావుగారు.

మ. విపరీతంబులు చేయ నీయనిశుభావిర్భాతిచే శాంతిచేఁ
గృపచే సర్వమహీపతి ప్రిణుతశక్తిన్ బుత్రులుం బౌత్రులు
న్నిపు డైశ్వర్యముతో ముదం బొనఁగ నుర్వీనాథరత్నంబ! యె
ల్లపుడున్నిన్నల శోభనాచల నృసింహస్వామి పాలించుతన్. 301

మ. సరసాంతఃకరణుండు చారుకవితా స్వారస్యసంవేది యం
చురుకీర్తిం గనుచున్న మీసముఖ మేదో దైవలోపంబుచే
గొరయం బాలకపోతి నేఁటి కగి మత్పూర్వాతిరేకంబునం
జిరకాలంబున కిప్పు డీగము లభించెన్ రామచంద్రాధిపా. 302

గీ. పేటిరాజవయ్యు మిత్రిండ్వైతివి, నూత్పృహంబు సిరులఁదూఁగ కున్నె?
రాముఁ డంచు నిన్నుఁ రహీఁగొల్వఁ బండదే? కోర్కె రామచంద్రకువలయేశ. 303

క. మణిపూసలు సుతులు సతీ, మణి పూసలలోన దారమనఁ దగు రాజా
గ్రిణివి భవత్కథ సంప, చ్చ్ఛణ మప్పారాయ! రామచంద్ర కరుపా! 304

మ. అవనీపాలుర కొంద ఱేని గవిరా జాలంబకు ల్లేనిచో
వ్యవసాయం బొనరింపఁగా వలయునో? వాణిజ్యవృత్తంబునం

దవులంగా వలెనో? సదా పరిణతద్రాక్షాగుళుచ్ఛంపువా
చవులం దేలుచు సత్కవీశ్వరుల రాజా! రామచంద్రాధిపా. 3౧౫

ఉ. పాటిలు నేమొకో గుడిశవాటుతనం బని కొందు నాళ్ళలోఁ
జీటికిమాటికిం బిలువఁజేయుచు నాటపదాలు లిచ్చు మీ
బోఁటి ధరాపతు ల్గలిగపో యిఁక సత్కవితాపురంధ్రి కే
లోటులు లేవు మాతరములోపల నో పృథివీంద్రచంద్రమా. 3౧౬

సీ. చదివినారము శబ్దశాస్త్రంబు తుదముట్టఁ జిరకాల మొక్క దేశికునియొద్దఁ
దిరిగినారము తెన్గుదేశమెల్ల శతావధానప్రచార ప్రధానముగను
రచియించినా మురుగ్రంథమ్ములొక్కొక విశ్వరుండే రచియించినట్లు
పొరపొచ్చె మింతేని బొరలకుండఁగ నిల్పుకొన్నార మేము గైకొనినమైత్రి

తే.గీ. యొక్కరేచేసి రవధాన మొక్కమాజి, వీట ననుమాటయును దీటు నేఁటి తోడ
సరస? తిరుపతివేంకటేశ్వరకవీశ్వ, రాశ్రయణ గేయ! రామచంద్రాప్పరాయ!

చ. జగతిఁ బ్రసిద్ధుఁడై కడుయశంబువహించుకవీంద్రుఁ గాని నీ
వొగపడువానికెల్ల బహుళార్థములిచ్చుచు సత్కరింప విం
పుగఁ గవితా రసం బెఱిఁగి మోదముతో నిడురాజుఁ గాని మే
మొగపడువానికెల్ల నిటు లర్థులు గా మెపు డప్పరాడ్విభూ. 3౧౭

మ. కవు లెల్లం దల యూచి మెచ్చఁగలవా క్చాతుర్య మింపొందు మా
నవరత్నంబులు మీరు మెచ్చఁగల విజ్ఞానంబు లేకున్న మా
కవులే చేసిరటన్న యాశ్రితకటాక్షం బొప్పఁగా నైన మా
నవరత్నంబులు స్వీకరింపఁగదవన్నా? రామచంద్రాధిపా. 3౧౮

## 2 వ సం|| ఖాసింకోట.

1. క|| రామా! నీరేజదళ!, శ్యామా! సీతాభిరామ! జగదభిరామా!
కామాభిరామ! నత సు, త్రామా! రాక్షసవిరామ రవికులధామా! 3౨౦

2. సీ. శ్రీవర్ధమాన మాకెళ్ళాన్వయ క్షీరవారాశిపూర్ణ జైవాతృకుండు
భోజభూపతివంటి పోలుపుగాంచిన వేంకటాచలభూపాలు నాత్మభవుఁడు
నఖిలసస్యసమృద్ధమైన ఖాసింకోట రాజధానిగ నేలుబ్రాహ్మణుండు
మిశ్రభాష సర్వసమ్మతభాష విద్యావినోది యాశ్రితపాలనుండు ఘనుఁడు

తే॥ గీ॥ వేంకటాచలనామ కోర్వీధవుండు, చైత్రమాసాది నీకు వసంతపూజ
తొమ్మిదిదినంబులధిక సంతోషవిజయ, విభవములు పెంపుచెందఁగావింపఁజేసి

* * * * *

తే॥ గీ॥ పదియవదినంబునందు సంపదచెలంగ, వేదవేదాంగనిధులైనవిప్రవరుల
సమ్మతంబున నధికముదమ్ముగాఁగ, వఱలె బట్టాభిషేకోత్సవంబు నీకు

క॥ వనభోజనోత్సవంబుం, దనమిత్రులతోడఁ గలసి నాఁటినిశిం జే
సెను బహుళీత రానందంబున విభుఁ డానందబాగుపూవుం దోఁటన్ 323

తే॥ గీ॥ అధికముదమున నూటపదార్లు మొదలు, బహుమతులొసంగి గాయక వరుల సుకవి
వరుల నంపించె నెదరువాత వారువారు, జెలఁగిసంపత్కరముగ నాశీర్వదింప

చ॥ పది బది నాఁటిరాత్రి జన పాలుని కొల్వున మంచియద్భుతా
స్పదములఁ బెక్కుచిత్రములఁ బల్వురిడెందములంగరంబునన్
మృదుమధురోక్తులం దనిపె మేటియనం దగుబుద్ధిశక్తిచే
గుము రని మెచ్చుకోఁదగిన కొండలరావు బుధుల్ నుతింపఁగన్ 324

గీ॥ ఇంద్రజాలము వఱియు మహేంద్రజాల, కంబనుచుఁజూచితిమిపుస్తకంబులందు
వానిఁబ్రత్యక్ష మొనరించె వరుస నతఁడు, ధాత్రి చూపించెఁదిదప సెబాసనంగ

తే॥ గీ॥ తొమ్మిదిదినంబు లిట్లుసంతోష మెసఁగ, జెలువుమీఱఁగనిన్నుఁబూజించినట్టి
సరసు మార్లె వేంకటాచలనృపాలు, తనయు రక్షింపుమయ్య సీతాకళత్ర

తే॥ గీ॥ పుత్రపౌత్రాభివృద్ధి సంపూర్ణబుద్ధి, ఆయురారోగ్యములు సంపదాదికములు
నిచ్చి శ్రీరామచంద్ర! నీవెపుడుఁబ్రోవ, వలయు మార్లె వెంకటాచలనృపాలు

## సంస్కృతపు ఇనస్పెక్టరు, ఆర్. కృష్ణమాచార్యులుగారు

1. ఉ॥ వేదమువృద్ధిచెందుత, వివేకము హెచ్చుత, శాస్త్రమందు నా
మోదమువొల్చుతన్, సమసిపోవుత మూర్ఖత, నాఁడునాఁటికిన్
బాదఋ లాదిగాఁ గలుగు వర్ణములందును విద్య లొప్పుతన్
భేదములన్నిఁటన్ గలిగి పెంపఱ కుండుత దేశమాతయున్ 325

2. మ॥ వినుడీ! వైదికులార! మీ మనములన్ భీతుల్ దిగన్ ద్రావుడీ!
మనుఁడీ! మీ మతమర్మకర్మములతో, మర్యాద లీప్సెని పై

కొనుఁడీ! కృష్ణుఁడు దక్షిణాశ నడుగో గోగోపలోలాత్ముఁడై
జనియించెన్ మనకేమిలోప మిక ధర్మంబుల్ బిరాన్ బోవుఁడీ. ౩౩౦

3 ఆ॥ వె॥ శాస్త్రకర్మమునకుసాహాయ్య, మొసఁగెంచెనాంజనేయమూర్తియపుడు రామ
మూర్తి, కిపుడుకృష్ణమూర్తికి, నాకృతియందుఁ దోడుపడియెనతఁడు బళిర!

4. ఉ॥ కాలప్రబల్మిచే నిగమగాథలు పూజ్యము లయ్యెఁ బూజ్యమై
మూలనడంగె నాకలలు పూని పఠించిన వారిఁ బట్టి వా
సాలఁ గలట్టి నాగరికసంఘము గేలి యొనర్పఁజొచ్చె నీ
గాలియు వానయున్ బోలియుఁగాక భవత్కృపఁ గృష్ణసత్కవీ! ౩౩౧

5. క॥ కవివో? శాస్త్రివొ? రావువొ?, యవధానివొ? పంతులవొకొ? యాచార్యుడవో?
సవిశేషమ్ముగ నిన్నెటు, కవులు పిలువవలయుఁ? జెప్పఁగాఁదగుఁ గృష్ణా!

6. శా. స్వామీ! యేఁగనువాఁడ నీమహీయ దేశంబెల్ల నింగ్లీషు భా
షా మూలం బగునట్టిపట్టున పరీక్షావ్యాజమున్ బూని నీ
వీమాడ్కిన్ జగమెల్ల సంస్కృతకలాహేలాలవాలమ్ముగా
ధీమన్మాన్యముగా నొనర్చితివి కాదే! కృష్ణమార్యాగ్రణీ! ౩౩౪

7. సీ॥ వేదశాస్త్రముల కాదిమూలంబైన మంచివంశమున జన్మించినావు
జన్మానుసరణంబు జరవాఁటుకుండ నశేష శాస్త్రము లభ్యసించినావు
వేదశాస్త్రముల వెలత్తగ నిపుడని యింగ్లీషులోఁ బ్రవేశించినావు
ఉద్యోగ మది పూరుషోచితమని పరీక్షాధికారమున జాయనయినావు,

తే॥ గీ॥ కవితపూర్వపుణ్యమునన కలిగె వేంక, టప్పలాచార్యశాస్త్రితోడయ్యెనుపరి
స్వామి! నీభాగ్యవేమని సన్నుతింతు, ఆర్యనుతచర్య శ్రీకృష్ణమార్యవర్య!

8. చ॥ మునుపు గుచేలుఁడున్నతిని బొందఁదలంచి యనంతగంబు కృ
ష్ణుని గననెంచి యటుకులను సూడెద గైకొనురీతి నేను మి
మ్మనుని యున్నతిన్ గనెడిబుద్ధిని గానుకగాఁగఁ బద్యముల్
పనిగొని కొన్ని చెప్పితిని బండిత కృష్ణకవీంద్ర! నీపయిన్. ౩౩౬

## పైవారి సంస్కృతోపన్యాసమునకు నాశువుగా తెలిఁగించినది.

1. తే॥గీ॥ భాషలెన్నేనిగలవహో! భాషలందు, సంస్కృతంబుత్తమంబు తత్సరణిఁబోల
నితరభాషల కించుకయేనిగాదు, దాని కెన్నియొ హేతువుల్ తనరుఁజుండి.

2. క॥ అందు మొదటిహేతువు మీ, కందఱికివి సుగమమే మహాశయులారా!
విందుమె! సంస్కృతమనుపే, రందఱనెడి భాషనొకటిఁ బ్రబలినదానిన్.

3. గీ॥ "క్రొత్తక్రొత్తరూపమ్ములు క్రొత్తక్రొత్త, రచనలును దేవభాషలోఁ గాంచుపగిది
నన్యభాషలలోలే" వటంచు కృష్ణమార్యుఁ డేది సెప్పెనదియ సత్యంబు సుండి.

4. తే॥గీ॥ మనకు నన్నివిషయముల జననియైన, వేదమీభాషలోననే వెలయుచుండ
నెవ్వరెఱుఁగని? దిటువంటిదెందు లేదు, భాష ప్రాశస్త్యమునను బావనతయందు.

5. క॥ పావనత నట్టులుంచుండు, జీవముగల భాషయైన శ్రీ సంస్కృతమే
యీవిధి శ్రవణాశ్రితిమ, జీవియు భాషలు పొసగ్వ విదినిమ్కు వమ్రా.

6. తే॥గీ॥ ఇందులకనేకములు స్వామి యిచ్చినారు, తగినదృష్టాంతముల, నిదితగ వినుండు
పొట్టకన్నములేని యీపట్టునందు, దీనిఁ బఠియింతుఱిఁకను, లదిదీనిమహిమ.

7. తే॥గీ॥ విత్తకరిగానివిద్యను వెఱ్ఱియైన, సంగ్రహింపఁడు గద! నేఁడు సంస్కృతమును
జదువ నేఁటికిఁ? జదివెంబో? చదువనేమి, లాభమున్నది? యెందుకీలోభమిపుడు?

8. గీ॥ దీనిమాధుర్యమునకు సమానమైన, గానము మఱియెందునేనియుఁ గనమియె సుండి
కానిపో హూణమయమైన కాలమందు, నెందు కిచ్చటఁ గృషి సేతు రెల్లవారు?

9. క॥ అన్నమ్ము పెట్టునని యో, మన్నన కలిగించునని యొ మఱియుఁ దనుక్ సం
పన్నిఁ జేయునని యొ యే, మున్నది? యుద్దాన సుగుణమొక రసము మీనా.

10. తే॥గీ॥ మాక్సుమూలరు మొదలగు మాన్యవరులు, లితరదేశపువారయ్యు నిందుఁగల్గు
నుత్తమాధుర్యమునకుఁ దామోడి కాదె!, బట్టు లైరెన్నఁదగినట్టి భట్టులయ్యు.

11. సీ॥ ఎందుకై పుట్టుటో యెందుకే గుటయొ? నాశంకనడంచు నొక్క సంస్కృతంబె
సుకృతదుష్కృతము లవెట్టులుండునొకో! నాశంక నడంచు నొక్క సంస్కృతంబె
జీవుఁడెవ్వండొకో? దేవుఁడెవ్వండొకో! నాశంక నడంచు నొక్క సంస్కృతంబె
న్యాయమెయ్యదియొ? యన్యాయమెయ్యదియొ? నాశంక నడంచు నొక్క సంస్కృతంబె
తే॥గీ॥ ఇంతయెందుకు సామాన్యమెల్లఁ గనుము, గలుగు మోగమును నెరడింపఁ గలిగినట్టి
దొక్క సంస్కృతభాషయే యొండుభాష, లిన్ని యోగ్యతలున్నవి సున్న సున్న.

12. తే॥గీ॥ ఇట్టిసంస్కృతభాషచే నిహముఁబరము, గన్నవారలనేకులు గలరు గాని
నట్టులుంచుఁడు దీనికిఁ బుత్రి యైన తెలుఁగుబాసయు నెంతయగ్న్యమహహా!

13. ఉ॥ నన్నయతిక్కనాదులు సనాతనులున్ దదనంతరంబు పె
ద్దన్నయు ముక్కుతిమ్మనయు నాపయిఁ గొందఱుఁ గన్నమాన్యతల్
విన్నవి కావె! మీరలు, స్వవేషము భాషయు నేరికేనియున్
మన్నన దెచ్చునంచెఱిఁగి మానకుఁడాంధ్రమునందు భక్తియున్. 3౪౯

14. గీ॥ ఆంధ్రదేశీయులార! మీరందఱొక్క, ప్రార్థనను గైకొనుఁడు దేవభాషయందు
కొంచెమేని పరిశ్రమకొనవలెఁ జుఁడీ, దాన సులభంబుగా మీకుఁ దనరుఁ దెల్వి.

15. ఆ॥వె॥ ఆదిభాషయందు నంతో యింతో ప్రవేశ మబ్బకున్న వారి కందఱికిని
వందనములొనర్తు నెందుకంచుర యేని, తెలుఁగునందు మీరు దిగకుఁడనుచు

14. గీ॥ తెలుఁగు తెలుఁగని యుద్ధానదిగు పెకాని, సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్మెహెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ జాలు, దాని, కిద్దానికో! రెంటఁ దగులవలయు.

క॥ ఓ సంస్కృతమా! నీకిఁక, శ్రీసన్నిధి కేగుదెంచెఁ జింతింపకుమీ
నీసఖుఁడు కృష్ణమూర్త్యుఁడు, వ్యాసుండై యవతరించె వర్థిల్లుమిఁకన్. 3౫3

## బందరు - జంధ్యాల గౌరీనాథశాస్త్రులుగారు.

1. శ్లో॥ భవదాదరకారణాదహం, నహి కించిత్ప్రథయామి దీనతాం
నహి పృచ్ఛతి పుత్రికే ప్రసూః, రపి నో యచ్ఛతి కిం బతాఽపరే. 3౫౪

2. శ్లో॥ సదృశేషు భవద్భిరాదృతా, కరుణా సాఽపి మయి ప్రవర్తతామ్
సమయోఽయమితి బ్రవీమి భోః, స్వకలం వో విదితం కలావతామ్. 3౫౫

3. శ్లో॥ భృతకం తుమమాఽప్యతోఽధికం, వితరంతీతి బృహత్పురాత్పురా.
అపి పీఠపురాత్సమాగతం, సముపత్రింత దుపేక్షితం మయా. 3౫౬

4. శ్లో॥ క్రియతేయదివా శ్వవృత్తిరేషా, ననునాఽస్యత్రిపరం త్వహైవ నూనం
ఇతినిశ్చితవర్తనస్య బాఢం, గతి రస్యత్రి కదాఽపిమే న భూయాత్.

5. శ్లో॥ నాఽహం మర్త్యోపవాయూాయం, మయ్యనుగ్రహశాలినః
నమచ్ఛిష్యాః కృతార్థావా, న మేకిం భృతకోచ్ఛ్రియః 3౫౭

6. శ్లో॥ నహి ద్రవిణమస్తి కిం క్రియత ఇత్యపి ప్రోచ్యతే
తథాస్తు సహి తత్రిమే కిమపి వస్తు మిచ్ఛాపరం
మత స్స్వసదృశేషు తన్నహి పరం మమైవైత ది
త్యతీవ హృదయే భవత్యసుఘ సంశయ స్సన్మణే! 3౫౮

7. శ్లో॥ పురా కాలే యావద్భృతక మిహ కాలేఽపిచ తథా,
యదిస్యాత్తావన్మేఽస్మిన్ కథ ముదరపూర్తిర్గృహిమణే
కలావిక్రేతృత్వేఽ ప్యధిగతసంసారభరణః
కవిత్వగ్రంథానామపి వినియయస్యాఽ స్పదమహం. ౩౬౦

8. శ్లో॥ క్లిష్టో మే సంసారో, గృహస్య నైవాఽస్తి దేయతా కించిత్
తదపిన పర్యాప్తమిదం, భృతకమితి తదేత దీశ్వరో వేత్తి. ౩౬౧

9. శ్లో॥ గైర్వాణ్యాం అపిచాంధ్రి పాఠనవిధౌ విద్యార్థి బాహుళ్యతః
కష్టంస్పష్ట మతస్తతోఽధికతరం మే జాయతాం జీవితం
దృష్టాంతోఽత్రిపురి స్థితా ముకురవత్కాలేజి రేవాఽస్తి భో
గౌరీనాథకలానిధే కిమపరం వాచ్యంభవాదృగ్విదాం. ౩౬౨

10. శ్లో॥ ఇదమేవ భవే ద్భవద్విశా,త్సకలానామపి తత్సభాసదాం
ఇతినిశ్చయత స్సదర్పితం,తదిదం మాఽస్తువృథాకథాస్పదం. ౩౬౩

11. శ్లో॥ అన్యేషా మభివృద్ధితో నసహతే, సోఽయం, దురూహః పుమా
నిత్యేవంకతిచి ద్వదంతు మమ తేనైవాఽఽశయజ్ఞానినః
తద్వృద్ధి ర్మమ వృద్ధిరేవహి తత స్తన్మే పరంసమ్మతం
పూర్వాంగం త్వనవాప్యవృద్ధి మయతే నైవోత్తరాంగం క్వచిత్. ౩౬౪

## బందరు, కృత్తివెన్ను జమీందారుగారు.

12. ఉ. గాయకుడౌనుగాక మతిగాయనియే యగుఁగాక పేర్మిమై
నీయెడకేగుదేర నొగినెవ్వఁడు దా సభఁజేసి తృప్తులం
జేయునో యట్టియీతని నశేషసుఖంబిడి ప్రోచు గాయనీ
గాయనగేయుఁడాహరి దయన్ బుచివెంకటరెడ్డినాయనిన్. ౩౬౫

## బందరు శ్రీదొడ్డంపేట వాడరేవు రంగనాయకమ్మగారి దత్తపుత్రుని వివాహము.

1. మ. అమరుంగుంబ్రియసి మున్నుగా లలితనానావిభ్రమంబందఁ దా
నును వమ్రిపము మీఱు రూపమును బూనున్ బుద్ధి బాముల్ మొదల్
తనసర్వంబు పరిత్యజించి సతిచిత్తం గొల్కు కామేశ్వరుం
డనుదేవుం డిడుఁగాక భద్రములు రమ్యంబైన యీజంటకున్. ౩౬౬

2. సీ. ఎవ్వానితండ్రి తానవ్వారిగాఁ గలసారస్య మెఱిఁగినధీరవరుఁడు
ఎవ్వానితల్లి లోకైకప్రసిద్ధంబు లగుసద్గుణంబుల కాకరంబు

ఎవ్వానిమాతామహి యగుపెంపుడుఁదల్లి రంగాంబ త్రిభువనారాధ్యచరిత
ఎవనిభావుకుఁడు భూపవరుఁడయ్యును గవిత్వముగూడ రచియించు ధన్యతముఁడు

3. తే. గీ. ఎవనిభార్య నియోగులందెల్లఁ బెద్ద, పేరుగల వడ్లమన్నాటివారిపడుచు
అతఁడు శ్రీవిశ్వసుందరుఁ డనుగతార్థ నామకుఁడు వర్ధిలుత, జమీందారుఁడగుచు

చంపకమాలిక.

4, జనకుఁ డనన్ గవీశ్వరుఁడు శాశ్వతకీర్తి నమల్లి తల్లి పెం
చినయలరంగనాయకమఁ జెప్పిననోట మఱొక్కరిన్ వచిం
ప నగుదు రెల్లవారుఁ "గవిపండితసంఘ"మటంచుఁ బెట్టె నూ
తనమగుత్రోవఁ జూపినయుదారుఁడు బావ భుజంగరావు గా
యనజనగాయనీజనసమాదృతిచే నభిధానుకూల్యముం
గనుటయ కాక భూభరణకార్యమునందును నట్టివాఁడె వీ
రిని నిటులుంచి యీవయిపురీతి గణింతము నీదుభాగ్యపు
ట్టినయలచోటు వైదికపురీవి నియోగపుఁ డెక్కుఁ గూడఁ గ
ల్గినయది సర్వమున్ సుపథలీల ఘటిల్లుటచేతనే జయం
బునకు నివాసమయ్యె నిది భూసురరాజ? యిఁకొక్కమాట యెం
దునకును గానికట్టుఁబడితో త్రివలం లేనికతానఁ గాదె! గా
యనజనగాయనీజనులు హాయిగఁ బాడుట దీనఁగల్గె నే
మనఁదగు శంభుఁడే యిటుకు నాగతుఁడైనను నాటిరీతి హా
యిని గలిగింప నేర్చునె? యటేనియుఁ "బూరుషగాన మంగనా
జనములసంస్కృతం" బనెడి సామెతకున్ గతియేమి? పెండ్లినే
రొనరుచుకోఁగ నిచ్చఁగలయోగ్యుల కియ్యది మార్గదర్శిగాఁ
గనుపడుచున్న దట్లు తగుగాయకులున్ గవులున్ ప్రసిద్ధగా
యనులును గల్గుమేటిసభ లౌరసి యారసి నేఁడు కూపకూ
ర్మనియతినున్న నా కిపుడు మానస మించుక సంతసించె నే
మన? గదవాలరా జిటు సమాదరణం బొనరించి గాయనీ
జనకవిగాయకాదులకు సంతతముం బ్రతివత్సరంబు మ
న్ననల నొసర్చు నియ్యెడఁ గనంబడ విట్టిపనుల్, భవచ్ఛుభం
బున నిది మొల్కయెత్తె నిఁకముందును నీవిని భార్యతోడిదే
యని మది నెంచి కాఁదగినయట్టిప్రభుండవుగాన సాహితీ

వనితను గీతితోఁ గలిపి భవ్యగతిన్ గనఁజేయుమన్ జమీన్
దనరెడితక్కుగేస్తులకు దారిని జూపఁగదయ్య! "బావ నీ
కును మఱి నీవు తక్కొరులకున్ గురువై" రని ముందువారు దీ
నిని గడుమెచ్చికొందురు జనించినకస్తురి వంశ మిక్కుతం
బునను బరీమళించి కడుఁ బొంపిరివోవుచు "నోడరేవు" తో
వను జగమెల్ల మొల్లపుసువాసన నిండఁగఁజేయు నిక్కుతం
బున నభివృద్ధి నందెదవు పూర్వపురాజులఁబోలి నీవు, శో
భనముగ విశ్వసుందరనృపా ? ధర యేలెద వార్య లౌనసన్. ౩౨౪

క. మొదలన్ గస్తూరీసం, పద గల్గినయింటఁ బుట్టుబడసిన నిన్నా
య్యది వీడునె ? నీవద్దా,ని దిగన్ దాగివినను సహజనిత్వముకలిమిన్, ౩౨౫

## బందరు-"క్రికెట్టు మాచ్చి"

1. ఉ॥ శ్రీకరమై "బ్రిటిష్" ప్రభుత చెన్నలరారుత దేని కారణం
బై కడు విజ్ఞతాగతి ధనాఢ్యులు తోఁడులుఁ గూడఁ గాంచి యు
ద్రేకపుఁ గృత్యముల్ విడిచి తిన్నని త్రోవ మెలంగఁ జొచ్చి ర
స్తోకయశస్కులై; బుధులు తోరము గాఁ దము మెచ్చునట్లుగన్. ౩౨౬

2. శా॥ "తేనాంపేటను" నిల్పి రాఢ్యులకు వృద్ధిన్ గోరి కాలేజి, య
న్యూనం బయ్యది యొప్పునెల్లయెడలన్ "న్యూయింగ్ట" నాఖ్యాకమై
దానంబొల్చు "సి, మారిసన్" దొరనితాంతఖ్యాతిమై ప్రిన్సిపల్
గా నాతండు వివేకులన్ సలిపి మేల్గా మన్చె భూపావళిన్. ౩౨౭

3. తే॥గీ॥ అతనితరువాతి 'ప్రినిసిప'ల్లధికయోగ్యుఁ,డితఁడు 'బ్లం'టనుదొగవయసెంతొ లేదు
పాండితీగరిమంబొ? యఖండ మితని,కతన మైనర్లు మిక్కిలిగనిరి తెలివి. ౩౨౮

4. సీ. ప్యాసయ్యె 'బి, యే, సెబాసనఁగఁ 'గుమారమంగళాఖ్యాకుండు మైనరొకఁడు,
అక్లై యుత్తీర్ణుఁడై యలరె "యఫ్, యే" యందు మఱియుఁ గవిలుపర మైనరొకఁడు
శివగిరి మైనరు చెన్నొందెఁ బశువైద్యశాస్త్రనామకపరీక్షాప్రసక్తి
పొలుపొందెఁ బీఠికాపురపు మైనరు మెట్రిక్కును పరీక్షను దాఁ గృతార్థుఁడగుచు
గీ. మఱియు నీతఁడు భాషాభిమానియై వి,శేషధనదాత యగుచు మనీషిహితము
గాఁ బ్రవర్తించు వాఁడయ్యె ఘనతయిట్టి, దెల్ల బ్రిటిషు ప్రభుత్వమేయిచ్చె నిజము.

చ. వెలమజమీనులం దితఁడె విన్నను వొందెను హూణవిద్యనం
చెలమిని గాంచుచుండఁగ నహీనబలాఢ్యుఁడు సత్కులీనుఁ డు

జ్జ్వలుఁ డలతేలపోలిల్ విభుఁ డసాధ్యుఁడు పీఠపురీశుఁ డెట్లొ య
ట్టులె యదియే పరీక్షను గడుంగడుఁ దేలి ముదంబొనర్చెడున్. ౩౮౦

6. క. ఘోషాయాస్పత్రి యొకం, డీపత్కాలంబు కట్టఁదనే యీతఁడు ని
శ్శేషబుధులు మెచ్చుచు సం, తోషింపఁగఁ గట్టఁ జేసె నుజివీటిపురిన్. ౩౮౧

7. ఉ. వీరలఁగాంచి రే మిగుల వేడుకఁ జెందుచు నుండునంత ను
య్యూరిజమీనుదారుఁడు మహోన్నతుఁ డొక్కటఁ “బ్యాసుచేసెఁ” దా
నాఅవ “షార” మీసుకృతి యంతియుకాక తెలుంగునందు వి
స్తారపుఁ జేర్మిగల్గి యటఁ దజ్జత కొండొక సంగ్రహించెడిన్ ౩౮౨

8. శా. ధీరత్వమ్మును జేర్మి పెంపుఁ గడు వర్ధిష్ణుత్వముం గల్గువ
ప్పారాయాన్వయభూషణుం డితఁడు సంపత్కాముఁడై రంగయ
ప్పారావున్ దనతండ్రి నెల్లగతులన్ బ్రఖ్యాతిలో మించి చె
న్నారుంగా వుత మేటిసత్కృతుల కాహ్లాదంబు సధింపుచున్. ౩౮౩

9. సీ. రంగయప్పారాయరాజేంద్రుఁ డీతని దత్తుఁగాఁగైకొన్న తాతగారు
రహినొప్పు వెంకటరంగయప్పారావు కడుపార నీతనిఁ గన్నతండ్రి
ఆయనరాణి యీయనఁగన్నతల్లి తా జనియించె వెల్లంకిసత్కులమున
కన్నతల్లియుఁ దండ్రి కొన్నతండ్రియుఁను వీఁపరికింప మిగుల విద్వత్కృటు బ.

తే. గీ. ఘనత లవారలంట? యెటులగలుగ దితని, కఖిలవిన్యాసవృద్ధి యటంచు వీరి
వంశచరితంబు నెఱిఁగినవారు వొగడ, మాటికి నెసంగు నుయ్యూరి మైనరెపుడు.

తే. గీ. మఱియు నుయ్యూరిమైనరు మనుచతల్లి, బంధుజ కల్పవల్లి ప్రబల కృపార్ద్ర
హృదయమే యీతనికి సదా యెల్లసుఖము, లొసఁగు వేఱొక్కదేవర లొసఁగనేల?

తే. పరమయోగ్యుఁడు బాలికాపాఠశాల, లాదిగాఁగల సుకృతకార్యములొనర్చె
నేనృపతి భావ్యకారు లాయీనృపాల, సుతుఁడు వల్లూరిమైనరు సొంపుని ఫు.

తే. గీ. ఇతఁడు తన తండ్రివలెఁ జాలవితరణగుణ, శాలియై శీలియై నృపపాళి, “యఙా, సె
బాసనఁ బరీక్షలందుఁదాఁ బ్యాసుగాంచి” వృద్ధి గలయత నానాఁట విధునిపోల్కె.

ఆ. వె. మఱియు నందిగామ మైనరు నేఁటీవ, త్సరము ప్యాసుసేయఁజను మెట్రిక్యు
లేషననుచుఁ దోఁచె లేఁతయయ్యు నితఁడు బుద్ధి నెంతయేని పెద్ద నిజము.

తే. గీ॥ ‘జగడ’ మైనరు కడుబుద్ధిశాలి యితని, కతన నూ్యయింగ్టు నధిక విఖ్యాతిగాంచు
ననుచుఁ జెప్పుట కావంతయైన సందియమ్ము లే దీతఁ డిట్టిఁడయగు ధ్రువంబు.

15. సీ. ఘనపండితుండు వెంకటరామసూర్యప్రకాశరావును గుణరాశి, జ్యోతి
షమున విద్వాంసుఁడై జగతిఁ బర్గిన సూర్యరావు నెవ్వానికి రమణఁ దాత

లతఁడు శ్రీతిరువూరి కధిపతియగు మైన రెలమిఁ దాతలయంత రొటుకగలిగి,
వర్ధిల్లఁగావుత భగవంతుని యనుగ్రహంబు భృశం బవలంబనముగ ౩౯౧

**తే. గీ.** మఱియు మీర్జాపురంబేలు మైనరులును, దండ్రి రాజబాబయ్య కుదారయశము
గలుగునట్లు వర్ధిల్లుదుర్గాత మిల్లె, యెల్ల మైనరు లెసఁగుత మెసక మెసఁగ ౩౯౨

**16. సీ.** బందరు "కాలేజి" ప్రిన్సిపల్ సుశ్లాఘ్యతరవర్తనుఁడు పెన్ను దొరయొకండు,
కృష్ణాకలెక్టరై కీర్తిఁజెన్నారు నిస్తులుఁడు శ్రీబ్రైడువుడ్ దొరయొకండు
బందరు కోర్టులోఁ బ్రాడ్వివాకుఁడు సుమచిరకీర్తికోల్ రెడ్డి దొరయొకండు
మఱియుఁ దక్కుంగలసుహితు లాంగ్లేయులు నాంధ్రులు యోగ్యతాఖ్యాతయశులు

**తే. గీ.** చూచియానందమందెడిసొంపుమిగుల,నిట 'క్రికెట్ మేచి' యనునాటనిందఱనుజ
మీనువారులాడిరి బహుమానితముగ, నుదిఁ బరస్పరజయకాంక్ష లదనములుగ.

**17. మ.** తిరువూర్మైనరు తక్కుమైనరులరీతిన్ 'కోర్టుఆఫ్‌వార్డ్సు'తో
మఱి సంబంధము లేకయుండినను సంబంధమ్ము గల్గించెఁ దం
డ్రిగసజ్జత్వమె; దీనిఁబట్టియె కడున్ విద్యాభిమానంబు పెం
పెటుఁగ న్నేర్చుఁ దిరూరిఱేఁడని జనంబెంతే వినోదించెడిన్. ౩౯౪

**18 సీ.** ఎవ్వానికొమరుఁడు నెవనిమేనల్లుండు సీ, మారిసన్ గారిశిష్యమణులు
బందరుకాలేజి ప్రిన్సిపల్ పెన్, దొరగారిశిష్యులలో నొకం డెవండు
ఈ మైనరులయంద యెసఁగెడు తిరువూరిమైనరు ఱేఁడు కుమారుఁ డెవని
కెవఁ డింద ఱియ్యెడ కేతెంచుటకు నిట్టికారణ మొక్కఁడు గల్గఁజేసె

**తే. గీ.** నతఁడు తనరారుఁగాత శ్రీయుతుఁడు సుప్రసిద్ధ వెల్లంకివంశాబ్ధి శీతకరుఁడు
గను శాఁ జిన్నవెంకటరామరావు దైవకృపకుఁ బాత్రుఁడునై కృతకృత్యుఁడగుచు.

**తే. గీ.** లీల 'నూయింగ్టు' ననెడి కాలేజిలోనఁ, దమకులమువారు ప్యాసయి తనరినట్లె
? రి పమిర్జాపురంపు మైనరులును దిరువూరిమైనరు నభివృద్ధి నొలిఁగాంతురు. ౩౯౪

## శ్రీరాజారామ చంద్రాప్పారావుగారి నిర్యాణము.

### నూ జి వీ డు.

**1. చ.** కలి నొకవైదు వేలపది గాఁదగుశాలిశకంబు చంద్రదృ
క్కులభధగల్ ప్రసంగఁగ జగద్ధితుఁ డప్పయరావు రామచం
ద్రలలితనాముఁ డేగె సురనాథునిఁ జూడఁగ సౌమ్యవత్సరం
బలవడఁ బూర్ణిమన్ నలువదాఱవయేటను మాధవమ్మునన్. ౩౯౬

**2. శా.** ఓసౌమ్యాబ్దమ? యెంత జేసితివి నీ వోహో? దయాశాలి వి
ద్యాసంపన్నుఁడు రామచంద్రవిభుఁ డత్యానంది. యాధీరు స్వ

ర్వాసింజేసిననీదుసామ్యతకు నేవా రొప్పువారింక, నీ
కేసంతోషము గల్గె! నిక్కఁతన నోసీ! గోముఖవ్యాఘ్రమా ! ౩౯౮

3. ఉ. రాజులు లేరె? లోకమున రాజులుగాఁగల రేమిలాభ? మీ
తేజము రంజకత్వమును దేఁకువ లోకువగానిళక్తియుఁ
భోజునివంటి పాండితియుఁ బొల్చెడివాఁ డెవఁడో వచింపు మిం
కీజనపాలురందు ధరణీశశిఖామణి? యప్పరాడ్విభూ. ౩౯౯

సీ. తల్పు గొట్టినయంత దాన మిచ్చెడి తేండ్లు గలరె? యీనాఁటి లోకమున నెందు
తా జ్వరమ్మున మున్నుకరి వార్షిక మ్మిచ్చు మేటివదాన్య లీనాఁటఁ గలరె?
పన్నుగా వార్షికం బెన్ని యర్పించుభూనాథుండుఁ గూడ నున్నాఁడె యిపుడు
"వారఁటు" గైకొని వచ్చువానికిఁ బోలెఁ గవి కిచ్చుదాత లిక్కలిఁ గలారె?

తే. గీ. వచ్చారె? నీకుఁ జెల్లె నీవార్షిక ప్రదానచాతురి యిందుల కేనె సాక్షి
యెంతకవియైన నగునుగా కెవరు నూతు,రయ్య? యీనాఁడు రామచంద్రాప్పరాయ!

5 శా. దాతల్ లేరనికాదు వారిదరికిన్ ధైర్యమ్మునన్ బోదుమో?
యేతేరన్ మతివారు బందుగులుగా నీమమ్ముఁ బ్రేమింతురో?
యీతీ రెక్కడనుండఁబోవ దకటా? యే మెందఱిన్ జూడ మో
దాత్మశ్వంబ? యనాథవైతిరె? తథ్యం బప్పరా వేగుటన్. ౪౦౧

6. మ. ఘనవ ళమ్మునఁ బుట్టినాఁడ ననుచున్ గర్వంబు గైకోవు వి
ద్యను సంపూర్తిగ నేర్చియున్ వినయమున్ దైవారఁ గైకొంటి వో
యనఘా? యెల్లర కీవు నచ్చెదవు నీకా? యెల్లయం దెవ్వఁడో
మన మెక్కన్ విను మప్పరాయ? యిదెసుమ్మా? నీకు దోసంబనన్. ౪౦౨

7. మ. అవివేకుల్ గడు దుర్మదాంధులును మర్యాదావిహీనుల్ నృపుల్
కవినింద్యుల్ ధ్రువ మంచు నీ వెఱుఁగు టకాదంబరీకావ్యమం
దు విశేషమ్మగ రాజనీతికడఁ బంక్తుల్ నీవు గుర్తుంచిన
ట్టివి వేవేళ్ళ వచించు నారస్మృపుట్టి? రామచంద్రాధిపా. ౪౦౩

8. ఉ. నీవును మంత్రియున్ మఱియు నేనును "సారటుపై" "షికారుగాఁ"
బోవునెడన్ శరోగ్రితముల్ వసనమ్ములు కొమ్మరాపిడిన్
ద్రోవఁబడంగ నీవచని తోకొనివచ్చి యొసంగిఁట్టి నీ
యావిఁయంబు రాజకుల మం దెటఁ గన్పడె నప్పరాడ్విభూ. ౪౦౪

9. సీ. వినయంపుఁగనివి వివేకివి రాజకార్యధురంధరుఁడవు గర్వంపుఁ దెలవు
నెఱుఁగనివాఁడవు పరుసవదనంబు నీ పేర్విన్నమాత్రనఁ బెటిలిపోవు

విద్వాంసుఁడవు లోకవిదితచరిత్రుఁడ వనుకంప కీవ ముఖ్యమగుతావు
సత్కళత్రుండవు సంతానశాలివి భోగివి మిగులవిరాగివి రఘు. ౮౦౫

తే. గీ. రామభక్తుండ వతులపరాక్రమైక, శోభితుఁడ వుత్తముఁడవు యశోమయుఁడవు
వట్టినుతికాదు మీగురువరుఁడు వాన,మామలస్వామి యిట సాక్షి మానవేంద్ర!

10. ఉ. ఇప్పుడుచెప్పితిన్ భవదహీనగుణమ్ములు కొన్నికొన్ని, మా
యప్పనరేంద్ర? నీసముఖమందు వచింపఁగనేరనైతి నీ
వొప్పవటంచెఱుంగుదును, నున్నది యున్నటులేని జెప్పినన్
గొప్పకు నుండ్రుగాక నృపకోటులు నీ కెనవత్తురే విభూ. ౮౦౬

11. చ. ఎనిమిదియేఁడులాయె నిను నేఁ గని నాఁటనుగోలె నీధనం
బును దినుచుంటి నంచు నుతిపూనికఁ జేసితినంచు లోకులా
డను మఱి సాహసింతురను "డా"టాకకొంతయు నాకు లేదు నీ
గొనము లెఱుంగనట్టి మొరకుల్ సరకుంగొనకున్న లెక్కయే. ౮౦౭

## అంతఃపురపరామర్శ.

చంపకమాలిక.

పతి గతియించెఁగాయని యపారపుదుఃఖము నందుచున్న మీ
మతి కవ రేమిచెప్పిన సమాశ్వసనం బది గల్గఁబోదు దు
స్థితు లిటువంటి వెంతయు సతీతిలకమ్ముల మిమ్ముబోంట్ల నా
ర్తిఁ గనఁజేయుఁ టబ్బురమె! ధారుణి నెందఱో భర్త లుండియున్
గతిచెడి మాకవిత్వసతి గాటపు దుఃఖము రామచంద్రస
త్కృతిపతి లేమిఁ గాంచి కడుదీనతఁ గుందుచున్న దెందఱో
పతులు గలట్టియీపురి భవత్పతి స్వర్గతిఁ జెంద మేటిదు
ర్గతి తన కబ్బెఁగా? యనుచు గద్గదికన్ బ్రజయం దనా
రతస్థితి వెలిఁబుచ్చుచున్న, దెటుచేకులు నింతటితెల్వితేటలన్
ధృతియుఁ బ్రజానురాగమును దేజముఁ గొంకొకయింతలేనిపాం
డితియును మంచియోరుపును నేరుపు గల్గినరాజు దీనికిన్
హితగ నుతింత్రు కొందఱు వివేకులు నేనెపు డట్టివట్టిప
ద్ధతి గనినంచు నీపతి యథార్థముగా నెఱుఁగున్, భవన్మనం
బు తగ నెఱుంగు నన్ను, మిముబోంట్లకు దుఃఖము గూర్చుధాతదు
ర్మతి కిఁక నేమిసేతుఁ, బలుమాటలు నేమిటికొక్కమాట, మీ
పతి కొకమీఱెకాదుగుఁడి! పండితులున్ గవులున్ గుణానుర

క్తత గలయెల్లవారు సతతమ్మును గుందినఁ దృప్తి గల్గునే?
నలియనుకోకు మమ్మరో! యనుంగుఁగవిత్వముపాలిభాగ్యముల్
మృతిఁ గనెఁగాని నీపతి నమేయయశోమయకాయుఁ డెన్నఁడున్
మృతిఁగనఁబోఁడు నిక్క మిది మిక్కిలి నమ్మఁగదమ్మ! దాతృతా
సతియుఁ గృపాలతాఁగయును సంస్కృతభారతభారతీమహో
న్నతియును నీవునుంబలె ననాథతఁ గుందుచున్నవారు నీ
పతియెడ నీవునుంబలెనె వారుఁ బతివ్రత, లట్టివారిఁబ
ల్వెత లుడుపం దమ్మ? సువివేకినివీవె మనంబులో నిటుల్
ధృతిచెడి కుందుచున్న నిఁక ధీరతకున్ గతియేమి? యింతకున్
సతమె శరీరముల్? వినుము సజ్జనమాన్యుఁడు నీదుభర్త, సం
తతిఁ గడుఁ జక్కనైనది ముదంబునఁ గాంచినవాఁడు కల్గుసం
తతి యదియెల్ల నున్నతవిధమ్మున నుండఁగ నేటిమోదపున్
గతియదితప్పు, దుఃఖమవఁగా నెటువంటిదొ? లేశమేనిఁ దా
మతి నెఱుఁగండు ముద్దులకొమార్తయుఁ గోడలుఁగూడ మన్మలన్
గుతుకము మైఁ గనంగలుగు కోరికయున్ మదిలో నెఱింగినాఁ
డతులితుం డాతఁడన్నిటను నాయన కెందును లోటులేదు, జీ
విత మిటు లెందు నెవ్వరికి వీసము వ్యర్థముగాకయుండ సం
గతముగఁ బోయె? నాయువునఁ గల్గెను గొంచెకలోప, మయ్యెడన్
శతధృతికిన్ వివేక మది చాలకపోయెను, నెంబదేడులేన్
బ్రతుకఁగఁజేయఁడయ్యె, నటుపాల్పడినన్ నుతికొన్ని ముచ్చటల్
ధృతి ఘటియించుఁగాని, విను దేవి? సమస్తమునందుఁ బూర్తి దే
వతలకె లేనియప్డు నరపాలురకున్ గతి యెక్కడమ్మ? సు
స్థితి నిఁకఁ గాంచి పెద్దలును జిన్నలుగానికుమారులన్ గొమా
రితలను దేర్చి, వీరలకు రేపటు నెల్లుటఁ గల్గుశ్రేయముల్
గుతుక మెలర్పఁ గాంచఁదగుకోర్కి వహింపఁగదమ్మ! నీయెడం
బతి "కడధీరురాలనియుఁ బ్రాజ్ఞతలోఁ గను మించు" నంచునున్
సతమును నమ్మ టిప్పుడు ప్రసక్తికిఁ దేఁగదవమ్మ! సమ్మతిన్. ౪౧౫

## మన్మలజన్మదినోత్సవసందర్భమునఁ జెప్పినది.

తే. గీ. రామచంద్రప్పరాయల కేమిగాని, యెల్లవిధములఁ గడుఁ గృతకృత్యుఁడతఁడు
ఈమహోత్సవ మాయన లేమిఁజేసి, మనకు సంతాపకర మనుకొనఁగ నయ్యె.

## శ్రీమైలవరపు జమీందారుగారు.

1. మ. పటుకీర్తిప్రథితప్రబంధరచనాపారీణ విద్వత్కవీ
ట్పటులోత్కీర్తిస్మరణావధానకలనాసందర్శనోత్సాహ? వేం
కటనారాయణరాయ? నీదుపథ వేడ్కన్ జూడ రాలేకపో
వుటకున్ గారణమున్ వచింతునిదుమీ? భూపాలచూడామణీ. ౪౧౮

2. క. శ్రీవేంకటనారాయణ,రావునకున్ శుభపరంపరావృద్ధికినై
దీవించి వేంకటేశుఁడు, శ్రీవినవము వెలయ మనవిచేసికొను నిటుల్. ౪౧౯

ఉత్పలమాలిక.

3. శ్రీలలనామనోహరవిశేషకృపన్ సుజనాలవాలమై
భూలలితాంగికొప్పలరుభూషణమై యలరారునట్టి శ్రీ
మైలవరంబు నేలుగుణమాన్యుని ధన్యుని సూరనేనిభూ
పాలకులేంద్రు నిన్ను భగవంతుఁడు పేర్మి నఖండుఁ జేసి స
చ్ఛీలతనున్ బ్రకాశగతిఁ జెందఁగఁజేసెడిఁగాక, యేరికిన్
బోలను శత్రువైఁ విను భూప! పరేచ్ఛకు లోఁగియుండుటల్
స్కూలునఁ దెల్గు"టీచ"రని తుచ్ఛులు కొందఱు నన్ను సారెకున్
హేళనసేయుచుండినను నిప్పరి యోగ్యులు సేయుసత్కృతిన్
జాలినయంతసంతసము స్వాంతమునం గనుచుందు, "హిందుహై
స్కూలుసొసైటి" నాపయినిగూర్మి విశేషము చూపు దీనిలోఁ
జాలదినమ్ములుంటి నొకచక్కని నే నొకయేడువత్సరాల్
తాలిమి నుండుటన్న నిది తద్గతయోగ్యతగాని చాపలా
వాలుఁడనైననాదుగుణవత్త యనంజన దో నృపాల? మీ
పాలికి "నేగుదెంతు"నని పత్రిక నంపియు వచ్చుపూనికన్
జాలనొనర్చియున్ దుదకసత్యవచస్కుఁడనైతి నో ధరా
పాల? పరీక్షకాలమిది, బాలురు వ్రాయుచునుందు వేళఁ ద
త్పాలకు లుండఁగావలయుఁ బండితులాదుల కంతముఖ్యమై
గ్రాలికయుండినన్ సెలవు గైకొనివచ్చుట చిక్కుదయ్యె. మా
స్కూలునఁ గొన్ని "రూల్సు"లవి క్రొత్తవి పుట్టుకతానఁజుండె మీ
పాలికివచ్చునాకు నొకపాటిదియున్ సెల వబ్బదయ్యె, వి
ద్యాలలనాతనూజులు నిరంకుశులయ్యును నేఁటికాలపుం
బాలునఁ బ్రుంగి పొట్టకయి చాలఁ గృశించుటఁజేసి శృంఖలా

చ్ఛీలుఁడు బ్రహ్మపండితుఁడు చెప్పినముక్తులకుఁ ఫలమ్మెటో
తెల్పుచుఁగాక, యిన్నిటికి ధీవరమాన్యులు మీరు, హిందు హై
స్కూలధికారు లేర్పఱచుక్రొత్తవిశేషములు న్నిమిత్తమై
చాలఁగహించుఁగాక, కవిజాతికి స్వేచ్ఛ యొసంగుఁగాక, నా
పాటివేల్పుటావుఁ బ్రబంధఫలావళికల్పవల్లి స
చ్ఛీలకఁ గాటపట్టు, సుఖసేవధి బంద రెసంగుఁగాక యీ
ప్రోలికి రాకయున్నయెడఁ బొత్తములెన్ని రచించియుంచినన్
గ్రాలఁగఁజేయుటబ్బదిట వ్రాయవలెన్ మతికొంత యుల్లస
చ్ఛీలుఁడు భైరవాహ్వయుఁడు స్నేహితుఁ డిల్లొగినిచ్చి శిష్యుఁడై
యేలెని నన్నుఁజూచె నదియెల్లను దేవుఁ డెఱుంగు, నాతఁడే
శ్రీలకుఁ దానకంబయినస్వీయకళాలయమందు ముద్రణం
బోలి మదీయగ్రంథముల కోపికమైఁ బఠించెనట్టి శీ
లాలయుఁడై కృతజ్ఞతకునాకరమై తగువానికిన్ గృపా
వాలుఁ డొసంగుఁగాక భగవంతుఁడు మేటిసిరుల్; భవద్యశ
శ్శ్రీ లలరారుఁగాక కవిశేఖరవర్ణ్యములై, బుధాగ్రణీ
లోలత మీకుఁ జేకుఱుత, లోకములోఁ బతియేరికన్న మీ
పాలికి వందు వత్సుత మపారముదంబునఁ గొన్నిన శ్లో. ౪౪౩

## రెడ్డిపోలవరము పాఠశాల.

1. సీ. శ్రీజార్జి భూపాలశేఖరు పట్టాభిషేకోత్సవమునకుఁ జిహ్న మనఁగ
శ్రీపోలవరమున నాపోలవరపురీనాయకుం డగుకృష్ణరాయఘనుఁడు
కట్టించినట్టి సెకండరీపాఠశాలను దొలుదొల్త విన్ననువు మెఱయ
గోదావరీమండలోదారతరకరగ్రాహియౌ యెగ్విను ఘనునిచేత
వరపరీధావివత్సర భాద్రపదపు, బహుళపక్షంబునను శనివారమందు
నవమితిథియందుఁ జేయించె గృహప్రవేశమహ మాప్తులాశ్రితుల్ వెలసికొలువ.

2. సీ. నిలిపినాఁడంట విద్య నేర్చి పెంపెక్కిన శ్రీపోలవర ధరిత్రీవిభుఁడు
తెలిచినాఁడంట యశస్కరుఁడు గోదావరీకలితమండల కరగ్రాహివరాళి
పోషించునంట ప్రజాభ్యుదయ మారయు కళాచతురులు పాలకసమితివారు
చదువువారంటఁ సుహోచ్ఛ్రయము సాధింపఁగాఁ జాలువిద్యనుఁగోరుబాలురెల్లఁ
బోలవర మునిక్కపట్టంట పుణ్యపురుషు లెల్ల దీవించువారంట యిన్ని వృద్ధి
పద్ధతులఁ గల్గి యలరుచునీపాఠశాల, కొలఁదికాలములోన హైస్కూలుగాదె. ౪౪౪

3. చ. తర తమ భావ మెన్నుచు సుధామధురోక్తులకేని కైతలో
మెఱుఁగిడఁ జాలు నెవ్వనిసమేధితబుద్ధి మహత్వచాతురీ
పరిణతి యట్టి పోలవరపాలుని వేంకటకృష్ణరాయభూ
వరుని రసజ్ఞఁగాక యలభారతి వేఱొకయింట నుండునే. ౨౨౭

4. క. శ్రీయా. బీ. ఎల్విన్. ఐ. సీ. యస్. దొరగారి నెపుడు శ్రీకాంతుఁడు దీ
ర్ఘాయుర్ద్రాయ మితోధిక,మై యొసఁగెడి పదవి నొసఁగి యరయుంగాతన్. ౨౨౮

5. శా. నీతీరమ్మున నున్న పోలవరము న్నీతి ప్రధానంబుగాఁ
జేతశ్శుద్ధికరంబుగా ఘనతగా శ్రీజార్జి రాజేంద్రవి
ఖ్యాతప్రాభవ మూతకోలగఁ గడంకం బ్రోచు మీకృష్ణభూ
నేతం గోర్కులొసంగి ప్రోచుకొనుమా నిత్యంబుగోదావరీ. ౨౨౯

6. సీ. గోదావరీనదీకుల్యలచే నదీమాతృకంబై పొల్చు మండలంబు
ఆశ్రితకల్పకంబైన ద్రాక్షారామ భీమేశ్వరస్వామి పెరుచోటు
హూణరాజన్యపాల్యులు హూణవిద్యాప్రవీణులౌ భూపతుల్ వెలయునాఁడు
భుక్తిముక్తులు రాజభక్తులు గలప్రజాకాండంబు నిండుబంగారుకొండ
గౌతమీమండలము వొల్పుఁగాత సాధు, వర్తనుండును దుర్మార్గకర్తనుండు
నగుకరగ్రాహి యేకాల మరయుచుండ, జార్జిభూపాలు సత్కీర్తి పదలునిండ.

7. క. ఆయుర్భాగ్యములధికము,లై యెల్లసుగుణములును నితోధికములుగా
మాయేలికయగు కృష్ణా, రాయనికిన్ శుభములెల్లఁ బ్రబలుంగాతన్. ౨౩౦

## గుంటూరు డి॥ చేబ్రోలు.

1. సీ. కావించుచున్నాఁడు గాడోత్సవమ్ముల నాగేశ్వరస్వామి కద్భుతముగ
సేవించుచున్నాఁడు శివపదాంభోజమ్ము లశ్రాంతభక్తిచే నహరహమ్ము
రావించుచున్నాఁడు రాజమాన్యులఁ గవీంద్రుల గాయకులను బండితులహితుల
భావించుచున్నాఁడు పరమార్థమునకు సంపదలెల్లఁ గర్తృణప్రాయముగను.
తే. గీ. దేవభక్తునికులము సార్థకరించు,చున్నవాఁడు సదాశిస్సు లున్నవాఁడు
పిన్నవాఁడయ్యు యశమునఁ బెద్దవాఁడు, శోభితుండు సీతారామయాభిధుండు.

2. సీ. నతవరప్రదుఁ డైననాగేశ్వరస్వామి పరమాద్భుతం బైనకరుణవలన
నమృతవాక్సారస్య మమర వర్తించుసత్కవులయాశీర్వాదకలనవలనఁ
దనవర్ణమున మేటిఘనతఁ గాంచినపెద్ద లైనవారియనుగ్రహంబువలన
నన్నదానాదుల నాహ్లాదమును గాంచుబ్రాహ్మణోత్తములదీవనలవలన

లలితవీచీపరంపరాక్షాళితచలిత, మైన మరుద్వర్గకముచేత సంపుంగాత
స్వాగతము ముందు పేరిగూజార్జివిభుల, కమగ ఢిల్లీపురప్రవేశమున యమున. ౪౫౭

2. సీ. అది ధర్మరాజు సంపదమీఱ మును రాజసూయంబు చేసినచోటు దేవ
అది శూరమాణిక్య మైన పృథ్వీరాజు కోటఁగట్టించినచోటు భూప
ఇవి కుతుబుద్దీను విదితప్రతాపంబుఁ జాటింపఁగలజయ స్తంభ మధిప
యివి సార్వభౌములై యీ నేల నేలిఁ యేలిక లుండుగోరిలు రాజ
అనుచుఁ గనిపింప ఢిల్లీ పురాతిశయముఁ, గనుచు నానందముగ వారి కారికలును
వినుచుఁ బండువు మాసఁగాంచుమయ్య, ఘనము మయ్యానుముక్ జార్జి మానవేంద్ర!

3. శా. హిందూరాజ్యభరంబు బాహుయుగళిన్ హేలా తిం దాల్చి య
స్పందశ్రీ విలసిల్ల ఢిల్లినగరప్రాచీనసింహాసనం
బందారూఢి వసించు నీకఖిలసౌఖ్యశ్రీచిరాయుఃప్రగల్
సందీపించుత నీప్రజల్ మనుత నిచ్చల్ జార్జిభూమీశ్వరా! ౪౫౯

4. సీ. కుశలమా! చిత్త మంకురిఁ సముత్పాదనాధారశక్తిశక్తి వెరిరాజ
ఆరోగ్యమా! చిత్త సంగోపితానంత వైనపీనినవద్య వైద్యరాజ
క్షేమమా! చిత్త మక్షీణ నాడీ ప్రసంగతుల్యత్వత తాడనతేజ
ఆనందమా! చిత్త మాలంబితాన్వయాచారకప్రజాపరితపూజ
యంచు సేవాసమాకారితావనీశ్వ, రాప్తముఖసార్వభౌమ వాక్యప్రకటన
భాగ్యము లభించె నిండియాపత్రికలను, మాకు నేఁటికి జార్జిభూమీశమిత్ర!! ౪౬౦

5. సీ. సార్వభౌమపదంబు సంతరించిన నీసముంచితశ్రీ సంతసించినాను
సకలసౌఖ్యంబు లొసంగి కాపాడిన నీయవ్యాజ్యకృతిఁ జింతించినాను
ప్రకటించినాను నాటకమునందు నీపట్టాభిషేకవైభవము నెల్ల
వర్ణించినాను నీపట్టాభిషేకంబు లందక్ మహాపురీమండనంబు
సకలసామంతనరపాలమకుటమణివి, లాంఛనతి ఢిల్లిసింహాసనంబుఁ
బైకొనెదు నిర్మించిన కవుంజకవిత, నేఁడు ప్రకటించితిని జార్జినిర్జరేంద్ర! ౪౬౧

## మా పేరఁ బ్రకటింపఁబడిన పద్యములు.

1. శ్లో. పారమ్యం లభతాం పునస్సమధికం ప్రాలేయశైలేశ్వర
శ్రీరామేశ్వరసేతుమధ్యనగరీ సీమంతసీమామణిః
శ్రీజార్జిక్షితిపాలపాలనకలాభిఖ్యా ప్రసర్యాభిషిత
శ్రీసింహాసనవాసనాతతశుభశ్రీ రద్యఢిల్లీపురీ. ౪౬౨

2\. సీ. కలుగదే? సర్వలక్షణలక్షితాకృతి శ్రీపురంబగు కాళికాపురంబు
ఉండదే? జనవశానుపమాన విత్తధీమత్తంబు బొంబాయిపత్తనంబు
రంజిల్లదే? కృతామరావతీనగర సంఘట్టనంబగు చెన్నపట్టణంబు
నెగడదే? యలత్రివేణీతీరబోధిత ప్రాగార్యజనభోగ యగుప్రయాగ
కీర్తిధారేయులైన యాంగ్లేయదొరలు, పట్టభద్రత నీయంద కట్టుకొనిరి.
బ్రతికి చెడ్డను ప్రాగ్గౌరవప్రపత్తి, గారకేపోవు ఢిల్లి? యెవ్వారికైన. ౪౬౩

3\. శా. ఢిల్లీపల్లవపాణి నిన్నరయ నృప్తిన్ జూడ నున్నాఁడు యా
వల్లోకప్రథమాన సేతునగరీ ప్రాలేయశైలాంతరా
పల్లీపక్వణపట్టణస్థిత కుటీప్రాసాదసౌధావళీ
ఫుల్లాకారపటుండు జార్జినృపుఁడీపుణ్యంబు సామాన్యమే. ౪౬౪

4\. సీ. సకలరాజన్యమస్తకమణీదీపనీరాజితుం డగుధర్మరాజు నాఁడు
అంతఃపురంబవై చెంతఁబాయని నీకుఁ దేజుదెచ్చిన పృథ్వీరాజు నాఁడు
ఆసేతుశీతాచలాచలాచాలితాస్థానుఁడైన శహాబదీను నాఁడు
నిఖిలకామ్యంబైన నీసింహపీఠి నైఁగాంచిలిన వెఱఫాష పాలనాఁడు
నీవు చెందినయానంద మిపుడు నలిగె, మధ్యకొన్నాళ్లు లేకున్నమాత్రెగాని
జార్జిభూపాలసేవాసమార్జితప్ర, తాపకీర్తిభరంబ? ఢిల్లీపురంబ! ౪౬౫

5\. మ. కరులశ్వంబులు రత్నముల్ మణులు బంగారంబు హారంబు లం
బరము ల్కానుకలొసంగి ధర్మజుని ముస్నభ్రాసనా సీనుఁ జే
సిరి నిజ్జేసిరి నేఁడు జార్జినృపతీ! శీతాద్రిరామేశ్వరాం
తర రత్నాకరమేఖలాధిపతు లందర్నాల్గువేలేండ్లనుఙ్. ౪౬౬

6\. మ. బహుకాలాగతపాండితీయుతము సప్తద్వీపవిక్రాంతమున్
గుహనామానము వాంఛితార్థ ఘటనా కూలంకషంబైన దీ
మహి నీపాలన మెల్లపాలనములన్ బాగైన దీరీటికి
రహిఁ జేకూరిన యానుకూల్యమును సంరక్షింపు జార్జీశ్వరా. ౪౬౭

7\. మ. అరులన్ ముంచుచుఁ దేల్చుచు న్నృపుల కార్యావర్తదేశంబు ము
న్నెరపెన్ దుఃఖము దాను కర్తవడె గానీ? నేఁటికాంగ్లేయధీ
వర నైపుణ్యముచేత దానిసుడియుం బైఁ బడ్డగొనాఁగిన
చ్చెరువైయున్నది జార్జిభూప! సరిస్త్రీఁ దేఁగదే దానికన్. ౪౬౮

8\. సీ స్థాపించిరుత్తర దక్షిణ ధ్రువ దుర్గమాధ్వంబులందు జయధ్వజంబు
ప్రకటించిరి పతాక ప్రకృతిలోపలి మూఁడుగుణముల మూఁడురంగులును జొనిపి

చేయించుకొన్నారు చేతనాపని నీళ్ళచే నిప్పుచే గాలిచేతఁ గూడ
నార్జించినారు ప్రజ్ఞాతిశయంబున నైదుఖండముల రాజ్యం బొకింత
ప్రజల విశ్వాసమును దృఢ పఱచినారు, రిపులనిశ్వాసములు సంహరించినారు
పెంచినా రిండియా సుప్పగించినారు, ఏలుకోవయ్య జార్జిభూపాల! దాని.

9. సీ. గ్రహియింపుమా! నన్నుఁ గాపాడుమా! యంచుఁ గరము చేతికొసంగు కామదాత్రి
ఏరాజ్యమునొసంగ గారాని సార్వభౌమాభిధాన మొసఁగి నట్టి సాధ్వి
ఏరాజుల కొసంగ కేటిదాఁచిన మేటిహీరంబొసంగిన వీరలక్ష్మి
ఏరీతినడిపింప నారీతినడచెను సారస్య మెఱిఁగినచారుగాత్రి
ప్రతినిధులచేత నే పుస్తె పంపకుండ, పెండ్లి నాఁడైన మొగము చూపించుచుంటి
విదియె నీనాఁటి గౌరవం బిండియాకుఁ, జాలు మాకిది పదివేలు జార్జి భూప

10. సీ. బెదురుగుండెయు పిక్క-చెదురు లేకుండంగ నీగౌరవంబు నీకాఁగినారు
నిఖిలవస్తువులు కానికలఁగాఁ బంపించి నీకుసింగారంబు నింపినారు
మాటి మాటికి భంగపాటు లేకుండంగ నీసతీభావంబు నిలిపినారు
సతతసూర్యప్రేక్ష్య సామ్రాజ్యలయ్యు నీసిరి యసూర్యంపశ్యఁ జేసినారు
ఆంగ్లరాజులు పోషితు లైననేమి, పాపె నారీతి జార్జిభూపాలకుండు
ప్రేమగలభర్తపాం దొక్క-టేయియైనఁ,జాలదా సాధ్వికో యిండియాలతాంగి

11. సీ. కడిపెడుఁ బిడ్డలఁ గన్న పూతచరిత్రి, జనులు తల్లిగ నెంచుకొనినసాధ్వి
అతి దయావతి భాగ్యవతి సర్వ సమురాలు సంతురాలు నదృష్టవంతురాలు
నైన శ్రీవిక్టోరియాకు మనుమండవు, పరమశాంతుఁ డగు నెడ్వర్డుకొడుక
వాస్ట్రేలియాప్రజ కధిపతిస్వాతంత్ర్య, మిచ్చిన వాఁడ వీ విండియాను
వలచినాఁడవు నీశైశవముననుండి, చక్రవర్తివి కాఁబోవు సమయమేగు
దెంచె ననురక్తిబలము చూపింపుమయ్య, జార్జిరాజేంద్ర వైభవనిర్జితేంద్ర. ౪౭౨

12. సీ. ప్రభుభక్తి మాతృవిశ్వాసంబు పితృభక్తి దైవభక్తియు పూర్వధనముగాఁగఁ
పితృవైరి మాతృవిద్వేషియు రాజదూషకులును ఘోరపాతకులుగాఁగఁ
ప్రభువు దేవాంశసంభవుఁడు తల్లియుఁ దండ్రి ప్రజకను కథలు శాస్త్రములుగాఁగఁ
ధర్మవిశ్వాసకృతజ్ఞతావిధులు నిత్యం బొనరించు కృత్యములుగాఁగ
భరతఖండనివాసులు బ్రతుకువారు, గాన వారిస్వభావంబు గరిచు మెఱిఁగి
పాలనము సేయుమయ్య భూపాలమౌళి, జార్జిరాజేంద్ర! వైభవనిర్జితేంద్ర!

13. సీ॥ రాతిపై రాతుసారాతిభావంబు భావించి చిత్తంబు లర్పించువారు
గుణశూన్యు లోచనాగోచరు గుణజాలమెంచి మన్నించి వర్ణించువారు

అనృతగాథలును సత్యములంచు మదుల కెక్కించి నమ్మకముపుట్టించువారు
భక్తితత్పరమైన పారవశ్యముచేత నితరకృత్యము లసహించువారు
ప్రతినిధుల రాజబుద్ధి, కన్నడెడు ప్రభువు, గుణములెన్నుట, సత్యవాక్కులనువిశ్వ
సించుటయును, రాజభక్తిఁజూపించు టేమి, భరము హిందువులకు జార్జిధరణినాథ

13. సీ॥ భక్తితోఁ బూజింపఁబడెడి మాదేవాలయంబులెల్ల మసీదు లైననాఁడు
"భాంచోద్ధలంకోరు" బాపనయ్యా యంచు నాల్కలచేఁ దిలకము ల్నాకునాఁడు
పసుచుకుట్టిది వీధిఁ బడిపోవ జంకి మేడల మూలమూలల డాఁగునాఁడు
సన్యాసులగు మతాచార్యవర్యుల బోడినెత్తులపై మూటలెత్తునాఁడు
రాజభక్తిని విడువని సూజనంబు, సకలసౌఖ్యంబులిడి మతాచారవిధుల
నోము మీయెడ నది మాపుణ్యలోకభరంబె, జార్జిరాజేంద్ర! వైభవనిర్జితేంద్ర!

15. సీ మామేలెఱింగిన భూమీంద్రులందువచ్చిన వారలెవరో వచ్చెదరుగాక
మాకు మాఱుఁ బల్కు మానవీయులను మెచ్చినవారలెవరో మెచ్చెదరుగాక
సముపాయ మనఁజాలు సదుపాయనంబు దెచ్చినవారలెవరో దెచ్చెదరు గాక
కోరుకోఁదగినకోర్కులు దెల్పు "సన్నద" నిచ్చిన వారలెవరో యిచ్చెదరు గాక
పోకయుండిన పట్టాభిషేకమిపుడు, కాకపోవని రాక నిరాకరింప
కేకరణి తావకీన కృపాకరంబు, మాకుఁ జూపించితివి జార్జిభూకళత్ర. ౪౭౬

26. సీ. పోనేర్చిరి విమానములమీఁదనె "బిలోన్సు" మాటలేకయె నుడుమార్గములకుఁ
దెలియనేర్చిరి దివ్యదృష్టిచేతనె తంత్రులకయనుండఁగనె వార్తాళినెల్ల
నరయనేర్చిరి తపోగరిమచేతనె ధూమశకటిలేకుండ దేశంబులెల్లఁ
జూడనేర్చిరి భూమి జాడలెల్లెడల ప్యాపులు లేకయే యోగ బలముచేతఁ
గాలవశమున మాతొంటిపేసునతతులు, కాలమున కేగుదెంచె మీపాలనంబు
కలిగె నవియెల్ల మీబుద్ధిబలముచేత, జార్జిరాజేంద్ర? వైభవనిర్జితేంద్ర? ౪౭౭

17. సీ. తస్త్రాది రాజ్యాంత్రివిద్ధ ఘనభూము వరిగి క్రిమ్మరవచ్చె నదియె మాకుఁ
గనుమాయు నడఁచు మూర్ఖుల్మలు గతియించి మరల మాకవియె సంభవములయ్యె
నాపగల్ సేయు కీలాలకుల్యలు వోయి మరల మాకవియె సంప్రాప్తమయ్యె
మహివచుల్ సేయు సంభ్రమములు పొలివోయి యవక్రస్థిరతటస్థమయ్యె మాకుఁ
బరమరాజ కార్యపద్ధతుల్ నశియించి, మరల వఱలె నవియె మాకుఁ గాని
మాపదముల కగ్రమావృత్తి మొనరించె, నాంగ్లరాజ పాల నాతిశయము. ౪౭౮

18. సీ. మాదేశమున లేని మహనీయ కార్యముల్ మీతో సమముగఁ గల్పించినారు
మీమెన్నఁడెఱుఁగని సీమవస్తువులెల్ల మీ చేతిమీఁదఁ బంపించినారు

మా మేలభిలషించి మాబుద్ధి మీఁదనే మీ రాజకార్యముల్ మెలపినారు
మాభాషలోలేని మహనీయశాస్త్రముల్ మీ భాషలోన నింపించినారు
దొరతనంబన్న మీదికా దొరతనంబు, మీపురముతోడ మాహస్తినాపురంబు
సాటి పొందింపలేని యాలోటుకూడఁ, దీర్చితివి నేఁడు జార్జిధాత్రీకళత్ర!

19. సీ. పాలింపుమా మేటిభారతఖండము పరిశీలింపుమా మంచి చెడ్డలెల్లఁ
దేలింపుమా దుర్మతుల నావలకు ననుకూలింపుమా ప్రజకోరికలకు
ఏలింపుమా నేల యెల్ల రాజులచే నివాళింపుమా కీర్తివళుల దిశల
గాలింపుమా దేశ కష్టంబు లెటేఁగి సురాళింపుమా వైరిరాజబలము
బిడ్డలంబోలెఁ బ్రజలఁ భావింపుమయ్య, విశ్వమెల్లను వశము గావింపుమయ్య
విమతులను మాటలేక జీవింపుమయ్య, జార్జిరాజేంద్ర! వైభవనిర్జితేంద్ర! శరం

10. సీ. మహి నేలు శ్రీజార్జిమహనీయునకు సార్వభౌమునకు శుభంబు ప్రబలుఁగాక
అతనిదేవేరి లోకైకదివ్యచరిత్ర మేరీకి సుఖము చెన్నారుఁగాక
అతనిసంతతిలోన నగ్రజుండైన యెడ్వర్డున కిష్టాప్తి వగలుఁగాక
ఆల్బర్టులోనైన యతనితమ్ములకెల్ల ననుపమానానంద మబ్బుఁగాక
వీరలకుటుంబమే మనధారుణికి స, దాప్రభుత్వ మొనర్చుచుఁ దనరుఁగాక
నేఁటిశ్రీజార్జి ముత్తవ్వ నాఁటియట్లు, పొంది చిరకాల మీనేల నోముఁగాక.

21. సీ. ఏయమ్మ మనరాజ్య మేలు కారణమునఁ బఠ్ఠభూములుగూడఁ బండఁదొడఁగె
ఏతల్లి మనధారుణీతల మేల్మిహేతువున దుర్భిక్షంబు తొలఁగిపోయె
ఏమాత మనహిందుభూమి నేలుటఁజేసి వసుమతీనామ మన్వర్థమయ్యె
నేయంబ మనకెల్ల నీశ్వరియైన కతమ్మున నెన్నొ యంత్రములు గలిగె
ఆ విక్టోరియా రాణి యమ్మహాత్మ, రాలి పేరిటి శుభగాత్రి కఖిలసుఖము
లబ్బుఁగాక శ్రీజార్జికి ననుఁగుగూఁతు, రైన విక్టోరియాంబకు నమలగుణకు.

22. సీ. ఎవనితండ్రి జగమ్మునెల్ల నేలినచక్రవర్తి యెడ్వర్డుభూపాలకుండు
ఎవనితల్లియన రెండవలక్ష్మియా ప్రజ జననినాఁ జను నలగ్జాండ్రదేవి
ఎవనిపితామహి యీరేడు లోకమ్ము లేలు సామ్రాజ్ఞగదీశదేఁటు
ఎవని దేవేరి భూమీశకుటుంబమ్ము గాంచ దుద్భవంబందినట్టి మేరి
అతఁడు శ్రీజార్జియనఁగ నీయనఘుఁడిపుడు పట్టభద్రుండగుచునుండెఁ బ్రబలభాగ్య
మేమనుచుఁ జెప్పవలె నీతఁ డేసగుఁగాక, యింద్రుడై చంద్రుడగుచు నుపేంద్రుఁడగుచు

23. మ. మనరాజ్యంబటునుండి యేలెఁ ద్రిజగన్మాన్యాత్మురాలైన యా
ఘనవిక్టోరియరాణి యాపెకొడుకున్ గాంక్షింపఁడీ దేశమం

మునఁ బట్టంబును గట్టికొంట కిపు డీదోశ్శాలి శ్రీజార్జి హా
స్తినకేతించును బట్టభద్రితను నిస్సీమానురాగమ్మునన్. ౪౮౪

24. ఉ. వాగలకన్న నెక్కుడగు వైభవముల్ మనకిచ్చి పేర్మి పెం
పొంగఁ బ్రజావళిన్ బ్రజలయట్లు భరించు నితండటంచు శ్రీ
వారిటకేగుదెంచునొ యవారిగ సారెకుఁ జాటుచుండె నో
ధీరులు పెంపుడుపుల్ కడునుదీర్ఘత దీవనలిందు జార్జికిన్. ౪౮౫

25. చ. అనువదియేండ్లు గాఁటుపయి నబ్బెను దండ్రికిరాజ్య ; మీతఁడో
ధనుభరించె నేఁబదియు దాఁటకపూర్వమె ; నూటికింకనో
క్కూర తరువాయి ; దేవుఁడుశతాయువునిచ్చెడుఁగాక యంచు ను
ర్వీజనులెల్లఁ బల్కుడు ధ్రువంబుగ నల్లెయొనర్చితీరెదున్. ౪౮౬

26. సీ. ఆరోగ్యమిడుఁగాక యనుకఁ దర్కపవిత్రాప్రునకు శ్రీజార్జిభూపునకు నెపుడు
ఐశ్వర్యమిడుఁగాక యగ్ని యగ్నింబోలె శుచియైన శ్రీజార్జి శూరమణికి
భోగంబులిడుఁగాక భోగిరాట్టిలఁదన్నుఁబోలె నో మెడుజార్జిభూవిభునకు
వాక్సిద్ధినిడుఁగాక వాక్పతి వాక్పతివలెఁ బల్కు శ్రీజార్జివల్లభునకు
ప్రజలుజయవెట్టుచుండుగాక ప్రజలుఁగాక, యింతకంటెనురాజ్యలక్ష్మియుండగుచు
నెల్లదీవులనీతఁడేయేలుఁగాక, మనకుసంతోషమొసరించి మనుచుఁగాక. ౪౮౭

27. సీ. రాజ్యంబునెంతుమా ? రవిగ్రుంకనొకనాఁడు దిరుగలేఁడన్నంతదేశముండె
సంతానమెంతుమా! సాంగభోగపదంబులందగఁ దగినప్రఖ్యాతులైరి
దేవేరినెంతుమా! దివిజలోకమునారికేరి లక్ష్యముగానియింతియయ్యె
ఆవాసమెంతుమా! యాలమణిస్వేపంబు నతకరింపఁగఁజాలుఁబట్టిదయ్యె
అన్నిటనుబూర్తిగన్న యోరాయన్ననీకు, నేమియాశీర్వదించెద మీసుఖంబె
సుస్థిరంబగుఁగాక యేసుఖముగోరు, దగనడుఁజేకూరుఁగాక యోరాయధిపమౌళి.

28. సీ. మీకవులంబోలె మాకవీంద్రులఁగూడ ననురాగసంపత్తి నరయుమయ్యా
మీపండితులఁబోలె మాపండితులఁగూడ గౌరవంపుఁబ్రపత్తిఁ గాంచుమయ్యా
మీవేదములఁబోలె మావేదముల్ గూడ వృద్ధిచేసెదుపూనిక వెలయుమయ్యా
మీద్వీపమునకన్న మాద్వీపమునయందె మాతృభావముమాపి మనుపుమయ్యా
యెల్లెడజయంబుగొనుమయ్యా యేలుమయ్యా, శతముపైకొన్ని యేండ్లుకొనసరుపడంగ
సకలత్రిజగతిషేంకటేశ్వరులనేక, నలుపలికఁపంగ మాయయ్య యలరుమయ్యా.

## బందరు హైస్కూలులో శ్రీచక్రవర్తిగారినిగూర్చి

1. మ. కలుగుంగావుత "జార్జిషిప్పు"నకుఁగాఁ గళ్యాణపారంపరల్
తెలుగుంగావుతఁ దత్సతీమణికి తత్సైన్యోభివృద్ధుల్ సదా
యలరుంగావుత వీరిసంతతికి నిత్యంబుల్ సుఖావాప్తి ని
ర్మలకీర్తిన్ జగమేలుఁగావుత మితఁ డామ్నాయమ్ము లోహహో! యుగల్. ౪౯-౦

2. వ. ఎవనిప్రభుత్వహేతువున నీమహస్కూల్కు దివ్యమెంతయో
శివకరమై లభించె, గుణసింధు వెగం డొనరించె రాజధా
నివిధికిఁ బాత్రమాగతి ననిందితమౌ మనఢిల్లిపట్టణం
బవితథమైనకీర్తి నతఁ డార్యహితుం డగుఁగావ మెల్లెడల్. ౪౯-౧

3. సీ. ఈవత్సరముపోలె నితఁ డెల్లకాలమ్ము మనభూమిఁ బాలించి మనుచుఁగాక
ఈవత్సరముపోలె నితఁ డెల్లకాలమ్ము మనకు నానంద మ్మమర్చుఁగాక
ఈవత్సరముపోలె నితఁ డెల్లకాలమ్ము మనమీఁదఁ బ్రేమంబుఁ బెనుచుఁగాక
ఈవత్సరముపోలె నితఁ డెల్లకాలమ్ము మనవిద్యపై బుద్ధిఁ జొనుపుఁగాక
తే. గీ. దైవ మీతని కెప్పు డీవిధముగ, సుఖము నారోగ్యమును నిడి యఖిలరాజ
భూషితపదారవిందుఁగాఁ బొసఁగఁజేసి, ప్రోచుఁగావుత జగ మెల్లఁ గాచుఁగాత.

4. సీ. మనమీఁద నేకాక మనచక్కనొలయుక్తములపైఁగూడఁ బ్రేమమున బొదలు
మనయందు నేకాక మనవేషభాషాదులందునఁగూడ నానందమందు
మనపైన నేకాక మనమాచరించు కార్యములపైఁగూడ గౌరవముచూపు
మనవంక నేకాక మనదేశసంస్థానములయందుఁగూడఁ దా నొలుకుఁ బ్రేమ.
తే. గీ. ఇతఁడుమనకు నేఁడగుటకీతఁడు యోగ్యుఁ, డట్టిపూర్వపుణ్యంబుశ్లాఘ్యముగుఁగాదె?
చక్రవర్తిత్వ మిటువంటిసత్పురుషున, కబ్బిశోభించుటది యొక్కయక్కజంబె. ౪౯-౩

5. శా. ఎంతోదూరమునుండి తన్నుఁ గనఁగా నేతెంచియున్నట్టి స
త్స్వాంతుల్ సంతస మంద నొక్కయెడఁ దా సవ్వారి కవ్వారిగాఁ
జెంతన్ దర్శన మిచ్చి యాదృతమతిన్ జెల్వొందె నేరాజు ధీ
మంతుం డాతఁడు జార్జిషిప్రవరుఁ? సామాన్యుండె వర్ణింపఁగన్. ౪౯-౪

6. ఉ. ఈతనినే వరించుత జయేందిర, యీతనినే సదా యశ
స్స్థితి వరించుతన్ జనులప్రేమయు నీతనినే వరించుతన్
భూతియుఁగూడ నీమనవిభున్ వరియించుత, మీతనిన్ గుణ
స్స్థితి వరించుగాక, సకలనేతను లోప మొకండు కల్గునే? ౪౯-౫

7. ఉ. ఏగురుతల్లులున్ మఱియు నేగురుతండ్రులు నుండ రందులో
బాగుగ నేలురా జొకఁడు, పార్థివపత్నియొకర్తె యుండు, స
ర్వాగమసమ్మతం బిది కలార్థులు? కేనియెడ న్నితాంతమున్
మీగురునందుఁబోలెఁ జెలిమెన్ గని వర్ధిలుఁడయ్యా? తత్కృపన్. ౪౯౬

## శ్రీరాజా రావు గంగాధరరామారావు బహద్దరుగారు, ధవళేశ్వరము.

1. శ్లో. శ్రీమానాశ్రితరక్షణక్షణగుణ స్సర్వత్ర సర్వప్రద
స్సత్సంతానవిభాసుర స్సుగవీ జేగీయమాన స్స్వయమ్
శ్రీగంగాధరరామరాయనృప తేజఃపాత్రం తమాత్మోపమం
శ్రీగంగాధరరామరాయనృపతిం పాయాత్సదా శ్రీపతిః. ౪౯౭

2. చ. జనకపితామహుండు గుణసాగరుఁ డాశ్రితవత్సలుండు భూ
జననుతకీర్తి, దత్తుఁగొని సాఁకినయట్టిపితామహుండు నీ
వనఘుఁడ వట్టినిన్నుఁ గనినట్టియభాగ్యత నేఁటితోడఁ దీ
ఱెను ముదమబ్బె నెమ్మదికి శ్రీకర! రావునృపాలశేఖరా. ౪౯౮

3. మ. పినముత్తాతనృసింహసత్కవిని మీ నెత్తాత నీలాద్రిభూ
జనపాలుండు బహూకరించె నను నీజన్మించువేళంబు భూ
జనపాలుర్ గను గారవించిరి భవత్సౌహార్దము న్నేను గై
కొనయత్నింతు భవాదృశుల్ సుకులజుల్ గోరంగ నర్హుల్ గదా. ౪౯౯

4. మ. ధనధాన్యాదు లశాశ్వతంబులు యశోధన్యుండె సన్మాన్యుఁ డె
వ్వనికో ద్రవ్యము సేవ్యమైనను ఋజుప్రజ్ఞాఢ్యనుల్ సత్కవుల్
గొనముల్ దక్క ధనంబుగోరరు భవద్గోష్ఠీసమావేశమే
నను సంతుష్టునొనర్చెఁ గైకొను మఖండమ్మైనయైశ్వర్యమున్. ౫౦౦

5. సీ. విదియచందురునకు వెసఁ గ్రమక్రమముగాఁ గాంతివిస్తారమ్ము గలుగునేని
వాఁడినమాలతి వర్షాగమముకల్మి ననుపమానస్ఫూర్తి నందునేని
శారదాంబుదము నిచ్చలు దొల్కరిని గడు మాంసలత్వముకల్మి మసలునేని
ఆకరోద్భవ మైనయట్టివజ్రంబు శాణోల్లిఖమై దీప్తి నొందునేని.

తే. గీ. నిన్నువంటిసత్కులవంతు నిన్నువంటి, మానధను నిన్నువంటిసన్మాన్యచరితు
ననుగుణైశ్వర్యయుతుఁ జేసియుండుఁడు కీర్తి,నోచుకున్నె? గంగాధరరామరాయ?

6. ఉ. పుట్టినదాదిగా నృపులు భోగులునై తనరారువారికిన్
గట్టియుశమ్ము గల్గ,దధికారమువీడి పరిశ్రమమ్మునన్

బట్టుపురాజు లైనక్షితిపాలురనామము శాశ్వతంబగుణ్
ఛట్టుఁడు రాముఁ డర్జునసుదర్శనులాదిగ నిందుదాహృతుల్ ౧౦౨

## శ్రీ పోలవరపు జమీందారుగారు, కాకినాడ.

1. ఉ. పోలవరక్షితీంద్ర? విను బుద్ధచరిత్ర రచించి నీకు భూ
పాలకమౌళికిం గృతిగఁ బంపినవేడ్క నొసంగినాము నీ
పాలయినాము నేఁడు తమపావనజన్మదినమ్ముగాన ను
ద్వేలఘవద్వదాన్యతకు వేళయిదేసుమి కృష్ణభూవరా! ౧౦౩

## వేఙ్కటేశ్వరపత్రికలో శ్రీవారినిగూర్చినపద్యములు.

1. తే. గీ. ఎన్నినాళ్ళాయె శివ? శివ? యెన్నిసార్లు, చనవుమాటలుమీరునన్నుడుగుకేగు
ఆగ్రహం బది వచ్చెనే? యకట? నాఁటి,ప్రార్థనాసమయంపుఁ జేఁతగాక.
2. చ. వ్యసనమునందు మున్గి ప్రతివాసరముణ్ ధన మంతొ యింతొ తై
వస మొసరించుచుంటిఁ బయివారలు, కయ్యది "మీప్రతిజ్ఞచే
ననదయిపోయె"నంచు మనసార ముదంపడుచుంటిఁగాని యా
రసి తమబోట్లకుణ్ గినుకరానియఁగాడపటంచు గుండెదణ్. ౧౦౪
3. క. నెల కింకొకపదియూహా,యలజీతము హెచ్చినట్టు లానందింప
గలయీవిషయము నాకుణ్,గలకాలమ్మను మహోపకారముసుండీ. ౧౦౫
4. చ. "హృదయము నుంచి"దంచును సుహృత్త్వముఁ గోరెడువార"లంచు నే
యదనునఁ జూచినణ్ మది మహాముద మొందెద"రంచు మైత్రికిన్
గుదురగువారలంచుఁ దమకుంగలమోహ్యలె దారిచూప నే
నిది లిఖియించినాఁడ తుమిఖుంప్రఁడు నాయెడఁ దప్పు గల్గినణ్. ౧౦౬
5. తే. గీ. మనము తొల్లింటివమనసనే మనలవలయు,నంచు నేఁగోరియిదిలిఖియించినాఁడ
నంతమాత్రముచే మీకు యశము పోదు,లేకయుండిన నపకీర్తి నాకు రాదు.

## శ్రీ యినుగంటి ప్రకాశరాయనింగారు,

## అన్నవరముకొండ.

1. మ. మనకుణ్ మున్నిట నున్నవారలె యసామాన్యప్రతిష్ఠాదికం
బును గావించి స్థిరీకరించి రిఁక నీప్రోపంది కానొచు ని
ల్చిన దీదేవున కప్రతిష్ఠ యొకటే, చేయింపు మీయాప్రతి
ష్ఠను నీకిచ్చు నిదే ప్రతిష్ఠను బ్రకాశక్షోణిభృద్గ్రామణీ! ౧౦౭

## శ్రీగంపలగూడెము జమీందారుగారి కుమార్తె భారసాల.

1\. శా. ఆయుర్దాయము బ్రహ్మ, కాంతి శశి, నిత్యైశ్వర్యముల్ లచ్చి, వి
ద్యాయోగం బజురాణి, భర్తృహిత సౌందర్యం బుమాదేవి, యా
మ్నాయంబుల్ శుచిమత్త, తక్కుఁగలసంపత్తుల్ సురల్ గూర్చి నా
నాయోగాఢ్య నొనర్చి ప్రోచెదరు కృష్ణారాయసత్పుత్రికన్. ౫౧౦

2\. శా. కాంతా కారమనంగగేహిని, కడుం గళ్యాణవిద్యామన
స్సంతోషమ్ములు సంతతంబును సరస్వజ్జా సరస్వత్యుమా
కాంతల్, దీర్ఘతరాయురాదికము తత్కాంతుల్ ప్రసాదించి శ్రీ
సాంతత్యం బెసఁగింతురుగాక మనకృష్ణారాయసత్పుత్రికిన్. ౫౧౧

3\. తే. గీ. ఏమహాసాధ్వి చరిత వహ్నికిని శీత,లత్వమును జేర్చె నమ్మాత లలితసుగుణ
వ్రాత సీతామహాదేవి ప్రోచుఁగాత,బుచ్చమాంబిక నఖిలసద్బుద్ధులొసఁగి. ౫౧౨

4\. తే.గీ. వీరపత్నీత్వమునుగాంచి వీరమాత,వగుచు మీవెల్మకులమున కమలకీర్తి
దెచ్చి వర్ధిల్లుమమ్మ? నీతికి నిధాన,మగుచు నోబుచ్చమాంబ? గుణావలంబ?"

5\. చ॥ కొమిరెలఁ గన్నతండ్రి లిలఁ గోటులు నర్చనముల్ నలారు బు
చ్చమ? వినుమమ్మ? నీదుపిత సత్కవియై నృపుఁ డౌటఁజేసి నీ
కమలిన మైనభావిసుఖ మబ్బఁగఁ జేయఁగనెంచి యిందఱిన్
సుమతులఁ బిల్చి దీవనలసొంపు వహింపఁగఁ జేసెఁ నింటివే. ౫౧౪

7\. చ. ధరణిపు లెందఱో భువి నుదారయశోనిధు లుండ వారికూఁ
తురవయి పుట్ట వీవు, విబుధుల్ వినుతించెడికృష్ణరావుకూఁ
తురవయి పుట్టి తిర్యాదియుఁ దొల్లిటిపుట్టుఫలమ్ము, నీకు ను
ర్వర సమకూర నట్టిదొకభాగ్యము గల్గునె? బుచ్చమాంబికా. ౫౧౫

## శ్రీశనివారప్పేట జమీందారు నారయ్యప్పారావుగారు.

1\. చ. సిరియును మంచిసంతతియుఁ జేవయు నీవియు రాజ్యముల్ యశ
స్కరమగునాభిజాత్యమును సర్వముఁ బొంపిరివోవునీకు నె
వ్వ రొసఁగ నేమి యున్నయది; భవ్యగుణోదయ! నారయప్పరా
డ్వర? భగవంతుఁడీసిరిని బాలనజేయుత శాశ్వతమ్ముగన్, ౫౧౬

2\. తే, గీ. దారుసంపత్తిగలజమీందారుఁడవును,దారుఁడవునంచునిన్ను నేఁ గోరుచుంటి
నూత్నగృహనిర్మితికి దారురత్నములను,నర్థునయశస్క!శ్రీనారయప్పరాయ. ౫౧౭

3 తే. గీ. అజ్ఞనామ్నాయ వాసవు లజ్ఞనప్రి, భూతవిఖ్యాతి గల మహోదాత లలరు
వంశమునఁ బుట్టి నట్టిసీవా పె-బట్టె,యమగు మంటిని శ్రీనారయప్పరాయ? ౧౧౭

4. ఉ. ముప్పదిపంచిమాలములు బొ-ఓరివో యెడి వంశపట్టభం
బప్పనృపాల? నా కొసఁగు టున్నది నీ కొక గొప్పగాదు నా
కిప్పని సేయుగే మికుల హె, చ్చిది శాశ్వత మైనకీర్తి నీ
కిప్పు డొసంగు, నుండటికి నీయఁగఁజాలు మహోన్నతస్థితిన్. ౧౧౮

5. యశక శాఙ్ఞనభంజనకృతి , నమలినముద మిచ్చు కృష్ణుఁ డర్పించుత నీ
కు మహోత్సాహము విజయము, నమితముగా ట్యంబు నారయప్పారాయా. ౧౨౦

ఈసందర్భముననే మైలవరపు కృష్ణమూర్తిగారికి వ్రాసినది.

1. శా॥ అప్పారాయ లపత్య సూడ రని నే నామూలము న్నాజివీ
డప్పారాయలచే నెఱుఁగుదును నేఁ డమ్మాట వమ్మయ్యె న
ప్పప్పా? కృష్ణసుధీ? యిట్టాట శనిసాహాయ్యమ్ముచేఁగాదుగా?
చెప్ప న్నేర్చినఁ జెప్పు నారనృపతిశ్రీస్థం డిటుల్ సల్పునే? ౧౨౧

2. శా. నాపద్యమ్ము నృపాగ్రణీ దనుచు విన్నాణంపుగర్వమ్ముతో
నేపారన్ ...డు సోలువేంకటకవిన్ హీహీలటన్ డింపఁగా
నీపాటన్ ఘటియించెనో? యొకఁడు, కాదేనిన్ వదాన్యోత్తమున్
భూపున్ వేఱుఁగఁ జెప్పుచున్న దదియో? లుబ్ధుండే యతం డకటా. ౧౨౨

3. తే. గీ. "గందపుంజెట్టుఁ దీపమ్ముఁ జందురుండు
ఫణాల మషి నంకముచుదాల్పఁ, బాధ్ర వేఁదుని
లట్టు శే చేరఁడీతురు చెట్టులను" న
టంచుఁ బండితరాజు ము న్నానతిఁడె. ౧౨౩

4. మ. వినుండా గోరినకోర్కె యట్లు వృథమై పొండిన్ వృథాస్తై మనిన్
దనుకంజేసిడిలజ్ఞ కోర్కెఁ దుసమాధానంబు గన్పట్టె "భూ
జనమాన్యున్ ఘనుఁ గోరి వ్యర్థుఁడయినన్ శ్లాఘ్యుండె యయ్యర్థి"యం
చనినాఁడేకద! కాళిదాసు మనకేలా? లాఘవం బియ్యెడన్. ౧౨౪

4. తే. గీ. సంపదలు పూర్వపుణ్యపరంపరావ్యయమ్ముఁ జేసి కలుగుట నాపదలుఁ గఁ
బాతులిలను నిమ్చ్ఛేసె శాంతి, ప్రాజ్ఞులైన యప్పరాయల కిది వేఱె చెప్పవలెనే.

కృతకృత్యతనందినమీఁదఁ జెప్పి పంపినపద్యము.

1. ఉ. నారనృపాల? నాదొక మనమ్మున నీ కుదయించియున్నయ
యూహారిని కీడుగాఁగ నినుఁ గోరినకోర్కె ఫలించునట్టు లీ

వారసి పంపినట్టిధన మందె శతద్వయరూప్యముల్ కడుం
గౌరవపూర్వకమ్ముగను గన్గొని మీగిరిరా వొసంగుటన్. ౧౨౬

## శ్రీ చెలికాని జగన్నాథరావుగారు—తంగెళ్ళమూడి.

1. చ. ఇరువదిరెండవత్సరము లిప్పటికిన్ గతియించె, గోపభూ
వరతనుజాత ? ధీవరుఁడవజ్జనకున్ గని ; నేఁటికిన్ మహా
త్తరు నినుఁ జూడఁ దన్నృపునిదర్శనమైనటు లాత్మఁ బొంగె నో
నరవర ? తండ్రియే కొడుకునా జనియించుట చెప్పు వేదముల్. ౧౨౭

2. ఉ. ఈధరలో జమీన్లు గల వెందఱుకేనియు, విద్య వారిలో
నేధరణీశుఁడో యెఱుఁగు, నెల్ల రెఱుంగరు వింటవే జగ
న్నాథనృపాల ? తద్ద్విజజనాథశిరోమణి నీకుఁదండ్రి ప్రి
జ్ఞాధికుఁ డార్యసమ్మతసదాచరణప్రవణుండు వారిలో. ౧౨౮

3. ఉ. ఆయన పుణ్యశాలి యగుసన్నవిశేషము నిన్నువంటిసు
శ్రీయుతుఁ డాత్మజుండగుటచే ధ్రువమైనది తండ్రియోగ్యతా
శ్రీ యెసఁగింపలేని సుతుచేఁ బితరుల్ తరియింపఁబోరు, స్వ
శ్రీయశ మిచ్చుఁగావుతఁ బితృప్రియ ? నీకుఁ బితృప్రసాదముల్. ౧౨౯

4. మ. కొమరున్ గొంటివి వంగడమ్మునకు నీకున్ బ్రీతి సంధింపఁగాఁ
గొమరున్ గంటివి దాన, నక్కుమరుఁడున్ గోర్కుల్ పిసాళింపఁగాఁ
గొమరున్ గాంచెడిఁగాక మాంతకును నీకున్ వేడ్క దైహారుతన్
గొమరుభార్యయును వైశమే యతనికిన్ గోముల్ ప్రసాదించుతన్. ౧౩౦

5. ఉ. రాజులయొద్ద మాకుఁ గలరమ్యతరప్రతిభావధానవి
భ్రాజితసత్కవిత్వపరిపాటి విశేషము మాపి వారిచే
రాజ బహూకృతుల్ గొనఁగ రాజసపాలనరేణ్య సాందిగా
నిజనమందు మమ్మును గణించి బహూకృతు లిచ్చె నచ్చుగన్. ౧౩౧

6. మ. తనయీవిన్ దనియించి యంతటను స్వాంతం బందు సంతృప్తిచెం
దనివాఁడై మనగోపభూవరుఁడు విద్యాదత్తుఁ డప్పట్టున
బ్బిన వైనస్యము నాఁగి స్వాలంకమణిన్ బ్రేరేప యవ్వారిచే
తను మమ్మున్ దనియింపఁజేసి ధనవస్త్రశ్రీవిశేషమ్ములన్. ౧౩౨

7. చ. "స్తుతికయి చెప్పుమాటలని చూడఁగఁబోకుము గోపభూవరుం
డతులితు డప్పుడుమ్ముఁ గనినట్టిధమ్మును దేవిమయుండ్ జను

శ్రితమునకైననుఁ మఱవఁజాలము పేరిమిపట్ల నీకును౯
బ్రిటియన నాఁటికిం జెలువపార్తియమువారల సత్కవీంద్రులన్. ౧౩౩

8. సీ. వినుతిసల్పినమాత్ర విని వేగ రక్షింపఁ జాలియెయ్యభయహస్తమ్మువాఁడు
పరిణతిఁ గొల్చినమాత్రఁ బరమాదరము చూప నోపెడుకనుదమ్ములొలయువాఁడు
కరము మోడ్చినమాత్ర వరములీయ సమగ్రమైనమెత్తనిచిత్త మూనువాఁడు
అపరాధ మొనరించి నంత బుద్ధిని జెప్పి తనభక్తులను బ్రోవఁ దలఁచువాఁడు
తే. గీ. వేంకటగిరీశ్వరుండు నిరంకుశుండు కరుణమైఁ బ్రోచు శ్రీచెలికానివంశ్యుఁ
డగు జగన్నాథరాయని నతఁడుగొన్నపట్టి శ్రీమంతు రాజగోపాలరావు. ౧౩౪

9. శా॥ శ్రీనీలాఖ్య ఖుసినీలా వేంకటమహీభృన్మందిరావాసకే
శ్రీమంతుం డగువేంకటేశ్వరుఁడు పాలిన్ భక్తమూర్ధన్యమే
ధానూన్యున్ జెలికానివంశజు జగన్నాథక్ష్మాజాని శ్రీ
రామకృష్ణను వీరిచిత్తనుతు సంరక్షించు నెక్కాలమున్. ౧౩౫

10. మ. అతిసౌభాగ్యం డగుభక్తితో సుతునితో నాయుష్యకో వైభవో
న్నతితో సన్మతితో మహానందకన్నారాయణాంఘ్రిద్వయీ
శ్రితకైవల్యగురుప్రశక్తితో నిరతమున్ శ్రీరాజగోపాలరా
ట్సుకృత, రామకృష్ణనిమతల్లిక కడున్ శోభిల్లివర్ధిల్లుతన్. ౧౩౬

11. సీ. విద్వద్వతంసమై వెలయు శ్రీగోపాలభూపాలకు యశఃపరిపూర్తి నెఱిఁగి
శ్రీరాజగోపాలకృష్ణయాభయమ నొందుర్తి స్తవనీయ గురుతరౌదార్య మెంచి
శ్రీరామచంద్రాంఘ్రిసేవారతుఁడు జగన్నాథరాజేంద్రుసాన్నిత్య మనసి
పరమపాతివ్రత్యధరిత రామకృష్ణాంబయనుసమసత్త్వవర్తనము దెలిసి
తే. గీ. తాతవలను దాతవలను దల్లిదండ్రులవలను మఱదము గూర్పఁగఁ జాలినచదువుసొము
లభ్యసించి సదాచార మలరఁ గీర్తి వరత నెగడుము రాజగోపాలరాయ. ౧౩౭

## శ్రీరాజా భుజంగరావు బహద్దరువారి నెంవన గోమూర్తివాహము,

## ఏలూరు.

1. శా. ఆకారమ్మునవిద్యయందు గుణసత్త్వమ్మునందున్ జను
శ్రీకళ్యాణపరంపరాపరిణతిన్ జెన్నొందుచున్నట్టి యా
శ్రీకృష్ణుండు చెలంగుతన్ సతతమున్ శ్రీమన్మహాలక్ష్మితో
నేకాకారముగా నెసంగెడిభవానీశుండు రక్షింపఁగన్. ౧౩౮

## ఇంకొకసందర్భమునఁ జెప్పినది.

1. ఏలురియందు రాకొమరి కియ్యెడఁ బెండిలియౌనటన్నఁ దా
నేలొకొ మాపురంబు వచియింపుము మాకవితాపమారి గ
గ్గోలొనరింపగా నిపుడు గొనితెచ్చితి మోభుజంగభూ
పాలక దీనిపల్కు చెలువం బొకయించుక యాలకింపుమా ! ౧౩౯

## మఱియొకసందర్భమునఁ జెప్పినవి.

1. మ. ఎలమిన్ సత్కవివై ధరాధిపతివై యీరీతి నీకాఁడు నిం
డిలికిని సత్కవులందఱన్ బిలిచి పాండిత్యంబు మన్నించుచోఁ
బులులన్ మేఁకల నొక్కచెర్వున జలమ్ముల్ ద్రావఁగాఁ జేయు చ
క్కలఁ జూపించితివయ్య ? కౌశలమునన్ రాజా ? భుజంగాధిపా! ౧౪౦

2. శా. "ఏకగ్రీవముగాఁ గవీశ్వరులు మాయింటన్ బ్రవర్తింపఁ బ
ట్టాఁకల్ మాని" యటంచు ముస్పృహము సంప్రార్థించి రప్పించి "రా
జీ" కల్పింప దయోదయమ్ముఁ గని మాచిత్తంబు లేకున్న "గో
రీ" కట్టింపమె ? కాకవిప్రతతి కర్థిన్నేఁడు హేలాపురిన్. ౧౪౧

3. ఉ. దగ్గ అనున్నయప్పుడు యథార్థపుదాసులపొల్కి నుండి కే
లొగ్గుము, నొద్దలేనపు దయోగ్రప్రమోదలు మోగ్రఁగు మన్నయీ
ముగ్గురుమూర్తులన్ ధ్రువతమానిభకీర్తుల సైఁపఁజూమ్మి యీ
ముగ్గురుమూర్తు లొక్కటయి మూఁగినయట్టి భుజంగరాడ్విభూ. ౧౪౨

## వేఱొకసందర్భమునఁ దిరుపతిశాస్త్రి చెప్పినది.

1, క॥ వెలనాఁటివారెఁ గవితను వెలనాటినవాఁడ, పట్టి వెలనాటిని గా
వెలమిన్ దర్శివిడులకన్నను వెలనాఁటులె తెలుఁగుఁగఁ యివిందులు తలంపన్ .౧౪౩

## శ్రీభుజంగరావు బహద్దరువారి తృతీయపుత్రికావివాహము.

1. క. కవి వవధానివి, రాజవు కవితాకన్యకలఁ గన్యకలఁ జెక్కఁగఁ గం
టివి జగతిని నీతో సము లెవరయ్యా ? యోభుజంగ పృథ్వీనాథా. ౧౪౪

2. సీ. ఎవరింటికిని బోవు టెఱుఁగని బాంధవుల్ చనుదెంచినారు మీసదనమునకు
నేరాజుపిల్చిన నేతేనికవీంద్రవరులు మీయింటికి వచ్చినారు
ఎవరియింటను బెండ్లి నేని జూడనివేడుకలు మీగృహంబునఁ గాంచినారు
ఏజన్మమందైన నెఱుఁగనిభత్యముల్ మీయింటఁ దృప్తిపై మెసవినారు

తే.గీ. ఒకటికంటెను నొకటి యింకొకటి హెచ్చుతోఁ బంచేయఁగ బలిక! ఘనుఁడుల్ద పెండ్లి
చేసితివి చేయుచుంటివి చేయఁగలవు సకలకవిగేయ? రాజాభుజంగరాయ? ౧౪౫

1. శ్లో॥ హరిహరహిరణ్యగర్భా దదతు సభార్యా స్తస్యవధ్వాశ్చ
ఆయుర్విద్యాం లక్ష్మీం పాత్రిభవ మైశ్వర్య మపి చ సౌభాగ్యమ్. ౧౪౬

2. ఆ.వె. మంత్రిశ్రేష్ఠ వీవు, మంత్రి పెద్దశ్రేష్ఠ నీయనుంగు రంగనాయకమ్మ
యొకటి కొకటి యనక సకలధర్మంబులఁ జూచు చేసికొనుము జోగరాయ? ౧౪౭

3. సీ. పతిని దైవమ్ముగా భావింపవలెనమ్మ? తరుణి మాటలు వినవలెనటయ్యా?
అత్తమామలమీఁద భక్తి చూపఁగదమ్మ? వినయంబుల దనము చూపింపకయ్యా?
మానినిచుట్టాలపై మమతఁ జూపఁగదమ్మ? సతివైపులను గొప్పజరుపుమయ్య?
మగఁడు చేసిన తప్పు మాటు చేయఁగదమ్మ? తెలివిని సవతాండ్రఁ దేకుమయ్య?

తే. గీ. పతికిఁ దలలోని నాల్కవై ప్రియలు మెప్పు,రంగనాయకి! ప్రియుఁడనొరంగళయని
యువిదముం గొంగు పసిండుపై యుంచుమయ్య?, జో రాయ? వధూసమాయోగ గేయ?

4 సీ. నీతాత సుకవికల్పితుఁడు చల్మయమంత్రి, నీతాత నరసింహనీతివిదుఁడు
నీమామ్మ కామేశ్వరీమాన్యచరిత నీయమ్మమ్మ యలలక్ష్మియమలకీర్తి
నీతండ్రి సత్యవిఖ్యాతి వేంకటరావు నీతండ్రి భుజగాధనిధవుండు
నీతల్లి చెల్లాంబ నీతికోవిదురాలు నీతల్లి సుబ్బాంబ పూతచరిత

తే. గీ. కృతుల నందినవాఁడును గృతులు చెప్పి,గన్నదానమ్ము సంపు విఖ్యాతయశులు
వారిపోలిక జగతిలోఁ జేరుమనుము,రంగనాయకి? యోజోగరాయ? నీవు ౧౪౯

5. ఆ. వె. మును భుజంగరాజుతనయ సురాధిప,తనయునిక్ వరించె దప్పటంచు
ఘనభుజంగరాజతనయ భూమీసుత,ప్రవరసుతునిఁ జెట్టవట్టె నేఁడు. ౧౫౦

## శ్రీ భుజంగరావుగారి చతుర్థపుత్రికావివాహము.

1. శ్లో. యస్మిన్ నానదుహాంభ్యాం, యా దేవీ సర్వమంగళా
తావివౌ దంపతీ పాయా స్తామేతౌ జంపతీ పునః. ౧౫౧

శా. రాజాంకుండు భుజంగరావు నవిసర్గపరిక్రియన్ జేయు వి
భ్రాజన్నైకవిధాన్నదానజనితాపారంపుపుణ్యమ్మమే
యోజంటన్ సిరులిచ్చి ప్రోచు మఱి దోడింకేటి కన్నైన, సీ
తేజశ్శాలుల నీవధూవరుల నేదీవించు శ్రీ కాలక్. ౧౫౨

## శ్రీ సోతు వల్లూరు నృపాలకుమార నామకరణ మహోత్సవము.

1. మ. శ్రీరుచిరుండు భక్తజనసేవ్యుఁడు పాదకృపాకరుండు భూ
దారుఁ డుదారుఁ డవ్యయుఁడు తంగుఁడు సెంగుఁడు వేణునాదపున్

ధోరణి వేత్రఁతలన్ వలపుదూఁగఁగఁ జేసినవేల్పుసాతు వ
ల్లాయస్పాలవాలికి మహోన్నతసంపద లిచ్చుఁగావుతన్. ౧౧౩

2. తే. గీ. సత్యనారాయణవరప్రసాదన్నపతి, కొమరునకు నామకరణోత్సవము నొనర్ప
నెంచి కవిగాయకుల వెలయించుబోండ్ల, నోలి రావించెఁ దోట్లవల్లూరిపురికి. ౧౧౪

3. మ. సుకుమారుండయియొప్పు బరిశ్రమపుసంకోచంబులెక్కింప కూ
రికిని బల్లెపుఁబట్టణంబునకుఁ జేర్మిన్ దానుగా నేగి బం
ధుకులంబున్ దనమిత్రవర్గమును నెంతో ప్రీతిమైఁ బిల్చి వా
రల రప్పించెఁ గుమారనామకరణప్రారంభసంరంభియై. ౧౧౫

4. ఉ. వచ్చిరి రాజబంధువులు వచ్చిరి మిత్రులు సత్కవీశ్వరుల్
వచ్చిరి గాయకోత్తములు వచ్చిరి వారవధూపరంపరల్
వచ్చిరి వాద్యకోవిదులును వచ్చిరి యొప్పుగఁ జూచినన్ బురం
బచ్చపుసంతసంబునను నాకరమై కరముం భరంబుగన్. ౧౧౬

5. మ. ఇఁక నెల్లుండి కుమారనామకరణం బింపారఁ గావించు నం
తకు మున్నే సుకుమారవారవనితా నాట్యప్రసంగంబులన్
బ్రకటీనూనము లౌప్రభేదములచే బంధుప్రజాస్తోత్రితా
ధికులన్ బంధురమోదవారినిధిలోఁ దేలించె వారాంగయుమున్. ౧౧౭

6. సీ. ఇరువుర జతఁ జేసి యేకరీతిగ నాట్యమాడించు నొక్కొక్కయవసరమున
మూఁగుర గుమిగూర్చి ముచ్చటనృత్యంబు లాడించు నొక్కొక్కయవసరమున
నలువుర నొనఁగూర్చి నలువొప్ప లాస్యంబు లాడించు నొక్కొక్కయవసరమున
నార్గుర నేమించి యనువొప్ప నృత్తంబు లాడించు నొక్కొక్కయవసరమున
తే. గీ. పెక్కుపూబోండ్ల రంగంబు నెక్కఁ జేసి, పక్కనాడించు సుక్కువనొక్కమాఱు
అచ్చరలసుధ్య నలువువియచ్చరేశు, మాదిరిని దెల్ప సత్యప్రసాదనృపతి. ౧౧౮

7. శా. కోలన్ కేలను గీలుకొల్పి పెలుసుల్కఁబోఁగ్లు భూపిల్లవేల్
గోలన్ నాఁగ ప్సనప్రధానపుగతుల్ సూపించి మఱ్ వేరొకా
జాలంబుల్లెమహాళి ఇన్నొనిన విస్తారప్రమోదాబ్ధిలో
నేలా తేలకయుండు? దుఃఖియగువాఁ డేనిన్ గిళచ్చోద్యమై. ౧౧౯

8. మ. తనకున్ హాస్యమొనర్పఁగాఁ దగినయా స్త్రశ్రేణి కెవ్వుడ్గరో
వనితల్ నాట్యమొనర్పువేళ సభ నవ్వున్ వాండ్రచే మార్దవం
బునకున్ దప్పనికొంటెచెయ్యులు రసంబున్ బట్టఁగాఁ జేయున
జ్జనపాలాగ్రణి సత్యభూపతి మహోత్సాహంబు దీపింపఁగన్. ౧౨౦

9\. క. కలఁగించిసరోవెలఁదికిఁ,గలఁగింపఁగ నొప్పికొనినకామికి నాపై
వెల్గులుగుచీరలును ముత్యాలజోడులు కానుకిచ్చుఁ బోలు వెసఁగంగన్. ౧౬౧

10\. వ. ఇటు లొకరొండునా ళ్ళరిగె హేలగ "మోటరుకారు"లప్పటి
ప్పటికిని మిత్రవర్గముల బంధుజనంబులఁ దెచ్చుచుండె నం
తటు సుమహోత్సవంపు సుదినం బరుదెంచె నృపాలమౌళి క
చ్చటికవిగాయకావలకు సంతతకాంతవసంతతుల్యమై. ౧౬౨

11\. మ. భగవంతున్ దొలుతన్ యజించి పిదపన్ బాలున్ శుభాపేక్షుఁ జే
యఁగ నద్దేవుకృపాధరంబున సుపేర్గు మూర్తుల్ మహైశ్వర్యముల్
దగునంచున్ మది నెంచి సత్యవసుధాధ్యక్షుండు తన్వంగితో
భగవంతున్ వ్రతదీక్షమైఁ దనిపె దేవన్ సత్యనారాయణున్. ౧౬౩

12\. వ. వ్రత మొనరించి సాంగము వైభవభాగ్యదశోచితంబుగాఁ
గృతి కృతకృత్యుఁడై నృపతి కూరిమిబంధులకేమి మేటిపం
డితులకునేమి సత్కవిమణిప్రకరంబునకేమి పత్నితో
నతి యొనరించెఁ బూర్వజనవాఘులఁ దర్య దలంపఁజేయుచున్. ౧౬౪

13\. క. ఆ తతి నమస్కరించిన,భూగోపాలకుని భక్తిపూర్ణతకు మదిన్
లోఁగిన పేరిమి పెంపున,నీ తి నాశీర్వదించి రెలమిఁ గవీంద్రుల్. ౧౬౫

ఆశీర్వచనము.

14\. అనుకూలదాంపత్య మలరించి నినుఁబ్రోచు సామేన సతి గల్గుశంకరుండు
అనుపమానశ్రీల నర్పించి నినుఁ బ్రోచు నురమున సిరి గల్గువరధరుండు
బహుళసంతానంబు ప్రబలించి నినుఁ బ్రోచు బొజ్జ మెల్లఁ గనినయజ్ఞప్రసూతి
ఒగి నిలోఁ గధికరాజ్య మొసఁగి నిన్ను బ్రోచుఁ ద్రిభువనంబుల నేలుదేవవిభుఁడు

తే. గీ. సత్యనారాయణుండు ప్రసన్నహృదయుఁ డెప్పుడును నిన్నుఁ గంటికి ఱెప్పపగిది
ససుతు సకళత్రు చిరు లిచ్చి సాకుఁగాక,సత్యనారాయణవరప్రసాదభూప. సీ॥ గా॥

15\. సీ. పుల్లలమ్మెడివాని కెల్లలోకము మెచ్చ శ్రీమత్తు యొసఁగి రక్షించినాఁడు
పొగరుఁబోతయి తనపూజ మానినజచ్చువాని యజ్ఞానంబుఁ బాపినాఁడు
వ్రతము చైఁ దేవ్రకుమారకులప్రసాదంబు తినని కొనికి బుద్ధి తెల్పినాఁడు
తొలుదొల్త భువిలోనఁ దుంగధ్వజనృపాలువలని భక్తికి తాన వలసినాఁడు

తే. గీ. రత్నగిరి నుండుసత్యనారాయణుండు,తనవ్రతము సేయునృపతికి ధన్యపతికి
సత్యనారాయణవరప్రసాదకృతికి,నెలమిని నిలోఁ గధికైశ్వర్య మిచ్చుఁగాక. తి॥ గా॥

16. మ. తతదీవ్యత్స్వవైభవం బలగ నంతన్ సత్యనారాయణ
వ్రతసంపూర్తి యొనర్చి వేడ్కకట భవ్యంబై మహాచిత్ర చి
త్రితమై విద్యుదుదారకాంతి పరిశ్రీసౌరభోపేతమై
కుతుకంబుంగని దైవమండపమునన్ గాన్పించి నిస్తంభమై.

17. చ. సతి పసిబాలునిన్ మురువు సంతసమున్ మురిపంబు నిండ నం
కతలమునందుఁ దాల్చి తమకంబునఁ గేర్చి వసింగఁగాఁ బుధో
హితులును బండితుల్ సుకవులెల్లరు బంధులు మిత్రులున్ మహో
న్నతి సభ నుండ రాకొమరునామ మహోత్సవ మాచరించుచున్. ౧౬౯

18. తే.గీ. బంధుజనసమ్మతమ్ముగఁ బండితప్రకాండహితముగ నాథరాకాంతుఁ డెలమి
బాలునకు భాష్యకారనృపాలు పేరు, వెంకటపద్మముతో మేళవించి యునిచె.

19. ఉ. ఆడిరి వారకామినులొయ్యారము తోరముగాఁగ గాయకుల్
పాడిరి సత్కవీశ్వరులు పద్యమయంబుల నాశిషంబులన్
వాడిరి బంధుగుల్ హితులవారిగఁ గానుకలిచ్చి వెట్టి రల్లపూ
బోణులు కర్పూరహారతులు పొందిగ నిచ్చిరి మెచ్చి యెల్లరున్. ౧౭౦

ఆశీర్వచనపద్యములు.

20. శా. శ్రీ యిప్పింపతి భార్యచేఁ గొమరుచేఁ జేయించు నాయుర్మహ
శ్రీయంబింకొకకుట్టుచే వసమ శ్రీసొంపు వాటించఁగా
జేయున్ శ్రీపతి వేణునాదగతి నీ చిన్నారి వేల్పట్టి కో
రాయగ్రామణి? భాష్యకారనృపపుత్రా? సత్యనారాయణా. వెం॥ శా॥ ౧౭౧

21. సీ. గిరిరాజసుతపాదగిరిటిలోపలి కుసుమయ హాళిమైఁ గనురాజమాళిపగిది
నంభోధిసుతచేతులందాడుతను బాతునందంబు గనుదానవారికరణిఁ
బాలోమి కౌముదిలోన బంగరుజయంతు నిరీక్షించుచుండు దేవేంద్రునట్లు
లసమాయకరముల నలరారు బాలచంద్రుని చెన్ను గనుగౌరి కనినవిధమున

తే. చెలువయొడిలో నెసఁగు చిరంజీవి చెలువు కేల గనుఁగొను మన్ బారసాల సేయు
సత్యనారాయణవరపరిసాదరావు, వైభవముఁ బొంది మరి వేణుగోపాలమూర్తి. ౧౭౨

22. సీ ఆయుష్య మొసంగి నీయున్నతసంబొందు నది యీయఁ దగు పతురాననుండు
ఆరోగ్య మొసంగి నీయసునుగు గూనన్ బొందు నదియిచ్చు సూర్యనారాయణుండు
ఐశ్వర్య మొసంగి నీయాత్మజాతుని గాచుంగి యీయఁ దగు నగజాధినేత
సామ్రాజ్య ఫలరించి సాకు నీతనయుని నది యొచ్చు నల్గుసురాధిపతియు

తే. గీ. నీతి వైతేయగురుఁ డిచ్చు నీతనయున, కితరసద్గుణముల నిత్తు రెల్లసురలు
చారుతరలీల? సౌరువ్యాసపాల?, సత్యనారాయణవరప్రసాదభూప. తి॥ శా॥ ౧౭౩

23. తే. గీ. అన్నదానంబు విప్రుల కాదరించి, భూరిసంభావన యొసంగి పూజసేసె
మఱియు నెన్నెని విధముల మహిపుఁ డల్ల, నాఁడు పేదలఁ దనిపె నానందగరిమ.

24. చ. అతనియనాంత్రభావమున శంతనుఁ దోడుగ రాకుమారునా
యతి కొకపెద్దసాక్షిగఁ జిరార్జితసస్యసమృద్ధజీవన
స్థితికి నిదానమై కురిసె జీవనదంబులు రైతులుం దదా
శ్రితులును నెల్లవారలును జీవనదంబులభంగిఁ బొందఁగన్. ౧౭౪

25. క. నలువురుననయులు దానుం, గొలువున నాస్థానగాయకుఁడు కోటయ యిం
పులు గులుకఁగ గానంబున్, జలిపెన్ మేలలర నాఁటిసాయాహ్నమునన్. ౧౭౬

26. చ॥ ప్రసదము మీఱ బందరుపురమ్మున యందలి మేటి "యిండియన్
డ్రమెటికుకంపెనీ" యనెడునాటకసంఘము వచ్చి చూపె రా
కొమరుని భావభావుకత్వమున్ గుమురై తగు "కృష్ణలీల" లం
దము గ సదస్యులెల్లరు ముదంబున సారెకు నోలలాడఁగన్. ౧౭౭

27. క. మఱునాఁ డుదయమునందున్, నరపతి తనబంధుమిత్రనాగాశ్వాస వీ
శ్వరగాయనగాయకు లె, ల్లరతో ఛాయాపటమ్ములన్ దీయించెన్. ౧౭౮

28. తే. గీ. పిదప నీయెల్లపరిజనుల్ వెంటరాఁగఁ, గృష్ణవేణికిఁ జని కరటేంద్రమొకటి
సేవకర్పించె జలకేలికిఁ గరీంద్ర, పాలనుం డగువేణుగోపాలపతికి. ౧౭౮

29. క. భూధవుఁడు పిదప వేంకట, భూధరపతికిన్ బ్రపన్నపోషకునకు శ్రీ
యోధాయకునకు దీపా, రాధన మొనరించెఁ గడుదిరం బగు భక్తిన్. ౧౮౧

30. తే॥గీ॥ నాటిసాధ్యాహ్నమునఁ గొల్వుకూటమందు, సరసతిరుపతివేంకటేశ్వరులిరువురు
గవితజెప్పిరి పిమ్మట గాయకమణి, నాగభూషణముం బాడె నాణెమెసఁగ. ౧౮౧

31. తే.గీ. నాగభూషణుగానంబునకు సహాయ, మగను వాయించె మద్దెలముదముదనర
ధాటిచెన్నారసఁ యశ్వధాటిరావ, మూర్తి తనయింటిపేరియబ్బురము దోఁప. ౧౮౨

32. క. ఆరేయి మగల గారపు, వారాంగన లాడిపాడ వారలతో సిం
గారముగ నిగారముగా, నా రాయఁడు గడపె నాప్తు లగువారలతోన్. ౧౮౩

33. క. మరునాఁ డుదయము కృష్ణా, పరిసరమున నున్న చూతవనమున కెలమిన్
బరివారముతోఁ జని యం, దఱతో విందారగించె ధరణీంద్రుఁ డటన్. ౧౮౪

34. తే॥గీ. అట జలక్రీడ లాదిగా నవని నేత, తనదునాప్తులతో ధనాంగనలతోడ
వాద్యఘోషంబులోఁ గృష్ణవారి నాడెఁ, గనెడివారల కానందమినుమడింప. ౧౮౪

35. చ. పదపడి యాకసంబున "శుభాలు శుభాలు శుభాల్ శుభాలు"మం
చుదయమునందె బిట్టుఱుము" లుర్విపయిన్ బడు నభ్రిమన్నటుల్
కదలెను వాయువుల్ సికత గప్పెను దిక్కుల నెల్ల వానయున్
మొదలిడె, సుంతయైనఁ దన,మోహము భంగము గాద కేనికిన్. ౫౮౯

36. తే॥గీ॥ సత్యనారాయణ వరప్రసాదస్వపతి,సత్యసంకల్పుఁ డనుచుడి చాటుకొఱకె
కాని యావాన తుంటవిఘ్నకారియయ్యెఁ, బిదప తుంటవిఘ్నకారిగాఁ బొదల దయ్యె

37. తే॥శ్రితులతో వారసతులతో హితులతోడ,బరిజనులతోడఁ బెక్కువాద్యములతోడఁ
నేను గులతోడఁ బురము కేగుదెంచె, రాజు సాయాహ్నమున గజరాజు నెక్కి.

38. క. మొల్లలనెటి గ్గొల్లి వెల, ద్విజగమనలసన నృపతిప్రియుఁడు మై
నిగ్గులు వెలార్పఁ జేసెడి, మొల్లలచేఁ గొంతదర్పమ్యమున్ దీయించెన్. ౫౯౦

39. క. చిన్నలకుఁ జిన్నయై కను, మిన్నలకున్ మిన్నయగుచు మేదురమోదా
భ్యున్నతికిం గుదుగైన యా, మన్నీఁ డెన్నేనిగతుల వది దనియించెన్ ౫౯౧

40. ఉ॥ ఆమఱునాఁడు నూటపదియాఱులు మేలిమివస్త్రముల్ మొదల్
గామరియాదకుందగిన కానుకలిచ్చి సగౌరవంబుగా
నామహినాథుఁడంపెఁ గవు లాదిగఁ గల్గినవారి నెల్ల వా
రామెయి నేగుచోఁ దనయు వారక ధారక ముద్దిపఁగన్. ౫౯౨

**శ్రీసత్యనారాయణ వ్రతసమయమందు నాయుడుగారి కాశీర్వచనము**

1. ఉ॥ గానమునందు నేర్పరి యఖండుఁడు తా నఘానితపట్లవి
జ్ఞాని లయప్రపంచమున నాయుడుగారిని గాంచి వేశ్యక
న్యానిచయంబు గ్రామునన్ భయమందెనటన్లు భీతి లో
నూనుచు రిట్టవిజ్ఞుఁడు మహోన్నతిఁ గాంచుత కేనిసత్కృపన్. ౫౯౩

2. ఉ॥ పిన్నటినాఁటినుండియును వేశ్యలయిండ్లను నేగువాఁడుకన్
వన్నెకు నెక్కనీవు నిశినాక యహంబన కెన్నిసందులో
దన్నియ వెన్ని గొందులనొ యేద్దెఱ సారెకుఁ బోయి భోగపుం
గన్నెలఁ దేర నేర్చితివి గావున మెచ్చఁగవచ్చు నాయఁడూ! ౫౯౪

3. తే॥గీ॥ అవసరంబైన సంజీవినైనఁ దెచ్చి, యాంజనేయుని బురణించు నట్టినిన్ను
నీకు బ్రియమైనవేశ్యకన్నియలయాట, పాట లెల్లప్డు సిరులిచ్చి ప్రబలఁజేయు.

ఇంకొకసందర్భమునఁ జెప్పినది.

1. చ॥ తనప్రియమైనవేశ్యకయి తాఁ జనుటన్ నిజభార్య యెట్టులో
తనుఁగొని తన్ను మిక్కిలిగ గారియపెట్టుడు నాపెతోడఁ దా

నన్నుతపునీటుమాట లవియున్నియు నాడియు వేశ్య వీడకే
ఘనుగతి వీధిలో మెలఁగఁగాఁ దగువారలు కొందఱయిలన్. ౧౯౬

## సాయంకాలము కృష్ణానదిపై నౌకాయాన మొనర్చునపుడు చెప్పినవి.

1. మ॥ అదె సంధ్యాసతి కృష్ణలోన జలకం బాడంగ నేతెంచెఁ ద
న్మదిరాక్షీమణియంగరాగపుపసన్ నద్యంబువుల్ తళ్కు బె
ళ్కొకనన్ వైళము యూపెగోప్యతనమై యూహించి వేశ్యలాడ ది
క్పుపతుల్ నించినవెల్లచీరలన బొల్చున్ నీటిలో మేఘముల్. ౧౯౭

2. చ॥ దయగలవాఁ డుదారగుణధాముఁడు దాత మనోజ్ఞమూర్తి స
త్యయశుఁడు సత్యకాముఁ డనృతప్రతిపక్షుఁడు దేవభూసురా
న్వయభజనానురక్తుఁడు విహారవిహారరసికుండు సర్వదా
జయమును సంపద ల్గాంచు సత్యనృపాలుఁ డేసంబుగా వ్రతన్. ౧౯౮

3. మ॥ ఒకసత్తానము వేణుగోపకృప నా కొప్పారె నబ్బాలునా
మకృతిస్ఫారమహోత్సవమ్మునకె మీ రామ్రవీటి కేతెంచినా
రిఁక నాకున్ కృతిరూపసంతతిని మీ రిప్పింపఁగా మీకు నే
నకలంకం బగుభక్తి మ్రొక్కిడెద నత్యాదృత్మన్ బొనర్పఁదగున్.

4. శా॥ సాయంరాగము నీటిపైఁ బరఁగు లచ్ఛాయన్ విలోకింప నౌ
కాయానంబున వచ్చునీకుఁ గడు వేడ్కన్ బూజఁ గావింపఁ గృ
ష్ణాయాన పతిపత్ని తాఁ బతిచె విన్నాణంబుగాఁగన్ దివా
సీయంచున్ మది నూహఁ జేసె గుణరాశీ! సత్యవల్లీనృపా! ౨౦౦

## డాక్టరు కాడిక్కు—కడియము.

1. మ॥ బలవద్రోగనివారణౌషధకలాపారీణు శ్వేతాస్యస
త్కులజున్ నిస్తులశాంతిదాంతిసుగుణస్తుత్యున్ స్మితాంచన్ముఖున్
లలితాంతఃకరణున్ సతీసుతయుతున్ నానత్యసత్కీర్తితో
నలరన్ జేయుతఁ గీస్తుదేవ మెలమిన్ యక్ష్ ఆరు కారిగ్గొరన్. ౨౦౧

2. శా॥ చిన్నారాయఁడు మాకు స్నేహితుఁడు సుశ్రీకుండు ఘోరార్తితో
నున్నన్ జూడఁగలేక చేయునది లేకొన్నాడ్పఁగాఁ గ్రొవ్వ లే
కెన్నో నొంగితులన్ శ్రీమఁపడఁగ నీ వేమిచ్చినన్ రానిసం
పన్న ప్రాణమణి వేగ దెంచితి లదా పద్మాకరిపోతంబవై. ౨౦౨

3. ఉ॥ వచ్చినవెంట నిన్నుఁ గని వ్యాధి భయంపడినట్టులై వెసన్
పోచ్చది పూర్తిగా సురిఁగి యూడ్చిగిలంబడి రాయమౌళికిన్

బెచ్చువెరింగ సౌఖ్య మది నిద్దుర చక్కఁగఁ బట్టఁజొచ్చె నే
మిచ్చినఁగాని తీఱదుసుమీ ? భవదీయబుణంబు "డాక్టరూ ? " ౬౦౩

4. ఉ॥ వైద్యము సేయవచ్చు ఘనవైభవ ముండఁగవచ్చు ఘోరరో
గాద్యపమృత్యువారకత నందఁగవచ్చు సదానిగర్వియై
హృద్యవచోభిరాముఁడయి యెల్లరఁ జల్లనిచూడ్కిఁ జూచు నా
విద్య సుదుర్ఘటం, బది వివేకికిఁ జేకుఱె నీకు "డాక్టరూ ?" ౬౦౪

5. శా॥ రామారాయఁడు చిన్నరాయనికి నారాయంపు మాకున్టుకున్
శ్రీమంత మ్మగునీదువైద్య మెలమిన్ జేకూర్చి రింకెట్లు నీ
ప్రేమం బిచ్చినమమ్ము వ్యాధిభయముల్ పీడించు ? మాకీప్సయిన్
సేమంబే యగు సేమమే యగు నగున్ సేమమ్మె "కారిగ్గొరా ?" ౬౦౫

## శ్రీ వేంకటాద్ర్యప్పారావుగారు, నూజివీడు.

మ॥ కవివై భూపతివై సదాసుమతివై కల్యాణివై నిత్యమా
గ్జవ మొప్పారఁగ నూజివీటు సుఖివై రాజ్యంబు పాలించు ని
న్నవలోకించునదృష్ట మిప్పటికి సంప్రాప్తించె నయ్యాయరా
జవరా ? తిర్పతిశాస్త్రికిన్ సుకవితాసాఫల్య మింపారఁగన్. ౬౦౬

2. ఉ॥ చిన్నతనమ్మునన్ రసవశీకృత మైనకవిత్వశక్తిఁ బ్ర
కొన్నభవాదృశావనిపకోరకముల్ వికసించు మన్నచో
మన్నన కేమిలోటు రసమంజులమౌ కవితావధూటి క
భ్యున్నతి వచ్చురోజు లివు డున్నవి నిక్కము భూమిపాలకా. ౬౦౭

4. తే॥గీ॥ శ్రీసమృద్ధియు సుగుణసమృద్ధి గల్గు, రాజ్యలక్ష్మికి సఖియౌ ము పూజ్యమైన
సుకవితాకన్య నిన్ను మన్చున్ సుకవివర్యాభినుతి గేయ! వేంకటాద్ర్యప్పరాయ.

## కోటలో నాఁడు జరిగిన నాటకముమగూర్చి.

4. సీ॥ భక్తి చిప్పిలెడిగోపన్న వేషము గన్నఁ గనుల కానందంపుఁగఱవు దీఱెఁ
బ్రాభవంబును శూరభావంబు దెల్పుసుల్తాను మేల్ సొరు దలంపవలదె ?
రామలక్ష్మణవేషరామణీయకవచో గౌరవంబుల నెంచ నేరితరము ?
తక్కునక్కన్నమాదన్న ప్రముఖులయుఁ వేషముల్ మిగుల సంతోషదములు
తే॥ గీ॥ నాటకం బెల్లను బ్రయోగపాటవమున, నాటపట్టయి యానంద మిచ్చెఁజేసె
నటులలోపము రానీని నాటకము సె, బాసు నాఁదగు శ్రీరామదాసచరిత. ౬౦౮

5. సీ॥ శయ్యారసౌచిత్యసంప్రదాయములకు సంతోషపడు కవీశ్వరులతోడ
ధారాచమత్కారధాటికి సంతసంపడు చుండు పండితవరులతోడ

"సుకవియర్యో" నటుంచు సొగియము చానందించు, తండ్రిలోనైన బాంధవులతోడ
నీతి విజ్ఞానాదితీరంత్రిములకు లో మెచ్చు, నుదోగ్యసమితులతోడ

తే॥ గీ॥ తన యొకర్ప్రనాటకం బనుపనుంబు, నూమభాగ్య బన్నష్టంబు శుభయశరేబు
నీవుం గాకెవ్వరికిం గల్గు ? నృపతులందు, వేంకటాద్యరిష్ప రాయవృద్ధీవతలేంద్రి.

## శ్రీనారయ్యప్పారావుగారు - నూజివీడు.

మ॥ చిరకాలంబుననుండి మేము ధనమార్జింపక బ్రియుత్నింప కె
వ్వరికిన్ శక్యులు గానితాద్విభుల భూపశ్రేష్ఠులన్ సర్వ
త్ర్వసోదారతరాంతరంగులను సంపాదించుకొన్నాము నే
య్యురుగాం గార్యములన్ గథల్ జరుగంగా నోనారయప్ప్మవరా. ౬౧౧

2. మ॥ ధర మావంతయు జేతంబూన నుహోత్సాహంబు పేరిరేపం బు
తృన కుద్వాహము నిశ్చయించితిని ఖర్చుల్ సేయంగా రెండువే
ల్దమకంగావలె నందుకై జడియ విద్వద్వార "మాత్మీయ" మం
చనుకోంజాలినవారు తాద్విభులు లేరా! నారయప్ప్మవరా ? ౬౧౨

3. మ॥ కవితాకన్యక నెన్నియేనియు నలంకారమ్ములన్ గూర్చి మ
క్కువతోం బెంచి భవాదృశోత్తములు కోంజేసి కోవండ్రి కుం
కువగాంగన్ నగ లిచ్చిరే యనుచు లోకుల్ దెప్పమావంటిస
త్కవులన్ జెందునకీర్తి రాజులది కాదా ? నారయప్ప్మవరా. ౬౧౩

4. మ॥ కవిమాన్యుం డగురాయచంద్రి ధరణీకాంతుండు మావేత ము
న్నవధానం బొనరింపంజేసి లిమి నూటార్లిచ్చె నాండాది మా
కవలో నొక్కరు యుష్మత్పియ మగుంతారన్ము నెకొంచును
న్నవిధం బిప్పుడు విన్నవించితింగదన్నా ! నారయప్ప్మపతీ. ౬౧౪

5. మ॥ ప్రతిసంవత్సర మేగుదెంచుచు భవత్సన్మానవం బేను స
మ్మతితోడం గయికోని పోతును తల పన్ లేకపోలేను నా
కతిభారం బగుకార్య మొందొదవునో నానాంటికిన్ దాని "దాం
చిటి" నంచున్ దలపోయుచుంటి గుణరాశీ ? నారయప్ప్మపతీ. ౬౧౫

6. తే॥గీ॥ పొట్ట పోషించుకొనుటకై పోలవరం,పాలకుండగుకృష్ణనృపాలుం డుండెం
బరిణయాదికశుభములు జరుపుపొంటె, భారమును బూనవలె మీరు మీరు మీరు.

7. తే॥గీ॥ "ఒక్కరే చేసి రవధాన మొక్క నూజి
వీట"ననువారు మీతండ్రినాటం బోయె

"నొక్కరే సత్కృతియుఁ బొందు చుండి" రనుటఁ
బాపవలె నీవు నాయపఖ్యాతిఁ దండ్రి ?" ౭౨౭

8. తే॥గీ॥ నీవు గాక వదలి కొసంగు నృపతివరుండ, వెల్లరను వేఁడువారల మేము గాము
అనుచు మీతండ్రియొద్దనే మునుపు విన్న,వించియుంటిమి నారప్పధీవ్రతలేంద్ర.

9. చ॥ అడుగకయుండు కార్యముల నన్నిటినిక్ దమబోటివారి కె
క్కుడుశ్రమ గొల్పకే జరుపుకొంటిని నేఁటికి మీరు మీరునుక్
గడపక చేయలేని గురుకార్యము పుత్రునిపెండ్లిగాన నే 6| 8
నడుగక తప్పదయ్యె సరసాగ్రణి నాగయభూతలేశ్వరా. ౬౧౭

## శ్రీకృష్ణనిర్యాణము- కాకినాడ.

1. కం॥ మాకాప్తుఁడు మాకొడయఁడు, మా కాలంబంబు రాజమార్తిక మపుడే
నా కాలయమున కరిగెక్, మాకృష్ణారాయ భూమివాగుం డకటా ! ౬౨౦

2. సీ॥ నాగరాజాదిజనశ్రేష్ఠాన మైనపెద్దాపవంశాబ్ధి నుద్భవముఁ జెంది
శ్రీకామమాంబికా శ్రీకరపాణిపోషణ శాణకషణపంసారక మంది
కొచ్చెర్లకోటాన్వయోర్చ్వమార్తికహారముగఁ జేరిమహిమణిప్రాన యగుచుఁ
బరమహూణాంధ్రగీర్వాణభాషాంగనాకంఠసీమల కలంకారమైన
గీ॥ రామచంద్రవేంకటకృష్ణరాయనామకమగుచు రాజయం బధికముగఁ గాంచు
టకును మాఱుగ మసియయ్యె నకట ! కాల యుక్తివత్సరమునఁ గాలయుక్తిచేసి.

3. సీ. పదిమందిపైనను బంక్తిని లేకుండ భుజియింప నేరనిపుణ్యమూర్తి
అపకార మొనరించునతఁ డేగుదేనైనఁ గోపమ్ముఁ జూపని ప్రాపకుండు
అలవిగానిప్రచార మడుగువారల నేని లేదు పొమ్మనలేనిసోదరుండు
ఆశ్రయించినవాని యపరాధ మెంతైన సైరియింప నొల్లనిసజ్జనుండు
గీ. చదువుల టిక్కాణ కరుణ లోగ్చనిదుకాణ, మాస్వజనముల ప్రాపు సన్యులకాపు
నాకమున కేగ నఖిలలోకైకనుతుఁడు, కృష్ణులను వేల్పుగావు మాకృష్ణరావు.

4. తే.గీ. శనిమహాదశ మంచియుచ్చదశ యంచుఁ
బల్కుకార్తాంతికులపల్కుబడు లన్నతము
లనఁగ శనిదశలోని శక్యంతరమునఁ
గుజుఁడు పాపాత్ముఁ డగుచు మాకొంప దీసె. ౬౨3

5. సీ. కలకలనవ్వుమీసల మోపల నటింప రాజనందగుముఖప్రభలతోడ
సమయానుసారిగా నమృతంబుఁ జిలికించు వచనగంభీరనిస్వనముతోడ

నాప్తులే తేర రండంచుఁ గుర్చి కేలఁ జూపించు వినయవిస్మితులతోడఁ
గరుణ చిందించు క్రేఁగంటిచూపులు మీఱ నలువంకఁ గనులోచనములతోడ
గీ. సౌధచత్వరమునఁ గొల్వుసాలయందుఁ, బడుకవేత్రాసనంబునఁ బ్రాఢి మీఱ
నుండునీరూపు ననగ పూర్జితోక్తు, లెట్లు వర్ణింతువయ్య! యోకృష్ణరాయ.

6. చం. ననుపగు నాణిముత్తెము లనందగునక్షరపంక్తి మీఱ వం
చిననడు మెత్తకుండఁగ మషీజలపూరిత మైనమేటిలే
ఖినిఁ గొని వేయిచేతుల లిఖించినయట్లుగ వ్రాయుకృష్ణరా
డ్జనపతిఁ బోలులేఖరి నిజంబుగ నింక ధరన్ జనించునే? ౬౨౯

7. సీ. శ్రీమత్తెగిలిగియుఁ జెన్నపట్టణకళాశాల "బి. యే" దాకఁ జదివినావు
చదువుకేగాదు భాషాసాగరం బెల్లఁ గుంభసంభవురీతిఁ గ్రోలినావు
క్రోలుటే కాదు పెక్కులుగ్రంథములు గొని గ్రంథాలయంబు నేర్పఱచినావు
శాసనసభలోన సభ్యతాపదవి గొంచెముతక్కువ యోఁడ్లు చేసినావు
గీ. పొందుకొనినావు సుగుణసంపద సమస్త, హృదయసీమలయందు సహృదయుఁడట్లు
నీకు లోటేమి? మేమెల్ల నిన్నుఁ బాయు, పాప మొనరింపఁగాఁ గృష్ణపార్థివేంద్ర!

8. ఉ. విలవిల యేడ్చుచుం బ్రజ "వివేకవిహీనుఁడు మంచిచెడ్డనేఁ
తల నెఱుఁగండు మూర్ఖుఁ డతిదారుణచిత్తుఁ"డటంచు రోయఁగా
నలుబదిరెండ్లుదేండ్లకె వినాశము నీకు ఘటింపఁజేసియా
నలువ పడెన్ వృథాజనులనల్వురనోటను కృష్ణరాడ్విభూ! ౬౨౯

9. ఉ. చూచితి వెల్లదేశములఁ జొచ్చితి వెల్లసభల్ నరేంద్రులం
జూచితి వెల్లవారలను సూరుల సత్కవులన్ దయాపరులం
జూచితి విందలోక మిఁకఁ జూడనదొక్కటియంచు నేఁగఁగాఁ
జూచితివేమి లేక విధిచోదితమో యిది కృష్ణరాడ్విభూ. ౬౨౭

10. సీ. పతిభక్తి నిత్యదైవతపూజ యతిథిసత్కారంబు వ్రతసువిధానదీక్ష
మొదలైనసుగుణముల్ పుంజీభవించి యద్వితీయ కటా! భవద్వితీయ
యిరువదియారేండ్లయింతి కెక్కుడ వ్రాసె వైధవ్యయోగ మావనజభవుఁడు
అనుమాయితి తప్పదా? యేమి కానుండెఁగాఁబోలు రెండవకావయాంబ
గీ. నీకు నీతండ్రిపోలిక నీపుగంధి, కరయ నీతల్లిపోలిక యన్నిగతుల
నబ్బె దివినుండి దీవింపుమయ్య! కృష్ణ, రాయ! కలుగంగఁ గొదవ సర్వంబుమాకు.

11. గీ. నీవు చదివినగ్రంథముల్ నీవు వ్రాసి, చేసినవికూడ పదుగురుఁ జేరి చదువఁ
దగినవని యెంచి కాఁబోలు ధర్మపుస్త, కాలయము చేసినావు కృష్ణావనీంద్ర! ౬౩౦

12. గీ॥ రావుబహదూరు లున్నారు రాజమాన్య, రాజపూజితులున్నారు ప్రజ నీయు
లైనమా కాకినాడ చంద్రాస్తమయము, నాఁటిరాతిరి యయ్యెఁ గృష్ణక్షితీంద్ర!

13. ఉ. లోపములం దెదో యొకటి లోకములోపల లేనివాఁడు లేఁ
డేపని చేసినన్ బరుల కెన్నఁడు హాని దలంపవీవు వి
ద్యాపటుసంపద ల్గలమహాత్ముఁడు సర్వజనోపకారచిం
తాపరుఁ డన్నఖ్యాతి విడిన న్నిను వీడదు కృష్ణభూపతీ! ౬౩౨

14. సీ. బహుకుటుంబములను భరియించితివి తత్తదనుగుణంబౌ పోషణము లొసఁగి
పెక్కుమందిని జదివించితి వన్నవస్త్రంబులు "స్కాలు" జీతంబు లిచ్చి
చాలమందికి మేటిసాహాయ్య మొసఁగితి వడిగినసర్వకార్యములు దీర్చి
కాపట్య మెఱుఁగనికరుణఁ జూపించితి వాశ్రితకోటిపై నాప్తులందు
గీ. నరిగితివి చెన్నరాష్ట్రంబునందు ఘనుల, యందుఁ దలమానికంబు ధరాధినేత
పండితుం డన్నఖ్యాతి తోడ్పడఁగ రామ, చంద్రవేంకటకృష్ణరాయేంద్ర దివికి.

15. ఉ. మంచమువీడఁ గాలిడె నమాసనిరోధిని నాఁటినుండి బా
ధించె జ్వరంబు భూతమయి తీక్ష్ణతరంబుగఁ గొన్నినాళ్లు వే
ధించెను నూపిరిన్ విడుచుతిత్తు లశించె నమూత్రవస్తు ల
భ్యంచిత మైనకృష్ణనృపుప్రాణము దీసె నివెల్ల నేకమై. ౬౩౪

16. సీ. హృదయంబు శోధించి కుదురు నంచువచించు నావల నాస లేదనుచు నుడువుఁ
బట్టిచ్చె మందంచు నట్టె సంతోషించు జ్వరము హెచ్చె నటంచుఁ బరితపించు
వాయుకోశము భగ్నమాయె నంచుఁ గృశించు వగరుపు గన్గొని భయముఁ జెందుఁ
జీర్ణకోశము కొంత చెడెనంచు దుఃఖించు జ్వరము లేదని యోచి సంతసించు
గీ. నిట్టు లైదారుదినము లనేకగతులఁ, జూపురోగంబు మరలింప నోపఁడయ్యె
బురభిషజ్మణి యిట్టి దుస్తరగదంబు, విడిచెఁ ద్రుటిలోనఁ గృష్ణపృథ్వీకళత్రి!

17. సీ. శతవధాన మొనర్ప సంసంలు కబురంపఁ బంపకుండఁగ మానిపింపలేదు
సర్వదేశంబుల సభలకుఁ బోవుచో వెంటరమ్మనకుండ విడవలేదు
పీటపైఁ గూర్చుండి పిలువనంపకయుండ నేదినమ్మున భుజియింపలేదు
మొదటినుండియుఁ దట్టుదుదదాఁక నొకరీతి గురుభావమున లోటు జరుపలేదు
గీ. నిట్టిరీతిగఁ బదునెన్మిదేండ్లు జరిపి, కృష్ణభూపాలకుఁడు దివి కేగె నేఁటి
కాయనను నాకుఁ గల్గుఋణానుబంధ, మకటా! దైవదౌర్బల్య మణఁచివైచె.

18. సీ. ఆత్మకూరునృపాలుఁ డాస్థానకవులు కండంచుఁ బెన్భక్తిఁ బ్రార్థించినపుడు
గద్వాలరామభూకాంతుండు మున్నగ్రహార మిచ్చెద నుండుమన్నయపుడు

నితరభూపతు లెంద ఱెందటో తవ యొద్ద నుంచుకోఁదలఁచి పిల్పించినపుడు
పాఠశాలలయందుఁ బండితపదవిఁ గైకొనుఁ డంచుఁ బౌరులుఁ గోరినపుడు
గీ. కృష్ణభూపాలగుణశంకుకీలితుండ, నగుచుఁ గదలఁగలేనైతి యకట యట్టి
పండితుం డైనబ్రాహ్మణప్రభు వుపాస్య, సుగుణుఁ డింకెవ్వఁడున్నాఁడీజగతియందు
19. గీ. సకలసద్గుణరాశిని సకలలోక, నుతుని బండితు విప్రభూపతిని గృష్ణుఁ
గంటివనుసద్యశము గంగఁ గలిసిపోవఁ, గాటి కంపితివే పాడుకాకినాఁడ !. ౬౩౯
20. సీ. రచియించినాఁడ బుద్ధచరిత్ర కృతిగాఁగ వేలినాటకములు మృచ్ఛకటిక
బాలరామాయణ పాండవవిజయ ముద్రారాక్ష సేడ్వర్డురాజమౌళి
పట్టాభిషేకముల్ పావనయుష్మదాఖ్యాభూషితంబులుగా నొనర్చి
నీకీర్తికాంతకీలోకమ్మునందు వసించుసౌధమ్ము నిర్మించినాఁడఁ
గీ. బండితుఁడు కవిమిత్రుఁడు బాంధవుం డ,నంగ మెలఁగితి దానికి నాకు నీవు
చేయుప్రత్యుపకార మిస్సి మహాత్మ !, వదలి దివి కేగుటా ? కృష్ణవసుమతీంద్ర
21. శా. ఆనందాత్ముఁడవై సుఖింపుము మహాత్మా ! సత్యలోకంబునం
దో నాకంబుననో వికుంఠనగరీమార్గంబునందో శివ
స్థానంబందుననో సమస్తసురసంస్థానాధిపత్యమ్ముతో
నానావైభవయుక్తితో నెపుడుఁ గృష్ణారాయభూపాలకా. ౬౪౦
22. గీ. గౌతమీపుణ్యపుష్కరకాల ముందొ,నర్చినట్టివి రెండుదానము లు గలవు
వానిఁజేయించుకొనుము నీభార్యచేత, శాంతివహిఁ గృష్ణరాయ ! నీయంతరాత్మ !

## శ్రీపోలవరం జమీందారుగారి శనిమహాదశ.

1. మ॥ శనిగా నీవరుదెంచి పోలవరసంస్థానంబుఁ బాలించు కృ
ష్ణనృపాలోత్తము కల్పపాదపముఁ బెల్బంగూల్చి యాచెట్టు మీ
ద నివాసంబొనరించు సద్ద్విజతతిం దైన్యంబుఁబొందంగఁ జే
సిననీచిత్రపుఁ జర్య లెల్లరును జీచీయంచు దూషించరే. ౬౪౨
2. మ॥ శని యేతెంచు బుణంబు తీర్చి నిఁక రాజ్యంబెల్ల వర్ధిల్లుఁ గృ
ష్ణనృపాలాగ్రణికంచు నందఱును బల్సంతోషముం జెంద సూ
ర్యనకుం దోడయి తత్ప్రయత్నముల కయ్యో ! భగ్నభావంబు నే
ర్పున సాధించి ఘటించితే మొదలికే మోసంబు వందాలుఁడా. ౬౪౩
3. శా. నీసంబంధములేక కృష్ణ నృపుఁ డెన్నేనాళ్లుదారాజ్యముం
జేసె న్మిన్నగఁ బెంచె నాశ్రితులఁ బోషించెం గవీశానులన్,

శాసించెన్ సభయందుఁ దట్టుతుదకుం దావైతి వోరీ శనీ !
నీసంబంధముచేత మాపెంగదరా నిర్భాగ్యదామోదరా! ౬౪౪

4. శా॥ చేయించెం జపముల్ సహస్రములు కాశీయాత్రఁ గావించె నా
సాయంకాలము నాప్రభాతము మనస్స్వాస్థ్యంబు లేకుండఁగా
నీయేర్పాట్లగుతించి జాతకము నెన్నేసార్లు యోజించె లే
దాయెన్ లాభ మొకింత నీవలన నిందార్య! శ్రాద్ధదేవానుజా ! ౬౪౫

5. మ॥ "కలలోఁ గన్పడెనంట నాఁటిడేఁ బిక్కల్ దీర్ఘముల్ దేహమిం
గల మాస్యంబదియోరసంబు వికటాగ్రభ్రూప్రసమాలోక మం
ఘ్రులమీఁదం బడునల్లకోటుగల యొక్కండంచు నాల్గైదు రో
జులకుంబోవుమ కృష్ణరావు యమరాట్సోదర్య నీవే మొకో ? ౬౪౬

6. మ॥ రజనీనాథుఁడు మున్ను గాఁగలుగువారల్ దాఁటునా మీఁద నీ
కుజనుస్సంగము వచ్చి మాపెంగదరా! కూలంకషప్రజ్ఞ చే
త జగాన్నిద్ధపు గాంతిఁ చేతఁ గవివిద్వత్పోషణాసక్తి చే
త జగంబెన్నఁగ బొల్చుకృష్ణజననాథఖ్యాత దీర్ఘాయువున్. ౬౪౭

7. శా॥ ఆచంద్రార్కముపేరు నిల్చుటకు మున్నార్జించెఁ దా నీతవి
ద్యాచాణక్యుఁడు కృష్ణభూపతి కవిశ్రేణ్యాఖ్యాతుల న్మమ్మ నీ
వేచందంబున దాని మాపఁ గలవోరీ! మంద! పాపాత్ముఁడా
నీచేయంగలదొండు చేసితివికాని ! లోపమేమి ? శనీ! ౬౪౮

8. శా॥ ఎన్నోధర్మము లాచరింపఁ దలలో నే వేళఁ జింతించు మా
మన్నీఁడింటకు మున్ను నీవెటులొగిన్ మాయించితో వాని మీఁ
ద న్నీకంటెనులేఁడు పాపమతి యేధర్మంబులేకుండ యా
పన్నుండై నరపాలుఁడున్న యెడ వీల్పాప్రయించి తోరీ శనీ ! ౬౪౯

9. శా॥ బాముల్ పెట్టకయుండఁ డంపె శని విద్వాంసుల్ ధరాపాలునిన్
భూమీదేవునిఁ గృష్ణరావునను చున్ మూర్ఖుల్ ప్రశంసింతుర్గా
కోమందాత్మ నినుంబలే యతనికాయుర్దాయమే యున్నచో
బాముల్ పెట్టఁగఁ జాలునే యొకఁడు దీవ్యత్కీర్తి కామూర్తికిన్. ౬౫౦

10. మ॥ తనయావాప్తి భవద్దశాంతరమునం దావైన దంచుం బుధుల్
వినిపింపన్ వినుచుం దదాశపడి సంప్రీతాత్ముఁడై కృష్ణుఁ డూఁ
కొనుచుం దద్దయు మిన్నకుండెఁ నకటా ? గుర్రొక్కండు ప్రాణంబు పో
యినదాఁక న్నృపు నీ వపుత్రునిగానే యుంచి తోరీశనీ! ౬౫౧

11, ఉ॥ చవలె నీదశ కృష్ణరాయనృపరాట్ప్రాణంబుతో నింక నా
సదువారాత్మక రాణి యెల్లప్రుడు నీసంబధముల్ లేక ని
న్నాదవంజేయుట కోసమేనియును నోరీమందా! కావించుచున్
దుచకుం దత్తుఁగ నింట నున్ననుపనీతుందమ్ము మోదంబునన్. ౬౫౨

12. ఉ॥ తమ్మునిగాకయున్నఁ దన దాయలలోపలి కుఱ్ఱివానిఁ జి
త్తిమ్మనకెక్క యోగ్యతము దత్తకుమారునిఁజేసి భర్తకున్
ముమ్మరమైనదుఃఖమిడు పున్నరకంబుఁ దరింపఁ జేయు ని
క్కమ్ముగ "వీలు"లోఁ గపటకారయితృత్వము లేకయుండినన్. ౬౫౩

13. శా॥ ఆరోగ్యంబు నొసంగఁజాలు వరదుండౌరౌర నీతండ్రి లో
కారాధ్యుం డటు వంటివాని కెటు మందా! నీవు నీతమ్ముఁడుం
గ్రూరాత్మల్ జనియించిరో ప్రజల గగ్గోల్వెట్టఁగా నంత కా
కారుల్ చెల్లెలోకర్తు చాలు నదియుం గాలించి కాలానుజా! ౬౫౪

14. చ॥ కవిబుధమైత్రి నీకుఁ గడకం గ్రహచారము చేతఁగాని నీ
కవిబుధమైత్రి కాలఁ గలకాలము వారలఁబ్రోవఁ జాలుఁ బో
లవాఁనృపాలుఁజంపెతి విలాతలమెల్ల నిసీ? యనన్ శనీ!
కవిబుధవైరి వైతివిగ కాలము కర్మము దాపరింపఁగన్. ౬౫౫

15. ఉ॥ నాదశ మూడు మంచొకఁ డనంతరమావిర్భవంబొసంగె నా
యీదశమాడుమంచుఁ జదువిచ్చె నొకం డొకఁడిచ్చె సౌఖ్యముల్
నాదశయంచుఁ బాపుఁడు ఋణంబులు పెంచె నొకండు కానియీ
నీదశవచ్చెఁ దుష్టుఁడవు నీమఁడ కృష్ణనృపాలుఁ జంపఁగన్. ౬౫౬

16. శా॥ మీకర్మంబది కాక నావలని పేర్మిం బెక్కురాజన్యుల
స్తోకప్రార్థవశాలు లేరు పడిరంచు న్నీ వనంబోకుమీ
నాకున్ గోపమువచ్చుఁ జంపుటకుఁ గృష్ణక్షోణిపాలుండు ధ
ర్మైకాలంబుఁడు నీకుఁగన్పడెనె యోరీవక్రచారీ! శనీ! ౬౫౭

17. శా॥ సామంతంబునఁ దెచ్చి పోలవరసంస్థానాలవాలంబునం
గామాయమ్మొక మొక్కపాతె నదియుంగల్పద్రుమంబై ద్విజ
స్తోమాధారమునై మహాఫలమునై దోర్వీధికిం బ్రాకుచో
నామూలంబుఁ బెకల్చివైచితివి మందా! మొక్క లేండఁగన్. ౬౫౮

18. శా॥ బుచ్చాయమ్మయుఁ దెచ్చి వైవఁగల దాబోద్రి న్నవాంకాంగమే
యొచ్చంబుంగనకుండఁగాఁ బెరిఁగి కల్పోర్వీజమానట్లుగా

నిచ్చల్ వేల్పులకెల్ల మ్రొక్కెదను రాజ్ఞీశల్లజంగూర్చి నీ
గచ్చల్ చూపకుమోరి నీకును నమస్కారంబు సూర్యాత్మజా. ౬౫౯

19. చ॥ ఆ చదువా మనోధృతియా మతియా స్మితపూర్వభాషణం
బా చతురోక్తులా గుణములన్నియు నేమయిపోయెనో నయ
శ్రీవన మంచుతిన్నక్రియఁ జేటు వహించు దిగుల్ భయంబు రా
నీవనుదెంచు నాఁటి కవనీపతి మాటెఱ శనీ ! క్రమంబుగన్. ౬౬౦

20. శా॥ వ్రాయించెం గురుఁడొక్క విల్లుసును ధర్మాత్మ లెన్నియో చేయఁగా
వ్రాయంగాఁబడె నందు నీవు మగలన్ వ్రాయించి తావిల్లిసీ
యేయేర్పాటులు లేకయుండ నెటు వీకింపయ్యెనో కాని వి
ద్యాయూదోఁగధి కృష్ణరా వతనివ్రాతల్ కూడ నిట్లుండునే? ౬౬౧

21. చ॥ అమలమనీషతోఁ జదివినట్టివి చిన్నవి పెద్దవాంగ్లగ్రం
థములొక యాఱువేలు జననాథుఁడు దాసముకూర్చియుంచె భ
ద్రముగ నెటో పురంబునకు దానము జేయఁగ వ్రాయఁ జేసి తా
సమయమునందు నున్న సహచారిగ్రహంబు కతంబునన్ శనీ ! ౬౬౨

22. చ॥ అనయంబన్నలు తమ్ములాత్మజులు విద్యాదేశికుల్ బాంధవుల్
తనకెల్లప్పుడు మిత్రులాశ్రితులుగాఁ దథ్యంబుగాఁగూడబె
ట్టినమాకృష్ణునకప్పుడాశ్రితుల మాటే జ్ఞప్తి లేకుండఁజే
సిన నీమశ్చరితంబు వ్రాయ శనిగా ? శ్రేపోహియుంజాలునే. ౬౬౩

23. మ॥ అమరంజాతక రాశిచక్రమున నీకబ్బెం ద్వితీయాధిప
త్యము ప్రాప్తించె వ్యయంబునందునికి మందా యందులో నీదశా
సమయంబైనపుడేల మానుమవురా చంపింప కాచావు లో
కముతోఁ పాటుగ నేలయుండును నపఖ్యాతంబుగాకుండఁగన్. ౬౬౪

24. మ॥ అగుకష్టంబని యొంపకట్టిపనికే నాశించువా రెందులో
దిగుచున్నందిగువారు రేయుమ! బవల్ నిద్రింప నందాఁకఁ బా
ర్శ్వగులైయుండెడు వారలాశ్రితులు మిత్రశ్రేణి యుద్యోగులుం
డఁగటా చేసితివొక్కఁడే నెఱుఁగకుండం జేయుచేఁతల్ శనీ ! ౬౬౫

25. శా॥ ఆయుర్వేద విధిప్రకారముగ వైద్యంబేల చేయింపరాం
గ్లేయప్రక్రియ చాలు దానివలనన్ లేదాయెలాభంబటుం
డాయీవైద్యులు పల్కు దేశభవ వైద్యశ్రేణి చండాల యే
స్వామ్యంబుంభొనరింప నీవయిలితిగా జాతిస్వభావంబునన్, ౬౬౬

26. శా॥ తల్లింజంపెను రాజయోగ మటుపై తద్భ్రాత్రిత్రి పోషించె నా
యిల్లాలే కొనె దత్తుగాఁ గుజునిచే నేర్పాటుగావించె సం
పల్లాకల్ లభ్యసించుటకు స్వర్భానుండు పెంచెన్ ఋణం
బుల్లాసంబుగురుఁడు కృష్ణునకు నాయుశ్ఛిద్రిపై తోశనీ. ౬౬౭

చ॥ శనిదశవచ్చునంట యదిచాలమహత్తర రాజయోగ కా
రిణియఁట యందు నేనఁబొరిఁబెదు ధర్మములెల్ల గొప్పగా
నొనరుతునంచు లో వల చు మఁడెను కృష్ణనృపాలకోరుకుల్
గొనకొని సున్నజుట్టితివి క్రూరుఁడ యొక్కటి చేయకుండగన్. ౬౬౮

28. చ॥ శనిదశవచ్చెఁ జంపెనని శాస్త్రమెఱింగిన పెద్దలెల్లఁ ద
ల్పి విని కృష్ణభూవరునిఁగేవల మీవుజ్వరాదిపై కసా
ధనములఁజావఁ జేసితని తథ్యముఁ బల్కితిఁగాని నీవయిం
గితుక యొకింతలేకు మమి నీరజభాంధవ పుత్రిగత్నమా. ౬౬౯

29. మ॥ శనిచాలండని చెప్పికొందురు విపశ్చిన్మర్త్యులావారలె
ల్లను సామాన్యముగాఁగ జాతకముఁ బోలంజూడ కేమున్న నీ
జననంబొందిన వేళ యట్టిదర నీనా! నిన్ను దుర్మూర్తి పో
యనివారెవ్వరు మిన్న కేకలుఁగ వాహా మంచియుం కెడ్డయున్. ౬౭౦

## శ్రీబాలగంగాధర తిలకమహారాజ నిర్యాణము కాకినాడ.

1. క॥ కలకాలము బ్రతుకుటె మన్న్యులకుణ్ సాధ్యంబుగా దనుత్తముఁ డకటా ?
తలఁచినపని కాకుఁడనె, తిలకమహారాజు మస్తతిలకంబరి యెన్. ౬౭౧

2. క॥ చేసినకృషి ఫలియించ్చె, వీసంబేనియును నమ్మవింపకమునుపే
కేసరి చనియెన్ ధీరా, నిసుడు డగుచునమరాటకేసరి యనియెన్. ౬౭౨

3. శా॥ త్యాగుల్ సర్వకళావిశారదులు "దాదాభాయినౌరోజి," గో
ఖ్లే, "గాంధి" ప్రముఖుల్ మహాత్ములు ప్రజాక్షేమంకరప్రక్రియో
ద్యోగుల్ గాంచిరి పేరు గొంద తెపు డెందుం, గాంచు మన్నారు గా
నీ గీతార్థసమన్వయంబు తిలకా? నీరీతిఁ గావించిరే? ౬౭౩

4. సీ॥ ప్రజలకోసము రెండుపర్యాయములు బందిఁ గొంకక కడగుండ్లు గుడిచినావు
జనులకోసనము రాజద్రోహ మను పెద్దకేసనంతి నుపేక్షించినావు
లోకులసేవ మాలోచించి యాంగ్లేయాధీశులతోడ వాదించినావు
ప్రజలేలవలయు రాజ్యంబు రాజచ్ఛాయ నందుఁ బల్ సభలు కల్పించినావు ౬౭౪

తే॥ గీ॥ పడఁదగినకష్టములనెల్ల బడియు ఫలము,ఖ౦బునకు రాఁదగినసమయంబునందు
హైందవావనిఁ దిలకశూన్యంబుఁ జేసి యేగితే? నీవు తిలక? లోకైకతిలక?.౬౨౫

5. మ॥ అరయంజాలియుఁ "దప్పుఁజేసి"తని కారాగారసంవాసముం
బోరి హంబాకుల్ విధియించి నిన్ననుపఁగా మాండాపురంబెల్ల న
త్తరి "నోహో? తిలకార్య" యంచడలి పత్యగ్రార్థిచర్యంబునం
దొరఁగంబోయె నఁకొర? నీఘనత యెతో తెల్ప నాశక్యవే. ౬౨౬

6. తే॥ గీ॥ జన్మదివసోత్సవము నీకు సలుపనెంచి, వంతనే లక్షరూపిక లరుగుదెంచె
నొక్కనాఁడఁట? తిలక? నీయుత్తమాఖ్య, ధేయగౌరవ మెంతయో! తెలుపవశమె

7. తే॥గీ॥లోకులొసఁగినదేకదా? "లోకమాన్య",బిరుదమొకటి"మహారాజ"బిరుదమొకటి
ఇవియ సాక్ష్యం బొసంగవే? భవముదార సుగుణసంపత్తి కోమహాశూర? తిలక.

8 శా॥ సూరత్పట్టణమందు సర్వపురవాసుల్ చేరి కర్తవ్యచ
ర్చారంభం బొనరించునప్పుడు సభాధ్యక్షుండు యుష్మద్వచ
స్సారస్యమ్మునకుక్ గవంతయవకాశం బీయమిక్ దత్సభా
స్తారుల్ తత్సభ నాఁగి రోతిలక? నీసామర్థ్య మింతింతయే. ౬౨౯

9. మ॥ బలముం దేజముఁ బెంపుఁబ్రాభవయశఃపాండిత్యముల్ గల్గి వై
రులకుక్ గుండెల గాలమౌ మఁ బలుసాయక్ వైరులం ద్రోలి భా
సిలె నేవీరకిశోర మాతఁడు శివాజీ, పూజ్యమాత్మజను
స్థలమం దీవును బుట్టి తోతిలక? వింతగ్గావె నీచర్యలుక్. ౬౩౦

10. మ॥ ప్రియదం బొప్పఁగ దేవదేవుఁ డనుకంపక్ ధర్మసంస్థాపనా
ర్థము జన్మించెన" నంచు మున్ను పలికెక్ దారామకృష్ణాదిరూ
పములంబుట్టియుఁ జేయఁదగ్గపని నిర్వర్తించె నేఁ డేమిపా
పమొ? సంపూర్ణముసేయకే తిలకరూపం బుజ్జగించెక్ గటా?. ౬౩౧

11. క॥ పట్టంచులనేల్ దోవతిఁ గట్టి తొడిగి బొందు లొప్పుకంచుకముఁ జరీ
పట్టీగల"పగిడీ"తలఁ, జుట్టినసీరూపు మగలఁ జూతుమె? తిలకా. ౬౩౨

12. సీ. దేవేంద్రుఁ డేదేని దేవకార్యమ్ము యోజించుటకై పిలిపించినాఁడో
భరతభూమికి నేఁడు ప్రాప్తించినసమస్య గుఱించితో యోజింప నరిగినావొ
"ఇండియాకు స్వరాజ్య మిప్పించు"మంచు విక్టోరియాఁ గన బయల్దేరినావొ?
స్వర్గ మేగినపూర్వచక్రవర్తులసాక్ష్య మిప్పింపఁగా నట కేగినావొ? ౬౩౩

తే॥ గీ॥ ఏదియో గొప్పయుపకృతి యిండియాకుఁ జేయుటకె కాదె వృత్తి తటస్థించెనీకు
మరల నేదేశమందో యేమానవతికొ కొడుకవై పుట్టి తీర్చుకో కథమ తిలక?౬౩౪

13. తే॥ గీ॥ నియతసుకృతాత్మకుఁడ వైననీకు మరల, జన్మముబ్బుట కా దార్యసమ్మతంబు
కాని నీవంటిలోకోపకారి మరల, దొరకఁ డని కోరవలసెఁ గ్రిమ్మఅభవంబు. ౬౭౫

14. సీ. ప్రతిగేస్తు నిఁటిచావడియందుఁ దనరారు శ్రీకరం బెవ్వాని చిత్రపటము
ప్రతిమనుజుండు జిహ్వాసీమ జపియించు భావుకం బైనయెవ్వానిపేరు
ప్రతిభారతీయుప్రబంధపేటికయందు పొలుపారు నెవ్వానిపుస్తకములు
ప్రతిపండితునిమనోభావవీధికయందుఁ దనరు నెవ్వానిసిద్ధాంతఫక్కి ౬౭౬
తే॥ గీ॥ మనల విడనాడిచనె లోకమాన్యుఁ డతఁడు, దివ్య మాకార మొకటిసఁధిల్ల నేఁడు
తనస్వరాజ్యాభిలాష మంతయును వదలి బాలగంగాధరతిలకభవ్యయశుఁడు॥ ౬౭౭

15. సీ॥ అనఘుఁ డౌతిలకమహారాజునకు నేఁడు కన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు
ధీరాత్ముఁ డైనమహారాష్ట్రమౌళికిఁ గన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు
లోకమాన్యానద మహాకీర్తిశాలికిఁ గన్నీట ధర్మోకమ్ము లిడుఁడు
పరమచిత్పావనబ్రాహ్మణాన్వయునకుఁ గన్నీట ధర్మోదకమ్ము లిడుఁడు ౬౭౮
తే॥ గీ॥ తిలకమూర్తికి మానవాతీతమైన, దేహ మేతెంచు పదియవదినముగానఁ
గరయుగము లొదలందాల్చి కరుణ మొలుక మ్రొక్కుఁ డొకమ్రొక్కు భారతీ
పుత్రులార! ౬౭౯

## శ్రీమోతేవారింటపెండ్లి కాకినాడ.

1. శ్లో॥ శ్రీకృష్ణం వరమూర్ధన్యం దమయంతీం వధూమణిం
దత్వా సమాన మైశ్వర్యం పాతా మాదిమదంపతీ॥ ౬౮౦

2. శ్లో॥ శ్రీమోతేవంశసంభూతం । తాటికొండకులోద్భవాం
శ్రీకృష్ణం దమయంతీంచ । పాయాస్తాం దంపతీ శివౌ॥ ౬౮౧

6. శ్లో॥ కృష్ణయార్యసుజాతం ! రామచంద్రతనూభువం
దమయంతీకృష్ణరాయా । పాయాస్తాంకమలావరౌ. ౬౮౨

4. శా. శ్రీకృష్ణా? వినుమోయి భాగ్యను గృహశ్రీయంచు భావించి సు
శ్రీకంబైతగుసంతతిన్ గనుము వారిన్ వీరిఁ బోలెన్ వృధా
యాకంజాస్త్రుని బారికిన్ దగిలి ద్రవ్యం బాఅడింబుచ్చ క
గ్రాకాంతున్ జరియించి కైకొనుము సారాచారసంపత్తులన్. ౬౮౩

5. మ. దమయంతీ? వినుమమ్మ? భర్త యన దైవంబంచు భావించి ని
త్యము తద్వృద్ధికిఁ గారణం బయినసత్యశ్రీకి దూరంబుగా
క మహత్త్వంబు గణింపుచున్ మదుల కైక్యంబున్ బ్రసాదింప దై
వములన్ గొల్చుచు మంచికీర్తులను సంపాదింపుమా ప్రోడవై. ౬౮౪

6\. శా. మంజుస్వాంతుఁ డుమామహేశ్వరుఁడు పేర్మిస్నిగ్ధుఁ డశ్రాంతసా
మంజస్య మ్మనురాగసంపదయు క్షేమప్రాభవంబున్ గళా
రంజత్సంతతి లోనుగాఁ గలుగుసామ్రాజ్యంబు గల్పించి నీ
తిం జెన్నారఁగఁ జేసి ప్రోచు దమయంతీకృష్ణులన్ జిష్ణులన్. ౧౯౫

7\. శా. మోతేవంశపయఃపయోనిధికి సోముల్ వైశ్యచూడామణుల్
ఖ్యాతుల్ వృద్ధజమీనుదారులు యశఃకాంతాంచకీర్తుల్ గతా
రాతుల్ స్వీయకులీను లందఱును వారల్ మెచ్చఁగాఁ జాలుస
త్ప్రీతిన్ దంపతు లుండుఁగాక సతతశ్రీమీఱి దైవాజ్ఞచేన్. ౧౯౬

## శ్రీ చెలికాని లచ్చారావుగారు—చిత్రాడ

### (హితవాదిసమర్పణము.)

1\. మ. జనమాన్యుండును ధర్మశీలుఁడును భాషాపోషకుండున్ దయా
ఖనియు న్నీతిపథానువర్తియు యశఃకళ్యాణకాముండు స
జ్జనుఁడున్ శ్రీచెలికానివంశజుఁడు లచ్చారాయనిం గూర్చినే
ర్చినకున్ "హితవాది" నామ మెలుప వర్తించుచున్ జన్ద్వంద్వంబుగా. ౧౯౭

2\. క. ఎటి గియుచు నీవు వ్రాసిన, మోటుఁగులనే నశనికిన్ని నోవు ని? లోకం
బెరియదె? లచ్చారాయుని । యూర్ వెలుఁగనివార లెవ్వ రోహితవాదీ? ౧౯౮

3\. క. హితవాదిదేశసేవా । వ్రతునిన్నిందింపవ్రాఁతఁ బ్రకటించితవో
హితకారిణి? నీవు ఋతా । నృతములు గూర్చఁపమనికి నీతికిఁ దె--వే? ౧౯౯

4\. సీ. ద్రవ్యవ్యయము మొనర్చి పగువారి నియమించి దేశదేశమ్ములు తిరుగఁబంచి
మూలమూలలఁ జన్గిపోయెడు నాంధ్రమహాకవిరచితంబు లైనయు త్త
మగ్రంథములను సమగ్రంబుగాఁగ వ్రాయించి కొన్నియును సొమ్మిచ్చి కొన్ని
యును బ్రోవుచేయించి యొకనిలయమ్మున "వీరవా"లందు వేర్వేఱ నునిచి ౨౦౦

తే. గీ. పదుగురును వచ్చి చదివికొఁ బదిలపఱచె। నాంధ్రపరిశోధకాభిధం బైనయొక్క
మండలి వీరపురియందుఁ దొకండ కాఁడె? ।లలితగుణములప్రోవు శ్రీలచ్చరావు. ౨౦౧

5\. తే. గీ. "దేశవర్ధని" యను పేర దేశమునకు। సౌఖ్యమొనఁగూర్చునొకసమాజంబునిలిపె
గానవిద్యావిశారదుఁ డైనలచ్చ । రావె సంగీతసభలకుఁ ద్రోవఁ దీసె. ౨౦౨

6\. తే. గీ. గోరసమ్మున కాసించు గోరసాఖ్య । జనపదమ్మున నిలిపెనసంస్కృతాంధ్ర
పాఠశాలకుఁ బ్రతిభూతై ప్రతిభమీఱ । రక్షణముచేసె మా లచ్చరాయఘనుఁడె.

7\. శా. సల్లాపమ్మున కాకగ మ్మయినలచ్చారావు గోదావరీ
జిల్లాసంఘమునందు సభ్యుఁడయి వాసింగాంచె గోదావరీ

జిల్లాబోర్డుకు మెంబరై ప్రజలకున్ సేమంబు చేకూర్చి ని
య్యిల్లాండ్రకున్ ఘటించెఁ గడుహాయి నీతిపద్యావళిన్. ౨౧౦

8. ఆ.వె. కాకినాడ "తాలూకాబోర్డునకు" మెంబరగుచుఁ గొన్నినాళ్ళు యశముఁగాంచె
నాపటంబునకె పిఠాపురమ్మునను నేఁ, డర్థియగుచుఁ దాఁ గృతార్థుఁ డయ్యె. ౨౧౧

9. సీ॥ "ఆంధ్రరాష్ట్రము వేఱ యగుఁ"గావలె నంచుఁ గోరువారలలో నొకొండనంగఁ
బరఁగి యందుల కేరుపఱచినయుపసంఘ మందొక్కసభ్యుఁడై యశముగాంచె
"నాంధ్రసారస్వతం"బనుమహాసభయందు సభ్యుఁడై మిగులఁ బ్రశస్తి కెక్క
నఖిలభారతదేశ మండలిగ్రంథాలయసభయందును సభ్యుఁడై రహించె
తే॥ గీ॥ నఖిలకవిమండలికి విజయనగరంబు,నందు జామీనుదారుఁడై యుండెఁ గీర్తి
పీఠపురిపాఠశాలలోఁ బేరుగోరఁ, బడియెఁ బ్రాచీనవిద్యార్థిపటలములందు. ౨౧౨

10. సీ॥ వరుసంబులుగాఁగ నవలలు ప్రకటింపఁ గడఁగు "రామవిలాస"గ్రంథమాల
ప్రాక్పీశ్వరకృతగ్రంథముల్ ప్రకటించు రసవత్ప్రబంధసర్వస్వమాల
నవలలు వచనముల్ నాటకంబులు ప్రబంధములు చర్చలుఁ బివాదములు తీర్పు
లాదిగాఁ గలవిషయంబులు ప్రకటించు "భాషావిలాసినీ"పత్రికకును
తే॥ గీ॥ దాన సంపాదకుండయి తగినమూల్య,మునకుఁ గాక యతిస్వల్పమూల్యమునకు
జనులకుఁ గందఁజేయు ప్రశస్తకీర్తి, దెచ్చికొనుచుండెఁ జెలికానిలచ్చరావు. ౨౧౩

11. సీ॥ శ్రీరామచరితంబు స్త్రీనీతిపద్యరత్నావళి యంతఃపురాంగనలకు
గోపనీయతఁ దెల్పుఘోషాప్రబంధంబు భీష్మచరిత్రంబు ప్రేమలతయు
మల్లెమొగ్గ, కురంగి, మహనీయ లఘువర్తమానాంధ్రకవులపద్యచ్చరిత్ర
మొదలుగాఁ గలగ్రంథములు రచించినమేటి, రామవిలాసముద్రానిలయము
తే॥ గీ॥ చిత్రాడపురిఁ బ్రతిష్ఠించి యందుఁ గవుల లోకోపకారకగ్రంథములను
నచ్చువేయించి యిచ్చునిర్వ్యాజకృపుఁడు, మెచ్చఁగా మెచ్చఁదగఁడె శ్రీలచ్చరావు

12 సీ॥ శ్రీరాజమానరాజారామయాంబికాకల్పితపుస్తకాగారమునకు
గౌతమీమండలగ్రంథాలయసమాజగౌరవాధ్యక్షుఁడై కాకినాడ
మండలగ్రంథసమాజమ్మునకుఁ బీఠనగరగోసంరక్షణసమితికిని
బెజవాడలోన నిల్పినయాంధ్రదేశకేంద్రగ్రంథతతి కుపాధ్యక్షుఁ డగుచు
తే॥ గీ॥ "కావ్యనిధి" యన్నబిరుదంబు గనినవాఁడు, తెలుఁగుదేశములోపలఁ గలుగు పెక్కు
పౌరజనములచే జానపదులచేత మెచ్చు లొందఁడె? చెలికానిలచ్చరావు. ౨౧౫

13. సీ॥ భావనారాయణస్వామిసన్నిధి భావనారాయణాఖ్యజనకుని పేరఁ
బురమందు గట్టించెఁ దిరిగి సంపాదించెఁ దిరుపతివేంకటేశ్వరుల సేవ

కాశి శ్రీరంగంబు కాంచి మున్నైనపుణ్యక్షేత్రముల కేగి యందుఁ దత్త
దధినాథులకుఁ గాన్క లర్పించె భక్తితో హితులతో నాశ్రితప్రతతితోడ
తే॥గీ॥ కృతులఁజేయించిబహుబహూకృతులొసఁగికృతులుగైకొనికావించెఁగృతులుకొన్ని
సుకృతి కార్యంబుల నతండు సుకృతిగాఁడె సచ్చరిత్రుఁడు చెలికానిలచ్చరావు.

14. తే॥గీ॥ కడకువచ్చిన "మాంటేగు" గారితోడ. "నాంధ్రరాష్ట్రంబుకావలె" నంచువిన్న
పంబు గావింపఁ బోయినప్రముఖు లందు, నొక్కరుఁడు కాఁడె లచ్చరావక్కటకట?

15. తే॥ గీ॥ ఇంతయోగ్యత యింతధర్మైకబుద్ధి, యింతదేశాభ్యుదయచింత యింతసుగుణ
సంపదయు నింతకవిజనాసక్తి గల్గు, హెచ్చుమానిసి చెలికానిలచ్చరావు. ౨౧౮

## దివాకరాస్తమయము.

(రాజమండ్రిసభలోఁ జదివినవి)

1. సీ॥ గురుఁడు బ్రహ్మయశాస్త్రి కొనియాడు నెవనిఁ గర్నాటసీతారాముసాటిఁ జేసి
తోడికలార్థు లెవ్వానితెల్వి కీర్ష్యవహించి కలహంబు సలుపుచుండ్రు
ఎవఁ డెన్నఁడును బాఠ మెలమి విప్పకయె వ్యాకరణపాండిత్యపరీక్ష మూనె
నొరుఁడు నచ్చనినాఁడు రవమ్ము సడలింపఁజాలె నెవ్వనిమనీషాబలంబు
గీ॥ ఎవఁడు వాకెక్కుఁడయ్యెఁ గారణాంతరమున గురుభావ మంతరంగ
మున నెకాక వెలికిఁగూడఁ గనఁగఁజేసె నట్టితిర్పతికవి దివి కరిగెనకట! ౨౧౯

2. క. నాకన్న ధీబలమ్మున, నేకాదు తనూబలమున నెంతయు హెచ్చౌ
లోకస్తుత్యుఁడు తిర్పతి, నాకన్నన్ మున్నె యెట్లు నాకము ముట్టెన్? ౨౨౦

3. మ॥ కలలోనైన నతండు ముందనుచు "వెన్క న్నే" నటంచున్ మదిన్
దలఁపంబో మతఁ డేనుఁ గూడ నెటు లీతాంగ్మరు చేకూరనో
బలవంతుండె మహోన్నతంపుఁ బదవిన్ బ్రాకంగ నన్నుండు దు
ర్బలుఁడో కాఁడటువంటివాఁడనుట సర్వత్రానుభూతంబకా. ౨౨౧

4. ఉ॥ ఏఁబదిదాఁటె నా, కతని కేఁబదికింక నెలల్ గొఱంత నా,
ల్గాబుధమాన్యుఁ డిందనుక నాఁగ కసల్పె శతావధాన, మే
నో బహుకాలమై యొకటనుండియు నాతని చేతియూఁతఁ బ్రి
జ్ఞాబహుళావధానపుఁబ్రసంగము లీడ్చుచునుంటి నెట్టులో. ౨౨౨

5. శా॥ త్వంకారోక్తులతోఁ బ్రసంగము సహాధ్యాయిత్వముం దెల్ప ని
శ్శంకన్ వ్రాసెడి లేఖలందలి నమస్కారాదిసంభావనా
లంకారంబులు నాయెడం గల యనల్పత్వత్కృతజ్ఞత్వపుం
బొంకమ్ముల్ దలిపుచ్చ వర్తిలిన నీబుద్ధిన్నుతింతున్ సఖా! ౨౨౩

6. ఉ॥ "ఏ నలనూజివీటి సభకేగితి నీ విఁకఁ దాఁగివి" యన్న తో
పానన కాదె? యొంటరిఁగఁ బాకరిపుఁ గనఁబోయి తిప్ప డో
ధీనిధి! తిర్పతీ! యచటిధీరులతోఁ గలహమ్ము గల్గున
ట్లేనియు నేను నీస్మృతికి సెక్కకపోనుజుమీ; సుమిత్రమా! ౨౨౪

7. క॥ నను "దర్శనమిప్పింపుం" డని వ్రాసినలేఖ నాకు నందకమునుపే
చని నాఁడవు స్వర్గం బే మిని నాతోఁ జెప్పఁ దలఁపమింగాదె? సఖా! ౨౨౫

8. మ॥ కృతకృత్యుండవు నీవు, వేఁకొకనితో నేమేరిఁ జెప్పం బనే
మి? తుది న్ననొక్కసారి చూచుటకు చెల్మిన్ జుమ్మి? రమ్మంచు వ్రా
సితి, పోస్టుఁడని పల్లెయాట నది నేఁ జెల్లింపలేనైతిఁ ది
ర్పతివిద్వత్సుకవీ? క్షమింపనిదియగ్రాం బెమ్మెయిన్ జేర్మినై. ౨౨౬

9. ఉ॥ నీకొమరుండు సత్కవిత నేర్వఁగఁ జాలినబుద్ధిశాలి, త
ద్ధీకుశలత్వమున్ సరిగఁ దిద్ది త్వదాత్మకు మెచ్చొనర్తు నం
దాఁకను నాదు రాకకయి నాకమునందుఁ బ్రతీక్షసల్పు మ
య్యా! కవితిర్పతీ! వ్యవధియాటకు నోపఁగ దయ్య యియ్యెడన్. ౨౨౭

10. క॥ నీపెద్దకొమరుకతమున నీపిన్నకొమరుఁడు ముగురు నేస్తురు విద్వాం
నాసై భారఁబియ్యది నీపెట్టకపెట్టినగియ నేర్పుకతమునన్. ౨౨౮

11. మ॥ మృతులంగూరిచియేను పద్యములు నే నేనాఁడు చెప్పన్ మహా
మతి! యోతిర్పతిసత్కవీ! త్రిజగతీమాన్యాత్మ విక్టోరియా
సతి లోనామృతులెల్ల నీకలన నే స్వర్గంబధిష్ఠించి రే
నతిపాపాత్ముఁడ నాకు నీకతన తే వాలాటిసౌభాగ్యముల్. ౨౨౯

12. తే॥ గీ॥ అల దివాకరునకుఁబోలె నస్తమయమును నుదయమునుగూడ నిజమునకుండఁబోవు
నీయశఃకాయమున కని నే నెఱిఁగియుఁ బాయరఁజేసి విలపింపవలసె సఖుఁడ! ౨౩౦

## శ్రీ చెలికాని లచ్చారావుగారు- చిత్రాడ.

ఉ॥ దిక్కులనెల్ల నాత్మగురుతేజమునించి దివాకరుండు తి
గ్మక్కుల కందరాని నగనాంతరసౌధపుఁజంద్రశాలపై
కెక్కెను లచ్చరాయ! యికనీతనిసంగతి కేమినెక్కహో
టెక్కులురాని పిల్లల ధరింపఁగనీవును నేను దిక్కుగా
కక్కట! యూరఁడిప్పటికి నాదరువైరగు నీపురమ్మునం
దొక్కటఁగాపురంబిడిన నూరకయుండవు నీవు; నెల్లవా
రెక్కుడఁగూడ నింతటియహీనపరంబు దృఢాభిమానమున్

చెక్కరపట్లఁజూపుటలు వింటిని, గంటినిగాని యాతఁడీ
చిక్కనయించునంచుఁ దనచేతమునందు దెలియఁగలేక నీ
చక్కికిరాక నీధనము సాపడుచుండియుఁ గాకినాఁడ వే
మక్కరవుండెఁ గానియొక మాదృశు లక్కడి కిట్లువచ్చి మీ
కిక్కరణీఁ బిధింపమని యెందుకు? మీరె భరింతు, రొక్కచో
నక్కవిరాజుపోయెనని యాతనిభార్యయు బిడ్డలింకపే
దిక్కనకేఁగుచెందినను దీనికిసమ్మతిఁజూపబోరు, స
మ్యక్కృతికర్తయై సుకవిమాన్యుఁడునై యతఁడేగెఁ బుత్రిఁడో!
మిక్కిలిబుద్ధిశాలి, యిఁక మీఁదట వీనికిఁ దండ్రివంటి స
మ్యక్కవితావిశేషమదియబ్బెడు శంకయొకింతలేదు స
వ్యక్కవియై నినున్ నను ముదంబుధి నోలలనార్చు నంతకున్
దిక్కగనుండఁగా మనకుఁ దిన్పతి చెప్పకచెప్ప నింతయున్
నిక్కవ మీకుటుంబమును నెక్కొనిపోవఁగఁజాలు మేనమా
మొక్కఁడు పెద్దజీతమునన్న యఖుండుఁడు గల్గెఁగాని యూ
దిక్కరి యిట్లువ్రాసెఁ గనుపీనిని, దీనఁబట్టిభవమున్
జక్కఁగఁగన్న నీమనిఁకస్వాంతమురాదని నేఁదలంప నే
ఫక్కినొ కొంతకాలము కృపన్ మన మీకవిసత్కుటుంబమున్
సుత్రిక్కఁగనీక ప్రోచునెడ సూరిజనస్తవనీయమైన పెం
పెక్కు, యశమ్ము గల్గు, నదియేకద? యేరికి శాశ్వతంబగున్
దక్కినవాలంబలె నుదారత దాఁచితివేనిఁ జేతికిన్
జిక్కినసద్యశోరమ యిసీ యని! యెక్కడికోచనుంజుమీ!
టక్కరి యిట్లిపట్టుఁగ నొడంగక దాఁకెడినన్నమాట మీ
కెక్కుటకేను వేఱొకటి యియ్యెడఁజూపఁగనేల? సర్వమా
ఫక్కి హృదంతరమ్మునకు వచ్చియయుండును, గీతిఁవచ్చి "యే
గిక్కనులేమినా" కనుచు దీనత నిమ్నవరించుచున్న దీ
నక్కనియెమ్మెలాడిని వెసంగొని పేర్మిసుఖింపుమయ్య? నీ
కిక్కతనన్ జయంబెసఁగు నింతయు నీవునెఱుంగుదైన నే
నక్కవిరాజునందుఁగల యాదృతిచే నిటుచెప్పుచుంటి, నే
ముక్కలొ నేర్చినందులకు మూర్ఖులవేఁడుటకన్న విజ్ఞుఁడౌ
చక్కనినిన్నువంటి సరసప్రవరుం గవితామతల్లికిన్

బ్రిక్కుకుఁ జేర్పుటొప్పకుటఁ బద్యముఁ గ్లితి నిన్నుఁ గూర్చి నీ
వికృతి కింకరుడన్ మును పెయేర్పడియుండిన నుందుగాక, నే
నిక్కమితన్ రచించి ఫలమించుక పంచికొనంగఁ బోలదే?
నిక్కము మీకు మాకు పతి నేఁటిదిగాదు బుజ్జాయుబ ధ మే
లెక్కడికేఁగ కూరకయ యింటవసించుట యీవెఱుఁగు, దీ
విక్కదయించి నిన్ను ప్రభు చేయుడి కోరుచున్నవాఁడ నీ
యక్కఱఁ దీర్చి మేల్ సిరియు నాయువు కీర్తియుఁ గైకొనంగదే?
దిక్కుఁ గనీవె వీరికని దేవుఁడు వ్రాసెను మూఁడుపంక్తులన్
దక్కువకాద యిక్కతనఁ ద్వద్ఘన సంపద లక్ష్మీరాణ్మణీ!. ౨౪౨

## శ్రీ కాట్రావులపల్లి జమీందారుగారు.

1. శా. శ్రీ కుంతీ న్నిను జూడవచ్చుటకు సద్దీర్ఘమ్ము మున్నే ప్రపా
చేయూలంబడవైచియుండియును దాని న్నేఁడు గైకొంటకున్
సామర్థ్యంబుఁ బ్రసక్తిగా దదియు నీసత్కీర్తికిన్ మూల ము
ద్దామప్రాభవ? దామరాన్వయజ? సీతారామనామాంకితా. ౨౪౩

2. శా. నన్నుం గోరెడి శిష్యవర్గమునకు న్నాకున్నయట్లు తలో
నన్నమ్ముల్ మతివిద్యయున్ జరుఁ మున్నార్జించికొన్నట్టి సం
పన్నత్వంబునఁ దృప్తిఁ జెంది యొకలం బార్థింపకే కాలకం
ధిన్నే నీఁదుచునుంటి హాయిమెయి తేనేలేదు లోటెయ్యెడన్. ౨౪౪

ప. కలిగినదానఁ దృప్తి వడఁగ్గిన లోటుగుఁట్టు, దట్లు తా
కొలమి వహింపమండు నెడ నెందును లోటులెతోఁచుచుండు ని
చ్చలు, నిది నీయెడింగిఁ బ్రసక్తియె, కావున విస్తరి ప క
వ్వలివిషయంబు తెల్పెద నృపాలక? పేరిమి నాలకింపుమా. ౨౪౫

4. ఉ. మాఁడియంపు గ్రామమున మాన్యులు కొందఱు చిన్ని బాలురన్
గైకొని సంస్కృతాంధ్రముల గావ్యములం బఠియించు యోగ్యతా
శ్రీ కెసకొల్పనెంచి యొకచిన్నబడిన్ గతవత్సరంబునన్
దేఁకువనిల్పి యొజ్జనొకనిన్ బిలిపించిరి యుంచి రాదృతిన్. ౨౪౬

5. చ. నెలకుఁ బదేనురూపికలనేకొని యంతన తృప్తిఁ జెంది శి
ష్యుల కుపదేశమున్ సలుపుచున్ బడి వృద్ధికిఁ దెచ్చె నొజ్జ,య
య్యలఘుని స్వల్పపున్ భృతికి నాకడియం బసమర్థమయ్యె న
వ్వల నదియున్ "నమా" యనుప్రసక్తికి లోనయి నామొదం బడెన్. ౨౪౭

6. శా. ఈ కార్యంబున నాకు లేశమును లేసే లేదు జోక్యంబు వి
ద్యాకార్యంబను కారణమ్మునను దదాస్థానాగ్రపీఠమ్మునన్
నాకున్ జోటది తప్పదయ్యె, బడి నానాఁడే తయ్యంబందును
ప్పాకంబుం గని మిన్నకుండుటది శోచ్యంబంచు నేఁబూనితిన్. ౨౪౮

7. ఉ. పూని మనమ్మునం "దెవరిపోడిమి దీని భరింపఁజాలు"నం
చేను విచారణన్ సలుప నెందఱు దాటిలఁ దోఁచి రందుఁదా
రానఁ గలట్టివారల భరం బిది పూన్చుటకన్న నీదుసం
స్థానము దగ్గ రొంటను బ్రసక్తముగాఁ గనుపట్టె భూవరా. ౨౪౯

8. ఉ. దగ్గఱనున్న కారణ మెదం గని యాపయి నీకు విద్దెలోఁ
బగ్గయుఁ బ్రీతియున్ గలుగుభాగ్యము తోడయివచ్చి నేఁడు స
మ్యగ్గతి నీదుదర్శన మమర్చెఁ బయింగలకార్యమన్న నో?
నెగ్గుత నగ్గుకుంచుత మనీషికి దాన విచార మేటికిన్. ౨౫౦

9. ఉ. పండితుఁడైనమానిసికిఁ బండితుఁడొన్నపుఁ జూడకుండులే
దొండొకలోప మానొసఁగ నూడ్చితి నీవది కిద్ది నమ్ముచోఁ
గొంకొకప్రీతిఁ గొల్పుటయుఁ గోరిక నచ్చనిపట్ల మాయెడన్
నిండుమనంబు నుంచుటయు నే మిముఁ గోరెదఁ గోర నన్యమున్. ౨౫౧

## మురుమండ - చెలికాని సూర్యారావుగారు.

1. క. శ్రీ కలిగియు గుణవత్తా, ప్రాకట్యమ్మునను వంశవారంపర్య
స్వీకృతి నెగడుంగలను, లోకా? చెలికానివంశ్య? సూర్యారాయా. ౨౫౨

2. క. మీతండ్రితరమునుండియుఁ, బ్రీతిమెయిన్ మమ్ముఁ జూచి పెద్దగ గురుతా
స్ఫీతిని బహూకరించుట, చేత మిమున్ జూడ మహమ్ము చెలఁగు న్నాకున్. ౨౫౩

3. చ. ఇపు డొకచోటి కెక్కడికి నేగుట మాని గృహమ్మునందె యుం
టపాసఁగాఁ దీని నెట్లొ విని నాయెడ మీ చెలికానిలచ్చరా
ణ్ణృపమణి పూర్వపున్ గరిమ హెచ్చఁగ సోదరిరామయాఁబచే
నిపుణుఁడు పెద్దవార్షిక మనిందితుఁ డేర్పడఁజేసె నాకొగిన్. ౨౫౪

4. క. ఈకారణమున మఱినా, నాకారణములను నాకు నాసంస్కృతికిన్
శ్రీ కొదవలేదు, తృప్తిం, గైకొనవలె నున్నదానఁ గవివరు లెలమిన్. ౨౫౫

5. మ. అటు గాకున్నఁ జతుస్సముద్రములమధ్యం బెల్లఁ బాలించినన్
తుటియింపంబడదయ్యె? తృప్తి యిటు వక్కాణింతు పెద్దల్ సుఖ

ఘ్నుట మీమార్గము పోతనాదికవిరాట్కంఠీరవుల్ పట్టిరి
ప్పటి కవ్వారికృపన్ దదీయమగు తోర్విన్ నిల్చితిన్ భూవరా! ౨౫౬

6. మ. అగుచో నెవ్వరిఁ గాని చూమపని లేదన్నన్, యథార్థంబయా
మగుడన్ యాచకతాప్రసక్తిఁ గొనుసంబంధమ్ము వాక్ప్రస్తు శ్రీ
ద్ధగ నాలింపుము మాదుగ్రామమున విద్యావృద్ధికై కొందఱో
ప్పఁగ నొజ్జన్ బిలిపించి యుంచి వెలమిన్ బోషించు నేర్పాటుతో. ౨౫౭

7. చ. తెలుఁగును సంస్కృతమ్మును సుధీవరుఁ డాయన బోధసేయఁ గు
ఱ్ఱలం పఠియింపుచుండిరి సరాసరి జీతముమాత్ర మొజ్జకే
నెలకును ముట్టదయ్యె నది నేఁ గనిపెట్టితి మిమ్మువంటిదా
తలకతనన్ ఋణంపడిన ద్రవ్యముఁ దెచ్చితి నిచ్చితి న్నృపా! ౨౫౮

8 సీ. వావిళ్లతఁడు ప్రతి వత్సరమ్మును నఱువఁది రూపికల నిడ వ్రాసియిచ్చె
నన్నవరంపుఁ గ్రామమ్ములోన నేఁబది యినుగంటి నృపాలుఁ డిడియెఁ
గాటరావులపల్లెఁ గలజమీందారుఁ డిర్వదియైదు రూపికల్ వార్షికమిడె
మిముఁ జూడ నామది మిక్కిలిఁ బ్రేమించెఁ దక్కిన దానికై దాన మెపుడు

తే. గీ. దాతృవశమగు గావునఁ దమకుఁ దోఁచి, నంత వార్షిక మొసఁగుదురని దృఢముగ
నాకుఁ దోఁచెను దీని కెన్నాళ్లనుండి, యీ ప్రయత్నించి వచ్చితి నో నృపాల

9. క. ఏటి కొకనూట యేఁబది, పాటియె రూపికల నాయుపాధ్యాయునకున్
బాటించి యొసఁగ వలెఁ గల, లోటెంతయు? మీమనమ్ములోఁ గనుఁ డింకన్

## శ్రీ శ్రీ వేంకటగిరి యువరాజుగారు - మురుమఁడ

1. క. శ్రీ ర్వసుధా౽పి చ విద్యా, ఘోర్వ్యహతాసంతతిశ్చ దోశ్శక్తిస్స
త్పూర్వాచారపరత్వం, సర్వజ్ఞకుమార! తే౽స్తు శత మాయుష్యమ్. ౨౬౧

2. సీ. మీ తాతగారి సమీపమ్మునం దవధానమ్ము సల్పి సమ్మానమంది
నట్టికవీంద్రుఁడ నయ్య శ్రీ తిర్పతి వేంకటేశ్వరకవిద్వితయ మందు
వేంకటేశ్వరుఁ డనువిప్రుఁడ, మీ మేనమామ సూర్యారాయమనుజపతికి
మిత్రుఁడ, మీమామ మేటి శ్రీ నూజివీడ్వారయప్పారాయనరవరేణ్యు

తే. గీ. నకుఁ బితృసఖుండ, గురుఁడ, వృద్ధకవి నగుట, నీదురాజధానికి వచ్చి నిన్నుఁ గాంచు
భాగ్యమును నోఁచకుండియు, భాగ్యవశత, నిచటఁ గన్నాఁడ, శ్రీయాదినృపవరేణ్య.

3. మ. ఇనుగంట్యన్వయుఁ డౌప్రకాశనృపుతో నేతెంచి చామర్లకో
టను రైల్ స్టేషనునొద్ద జేసితి గరిష్ఠం బైననీదర్శనం

బును, సంతుష్టుఁడ నైతి, నేఁటికి నిటన్ భూయోభవద్దర్శనం
బున నానందము చెందితిన్, నరపతీ? పుణ్యాకృతీ? సత్కృతీ? ౨౬౩

4. మ. కవు లెఘ్నన్ నరనాథు లెన్నకడకున్ గాంచంగ నేతెంచుటల్
భువి విందున్, నరపాలకుల్ కవికులమ్ముల్ వోల్చుదేశమ్ము తా
మవలోకింపఁగ వచ్చుటల్ తలఁచుగా నాలింప, నీభాగ్యమో
యవనీశా? యనుభూతమయ్యె నిపు డంచానందమున్ జెందెదన్. ౨౬౪

5. క. చెలికాఁడు సూర్యరాయని; చెలిమికి తన నాకు నిన్ విశేషగుణశ్రీ
కలితుని గనుఁగొను టబ్బెను, గలిగించున్ సూర్యచెలిమి ఘనమణిఁ బలెన్. ౨౬౫

6. శా. సత్కీర్తిజిత్తను ఁడు మున్నే నవ మాశ్చర్యమ్ముగాఁ జేసి తా
మిత్రింగాఁగొనె సూర్యు, నాచెలిమిచే మేలై సదర్త్నముం
బాత్రుఁడై గ్రహియించె నే నటులె భూపాలైకరత్నమ్ము న
ద్గోత్రిమ్ముం గనుభాగ్య మందితిని, గోర్కుల్ నిండె యాచపర్భూ. ౨౬౬

7. క. నీరాకకతన మాసూ, ర్యరాయని తపము పండె, నరుఁడిన్నాళ్లన్
ధీరులు మెచ్చఁగఁ దపముం, బ్రారంభముచేసె గాని ఫల మీవె నృపా. ౨౬౭

8. క. తనతోఁ బాటుగ నిరుల, ననయము తరియింపఁజేయు టది సత్కులజా
తునిగుణ మగుఁగా? యనసూ, ర్యనియం బేగుణము నేఁడు రూఢం బయ్యెన్. ౨౬౮

9. మ॥ ధనముం గోరను, గోర ధాన్యమును, విద్వద్వంశసంజాత ? నీ
మనముం గోరెద నెట్లుఁ జేసి యిటులే మాకిమ్ము నీదర్శనం
బని యాచింపఁగ నోయి యాచనృపతీ ! యామీఁద నీచిత్త మే
మనెనో ? కృష్ణకవీంద్రవాక్యములనై సత్యాదృతిన్ జూపవే ? ౨౬౯

10. ఉ॥ ప్రాజ్ఞులు పూర్వభూపతులు పల్వురు వోల్చిరిగాని వారు స
ర్వజ్ఞులు విద్వదంకనవిరాజితనాములు నాఁడు లేదు, స
ర్వజ్ఞకుమార! కృష్ణనరపాలక ? యీవ్వయ మంచొకండు స
ర్వజ్ఞుఁడు శాస్త్రకోఁడవది వానికి నుండియు నప్రసిద్ధమే. ౨౭౦

11. మ॥ కలముం బట్టితి, గొన్నినాళ్లు కవితాకన్యానుకూలుండనై
హలముం బట్టితి నేఁడు జీవికకునై, యాపన్నధర్మమ్ముగా
విలిఖించెన్ మను విప్రునిన్ ద్విజుల కోపృథ్వీశ ? యట్లోటిచే
ఖలమున్ మెట్టితి దాన నిల్లు గదలంగా వీలు లే దెమ్మెయిన్. ౨౭౧

12. క॥ మును ముక్కుతిమ్మనకు స, జ్జనసుతుఁ డౌకృష్ణరాయజనపతికిన్ గ
ల్గినపేర్మి వంటిపేర్మియె, మనకుం గలదని యెఱుంగుమా ? యాచనృపా. ౨౭౨

13. క॥ నాముక్కున్ మొగముం గన, నీముక్కున్ మొగముఁ గనిన నిపుణమతులకున్
నామాటలు నిక్కమ్ములు, గా మానసవీధి కెక్కఁగనుము నృపాలా. ౨౨౩

14. మ॥ తలిదండ్రుల్ సుఖవంతు లన్వయము విద్వద్భూమి యర్ధాంగి ని
స్తులసద్వంశజయౌటె కాక మిగులన్ శోభాయమానప్రభా
విలసత్సద్గుణజాల, రాజ్యము మహోవిస్తీర్ణ, మింకేదియున్
గలదే ? కామ్యము, పుత్రునిం గనుము లోకఖ్యాతచారిత్రునిన్. ౨౨౪

15. శా॥ సంతాన మ్మలరారుతన్, దఱచు సత్సంగమ్ము చేకూరుతన్
శాంతిస్ఫూర్తియు దాంతియున్ గలమహాస్సంపత్తి వర్ధిల్లుతన్
జింతాశూన్యత యొప్పుతన్, సతతమున్ శ్రీయమ్ము దైవారుతన్
సంతోషమ్ములు నీకు లభ్యమగుతన్, సామ్రాజ్యలక్ష్మీపతీ. ౨౨౫

16. మ॥ ఇనుగంట్యన్వయుఁ డౌప్రకాశనృపుచే నేర్పాటుగా నీగుణ
ప్రణుతి న్నే వినినాఁడ, నిక్కము భవద్భవ్యావతారమ్ము స
జ్జనసంరక్షణ కంచు నావినికి చే స్పష్టీకృతంబయ్యె నీ
కనిశమ్మున్ భగవంతుఁడే యొసఁగుఁ గాకాయుర్యశస్సంపదల్. ౨౨౬

17. శా॥ "యాచింపన్ వలెఁ దప్ప"దంచు భవదీయాభిఖ్య బోధించు, "ఛీ?
నీచత్వ మ్మది యంచు నిందులకునై నే సమ్మతిన్ జూప, నో
యాచేంద్రావనిపాల ? నీచనవునే యాచించెదన్, దానినే
ప్రాచుర్యమ్మగ నాకొసంగు మదియే బంగారపుంగొండయా. ౨౨౭

## శ్రీమంతు రాజా అంకినీడు ప్రసాదబహదరు బి. యే. దొరవారి పట్టాభిషేకము—చల్లపల్లి.

1. సీ॥ క్షితరక్షకత్వంబు శ్రీనాథునే కాక నీతండ్రిఁగని నీవు నేర్వవచ్చు
స్థిరవాత్సల్యమయ్యజ్ఞాత నేకాక నీతల్లిఁగని నీవు నేర్వవచ్చుఁ
బురపాలకత్వమ్ము పురుహూతు నేకాక నీతాతఁగని నీవు నేర్వవచ్చు
భక్తిప్రపత్తి నాప్రహ్లాదు నేకాక నీవారిఁగని నీవు నేర్వవచ్చు ౨౨౮

తే. గీ. సహజముగ నీకు రాజ్యశాసకులకుండు, లక్షణసమృద్ధి కలదు ప్రత్యక్షమయ్యె
రాజ్యలక్ష్మియు నేఁడను రక్తయగుచుఁ, గైకొని సుఖింపు మంకినీడ్క్ష్మాకళత్ర.

2. శా॥ ఆయుష్కాముఁడవై యశస్కరుఁడవై యైశ్వర్యపుంజంబవై
శ్రేయస్స్థానమవై యపత్యఖనివై శ్రీపెన్నిధానంబవై

న్యాయాన్యాయవిచక్షణుండవయి రాజ్యం బేలుకోవయ్య స
ద్ధ్యేయం బౌనటు లంకినీనరపతీ దేదీప్యమానాకృతీ. ౨౭౦

3. ఉ. చల్లదనంపు టెల్లయని చాలఁ బ్రసిద్ధి వహించినట్టి దీ
యెల్లకు నీవు చల్లపలి యీపురి నీపరిపాలనంబుచేఁ
జల్లఁదనంబునన్ ద్విగుణసంపదనొందిరహించుఁ గాక నీ
యుల్లము దానఁ బల్లవిత యుక్తిఁ దలిర్చి యెలర్పుఁ గావుతన్. ౨౭౧

4. మ. "సిరియున్ వాణియు నొక్కచోట నిలియుంటల్ చేకూర" దన్మాట ని
న్నరయన్ దప్పనితోఁచు హానికలయుండా? పెద్దవిద్వత్తరున్
గుణుత్తై తాఁ గ్రథమునందు సంస్కృతమునన్ గూలంకమపజ్ఞునున్
గురిసై తిట్టి యదృష్టమున్ సులభమొకో? అంకినీఁదుభూపతీ. ౨౭౨

5 మ. ఎలమిన్ గొండిక నాఁడె నీవయితి వీయే పట్టభద్రుండవ
వ్వల గీర్వాణవచః ప్రపంచకల నాపట్టాభిషేకమ్ము నీ
కొలసెన్ వెల్గుగ కాంధ్రనాయకుఁడె నీవున్నాఁడు రాజ్యమ్ము తాఁ
తలనాఁడే తలఁకుండు దేనికి మహాస్థం బిప్పుడో భూపతీ. ౨౭౩

6. క. శ్రీమత్తయు ధీమత్తయు గోమత్తయు గలుగు రాజకుంజరుఁడవు నీ
క్షేమానుబంధమున్బ్రన గ్రామంబుల ప్రజలసుఖ మగణ్యము భూపా. ౨౭౪

7. శా. లోకారాధనమే ప్రభుత్వమని సుశ్లోకుల్ మునీంద్రుల్ మహా
ధీమల్ వల్కుట నీవెఱుంగుదువు రాష్ట్రంబు వర్ధిల్లుటల్
లోకారాధనచేతనే మహితశీలుండైన శ్రీరాముఁడే
యీకార్యమ్మున సాక్షియై యలరుఁ జుమ్మీ యంకినీఁదుభూపతీ. ౨౭౫

8. శా॥ నీకున్ విద్దియ నీకు సద్యశము మన్నీఁడా! మతిన్నీకు సు
శ్రీకళ్యాణసమృద్ధి నీకు విలసచ్ఛీలమ్ము నీకాత్మజ
ప్రాకట్యమ్మును నీకు రాజ్యకలనా ప్రస్ఫీతియున్ సర్వమున్
జేకూరన్ మునుపే యిఁకేమి కవియాశీస్సుల్ ప్రసాదించెడిన్. ౨౭౬

9. తే. గీ శ్రీమదుద్దండభారతీస్వామిసదుప, దేశమున నీదు పెదతాత సేవిఁ గొలిచి
దేవతా ద్విజభక్తవర్తిష్ణుఁడయ్యె, నసఘు నా లేని మఱవంగఁ జనదు భూప. ౨౭౭

10. శా. ఏకుక్షింభరులో యథేష్టముగ నేకృత్యమ్మునో పట్టి ధ
ర్మైకాలంబనమైన యోగము మందన్యాగ్రమూహించి త
ద్వైకల్యమ్మునకుం గడంగినను నీతాల్పర్య మావంకకుం
బోకుండన్ సుఖియించుఁగాక మతికంభూ? అంకినీఁదుభ్వవరా. ౨౭౮

11. తే. గీ. కలవునీపాలిటికిరెండు కల్పతరువు, లందుఁ ద్రిపురసుందరి యొకటవనినాథ
రెండు శ్రీసోమనాథుండు పండితుండు వేలు నీభాగ్యమున కింక వేరగలదె? ౨౮౯

12. మ. పలుచోట్లన్ వినుచుంటినయ్య! నృపతీ? పట్టాభిషేకంబటం
చెలమిన్ లక్ష్యముగాఁగఁజూచినదిలే దేనెందు నేఁడశ్వని
స్తులమై శాస్త్రవిధి ప్రమోదితమ్మునై సొంపారు నీయుత్సవం
బలరన్ గాంచుట, లోటుతీర విజయంబౌఁగాక నీకెల్లెడన్. ౨౯౦

## శ్రీచెలికాని లచ్చారావుగారి నిర్యాణము—చిత్రాడ.

1. ఉ. కాకము గాఁ జిరాయువునఁ గ్రాలుటకన్నను బూఁటఁయేనిఁ దాఁ
గోకిలమై మనం గనుట కోవిదమాన్య మటన్న ఫక్కి నీ
కే కద దక్కె, నీవునయి యేడ్వఁగ నేటికిఁ గీర్తికాయ మీ
లోకమునందు డించితివి లోకహితమ్ముగ లచ్చరాణ్మణీ! ౨౯౧

2. చ. తిరుపతిశాస్త్రి కెంతయు విధేయుఁడ వీవతఁ డేగ నప్పురం
దరునిపురమ్ము; నాతనిఁ గనన్ మనమందలి కోర్కి నీవు దు
ర్భరమయి యేగియుందు, వదిభావ్యము యయ్యెడుఁగాని, నీదుసో
దరిని దలంపవైతి, గుణధన్యను, మాన్యను, రామయాంబికన్. ౨౯౨

3. మ. అరరే! యెంతటి మందగ మ్మిది విధాతా! బ్రహ్మవిద్యావివి
స్ఫురణం బించుక లేనివాఁడనియొ? విస్ఫూర్జన్మహోదగ్రవీ
శ్వర నిర్వ్యాజమహోపకారి యనియో? స్వల్పాయుషున్ జేసి భా
స్వరు శ్రీమచ్చెలికానివంశజుని లచ్చారాయనిన్ మ్రింగితే? ౨౯౩

4. మ. తనయావత్స్వము వెత్తయె సతము విద్యాభివృద్ధ్యర్థమ్ముగా
వినియోగించినమేటి, కావ్యనిధి, నిర్విఘ్నాంధ్రభాషాంగనా
పునరుద్ధారణబద్ధకంకణుఁడు సత్పూజ్యాంకు, శ్రీలచ్చిరా
డ్జనపాలుండని నీవెఱింగియును గర్వా! యిట్లు గావింతువే? ౨౯౪

5. ఉ. ముప్పదియొన్మిదేఁడులకె మృత్యువునూఁదునె కాకయేమి? యీ
తప్పునకాలమందు గుణధన్యులు మాన్యులు నిన్నువంటివా
రెప్పగిదిన్ మనంగలరు? హేయపుఁగృత్యము లాచరించుచోఁ
దప్పక నీవునుం గలుగదా? చిరమాయువు లచ్చరాణ్మణీ! ౨౯౫

6. సీ. నీసేకరించిన నిఖిల నిర్ముద్రితాంధ్రగ్రంథముల కింకఁ దారియేది?
నీవు రచింపఁ బూనిన యాధునిక కవీశ్వరచరిత్రకు నింకఁ బారమేది?

నిన్నాశ్రయించి మనియెడి విద్వత్కవీశ్వరకోటి కింక నాస్థానమేది ?
నీపూన్కి కతన వన్నెకు నెక్కి సొగడు సత్పత్రిక కింక నాధారమేది ? ౨౯౬

6. గీ. పొరఁబడితి నెల్లభారమ్ము పూనఁగలఁడు,
సోదరుఁడు ధర్మరావు సత్పూరిహితుఁడు
నిన్నుఁగాంచుభాగ్యమె మాకు సున్నయయ్యె
తీరదాలోటు లచ్చరాడ్ధీవరేణ్య ! ౨౯౭

7. క. మాతను సోదరముఖ్యుల, నీతీరున డించి యేగితే ? మిత్రమ ! నీ
చేఁ "తెవరికివారే యమునాతీరే" యన్నమాట నాకున్ దెలిసెన్. ౨౯౮

8. ఉ. పోయిన నింకనీకుఁ దలఁపోసిన లాభములేదు, నీదుస
ల్పాయువు పెద్దపెద్దలకు నన్నివిధమ్ముల నొజ్జయయ్యె నీ
శ్రీయును ధన్యయయ్యె నినుఁజెప్పి మఱొక్కనిఁ జెప్పరాదు, శ్వ
శ్రేయసముబ్బఁగాక యిఁకఁ జిన్మయమూర్తికి నీదుకీర్తికిన్. ౨౯౯

## శ్రీరావురామాయమ్మజమీందారుగారు లక్ష్మీనర్సాపురము.

1. శా. లచ్చారాయఁడు కీర్తికాముఁ డఁటయే లక్ష్యమ్ముగా నెంచి వి
ద్వచ్ఛందుల్ దను మెచ్చఁ దన్మయులసత్కావ్యంబు వార్జించి భా
స్వచ్చారిత్రుఁడు దాని యందఁగొని తత్సంపాదనవ్యాప్తికి
న్నిచ్చల్ కారణ మైననిన్నయిన మన్నింపండు రామాంబరో? ౩౦౦

2. శా. తల్లీ? రామమదేవి? కీర్తివనితా తాత్పర్యపర్యాప్తులై
తల్లీలాకలనమ్మునం దగులు సోదర్యుల్ ప్రసూభక్తి వి
ద్వల్లోకమ్మునయందు రక్తి, యెదియుం బాటింపమిన్ లోకమం
దెల్లన్ జూచుచునున్నదే, యిపుడుఁ గ్రొత్తేమున్న దోయమ్మరో. ౩౦౧

3. శా. అమ్మా! యాతఁడు నిన్ను మమ్ములను దేహంబున్ మఱిన్ గేహ ము
గ్ధమ్ముగ్ధాంగిని గూడఁ గీర్తివనితాతాత్పర్య పర్యాప్తమో
హమ్మున్ జేసి తృణీకరించె మనకేలా? వానికిన్ లేనిప్రే
మమ్మవ్వానియెడన్ విరక్తి గొనుమమ్మా? యింక రామాంబికా. ౩౦౨

4. శా. లచ్చారాయని వంటిసోదరుఁడు వేలచ్చల్ మఱిం గోటులున్
వెచ్చంబెట్టిన నీకుఁ జేకుఱుఁడు తద్విఖ్యాతి కాయంబుపై

హెచ్చుపేర్మిని జూపి నీ వతనిపే రీలోకమం దెల్లెడన్
నిచ్చల్ నిల్పితె నీమనమ్మునకు శాంతింగూర్చు నోయమ్మరో? ౨౦౩

5. సీ. అతఁడు నిల్పినయట్టి యాంధ్రసద్గ్రంథాలయమ్ముపైఁ బ్రేమమ్ము నానుమమ్మ?
అతఁడు నడుపుచున్న యాంధ్రభాషావిలాసినిన్ ఒత్రికను బరామృశింపు మమ్మ?
అతని కాయాయికార్యములఁ గోడ్పడెడిసన్నిధివర్తులను గమనింపుమమ్మ?
అతనిగౌరవమున కాటపట్టు లగువిద్వత్కవీంద్రుల పేర్మిఁ దలఁపుమమ్మ?

తే. గీ. ఇదియె నీ కన్నయెడఁ గలహెచ్చుపేర్మి, కరసినీచేయఁదగినకార్యక్రమమ్ము
ఇది యతనిమాత్రమే కాక యిహపరముల, నిన్ను నెగడించుత్రోవ మన్నింపుమమ్మ?

6. మ. ఇతరస్త్రీలనుబోలె విద్యయనఁగా నేలాటిదో సుంతయున్
మతిఁ జర్చింపనిదాన వైనయెడలన్ మాబోట్లు చెప్పన్వలెన్
సతమున్ విద్యయె నీవు నీ వదియునై సద్గోష్ఠితోఁ గాలమున్
గృతకృత్యం బొనరించు నీకు నొకరుం డేమంచుఁ జెప్పన్వలెన్. ౨౦౫

7. శా. నచ్చన్ జెప్పెద నొక్కమాట వినుమీ? నాతల్లి? రామాంబరో
లచ్చారాయఁడు నీఁడు గాఁడుగద? వేలచ్చోఁ ధనాదాయముల్
నిచ్చల్ సద్గిరరాజచంద్రులకు నేనిన్ రానిసత్కీర్తితో
హెచ్చోవన్గెడి గారణం బరయ నీకే తెల్లమౌ సర్వమున్. ౨౦౬

8. ఉ. కాన సుకీర్తికిన్ గొలఁదియుం గాని ధనంబులుగాని రాజ్యముల్
గాని కవిత్వసంపదలు గాని మశేవియుఁ గాని సాధకం
బై నెగడంగనేర వివి యన్నియు లెలుఁగరు తల్లి? పాత్రగా
పాత్రము లెఱింగి వర్తి యిహంబుఁ బరంబును జూడఁగోఁదగన్. ౨౦౭

9. శా. నాకై చెప్పెడిమాట గాదిది యెటో నాకబ్బ సంతృప్తి యె
ట్లో కాలమ్మను నిల్లు వీడకయె "ధన్యం"బంచు నిచ్చల్ ప్రజల్
వాకో నెట్టుమనుంటి లచ్చవిభునీసత్కీర్తితో నీను సు
శ్లోకంబు న్నెగడింపఁ జెప్పునుడు లాలోకింపు మోయమ్మరో? ౨౦౮

10. శా. భాషారాజ్యమునన్ బ్రభుత్వమును సంపాదించి నీయన్న స
ద్భోషారత్నమ వైననీదయిఁ జేయూఁతన్ దిశాచక్రము
ల్ఘోషింపన్ దగినంతకీర్తిఁ గొని నీకున్ గల్గుప్రేమమ్ము మా
ర్త్వేషంబూని కనన్ దలంచెడిని గీర్తి న్నిల్పి కొమ్మమ్మరో! ౨౦౯

## శ్రీరావు రామాయమ్మజమీందారుగారు లక్ష్మీనరసాపురం.

1. శా. మీపై సత్కృతి నిచ్చి మీవలనఁ జేర్మిక్ బొందఁ డాసించి మీ
ప్రాపున్ మాత్రమె కోరియున్నకవి నారాధింతువో! లేక పో
పొమ్మందువో? తెల్పుమమ్మ యెపుడుం బూజ్యమౌ కీర్తుల్
మీపూర్వుల్ ప్రకటింపఁబో దరయ మేర్మిన్ బూని రామాంబరో. ౧౧౦

2. శా. సోదర్యుం డగుసూర్యరాయనినృపుల్ శోధింపు మత్యంత మ
ర్యాదాపాదితు నన్నయాన్ మఱియు ధర్మారావు తద్వాక్యము ల్లా
మోదింపన్ బ్రియతింపు మిట్టియెడలన్ మోమోటమున్ దుర్యశః
ప్రాదుర్భూతికి హేతువుల్ యశము సంపాదింపు రామాంబరో. ౧౧౧

3. శా. లచ్చారాయనితోడనే చనె నమూల్యాంశైః రామాంబికా
త్యక్త్వైవస్వద్యశ" యంచు సత్కవులచే నూరూర నోరారగా వా
కొప్పన్ జేయకుమమ్మ! నానోళువువాక్యల్ త్వద్యశః కన్యకన్
నిచ్చల్ వర్ధిలఁజేయుమట్టి వగుసేవిక్ విన్మ రామాంబరో. ౧౧౨

4. చ. గురువటె లచ్చరాయనికిఁ గోవిదుఁడౌనట? నాతుఁడౌట? పు
ష్కరము సుమారు కాదగిన కాలము నుండి భవిష్యదాశచేఁ
గరమనురక్తి నిలిచి కష్టసుఖమ్ముల కోర్చి కొల్చి యి
ప్డురక మఱొక్కచోఁ జనుట కొప్పునె యమ్మ? భవాన్యశప్రభుక్. ౧౧౩

5. చ. వ్యయములు మీకొనర్పనవి ప్రాకములేని యందు నెట్టిప
ద్వ్యయములు నాటనాట నొకటైనను నుండుట నష్టబంబు ని
శ్చయమిది యియ్యెడన్ మనవి సల్పెదొసగు మాదిరాని సుం
తయు నిటు నుండఁబోదుసుమి దాలకోసము రామసురాంబికా. ౧౧౪

6. శా. మీచేయూఁతనె లచ్చరాయఁడు మహావేరుప్రకాశాధ్యుఁడై
వాచాకుర్యుల నిల్పి కీర్తిఁగొనెఁ దప్పిభాగ్యతి సర్వమ్ము మీ
కేచెందెన్ ధరివ మీమహాయశము మీరిప్పట్ల గాపాడుకో
వాచందార్కము నిల్చు చేసియొక సన్మార్గంబు తామా సమ్మరో! ౧౧౫

7. ఉ. మిక్కిలి మీయెడన్ నిలుచు మీధనమున్ దినమంటఁ జేసి నా
మక్కువ యక్కటమ్మ మన మాటికి "నా కిదియేల?" నాక నే
నొక్కపదింబు మంటిఁ బదినాళులు సాలుకు ఖర్చువెట్టుట
కెక్కడయో? మీకు, లక్షలును లెక్కడ రొక్కకపట్లు నంబరో. ౧౧౬

8. ఉ. కావున మీయుదారతకు ఖర్చిది లక్ష్యముగాదుగాని స
ద్భావులు సన్నిధానమున వర్తిల, రొక్కటుండియున్ వృథా
గా విభుమానసాంబుజము కందఁగఁ జేసెడివాక్కు లెంతయున్
సేవకధర్మదూర మని చెప్ప ? రెఱుంగుము సత్య మంబరో. ౧౧౭

9. క. భూవిభు లగాధహృదయులు, గావున "నూతు"లన నొప్ప ఘటకగుణశ్రీ
జీవన మిడవలె విను తద, భావంబున జీవనంబు బహుముఖ్యటమహా. ౧౧౮

10. క. కావున నింత వచించితి, భావమ్మున దీని నెఱిఁగి పండితకవిసం
భావిత మహాసద్యశమున్, జీవింపఁగఁజేసి వృద్ధిచెందుము తల్లీ. ౧౧౯

11. మ. కవి నారాయణశాస్త్రి నీదయకునై గన్పట్టుకున్నాఁడు ల
క్షవరాలిచ్చియు నిట్టివానిఁ గొనుటల్ శక్యంబె? పుట్టించెటి స
త్కవి యోగ్యుండు కృతజ్ఞుఁ డమ్మరో! భవత్సామ్రాజ్యపున్ లబ్ధిసె
న్నవవంతో తిన నీతఁ డర్హుఁడుసుమా యాలింపు రామాంబరో ! ౧౨౦

12. శా. మారామాంబిక రాజ్ఞిగావలయు, మామా రిక్తపల్ సర్వమున్
దూరంబైకడుభాగ్యపున్ గరిమతోఁ దూఁగన్ వలెన్ మేమటం
చారూఢిన్ గనువారిలో నిరఁ డొకం డాత్మన్ విచారించి యీ
ధీరాగ్రేసరు కోర్కె దీర్చుటకు నుద్దేశింపు రామాంబరో! ౧౨౧

13. మ. చిరకాలాశ్రితుఁ డుత్తమాన్వయుఁడు మీ సేవంబునే కోరుధీ
వరుఁ డిట్టిం డొకరుండు దిన్నయెడ మీ భాగ్యానకు న్నేమ్కి బం
గరుకుం దావియపోలె సార్థకతయుం గల్గున్ బగంబందు న
క్షరమాబున్యము నతురాస్యజన రక్షన్ జేసి రామాంబరో! ౧౨౨

### ఏలూరు శ్రీమోతే నారాయణరావుగారు.

1. శా. శ్రీబృందారకశ్రీ వైశ్యవంశమున వర్ధిల్లుండుగాఁ బుట్టి సం
తానైశ్వర్యము లొనగాఁ గలుగు నైశ్వర్యమ్ములం జేర్చి వి
ద్యానందమ్మునదక్క వేఱొక యెడన్ వ్యాలోలత ల్లేనిమో
తేనారాయణరావునిన్ సుఖితుఁగా దేవుండు దీవించుతన్. ౧౨౩

### శ్రీ ఆత్మకూరు రాజాగారి కుమారుఁడు హైదరాబాదు.

1. ఉ. వినయవివేకసంపదల వెన్కటి రాజులకన్న మిన్నవై
చనరెడినీయెడన్ మనము చిక్కువుఁ దృప్తివహించె నాత్మకూ
ర్జనవనందనా! వినుము సత్యముగా వచియింతు నీదుకీ
ర్తి నను నెఱవేర్తు నీపురి కొగిన్ జనుదెంతు ధర్మవమ్ము నమ్ముమీ. ౧౨౪

## శ్రీ చెలికాని సూర్యారావుగారు – మురుమండ.

1. ఉ. శ్రీయుతమై మహావిబుధసేవితమై సరిదంతికస్థమై
పాయనిభోగభాగ్యములపట్టయి చుట్టునెసంగుతోటలన్
గోయని కూయుకోయిలలగుంపులు లోనగు పక్షిబృందముల్
హాయినొసంగఁ బొల్చెడి సనాదిగ శ్రీమురుమండ భూస్థలిన్. ౨౨౫

2. తే. గీ. గౌతమికి దానిశాఖయై గాలితుల్య
భాగమును మధ్య నున్నయప్పగమపావ
నంబగుప్రదేశమున మునినాథులెల్ల
మండలింగూడి యచట ధర్మములు తెలుప. ౨౨౬

3. చ. వెనుకటికాలమందున నివేదనసేయుటంజేసి యాస్థలం
బును "మునిమండలం" బనుచు మున్నని గంతటఁ గొన్నినాళ్లకుం
బనుపడె దాని కెల్లొ "మునిమంద" యనన్ జనుపేరు నేఁడు దా
నినె "మురుమండ" యంచు నవనీప్రజలెల్ల వచింతు రెమ్మెయిన్. ౨౨౭

4. ఉ. గామోవంశవర్ధను లుదారులు కూరుచు వెల్మవారు సు
శ్రీమహితుల్ సదా యలపురిన్ వసియింతురు తద్విశాలధన
స్తోమమునందు దానమితశోభ వహించియు సత్కృతిప్రతి
ష్ఠామహనీయతల్ గడు నెసంగిరిలన్ మితిలేనివైఖరిన్. ౨౨౮

5. సీ. గామోవారికి గోహితుండై చెలికానిభాస్కరరావుగారి కొమరుఁ
డైనసూర్యారావు మానమర్యాదల కునికపట్టైయోగ్యుఁ డొడయుఁ డగుచు
మురుమండగ్రామమ్ము సిరిఁ దులదూఁగఁగ నేలుచున్నాఁ డిప్డు దేశక మెసఁగ
నీతని దేవేరి యెంతయు సుగుణాలవాల మాదామెరవంశజాత

తే. గీ. యన్నపూర్ణ, వరహాలురాయుని యనుంగుఁగూఁతు, రుత్తమోత్తమశీల పత్యుచితవృత్తి
రహిని నెసంగె డివేంకటరమణయాంబ, మేనమామకొమార్తెయు మేల్మి గలరు. ౨౨౯

6. ఉ. సంపదలు లిర్వురున్ మిగుల దైవతభక్తియు విప్రసక్తియున్
బెంపెసలారువారగుటఁ జేరుఁ బ్రతిష్ఠయు వృద్ధిఁజెందఁబల్
సంపద సొంపు మీఱ సరసమ్ముగఁ గాలము వెళ్ళఁబుచ్చుచున్
బాఁపఁడిపోవు మండిరి కవుల్ గణియించుసుశీల మొప్పఁగన్. ౨౩౦

7. క. సూర్యారాయఁడు పూర్వపు, టార్యులయాచారములను నవ్యాగలమేల్
మర్యాదల నవ్యాదల, చర్యల నెల్లప్డు నిల్పు స్వాంతము పేర్మిన్. ౨౩౧

8. శా. ఆయూరం గల దాలయం బొకఁడు ప్రాచ్యంబందు సోమేశ్వరుం
డేయే కాలమునుండియో కలఁడు గానీ నర్మదాబాణమం
దాయీశుండు ప్రతిష్ఠ సేయఁబడలే దాలోటు తీర్పంగ నీ
రాయం డెంచు మనుండె నెమ్మదిని విప్రప్రేరణల్ మీఱఁగన్. ర ౩౧

9. ఉ. బాదముఫ్రూడిబుచ్చయ స్వభావవినమ్రుఁడు సూర్కులుమాప్త రా
ర్యాదయితాంఘ్రిపూజకకులాభరణుండు కలాకరుండు కోఁ
డాద్యుతిఁ జూపు కార్యమున "కాబలి, మే"లని ప్రోత్సహించెఁ దా
మేదుర మయ్యె నాదరము మేదినిభర్తకు సత్కృతమ్మునన్. ర ౩౩

10. తే. గీ. నర్మదాబాణమును దెచ్చి కర్మనిష్ఠ,లైనశైవద్విజులను వేదాదివిద్య
లందు నాఱితేఱినవైదికాగ్రణులను, నెలమిఁ బిల్పించె సూర్యరాణ్ణృపతివరుఁడు.

11. సీ. ఆగమశాస్త్రమం దగ్రగణ్యుండు విద్యావయోవృద్ధుపాధ్యాయవరుఁడు
నైనశ్రీకంఠవంశాంబుధిచంద్రుండు కేదారలింగవిద్యాదయితుఁడు
శాస్త్రోక్తవిధిబోధ సలుపఁగా శాలయు నందలివేదికలందు నందు
వలసినకుండముల్ గలయ వినిర్మింపఁగాఁ జేసి సూర్యరాడ్ఘనుఁడు భక్తి
తే. గీ. తనర దీక్షితుఁ డయ్యె ఫాల్గునమున సిత, పక్షమున నవమిని భానువాసరమున
మేషలగ్నమ్మునను మతిమృగశిరోభ,మునను దుందుభివత్సరమునను బేర్మి. ర ౩౪

12. మ. సుకుమారుం డతఁ డయ్యు ఋత్విజులతో శుష్కోపవాసవ్రతా
ధికదీక్షాపరతంత్రుఁడై యచట నార్త్విజ్యమ్ముఁ గైకొన్నవా
రికి నాశ్చర్యకరమ్ముగా "నితఁ డయారే! పూర్వజన్మమ్మునన్
బ్రకటబ్రాహ్మణవంశ్యుఁడో? ననుగతిన్ వర్తించె నత్యంతమున్ ర ౩౬

13. చ. అచటిహరద్విజాగ్రణుల యం దొకఁడేనియు నాగమమ్మునన్
బ్రచలితదీక్షుఁడున్ నుతయపాత్రుఁడు నైలహరుండు లేఁడ సూ
రిచయము మెచ్చుకోఁదగినరీతి స్వకృత్యమునన్ గృతార్థులై
ప్రచురగతిన్ జరించు నలవారలయోగ్యత లెన్న మిన్నయౌ. ర ౩౭

14. మ. శివవిప్రౌఘమునందు మున్ను గల దుశ్శీలత్వశంకాదికం
బవకాశమ్మిడఁ బోక రూపఱియె నాఁ డమ్మండపమ్మందు శా
స్త్రవిధిన్ హోమము లొనగాఁగలుగు సత్కృత్యమ్ముల్ నివర్తించు బ్ర
హ్మవిదగ్రేసరులం గనుంగొనిని సూర్యక్షోణికిం బ్రాక్తనన్. [illegible]

15. క. ప్రత్యక్షరుద్రులో? యా,దిత్యప్రతిబింబములో ప్రథితశక్తులో? "త
త్త్రిత్యర్త్విగ్వరు"లని తత్రత్యులు సభ్యులు నుతింపఁ దనరిరి వారల్. ర ౩౯

13. ఉ. చెప్పెడివాఁడు కృష్ణకవి, చెప్పఁగఁజేసెడివాఁడ వీవు, మీ
రెప్పటికిన్ మహాయశము నెంతయుఁ గాంతురుగాక, లోకపున్
మెప్పును గొందురిగాకది సమీహిత మేదియు లేనినాకెటో
గొప్పదనంబుఁ దెచ్చుటకొకో? యని యెంచెద మీవివాదముల్. ౧౫౪

14. చ॥ మృదుహృదయుండ మాయికుఁడ మేయుఁడు కృష్ణుఁడు, నీవొ? సత్కవీ
ద్వదనముఁగఁ గన్నమాత్రన ప్రపంచము సర్వము విస్మరించు నా
హృదము గలట్టి నాత్మమణి విట్టిద్వయమ్మున కించుకంత యీ
కదనము వేంకటేశునెడఁ గ్గినకూరిమి పెంపు భూవరా. ౧౫౫

15. సీ. సచ్చిదానంద శ్రీస్వామిచాతుర్మాస్య కారణమ్మున వచ్చుఁగాక యిటకు
రారె? నిస్పృహు లయ్యు రాజులకడకు యతీంద్రు లవ్యాజంపుఁగృపను లోఁగి
యంతమాత్రన "యింతవ్యయమేటి" కనక యిందఱఁ బండితులఁ బిల్చు ధన్యు లెందె?
ఉండురిగా కేనేడ కొఁగి రాఁగ వీలు లేకుండియు వచ్చు టెట్లొకోరె? నీస

తే. గీ. మస్తమును నాకదియె గొప్పయశము దొరకు,
కారణంబని నాకదిఁ గానఁబడెడి
నితరనృపులఁ గాంచిన దొకయెత్తు నిన్నుఁ
గాంచు టొకయెత్తు సుమ్ము ముక్త్యాలభూప? ౧౫౬

## శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావుగారు—లక్ష్మీనరాసపురము.

1. శా. శ్రీరాజ్యంబని పేరుగాని మఱి యొండేనేని నీ కేజమీం
దారుల్ తుల్యులు? చెల్లయాంబరో? భవద్దైర్యంబు నీశౌర్యముఁ
సారోదారత రాజనీతి కవితాసారస్యనిర్దిష్టతా
భారంబుఁ గన విష్ణుఁ బైననృపు లబ్బిబ్బంది లజ్జింపరే? ౧౫౭

2. శా. సీమారోగ్యము వృద్ధిచెందుత భవన్నిర్వ్యాజధర్మంబు ల
త్యాయుర్భాగ్యము నందుతన్ గడు నమేయంబౌ భవద్వంశ మా
యాయాధర్మము లొంటియై నెగడుఁగా కాయాయియానందమున్
నీయుద్యోగము మాని సౌఖ్యపడుతన్ నిక్కంబు చెల్లాంబరో. ౧౫౮

3. ఉ. పెంచితి వెద కెందరనో బిడ్డలకన్నను మిన్నగాఁగఁ బ్రే
మించితి పెండ్లిళుల్ సలిపి మేటిగృహస్థులఁ జేసి చూచి హ
ర్షించితి డెబ్బదేండ్లు గడచెన్, మఱి యొందును నీకు స్వార్థ మొ
క్కించుక లేదు నీదుజని యెంతకృతార్థమొ చెల్లయాంబరో. ౧౫౯

4. ఎంతో యోజనచేయకుండ నతి నీ వేవస్తువుఁ గాని నీ
చెంతన్ జేర్పవు, జేర్చుచో విడువవో చెల్లాంబ? యీమాట నీ
స్వాంతమ్మందు ముఖస్తవమ్ముగఁ దలంపన్ వీలు లే దిందు నా
క్రాంతేనిన్ గృపయున్నఁ దెల్పుటకునై యేనిన్నుఁ జేరికెపెదన్. ౨౬౦

5. మ. నిను నిష్కల్మషవృత్తిఁ గొల్చి యెవఁడే నీగాని లక్ష్మీకృపా
ఖని కాకుండఁడు నీకృపాకరిమ నేఁ గైకొంటి నిన్నాశ్రితుఁన్
జన వాక్యండ వినా మ మైశ్వర్యాదియు నాస్వాంతంబు వాంఛింప దిం
దునకే నెప్పటికేని యాయ్యాది కడుం దోడ్పై బల మ్మిచ్చెడిన్. ౨౬౧

6. మ. చిరకాలాశ్రితులై నినుం గొలుచుచున్ జీవించునుద్యోగు లం
దఱిభాగ్యమ్మునఁ జేసి నీయెడఁ గడున్ దైవమ్ము దీర్ఘాయువున్
గరుణించెన్ ధ్రువ, మేనెఱుంగుదును, నిక్కం బింత నీజాతకం
"ఒరుజాశాలితగూడఁ దోడగునుగా"కం చేను దీవించెదన్. ౨౬౨

## శ్రీ వేంకటాద్ర్యప్పారావుగారు - నూజివీడు.

1. చ. కవివై, సత్కవిగాయకాదులను సత్కారమ్ములం దన్పుచున్
లవమున్ లోపము లేనిసంస్కృతిని హేలన్ గాలముం బుచ్చుని
న్ను విలోకించిన, నీదుసంతతిని గన్గొన్నంత నో వేంకటా
ద్రివిభూ! కన్నులపండు వయ్యెడి నినున్ దేవుండు దీవించుతన్. ౨౬౩

2. మ. స్మితపూర్వమ్ముగ మాటలాడునఁట! యా శ్రీకృష్ణుఁడో రాముఁడో?
స్మిత మాన్పై నొనరించువాఁడఁట భవచ్ఛ్రీకృష్ణునిన్ బోలునీ
స్మితపూర్వత్వము తండ్రివంకధనమై చేకూరె నో వేంకట
క్షితిపాలాగ్రణి! నీకుఁ గృష్ణుఁ డిడుతన్ శ్రేయమ్ము భూయమ్ముగన్. ౨౬౪

3. ఉ. శాంతియు దాంతియున్ గలుగుస్వాంతము మానవులకుండు, నొండుచో
వింతగదా! భవత్ప్రదముపీఠి రజోగుణయోగ్యమయ్యుఁ దా
నెంతయు శాంతిదాంతుల వహించు మఖస్థితిగాదు, నిక్క మే
సంతసమందితిన్ శుభ మెసంగుత వేంకటభూప! నీకొగిన్. ౨౬౫

4. ఉ. ఎందఱు లేరు భూపతు లహీనరమావిభవానుభూతిసం
క్రందను లల్లరయెల్లరకుఁ గావుత సేమము దానికేమి! నీ
యందలిసద్గుణంబు లవి యానగపాలకకోటిలోన నే
కొందఱకో ఘటించు ననుకొందును వేంకటభూప! నామదిన్. ౨౬౬

వ్వారికిని జ్ఞప్తియందున ధృవంబుగ నుండకపోయె, నే నెట్లొ
యెఱింగితి దానిఁ దెచ్చి వెస నిచ్చితి నారయభూపమౌళి క
చ్చిఱుతన్నపాలుఁ డండులకుఁ జెందినమోసముఁ జెప్పఁజాలఁ జె
చ్చెర నది ముద్రితంబుగను జేయఁగఁ జేసెను దాని నిస్థలం
కరణసాక్షులు దగన్ దమశిష్యుల కోటి-పాఠముల్
దఱుచు వచింపుచుండిరి, యువారుఁడు నారయభూపుఁ డంతఁ బో
కరసి విదస్వాయుజుల నాస్వతిస్మొఁ బిలిపించె వారి క
చ్చెరువగు సత్కృపాతిశయ లిపి చెందెఁ గృతార్థులై; సత్కథా కవీ
శ్వరుల సహాయ మిప్పటికిఁ బ్రాజ్ఞనృపాలురు కోరుకొంట కీ
_రిగనుకు వన్నె వెట్టఁగల తెల్వి మహోన్నతి కుండదంచు లో
నెఱిఁగియె కూ? ప్రసిద్ధులగు నెంకటఊరాజులతోడ నీవు చు
ట్టరికము లందిన్ గవిశతాత్మపరంపరతోడ నందుచు
ట్టరికము బోలజాలమి ద్రఢమ్ముగ నిమన మొప్పనీయవి
సగసత నే నెఱింగియె ప్రసంగమొ ర్చితి నింగవట్టు ని
కురువగు నాయువుల్, యశము యోగ్యత, సంతతి సంపదాశ్వితా
స్ఖరణము రాజ్యమున్ మిగులఁ బ్రాపిరివోఁ గరుణించుఁగాక యా
గిరిపలిశోభనాద్రి నిజగేహము గాఁగల మూర్తి వేంకటే
శ్వరుఁ డని వేంకటేశ్వరుఁడు సన్నుత వేంకటాద్రిభూ
వం? గ్రహియింపుమయ్య? జయవైభవముల్ గొనుమయ్య? యయ్యెడన్.

## శ్రీ చెలికాని సూర్యారావుగారు—మురుమండ.

1. ఉ. ఏన్నపు నాదగమ్ము వహియించుటఁ జేసి జయప్రదమ్ముగా
శ్రీ నొడఁగ నీసభ సుశీలుయ మెచ్చ నెసంగ నట్టి స
న్మానినికీర్తి యాసుగుణమండితుఁ డాగునగాత, నిర్మల
జ్ఞానయుతుండు వోల్పుఁ జెలికానికులీనుఁడు సూర్యరావిలన్. ౨౬౯

2. తే. గీ, ఈసుమాను గాను డిలి సత్కృత్యంబు,
లెపుడుఁ జేయుఁగాక! హితులు మెచ్చఁ
గరుణ నితనిఁ బ్రోచుఁగాక సోమేశుండు
సర్వకామదయుని సద్గతముగ. ౨౭౦

## శ్రీ బొబ్బిలిసంస్థానము.

చంపకమాల.

1. ఒకశుభ మిచ్చటం గని మహోదయ మందితి నో నృపాల! యిం
టికిఁ జనంగావలెన్ ద్వరగ నేఁటికి నాఱవనాఁడు మత్కుమా
రకునుపనీతియుత్సవము రానయియున్నది బంధువర్గ మిం
తకు మును పిల్వఁగాఁబడెఁ బదంపడి కాఁదగు నందు రేని యం
దుకు నవకాశ మేది? కడుఁ దొందరగాఁ జనమున్న మాట ద
క్కక రసభంగ మయ్యెడిని గావున నిప్పుడె యుష్మదాజ్ఞ వీ
నికి దయ సేయుమంచును వినీతిగ వేడుచునుంటి మీకుఁ దీ
తికగలరోజులేని మఱిరెండొకొ మూఁడొకొ గంటలేని విం
టకు నవకాశ మిమ్మని యొసంబడు నట్లొనరింపనేర్తు ని
దరికు మఱి భోజనమ్మనకుఁ దగ్గయుఁ దీఱనియుత్సవంపు వే
డుకను మెలంగుమి మ్మెటు కడుఁ జొగమోటము పెట్టువాఁడఁ దీ
తిక యగుదాఁకఁ దాళుటకు రందమనిచ్చిర మాముహూర్త మో
పిక యెటులిచ్చు? "భూమిభునివేశ్మము నందును మంత్రిగేహ మం
దొకతఱిఁ బెండ్లి" యన్న యటు లున్నది నేఁటిసమస్య, యిట్టులే
సకలము నేహమున్ శుభవశమ్మున నేగడుఁగాక నీకు, వీ
నికయిత కేమి వేఱొకట నెమ్మదిగా వినవచ్చు, మీవుఁగో
రిక గలదేని సత్కవివరేణ్యు లనేకులు రాఁగలారు, వీఁ
డొకగణనీయుఁడే? యొకరి కొక్కటఁ జిత్తము పల్లవించు, న
న్నకుటిలమైన పేర్మి నిటు లాతుఁగా నొనరించిట్టి, ప్రీ
తికి నభివందనమ్ము లిడి దీవన లిచ్చితి నేగుచుంటి, వే
ఱొకట వసింతుఁగాక యిట నుండుదుఁగాక త్వదీయుఁడన్ నృపా
లక! యిఁక నన్ను నీమదిని లాఁతిగఁ జూడక స్వీయుఁగాఁగ నీ
దుకృపకుఁ బాత్రుఁగాఁగ గని తొందరమై రచియించి నట్టిమా
మకకవితల్ వెసన్ బడుపురిమాపములన దిగఁద్రావి యాపయిన్
సుకవులపాలి వేల్పవయి శోభిలఁగోరెద రంగరాట్ప్రభూ! ౨౭౧

## శ్రీబొబ్బిలిరాజావారి పట్టాభిషేకము.

1. శ్లో॥ శుభమస్త్వవిఘ్నమస్తు శ్రీరస్తు చిరాయురస్తు విజయోఽస్తు
అస్తు ధనధాన్యరాజ్యశ్రేయో విద్యాయశః ప్రజాసిద్ధిః. ౨౮౭

2. మ॥ అలమేల్మంగమ దేవి వక్షమునఁ జెన్నారంగ రంగత్కటా
క్షులవస్ఫూర్తి ననేకరాజ్యములు నిచ్చల్ సృష్టిగావింపఁగాఁ
గల శ్రీవేంకటశైలనేత కృపతోఁ గల్యాణముల్ గూర్చి బొ
బ్బిలిరాజేంద్రునకున్ జిరాయు విడుతన్ శ్వేతాద్రిరాణ్మౌళికిన్! ౨౮౮

3. క॥ ఈతఁడు శ్వేతాచలపతి, యాతఁడు నీలాచలపతి యఁటియ భేదం
బీతనికి నాతనికి ననేతాదృశు లిరువు రిరువురే యెన్నంగన్. ౨౮౯

4. ఉ॥ తాఁతలనాఁటి చుట్టమని తద్దయు నెమ్మదిఁ బ్రేముడించి నీ
వీతటి వేంకటేశకవి నియ్యెడకుం గడుఁ బిన్నవయ్యుఁ బ్ర
ఖ్యాతని గోరి వచ్చినటు లాదట సల్పితి వో నృపాల! నీ
ప్రీతికి సంతసంపడితిఁ బెంపుగ నీకిదువాఁడ దీవనల్. ౨౯౦

5. శా॥ నీకుం గీర్తి హెచ్చుఁగాక మఱియు న్నీ కాయురారోగ్యము
శ్రీకల్యాణపరంపరల్ పరఁగుతన్ శృంగారభంగుల్ సదా
నీకున్ భోగ్యములై చెలంగుత మఱిన్ నీనామమే నీప్రజా
నీకమ్మం దొకమంత్రమై వెలయుతన్ శ్రీరామకృష్ణప్రభూ! ౨౯౧

6. మ॥ వెలసెన్ రాజులకన్న మిన్నలను నవ్వి ఖ్యాతికిన్ దావుగా
వెలసెన్ బొబ్బిలి, తాదృశం బగుమహావిఖ్యాతి మీవారు వ
ర్ధిలఁగాఁ జేసిరి నీవు సిద్ధమగుతద్విఖ్యాతికిన్ వన్నెచి
న్నెలు గల్పించుచు రాజ్యమేలు మనుచున్ దీవింతు భూవల్లభా! ౨౯౨

7. మ॥ ఎలమిన్ దిర్పతివేంకటేశ్వరులచే నెందున్ దెలుంగున్ ధరా
స్థలి రాజుల్ ప్రతివారు చూడఁబడుటన్ దత్తద్యశంబుల్ సభ
స్థలి రిక్కల్ బలె వెల్గు; బొబ్బిలికిఁ దద్భాగ్యంబు లేదన్న య
న్నలువున్ నీపరిపాలనంబు దొలఁచెన్ ననీవు రప్పించుటన్. ౨౯౩

8. సీ॥ వేంకటగిరినేత వెనుకటియభిమాన మించి నిన్నెపుడు రక్షించుఁగాక
తిరుపతివేంకటేశ్వరుఁడు నీబంధుత్వ మెంచి నిన్నెపుడు వీక్షించుఁగాక
ఏడుకొండలరాయఁ డెంతదవ్వున నుండియైన నీసేమంబు నెంచుఁగాక
వడ్డికాసులవేల్పు వరదుఁడై నీపట్లఁ గంటికి ఱెప్పయై కాచుఁగాక

గీ॥ నీదుపట్టాభిషేకనిర్ణిద్రదివ్య,తరమహోత్సవచరిత మ్మ్రదగ్రకీర్తిఁ
కాకరంబయి యెల్లెడ నలరుఁగాక, బెబ్బులిగ నేల నేలు! బొబ్బిలినృపాల! ౨౯౪

9. మ॥ కలవానిన్ బురుడించుసంపదల నెక్కాలమ్ము శోభిల్లి చు
క్కలవానిన్ హసియించుకీర్తిగరిమన్ శైకోలు గావించి, చి
త్కలవానిన్ గనినంత నాదర మెదన్ గ్రమ్మన్ బ్రజల్ మెచ్చ బొ
బ్బిలిరాజ్యం బఱలేక యేలుకొనుమీ! శ్వేతాచలశ్రీపతీ! ౨౯౫

10. మ॥ వ్యయ సంయోగ గలల్పనల్ నృపులకై వార్ధక్యపుంగిన్నె దా
పయి కన్నన్నలు సేయఁగాఁబోడఁగ వేదాంతార్థముల్ దక్క నే
వియముఁ జిత్తమ్మున కింపు నింప విప్ర డోప్పృత్త్వనుహోశాన! తే
వయసున్ రావకోమారు నెట్లు కఱఁగింప న్నేర్తు నిన్ గైతచే. ౨౯౬

11. ఉ॥ కాఁగలవాఁ డు శాస్త్రమునఁ గావ్యకలాకలనమ్మునన్ మహా
భాగులు మెచ్చికోఁ దగినవాఁడితి వొల్చెడివాఁడు యోగ్యతా
ధీగరిమమ్ము గల్గినసుధీరుఁడు నాపినతమ్ముఁ డల్లుఁ డి
చ్ఛాగతి నీకు నీడని వెనన్ గొని తోడ్కొని వచ్చితిన్ నృపా! ౨౯౭

12. శా॥ శ్రీలోలుండు కృపాకరుండు సకలశ్రీయోనిధానంబు ది
వ్యాలంకారుఁడు భక్తరక్షణకళావ్యాపారపారీణుఁ డు
ద్వేలప్రాభవుఁ డబ్జనాశ్రితుఁడు సద్వేదాంతవేద్యుండు గో
పాలస్వామి త్వదిష్టదైవము కృపన్ బాలించు నిన్భూవరా! ౨౯౮

"ప్లోలోట్" ఆటసందర్భమునఁ జెప్పినవి.

1. ఉ॥ అంగజము నెక్కి మున్ను నిటలాక్షుఁడు గెల్చెఁ బురత్రయంబు గే
వల తురగమ్ము నెక్కియు సవారొనరించుచు నాడుకందుక
స్ఫురదురుఖేలనమ్మునఁ గవుల్ వినుతింపఁ బురత్రయంబు గె
ల్చి గహిం యశమ్ము గొంటివని చెప్పఁగ వింటిని రంగరాట్ప్రభూ! ౨౯౯

2. మ॥ హయరాజంబుల నెక్కి బొబ్బిలిపురాధ్యక్షుండు సోదర్యు లెం
తయు శ్రీవేంకటరామారావు మొదలౌ ధన్యాత్ము లన్యోన్యమున్
జయకాంక్షన్ వెస బంతికై పెనఁగు నాచందంబు పార్థుండు త
ద్దయు శంభుండును ఘుటోత్కచకై పెనఁగు చందం బూహకున్ దెచ్చెడిన్. ౩౦౦

శ్రీచిపురుపల్లి కాని జగన్నాథరావుగారిడిన కానుకనుగూర్చి.

1. మ॥ ఇల ము న్నార్యులు దక్షిణవస్తువులను దామీలాటిసత్కీర్తిఁ యి
మ్ముల నార్జించిరి నీకు నిట్టియశమే మున్మున్ను రాఁగోరి శ్రీ

చెలికాఁడైనజగన్నియంత యిటు నాచేఁ గానుకన్ బెట్టించె ని
క్కలధౌతంపు'మతాబు'లాటిఁటిని రంగారాయ! గైకోఁగదే. ౯౦౧

## శ్రీసింహాద్ర్యప్పారావు- నూజివీడు.

1. శా॥ ఏనున్ మీజనకుండుఁగూడుసుదినం బేలాటిదో? యేన్రుపా
స్థానం బేఁ గని యున్నియేం డ్లిటుకుఁ "దూ, చా" తప్పకే వచ్చి స
న్మానింపంబడుచుంటి నిందులకు విఘ్నం బెందుఁ గన్పట్టిబో
దానందం బిది నీకుఁ దోడగుత సింహాద్ర్యప్పరాడ్భూవిభూ! ౯౦౨

2. చ॥ జనకుని మించువాఁడని ప్రశంసకుఁ దెచ్చుట పాడిగాదు నం
దనునకు, నిక్కమే, మిగుల దక్షుని దాతృశిరోమణిన్ గలా
ఖని ననుగున్ బితన్ గడవఁగా వశ మెవ్వరి కౌను? నీకుఁ గ
ల్గిన దిటువంటిభాగ్య మనలీకము సుమ్మిది యప్పరాడ్విభూ! ౯౦౩

## పొన్నపల్లె రాఘవసోమయాజిగారు- నరసాపురము.

1. సీ॥ నరసాపురమున పుట్టినసమయ మ్మెట్టిదో యొకింగినవారల నిందెందు లేరు
కాని యీపురి పుస్తకంబులఁగినట్టియి న్నాళ్ళలో నిట్టిధన్యగుణుకాల
మింతకుమున్ను లే దేమంగు రేని యింతకుమున్న కృతిగొన్నధన్యమూర్తి
యొక్కమిల్లికులేందుడిఁ డిబోట్ట నేకదా? జనియించినాఁడు సజ్జనహితుండు
తే॥ గీ॥ మరల శాకుంతలము నేఁడు మనసుమతికి, నందుఁ గృతిగైకొను చునున్నమహితబుద్ధి
సుగుణి శ్రీవీరరాఘవసోమయాజి కూడ మనయూహకు బలమ్ముఁ గూడఁజేయు.

2. చ॥ కడుఁ గడుఁజిన్నవాఁడితఁ డఖండతర మ్మగుడవ్వనమ్మునం
దడుగిడునాళ్ళలోఁ జపల మైనకుతూహలముల్ గుదించి పే
ర్వడఁదగునట్టిసత్కృతికిఁ బాల్పడుటన్నఁ బురాకృతంపుపం
దడి సుకృతంబుగాక మఱిఁ దక్కినరీతి లభింపనేర్చునే? ౯౦౫

3. చ॥ ధనము గడింపవచ్చుఁ దనదాతయునై పొగడొందవచ్చుఁ గీ
ర్తిఁగని లక్ష్మియి పవచ్చును కృతిం గొనుటన్న వశంబుగాదు పా
జ్ఞనికృతభాగధేయమునఁ గాక మఱొక్కటు నెంతధన్యుఁ డీ
యనఘుఁడు, సోమయాజి మనకందరకు న్నతిపాత్రుఁ డేమ్మెయిన్. ౯౦౬

4. ఉ॥ వైదికు లైనసత్కవులు వారక లౌకికు లైనవారికిన్
గాదిలి"కై తపుంతులఁ దగగ్గియనేసి యొసంగినారు నేఁ
డావృతి వైదికపరిభుగ కర్పణఁజేసె నియోగసత్కవి
శ్రీనయికుంను కూఁతు నిరి చెప్పఁగ నొప్పదె? క్రొత్తవింతగన్. ౯౦౭

5. ఉ॥ కాసలనాఁటివారు కృతికర్తలు భర్తలు గూడ నైరి నేఁ
డీసుకృతిన్ గ్రహించి యితఁ డెంతయు నొప్పుటఁజేసి వీరిక
గ్రేసరుఁ డైన శిష్టుపులకేసరి సత్కవి కృష్ణమూర్తిన్ తా
నీసమయమ్మునం దిచట నే చెలువారిన నెంత మెచ్చునో. ౧౦౭

## మల్లెపూడి పళ్ళంరాజుగారు- వీరవరము.

1. సీ॥ మల్లెపూడికులుండు పళ్ళమరాజు తా నింతకన్నను వృద్ధి నెసఁగుఁగాక
ఈతనికనుయీయు యేతాదృశగుణుండు నరసన్నయును వృద్ధిఁ బరఁగుఁగాక
యొకఁడు జిల్లానేత యొకఁడు తాలూకాను నేత యిర్వురుఁగూడ నిపుణమతులు
ఇట్టియోగ్యులు మన కేలిక లగుటకు మన మొనర్చినపుణ్యమహిమఫలము
తే॥ గీ॥ గాన వీరికి వీరవరానఁ బోల్చ, శివుఁడు కేశవుఁడును సదాశివము లొసఁగి
యెలుముదురు గాక ని యేకమతిని, గోరికొనుటొప్పు సభ్యులు ధీరమతులు. ౧౦౮
2. తే। గీ॥ భగవదంశంబు లేకున్న జగమునందు, నెవ్వనికి నధికారంబు నివ్వటిలదు
గాన నధికారి యన దైవమే నటంచు, హిందువు లనాదిగాఁ బ్రేమ నొందుచుండ్రి.
3. తే। గీ॥ ఎందు నధికారి చక్కఁగా నెసఁగనేని, యాతఁడధికారియే యగునట్లుగాక
యన్యథాగా మెలఁగిన నపుడుఁగూడ, నాతఁడధికారియే యగు నండ్రు బుధులు.
4. తే॥గీ। ఎన్నిశాస్త్రమ్ములను మెలమిఁ జదివి, చూచినఁ బరోపకృతికన్న సుకృతమొండు
లే దిఁకఁ బరాపకృతికన్న లేదు పాప, మది యెఱుఁగువారి కుభయత్రనబ్బు సుఖము
5. మ। వినుమిా? పళ్ళమరాజ? పూర్వసుకృతావేశమ్మున న్నీకువ
చ్చెను మ్మిట్టిమహాధికార, మిది యుర్వీరాజ్యమున్ మించు నీ
విని నీ వొప్పగురీతి వాడికొని యెంతేఁ గీర్తిన్ నార్జించి నీ
కును నీపూర్వులకున్ యశంబు బిరిమున్ గూర్పన్ బ్రియత్నింపుమా. ౧౧౩

## శ్రీరావు రావురామాయమ్మ జమీందారుగారు, లక్ష్మీనర్సాపురము.

ఉత్పలమాలిక.

1. తల్లిరో ? యాలకింపు విశదమ్ముగ వెంకనపల్కు శారదా
"బి" ల్లోకఁ జేగుడెంచినది విప్రిల నెల్లను మేలుకొల్ప నే
పిల్లను నేని "యేప్రియలు" తెర్వినుపూర్వమె పెండ్లిసేఁత సం
ధిల్లెను మద్ద్వితీయసుతు ధీకలితున్ బదియేండ్లవానిఁ దా
నల్లునిగాఁగఁ బూర్వ మొక రర్థి వరించిరి కన్నె కేఁడు లే
దుల్లసిలంన్, వివాహ మిపు డొయ్యనొనర్పక మీఁదఁ జేయుచో

నల్లరి రాజకీయముగ నబ్బెడి నన్నభయాన నేఁడె వా
రెల్లవిధాలఁ బెండ్లియని యెక్కుడు తొందర నిచ్చుచున్నవా
రల్లదె మార్గశీర్ష మిఁక నాఁగినచో సుముహూర్త మబ్బుటల్
కల్ల కనుంగడుం ద్వరగఁ గార్యమదొ్రక్కగ పెండ్లి చేయుటే
చెల్లెడి"నంచు నెంచి యటు సేఁతకుఁ దావకదర్శనంబు నా
యుల్లమునన్ స్ఫురింప నిట కొయ్యన వచ్చితినమ్మ? నేనెటన్
గల్ల వచింపఁ జిక్కుదరఁగా నది కాళిక తీర్చుచుండె సం
పల్లిత లబ్ధికొన్నపుడు భారము నీవు వహించుచుంటి వి
ట్లల్లినపద్దె మొుంచు గల దయ్యది యచ్చగుచున్నపాత్ర మం
దుల్లసిలున్, గనుంగొనెద వొక్కపదేనుదినాలలోనఁ నేఁ
డిల్లలితంపుశోభనము నేర్పడ విన్నపమాచరింపఁగా
మల్లడిసేయుకోరికలు మాటికి మాటికి సందడింప నే
"నల్లె యటంచు వచ్చితిని భావిశుభంబు సమస్తమున్" భవ
త్పల్లవితాన్వితేచ్ఛ"మని సాఁదరు విన్నప మాచరింతు నా
వల్లఁ బవిత్ర మల్లనలవైఖరి చొప్పడుదీనికల్మి నేఁ
జిల్లరగాతలన్ గనఁగఁ జెల్లఁ దుదారుల మిమ్మువంటిశ్రీ
నల్లెగవాంఛితార్థలనె" చెల్లఁ గనుంగొనుటంచు నెంచితిన్. ౯౦౯

చంపకమాలిక.

2, అఘుఁడు లక్ష్మరావు భవదాదృతి నాకు నయాచితమ్ముగాఁ
బనుపడఁ జేసె దానిని శుభంబు లొనర్చెడిపట్ల వానికో
మనమున నెంచి దాఁచికొని మన్నుచునుంటిని, బెద్దకుట్లకున్
మొనమొన నైనపెండిలికి మూలము నీవిశదర్శివ్యమే, వెసన్
బని గలిగించె నియ్యెడలఁ బండితవంచకి మైనబిల్లు త
జ్జన మొనరించు హేతువునఁ జయ్యన రెండవ కుట్లపెండ్లి; యి
ష్టానగకయున్న నిట్టిపయి మొప్పునె? యింతటివేగిరమ్ము భూ
జనులయ; మూర్త మబ్బినను జక్కని దబ్బకయున్న మాశ్యముల్
బనుపడినన్ గణింపరు వివాహములన్ జరిగించుచున్నవా
రనయము రాజశాసన మహాంకృతిఁ బైఁబడు నన్నభీతి; నీ
యనుచిత మైన "బి"ల్లొకటి యజ్ఞులవాండితికల్మి మూఁడి శా
స్త్రనియతికిన్ నిరాదృతి నెసంగఁగఁ జేసెడి నింకమీఁద నో

4. శా॥ మీ మీ యాశ్రియకారణమ్మున మముఙ్ మిన్నంటు "శ్రీమంతు"లం
చామోదింతురు తర్కపండితులు ; కార్యం బప్పు డాచేవ యీ
మేమున్ జూపక తప్ప దట్లగుటచే మి మ్మిట్టులర్థించుటఙ్
సామాన్యంబుగఁ జేసికోఁ దగినదైశ్వర్యంబు మా కుండియున్. ౼30

5. చ. చనుటకు శక్తిచాలమి వెసఙ్ గిరపత్రిము లంపినంత నే
ధనమిడు కోఁడలుం గల దనారులు కొందఱు నాకు ; వారిలో
ఘనుఁ డలవాసిండ్డసులకాంతుఁడు శ్రీశశిమౌళియొక్కఁడై
నను నటువ్రాసిప్పుచ్చుటకు నామది సిగ్గిలఁ రాయఁయాఁ బిక౦.

6. ఉ॥ దగ్గఱినున్న నీవి దేడిదవ్రియ్యమె నన్ కృతకృత్యుఁజేయ నే
సిగ్గును వీడి మూఁకగుల చెంతకుఁ బత్రిము లంపె దైన్యపున్
"ముగ్గులువెట్టునేల!" యని మూఁకనిఁ జైకొనినాఁడ వ్యర్థపుం
బగ్గులుగావటం జెలుఁగుచాప్రిష్ఠు వు నీ వగుటఙ్ లిఖించితిన్

## శ్రీ ఠాకుర పండా వేంకటరమణమూర్తిగారి యింట వివాహము.

### విశాఖపట్టణము.

1. మ॥ ధనధాన్యంబుల నాయురున్నతుల విద్యాద్యుక్తసంపత్తులన్
ఘనవిద్యావిభవమ్ములన్ సుగుణసౌఖ్యమ్ములన్ బెద్దలం
గనినంతన్ వినయంబు, వీరినిట లోకమ్మున్ గటాక్షించి యీ
మనలక్ష్మిన్ మనశంకరున్ మనుతు గంబాదేవియున్ ధర్త్రియున్. ౼33

2. మ॥ వినుమో రాజ్ఞేంద్రసూర! పెండ్లిగొను కుర్వీజంబకున్ బెండ్లికూఁ
తునకున్ బెల్లు లతాంగసర్వత్వుల, తమదోర్యానమ్ము మీ యిర్వురుం
గని బంధువ్రజ మెల్ల మెచ్చికొన నంగంబుగియున్గా మెలం
గునటుల్ శంకరుఁ డర్ధనారికుఁ డొసగుంగావుతన్ శ్రేయముల్. ౼3౪

3. మ॥ పురుషార్థమ్ములు నాలుగందు గతటిబోఁ బుంసేవ్యముల్ మూఁడె యీ
ఘనుఁ గన్నట్టుడెఁ గామ పూర్ణమును సద్ధర్మమ్ముఁ నీవీతలో
దరి నీమూఁటు నొకింత యేమఱక సంతానప్రభాశోభివై
మనలన్ వేంకటసత్యవీశ్వరవచో వైవర్ధి తోడయ్యెడున్. ౼3౫

4. మ॥ మఱవంబోకుము లండ్రి? యాశ్రిమములఙ్ మాన్యంబు గాంపత్యస
ద్యాగసాదంచిత్తమై మతింపఁ బడు గార్హస్థ్యం, బిందున్ దలో
దరియే నొక తరించు నెవ్వరికె, విస్పష్టప్రత్యర్థుల్ మెచ్చుకోఁ
గరమిబ్బాలికతో మెలంగి యశముఙ్ గైకొమ్ము సంతానమున్. ౼3౬

5. మ॥ ధనధాన్యాదిసమస్తభాగ్యములు తద్దన్ నీకు మున్ మున్న యి
చ్చెను శ్రీశంకరుఁ, డేదినూతనముగాఁ జేర్పన్ బ్రియత్నంబు నే
నొనరింతున్ మును నీయెడం గలమహాయోగంబె నీవంశమం
దనయమ్మున్ బెనుపొందుఁగాక యని నేనాశీస్సు నీకిచ్చెదన్. -౩౭

## నరసింహదేవర నరసింహముగారి భాగవతమునుగూర్చి.

1. మ॥ నరసింహుం డితఁ డాత్మనామమున నే నల్వొందు గేహాఖ్య పొం
పెరివో నొప్పెడివాఁడు బంధుగుఁడు పేర్వించుటయే కాని నే
నరయన్ లే దితనినిన్ గవీంద్రనుతిఁ జెల్వారన్ బ్రవర్తించు "బా
కురుపండా" యొకమూలనై యితని నాకున్ జూపె నిన్నాళ్ళకున్. -౩౮

## శ్రీరాజా రామచంద్రప్పరావుగారు—నూజివీడు.

1. శా॥ నీ కాశీర్వచనంబు నారసృపకంటెన్ మేటిపాండిత్యమున్
జేకొన్నాఁడవు తండ్రికంటెఁ గొంపరుల్ చేనన్ బ్రకాశించు పే
లోకుల్ గొండడనాగ్యఁ బట్టిసిరి నాలోకింపలే దాతఁ డా
హా! కాలమ్ముచేసె నారసృపపుత్రా రామచంద్రాధిపా. -౩౯

2. శా॥ నీపేరన్ బ్రిథ గన్నతాతఘనపాండిత్యమ్ము నీతండ్రి వి
ద్యాపారమ్యము నందుఁగాక కవితాతత్వంగి నలోడస
ల్లాపింపన్ గోడఁగెన్ రహస్యముగ నేలా. నీకు నాసీస్సు, లిం
కాపూర్ణాయువుఁ గొమ్ము నారసృపపుత్రా ? రామచంద్రాధిపా -౪౦

3. శా॥ నీ దాక్షిణ్యము నీవినతి గతియయి స్నిగ్ధ నవౌచిత్యమున్
నీదౌశీలము మీపితామహియె వర్ణింపంగ నేవింటి, ధీ
రోదాత్తుండవు నీకు నెక్కుడుగ నాయుర్దాయ మర్పించుఁగా
కా దైవం బయ నించి నారసృపపుత్రా ? రామచంద్రాధిపా. -౪౧

4. శా॥ తాతన్ దండ్రియుఁ బిన్నతండ్రులును విద్వాంసుల్ కులం బెట్టివి
స్ఫీతోదాత్తసభ నొప్పటఁగదా ? ప్రేమించె నిన్ వైత, నీ
వింపన్వాసశిఖెట్లు మాదవలె నర్లేమాచి పాలించుకో
మ్మా ? తాత్పర్య మెలర్ప నారసృపపట్టీ రామచంద్రాధిపా. -౪౨

5. మ॥ మతిచుంతున్ గులవంతు రూపగుణకర్మబ్రహ్మచర్యాశ్రియ
వ్రతసంపన్న నినున్ వరించెఁ గవితావామాక్షి, నీ వీమెతో
శతసంవత్సరముల్ యథేచ్ఛముగ సంసారమ్ము గావించి సం
తతియున్ గాంచి సుఖింపు నారసృపపట్టీ? రామచంద్రాధిపా. -౪౩

### ఉత్పలమాలిక.

6. బాలుఁడ వీవు నీకవిత బాలిక గాదు తదద్భుతంపువా
చాలత, ప్రౌఢతాగరిమఁ జాలెడి నంతియ కాదు ప్రాజ్ఞులన్
జ్వాలవిధాల నాత్మసరసత్వపుటుయ్యెలనుంచి యూఁపగాఁ
జాలెడి, నర్థగౌరవపుసంపద నింపులు నింపి ప్రోడలన్
మాలిమిఁజేసి వశ్యులుగ మాటికి లోఁగొనెడిన్ మఱెం దదు
ద్వేలపుఁజాతురీగరిమ వీనులవిందుగ గ్రంథకర్తృస
చ్ఛీలము నెల్ల వ్యంగ్యగతిచే విశదీకరణం బొనర్చెడిన్
శ్రీలలనాకటాక్షమునఁ జిన్నతనంబుననుండి యెల్లరున్
లాలనసేయ భోగము లనంతముగాఁ గొనుచున్ బ్రపంచపున్
గోల నొకించుకే నెఱుఁగుగోష్ఠికిఁ బోవనిభూసతీమణీ
పాలక బాలు రెక్కడ ప్రపంచము నందలి యెల్లసంగతుల్
చాలఁగఁ జూచి చేయఁదగుసత్కవితారచనల్ మఱెక్కడ? డె
ట్లోలిని నీకు నీకవిత యుప్పతిలెన్! ఇదునక్కజం బహో
పూలకు సౌరభంబువలెఁ బుట్టెఁ గవిత్వపుధార నీకు, రా
డ్బాలక? రామచంద్రనరపాలక? నారసరేంద్రపుత్ర? స
చ్ఛీలుఁడు నీదుతండ్రి కడుఁజిన్నతనమ్మున స్వర్గ మేగియున్
గ్రాలె సమస్తవిద్యల నఖండతరంబగుప్రజ్ఞగాంచి ధీ
శాలి యతండు నీకవితనందముఁ జూచిన నెంతమోదపుం
బాలగునో కదయ్యా? భగవంతుఁ డటుల్ ఘటియింపఁడయ్యె ని
క్కాలమునన్ గవిత్వమనఁగాఁ బెడత్రోవలుత్రొక్కుచున్నగి
య్యాళికిఁ దుల్యమై చెడుట యారయుచుంటిమి వారిత్రోవలన్
గాలిడఁబోకుమయ్యా? యది గాలికి దూళికిఁ బోవుఁ జక్కనౌ
జాలునఁ బూర్వపద్ధతికి జంకనిఫక్కిని వ్రాయుమయ్యా? ప
ద్యాలను, వానిఁ గాంచి విబుధవ్రజ మాదర మూను, సద్యశో
శ్యాలివి దాన నీవగుదు, సత్కవిసమ్మతికన్న జన్మముం
దాలుచువారి కొందు సుఖదంబగువస్తువు లేదు, సద్యశం
బాలయమున్ సుఖం బొసఁగు నావలఁగూడ సుఖమ్ము నిచ్చు భూ
పాలకభావమున్ సుకవిభావము రెండును గూఁచి చూచినన్
గు[illegible]లయువో లెఁ [illegible]? [illegible] వసే
కాలము నందుఁ గూడఁ గవికన్నఁ గృతార్థులు గల్గఁబోరు, భూ

పాలురు వారియాద్యుతికిఁ బాత్రులు గాఁగలేరనిఁ గీర్తిఁ గా
వాలముతొడు, రండులకుఁ బాసిన మూరును బేరులేనివా
రైలయ మంది పోయెను, రహర్నిశ మీవిట బుద్ధినిల్పి యా
శూలిసతీకటాక్షమున శుద్ధయశమ్ము గణింపు; మిద్దియే
చాలునురాజ్య మేమిటికి? జన్మము దీనఁ గృతార్థ మయ్యెడిన్.

శ్రీశోభనాద్ర్యప్పారావుగారు- నూజివీడు.

చంపకమాలిక.

1. పరిచిత తేలప్రోలినరపాలక శోభనశైలవిస్ఫుర
ద్ధరిపనాపధము సుగుణాకర? శ్రీకర యప్పరాయ? ని
న్నెఱుఁగుదు నన్ను నీ వెఱుఁగు దెన్నిశరత్తులనుండియో, మహా
త్తర మగునీయుదారలయుఁ దద్దయు నే వినుచుంటి నెప్పుడో
పోరిఁ బోరి నీదుదర్శనము పొందుటయున్ గల దీవు రామమం
దిరమును గూర్చి చేసినవితీర్ణిని గూరిచి కాని చాలను
స్థిరమగు "నాసుపత్రికయి" చేసినమేటివితర్ణిఁగూర్చి కా
ని గనను గడంగిన నవేకకృతుల్ ప్రథిపిల్లు, నిట్లని
న్నెఱువదియేండ్ల యీవయసునం దొకకోరికఁ గోరుచుంటిఁ జు
ట్టరికము నీకు నాకుఁ బ్రకటమ్ముగ నేర్పడు కారణమ్ము నన్
"సరి! సరి? నీవు విప్రకులజాతుఁడ వే నరపాలవంశ్యుఁడన్
గరమును నీకు నాకు నెటుగాఁదగు జుట్టరికం" బటన్న వా
విరి వినుమయ్య? నీకు నలబెబ్బులి తోఁ డగుఁగాదె! యల్లుఁ డా
నరపతి నాకు నల్లుఁడని నమ్ము "మసల్య" మటందువేని ద
ట్టిఁ గలదయ్య? మాపెద "రికార్డు" గనుంగొను, మాన్యపింఛఁ డా
దరమున రాజ్యభారమును దాల్చెడియుత్సవ మప్డు నన్ను మే
దుర మగుప్రీతిఁ బిల్చి కడుఁ దోఁపుగ గౌరవ మాచరించి త
చ్చరితము గ్రంథరూపముగ సల్పుట కాజ్ఞయొసంగె, దాని నే
విరచనసేయుచుంటిఁ గడువేగమె తత్కృతి యన్నరేంద్రు శ్రీ
కరకరపంకజమ్ము నెడఁ గ్రాలుట మాడఁగలాఁడ, విట్టి యీ
తాఁపున నీవు చుట్టమవు విన్ము కృతిన్ గ్రహియించియున్ సుతా
కరము గ్రహించియున్ బగిదిఁ గాఁదగు నల్లుఁ, డటండ్రు పెద్ద లీ
వరుస సమగ్రనీయమగు బాంధవ మీమన కౌనుగాక యి

ట్లిఱువది దాఁక మాని యిప్డు డాదటఁ గోరఁగ నేల యన్న నో
నరవర? బిల్లు, కారణమునన్ బదియేనుదినాలలోన నా
చిఱుతకుఁ బెండ్లిసేయుపనిచేసె నెం, నీశుభకార్యమున్ మహ
త్తరముగఁ జేసికోఁ దలఁచి తావకదర్శన మాచరించి నే
నణిమణిఁ గోరఁగా వలసె, నంతియ కాని వృధాగ నేదియో
"పరిచితు" లన్న హేతువునఁ బ్రార్థన సేసెడిపాటి గాదు, నా
సరణిని రామచంద్రనృపసత్తముఁ డాయనకన్నమిన్న శ్రీ
కరుఁ డలనారభూపతియుఁ, గామితదాత తదీయసోదరుం
డురుగుణశాలి సింహగిరి నుండెడి దేవునిపేర నేలుచూ
వరుఁడును రాజగోపనగపాలుఁడు గూడ నెఱుంగుటన్ సవి
స్తరముగ మీకడన్ మనవి సల్పక యింతటితో ముగింతు, నీ
సురుచిర సేవలన్ దనియుశోభనశైలనివాసి నీకు మేల్
సిరియును మేటిసంపదయు శ్రీయును నాయువుఁ గూర్చి సత్యశో
భగము నొసంగి ప్రోచుత మహాకృపారసభావ మేర్పడన్. ౯౬౧

## శ్రీఅశ్వారావుపేటదొరగారు - నూజివీడు.

చంపకమాలిక.

తలఁచుగ నీదుసద్గుణవితానము నే వినుచుంటిఁ గాని ని
న్నెయెడఁగ లేదొకప్పుడును, నాదర మొప్పఁగ మీపురంబు నా
గరిమతి "వార్షికోత్సవ" మటంచును "దానికి వచ్చి మేము సా
దరముగఁ జేయుగౌరవము తప్పక తన్ గొనుఁ"డంచు సారెసన్
గర మనురాగ ముప్పతిలఁగా లిఖియించిరిగాని మున్నెపుఁ
బరిచయ మాటచేఁ గొంచెప సామి మీపురికేఁ దేను, బెన్
సస్మతిగల్గువారి నెనకమ్మొక్కరిఁ జూడకయుంట "సత్కవీ
శ్వరులకుఁ గాదు ధర్మ"మని స్వాంతమునందు, దలంచు నంతఁ గొం
దఱు "భవదీయదర్శనము తప్పకచేయుట యుక్త"మంచుఁ జె
ప్పిరి యిప్డు డాస్మజాతునకుఁ బెండిలి సేయుప్రసక్తికల్గి ని
ష్పరమున కేగుదెంచితి నపూర్వగు నీదగుదర్శనం బున
కే ... మెయిఁ జేయుచుంటిఁ ద్వరగాఁ జనఁగావలె వేఁగొకప్పు నీ
దరిసెన మాచరించి నుగుణాకవిత్వము కొంత విన్చి ని
నుమమునమున్ సుతిసేందులఁ బున్నది నామతి కొఱ్ఱిత్తగాని మున్

పరిచితుఁ డైన శ్రీవరదపార్థివు నల్లుఁడ వీవు నాయెడన్
గర మనురాగి యౌ నృపతికాంతుఁడు శ్రీకర! కందిమళ్ళన
ద్వరకులదీప! నీకు భగవంతుఁడు సర్వవిధాలఁ దోడుగా
వఱలి భవద్గుణమ్ములకు వన్నియ వెట్టెడుఁగాక నిచ్చలున్.

## శ్రీవరదరాజాప్పారావుగారి జనానా శ్రీచెల్లాయమ్మారావుగారు- నూజివీడు.

ఉత్పలమాలిక.

1. ఈవిషయమ్ము సుంత మనవే యిక శ్రీయుత చెల్లమాంబికా
దేవికి విన్నవింపుఁ డల దేవియు నన్ను నెఱింగియుంట సం
భావిత మెట్లనన్? సుగుణభవ్యుఁడు శ్రీవరదాప్పరావు తా
నావలనన్ బ్రియమ్ము మది నాటిన ఱేఁడులలో నొకండు నే
నావఁ రామచంద్రనృపునగ్రమునం దవధాననైపుణిన్
జేవ దలిర్పఁ జూపునెడఁ జేతమునం గడు మెచ్చి పొంగి, య
ట్లీవఁ భర్త నెమ్మదికి నెక్కిన నన్నలయమ్మ కొంచెమే
నీ వినకుండ, దింకొకటి కృష్ణుని రాధను గూర్చి కబ్బమున్
భూవినుతమ్ముగా సలిపి మున్ను కృతిన్ దమ కిచ్చినట్టి భూ
దేవసుతుండు నాకడనె దివ్యలబాస పఠించె నెట్టులే
నీ విని యుండవచ్చు నను నిర్మలమానస దేవిగారు, త
ద్భావము "ధర్మకార్యములఁ దద్దయు సక్తి" యటంచుఁ బూటిగా
నీవల నెల్లరున్ బలుక నే విని సంతసమందుచుంటి యా
త్రావిధి నెల్లదేవతల దర్శనమున్ బొనరించి జన్మమున్
బావన మాచరించె నలపార్థివలక్ష్మి నుతింపఁ జెల్లు, నా
భావము మత్తుమారు ఘనివాహనిమిత్తము నాదు రాకయున్
భావుకభావ యాపె చెవివైవుఁడు పిమ్మటి కార్య మెట్టుగాఁ
గావలె నట్టులే యగును, గార్యము పట్టువఁ జింత లేదు గీ
తావిదుఁ డైనకృష్ణుఁ డెటు తా నుడివెన్ వినలేదె? "కృత్యమున్
నీ వొనరింపు మాపయిని నీ కధికారము లే"దనండె?, స
ద్భావవిభూరాణి యాపె, కవిపుంగవుఁ డీతఁడు కోరవచ్చె నా
దేవియు నీయవచ్చు గణుతింప నొకప్పుడు యాచ్న వ్యర్థమై

ధనము ఛవత్ప్రముఖమునఁ దద్దయు వద్దులుఁ బెండ్లిపేరఁటాల్
గొనకొని కోరుచుండు ననుకొందును, నన్నిటు మన్చుచున్న నీ
ఘనతకుఁ బుత్త్రపౌత్త్రుల కఖండపుశోభనముల్ ఘటించు "మే తే
దినములు వచ్చుఁగాత"మని దీవనలన్ బొనరించి యింతతో
మనవిముగింతు, రావుకులమండన శ్రీయుత రామమాంబ? నీ
వనిశము గోద్విజార్ఘ్యమున నాచరణంబొనరించు పున్నెముల్
వను మత నీదునవ్వయపుమాత్త్రునికిఁ బూలును గాయలున్ బొసం
గునటు ఘటించి యక్కలిన గొప్పముదంబది నీకుఁ గల్గుతన్. ౯౯౨

## శ్రీరావు చెల్లయ్యమ్మారావు జమీందారుగారు, లక్ష్మీనరసాపురము

చంపకమాలిక.

మును పాకసారి చేసితిని మోవ మెలన్పఁగ నీమదర్శనం
బును. మరలన్ ఘటించినది పున్నెము మంచిది యాట, బుద్ధికిన్
ఘనతకు యోగ్యతాగతి కఖండవదాన్యత కెందు మంత్రిపున్
బనికి ఛవత్ప్రమానులు నృపాలురలో మగవారియుండె "తే"
గన నీకె వాండ్ర వారివిషయ మ్మిటు నెత్తగ నేల? నీకు న
బ్బినచిరజీవితం బది వివేచన సేయఁగ నీదరోగ్యమం
దున వసియించు లోకులయనూన "పురాకృతపుణ్య"మంచు నే
మనమున నెంతు, రాజ్యము లమర్చిన దేవుఁడు తెల్వి తేటలన్
దసరఁగ నీఁడు, తెల్వి నిడి దైవము దానిని మంచిమంచివ
ర్తన కనుకూల మౌనటికిఁ దార్పఁగనీయఁడు దవ్యమెంతయై
నను ధృణ నట్లు తాము గణనం బొనరింపక వెచ్చవెట్టుధీ
ఘనులకుఁ గూడఁ గార్యము నకార్య మెఱుంగనిచో వృథాపకీ
ర్తిని నది గూర్చు శాస్త్రముల ధీవరు లేగతి వ్రాసియుంచిరో
యని కడుఁ బెద్దలౌ బుధు లనాదృతిమైఁ గనుఁగొంచుఁ జేయున
మ్మనుజునిదానముల్ జగతి మాన్యత కెక్కుడిఁగాని యన్యముల్
ఘనజనగర్హితమ్ములయి కాలునిపోల్కికి దారిమాపు, వా
ని నిటు నుదాహరింతు, నొకనిన్ మఱియెప్పుడో కాటువేసెఁదా
శునక మొకండు దానికయి సొమ్ము సమస్తము స్వీయమాతఁడా
శునకపుజాతిఁ జంపు నట్టు ఘాతుకు కొ నియమించిపోయె నం
టు? నెమకి కుక్క లన్నిటి గటా? యతఁ డిచ్చిన సొమ్ము పెంచి యా

దినములఁ జంపు మందురు పదింబది కృత్యవివేకశూన్యతం
బనిగొని యిట్టిధర్మములపా లొనరింపధనాఢ్యు లయ్యయో ?
ధనమిడి చేసినం గొనెడితజ్ఞులబిడ్డలొ ? లేక తండ్రులో ?
యనఁదగు భారతంబు భవదాత్మ యెఱింగినదేకదా ? యటన్
ముని యొకరుండు సర్వగణమున్ దనతండ్రి మృతిం దలంచి చం
పను బనిబూని జన్నము నభంగురమౌగతిఁ జేయురాజనం
ద్రుని జనమేజయున్ దనమృదుప్రకటోక్తుల మాన్పెఁ గాదె" యే
పని యిహలోకసాధనము ? వైజననంబున కేది ముఖ్యసా
ధనము ? యెఱింగి సల్పఁగలధర్మము ధర్మము, తక్కధర్మముల్
పారుడుకంటె నొక్కయెడ భూధ్రముపోల్కి వసించు టొప్పు, నీ
మన మిటుఁ బల్గుభావము సమస్త మెఱుంగుట విస్తరింప, నో
జనని ? భవద్ధనంబెపుడు సజ్జనసన్మతిగా వ్యయించి తీ
నిగఁ జిననాఁటనుండియు గణించి గ్రహించినరాపుయాంచ నీ
యమంగసున్నమ భవద్గుణము లంతె సమస్తము, నిన్నుఁ గొల్చి మ
న్ననమొయి నీమనీషుల ననారతమున్ గొనికూడఁ గొండ తె
పునఁ దగు ? నన్యథాపథమునందుఁ జరించెద, వేమి సేయవ
చ్చును ? గురుఁ డెల్లశిష్యులకు సూనృతమార్గమునన్ గళాగతుల్
వినుమఁ గ్రహింతురి కొందఱు వివేకులు కొందఱు తప్పుతోవలన్
జన దొరకొందురి, దేశికునిశక్యముగా దలవారిఁ దిద్ద ద్రో
ణునికడ విద్యఁ జేర్చిన యమంగులు శిష్యులు వేనవేల్, సుయో
ధనుఁ డెటు లయ్యె, నర్జునుఁడు దా నెటులయ్యె ? నెఱుంగవే ? గురున్
జనకుని దల్లినిం దలఁచి శాస్త్రవిరుద్ధముగాకయుండుపో
ల్కిని బొనరించుధర్మములు కేవలమున్ సుయశస్కరంబులై
మనుచు నిటన్ మఱొక్కటుఁ బ్రిమాంద వెంకింతయులేనిధక్కన
నృనియతిఁ జేయుచుట్టి వృథయత్రివిరుద్ధములై వృథావ్యయ
మ్మున కగుఁ గారకమ్ము లిది ముగ్ధ లెఱుంగరు నిన్నుఁ బట్టిబల్
సునిశితధర్మమూర్తులకు లోకసమాదృతకార్యముల్ స్ఫురిం
చును స్ఫురియింప వన్యులకు నాయయుఁ గూడ సుధర్మవర్తులం
గున జనియించు నిక్కులేన దల్లులుపెద్దలె చాలదూఱు రి
ప్పని మనకేల ? యిప్పుడును "ధర్మగుణంబుల్ సెడు" రంచు వారి తా

మనువుగ వ్రాసియుంచి, రుభయత్రియశఃప్రదమైన నీదువ
ర్తనకు జయమ్ము గల్గుత ముదారయశోనిధి ? చెల్లయాంబ ? నం
దనునివివాహముల్ సలిపినాఁడను మీదయకల్మి నేఁడు నం
దనలకుఁ బెండ్లిసేయుపని నాకు నయత్నము సిద్ధమయ్యె "బి
డ్డను"ను వినియుందురే గద ? కులోకులదుర్గతి కారణంబుగాఁ
బనుపడె నిద్దియుక్కుతనఁ బాలను వీడనిబాలకేనిఁ బెం
డ్లని జరిగించుచుండి రవనీలగ మూర్తము లుంచి నీదుద
ర్శనమున కట్టికార్యము వెసన్ దలపెట్టియె యేనువచ్చితిన్
ననుఁ గడుఁబెద్దమాపునఁ గనం గడుఁ గోరగ మిమ్ము నెమ్మయిన్. ౧౦౦౬

2. శా॥ ఏమో ? చెప్పఁగఁ జాలఁగాని మును పెన్నైనాళ్లకుం బూర్వమీ
గ్రామమ్మందు వసించియుండ్ భవదుదారత్వంబు సుంతేనియున్
నామీఁదం బ్రసరించున ట్లొనరుప న్నారల్లి ? నే నేక, నా
పైపూటన్ వచియించెదన్ విను మదంబా ? రావు చెల్లాంబికా. ౧౦౦౭

3. శా॥ ఆపై నాకుఁ దనూభవుం డుదయమౌ నకాల మేతెంచె నీ
కాపట్లన్ వెస పుష్టిపూర్తిసుయంబై నాదు నాహ్వా యున్
బ్రాపించెన్ జ్వరపీడితుండనయియుండ్ బ్రస్థానముల్ సేసితిన్
మీపూర్ణంబగుసత్కృతిన్ గొనుచు నెమ్మింపోతి నేనారికిన్. ౧౦౦౮

4. చ॥ అదెమొద లప్పుడప్పు డెటులైనను మీపథ మేగు [illegible]ర్తిగా
నడచగు వేళఁ [illegible]కొనుచు నన్నిసుఖంబులు [illegible] నీ
ముగ మిపుడేర్తికోలునకు ముఖ్యనిమిత్తము [illegible] మీపథం
బదియు సుపీయసంతతికి నవ్వణ మిక్కవిక[illegible]. ౧౦౦౯

5. ఉ॥ హేతువు చెప్పుచుమ్మ ? యిటు లేల [illegible] ? సత్తమా
జాతులపట్ల నీదయ పొసంగుట నన్నునుబ్బి[illegible]పె ! యే
మీ ? తొలి కష్టముల్ మొలుచు నేర్పడునా[illegible] లమ్మరో ?
భూతలమందు వాఁడి పయిఁ బుట్టినకొమ్ములు[illegible] [illegible]స్పనున్. ౧౦౧౦

## శ్రీచల్లపల్లి కుమారరాజావారి వివాహము-[illegible] సంస్థానము.

1. మ॥ ఘననామంబు కులకీర్తిమానిమముగాఁ [illegible] [illegible]ని త
న్నునయమ్ముల్ [illegible]యించువాఁడునయి [illegible]

బొనరెడిఁ గాని యిట్టిపను లున్నపతిన్ గృహమంద యుండి య
ప్పని కనువైన కృత్యముల పట్టున భూజను లుండుఁగాని యే
జనవరు పెండ్లికేనిఁ జనఁజాలమి నిక్కము లోకరీతి యి
ట్లునికి నెఱింగియున్ వెనుక నొక్కఁడు నిటుఁ గలట్టికృత్యముల్
పొనరుచ పెద్ద లుండమియుఁ బూర్తిగ నేను నెఱింగియుండి భవ
ద్ఘనతకు నీదుమాతులఁ డఖండవదాన్యుఁడు చంద్రమౌళిరా
డ్ఘనతకుఁ, బైని నాయఁడవుగారను వేంకటకృష్ణశౌరిస
ద్ఘనతకు నొఁగి యింటఁగల కార్యభరమ్ము గణింప కాదటన్.
నిను సుకవిత్రి దీవనల నేఁడు కృతాప్తు నొనర్ప వచ్చినాఁ
డను నవకాశమిచ్చి ప్రకటమ్ముగ నాదువచఃప్రచారమున్
వినినను "వేగఁ బంపు"మని వేఁడెదఁ బెండ్లికుమారుఁ డైననా
యనుఁగుసుతుండుఁగూడ భవదద్భుతభవ్యవివాహశోభనం
బును గన నేగుదెంచె నొగిఁ బోవలయున్ స్వపురమ్ము పేర్మి నే
గ నొసఁగుమయ్య యాజ్ఞ క్షితికంజముఖీహృదయేశ? యంకినీ
డ్జనపతిచేయువాక్యమును సర్వము నేఁటికి లెక్కఁజూచి యి
చ్చినయెడఁ జాల సంతసము చెందెదఁ "బుత్రిని పెండ్లిబువ్వ మో
చెను శివరామభూమిపతి శేఖరుని మేటియుదారతాగుణం
బని లిఖియించు మున్ప్రియమునం దిపు డుండిన "సర్వరాజద
ర్శన" మనుపత్రమందుఁ, గవివర్యుల కిచ్చినయీవి యొక్కెడన్
జనవరు శాశ్వతుల్ నలుపఁజాలెడిఁ దక్కినయీవికన్న నో
జనవర! "కోనఁగూడ"దని స్వాంతమునందు నెఱింగియుండ నిన్
"ధనమిటు లిచ్చెయి"మ్మనుచు [illegible] మాపుట హాస్యకల్మియే
యని మదినెంచి, మింటికరు యథార్థము తెల్పితి నీమనమ్ము న
చ్చినగతి నాకు సత్కృతిని చేయుము దానికి సంతసింతు, నో
యనఘ! భవద్వివాహమున యందుఁ బురార్జితమైననాధనం
బునకటుఁ బ్రాడ్వివాకతిన "ప్రాడ్వివాక"మ్మనియంటు కంకిన
మ్మనుజవరేణ్య పుత్రి? యనమాన్యచరిత్రి! ద్విజుండు సంశయం
బునఁ జను గొప్పరా జిదక పొమ్మనె నేనియు, నన్నునూకె నె
మ్మనమున లేక కా, దటులు మమ్మును గూర్చి లిఖించి నట్టియా
ఘనుఁడె లిఖించె "రాజునకుఁ గాఁ దగ దొందుసు దృష్టి" యంచుఁ గా

వునఁగలరీతిఁ దెల్పితిని, బొంపిరిబోవుయశమ్ముఁ గోరుచో
మనమున మచ్చచుఃకలన మానక నిల్పుము, నీకుసర్వశో
భనములు గల్గ దీవన లపారముగా నిడి యింతతోడ ని
మ్మనవి ముగింతు నమ్మహిమమర్దని మీయిలువేల్పు నిన్ను స
జ్జనగణనీయుఁగా సలిపి సాఁకుత సర్వవిధాల భూవరా. ౧౦౨౭

5. మ. ధనముల్ విద్యయు నీకొసంగె నృపతీ దైవమ్ము మాకిచ్చె వి
ద్యను ద్రవ్యంబును తారతమ్యముగఁ దాత్పర్యం బిటుల్ గాంచి యె
వ్వని సెట్టుల్ గనఁ గీర్తి గల్గెడినొ? తద్భావంబునం బొమ్ము నీ
కనఘా? తావృశకీర్తి యెల్లెడల సర్వాభీష్టసంధాత్రి యా. ౧౦౨౮

6. మ. ప్రతివ్యాపుల్ శుభకార్యసంగతుల నేభవ్యాత్ముల్ ముందు సం
స్తుతిఁ గావించి కృతుల్ బ్రివర్తిలుదు రాశుంభచ్చుభాధాయిదం
పతినామమ్ములవారు మీరిరువురుల్, భద్రమ్ము మీ కబ్బుతన్
సతి? దుర్గాంబ? వరుండు? యోశివుఁడు? నిచ్చల్ వర్ధిలుం డిమ్ములన్ ౧౦౨౯

7. మ. శివనామమ్ము శివాంగనామణియు నీచేఁ జిక్కె నీ కున్న వై
భవ మేరాజులకున్న దిట్టినిను సంభావించితిన్ గాతచే
శివమ స్వస్తు శివం, శివంభవను తే చేతశ్చ భూయా చ్ఛివం
శివసంకల్పక మ స్త్వపత్యమపి తే శ్రీమచ్ఛివక్ష్మాపతే. ౧౦౩౦

8. శ్లో. ఇతో౽ప్యధిక సంతోష ఇతో౽ప్యధిక సద్యశః
ఇతో౽ప్యధికరాజ్యం తే సంపద్యేత శివప్రభో. ౧౦౩౧

సెలవుసమయమునఁ జెప్పినది.

1. శా. ఎం తెన్నంగమి నృపాల? కోరిలినా ని న్నే నంతకున్ మించి న
న్నంతేవాసులతోఁ దనూభవులతో నత్యంతమోదమ్ముతో
సంతోషింపఁగఁజేసి పుచ్చితివి, మనాస్వాంతమ్ము రంజిల్లె నిం
కెంతే నీయనేకముల్ గనుటకై యే శేర యత్నింౘెదన్. ౧౦౩౨

శ్రీముద్యాల రాజుగారు - చల్లపల్లి సంస్థానము.

1. మ. నృపతుల్ లోనికిరాముగాని మఱి ముక్తీశ? నీవంటిదా
నపరుల్ పృథ్వులు నాఁడు నీపురముసన్ న్యాసికిన్ భక్తిమె

నుపచారమ్ము లొనర్చు నుత్సవమునం దోహో భవత్పాణి ప
ద్మపుసౌభాగ్యము నేమిచెప్పఁ గలఁ దత్తద్దానముల్ సేయుచో. ౧౦౩౩

2. మ. ఎవరో మస్కరి వచ్చె నేయనుము మీకృష్ణా స్రవంతీతటం
బవలోకింప నమస్కరించియు సపర్యల్ సల్పినం జాలుఁగా?
కవులన్ గాయకులన్ దదన్యులను వేడ్కన్ బిల్వఁగా నేల? త
ద్వ్యవసాయమ్మున కంతయీవియిడ నేలా? చంద్రమౌళీశ్వరా.

3. మ. అది నీవెట్లు పఠించితో? తెలుపుమయ్యా? నాకు; నాముక్తమా
ల్యదలో వ్రాసెను కృష్ణరాయలు మహౌదార్యస్వరూపమ్ము నీ
కిదియున్ గాదను కార్యమాతఁడు భవిష్యద్వేత్తయై "వ్రాసె" నం
చెద నూహింతు భవత్ప్రగాఢ్యతకు నీ దేచోటు నేఁ గానమిన్. ౧౦౩౪

4. మ. కొమరున్ బెండ్లి కుమారుఁ జేసినపుడో కూఁతున్ వివాహాఖ్యభ
ద్రమహోత్సవ మలంకరించినపుడో తత్తాదృగుద్దామదా
తృమహత్త్వంబు సమర్థనీయమగు నంతేకాని సన్న్యాసిభై
క్ష్యమునాఁ డింతవ్యయ మొనర్చెడి వదాన్యశ్రేష్ఠులుం గల్గిరే? ౧౦౩౫

5. మ. ఒకనూటారిడఁ జాలదో కొన్ని? మఱిమూఁడో నాలుగో యిచ్చియున్
బ్రకటింపన్ దొరకొన్న వ్యక్తి, పయివస్త్రాలన్ననో? పట్టువీ
యక సామాన్యపుజాలువీయ వృథయ మ్మర్పించినా తీరె తె
న్నక యొప్పుండఁగ వచ్చు నీవితరణానందంబు పర్మేశ్వరా. ౧౦౩౬

## శ్రీచల్లపల్లి రాజావారి పట్టాభిషేకము - చల్లపల్లి.

1. మ. సిరియున్ సంపదయున్ బురాణిజము లై చెల్వారు నేపాల నీ
శ్వరభావమ్మును దాదృశంబగుచు నెన్నాళిన్ వరించెన్ గదా
పరమేశుండగునట్టి నీకిపుడహో? పట్టాభిషేకంబు క్రొ
మ్మఱుశ్రీయన్నది యీఁదలంతు శివరామ శ్రీప్రసాదప్రభూ. ౧౦౩౭

2. మ. "అయినన్ శ్రీయము పట్టఁ దృష్టిఁగనరా" దండ్రాన్యు లన్నట్టు నీ
పయి నాకుంగల పేర్మికల్మి నిటు లేఁబల్కుచు దీవింతు లో
కము మెల్లప్పుడె సంగుఁగాక, సదపత్య శ్రీయు వర్ధిల్లుఁ గా
క! యథార్థంబగుఁ గాక వేంకటకవీట్సాక్షి రాజోత్తమా. ౧౦౩౮

మనుతురుగాక నాపనవి మానసమందిడి యంకి నీణ్ణృపా
లుని సుకుమార? యక్కతనలోకుల యాదృతిఁ గాంతుగ్రావుతన్. ౧౦౪౭

4. క॥ అప్పువడియుంటి కేనికి, సెప్పగిదిన్ దీని నీకుఁ “నే నేర్తు”నటం
చప్పుడు మది యోజించితి, నిప్పటికిఁ గృతార్థభావ మెనసితి నృపతీ. ౧౦౪౮

5. మ॥ కొడుకుంగోడలుఁ గూర్చుచుట్టములు పక్కంగల్గు శిష్యుల్ మునం
బడగన్ నేఁడు గృహప్రవేశమునకై యాత్మీయమా గ్రామమున్
గడియమ్మున్ జనియుండవచ్చుఁ గృతవాగ్దానానకు న్నేనులోఁ
బడి యేతెంచితి నోనృపాల? యిదె నీపట్టాభిషేకానకున్. ౧౦౪౯

6. సీ॥ ఇంతమంది కవీంద్రులే కేని పట్టాభిషేకమ్మునకును విచ్చేయలేరు
ఇంతమంది బుధేంద్రులే కేని పట్టాభిషేకమ్మునకును విచ్చేయలేదు
ఇంతమంది నృపేంద్రులే కేని పట్టాభిషేకమ్మునకును విచ్చేయలేదు
ఇంతమంది మనుష్యులే కేని పట్టాభిషేకమ్మునకును విచ్చేయలేరు

తే॥ గీ॥ ఇందు నొక్కరుఁడ కృతార్థుఁ డనుకొందు, నీనుపట్టాభిషేక వినోదమెన్న
శక్యమే? శివరామప్రసాదభూప, అంకినీడుస్వామి పతిపుత్రి? యతిపవిత్ర. ౧౦౫౦

## వేళాకపసక్తికి సంబంధించిన పద్యములు.

1. ఉ॥ వచ్చిన భావ మిట్టిది నృపాలక? కొందఱు ప్రాజ్ఞులన్ననో?
యిచ్చినసొమ్ము చాలక మఱెయ్యదియో గ్రహియింపవచ్చిన
ట్లిచ్చఁ దలంచుచుండిరని యేను గుమానుగ వింటి, నందుచే
హెచ్చగ నాకు సిగ్గు జనియించెడి నేమనవచ్చు నక్కటా. ౧౦౫౧

2. ఉ॥ ఎప్పటికేనిఁ జాలెడి యహీనపు గౌరవ మాదరించిన
న్నప్పుడు పంచియుంటి వది.యాదటఁ గైకొని లేశమేని నీ
యప్పుపుగల్పఁగాఁ గలిగినట్టి పనిన్ బొనరింపఁ గోరుగా
“చెప్పులలోని కా”ళ్ళను ప్రసిద్ధికి లోనయి యేను బోయితిన్. ౧౦౫౨

4. చ॥ ఇపు డవకాశ మౌ నెడల నించుక నీకు ముదంబొసంచి నీ
కపరిమితంపు మోద మిడి యాపయి నేఁ బనుదేరనెంచి కా
నృపు గ్రామమున్ గణింపక చనాలున నిమ్మెడ కేగుదెంచితిన్
నృప! సమయం బొసంగఁదగు నేని యొసంగఁగదయ్య? యొయ్యనన్. ౧౦౫౩

4. ఉ॥ బందుగులెండలో గృహముపట్టున నాడగురాక చూచుచుం
డొందర గొల్చుచుందురు మనోగతి వేగమ యేగఁగా వలెన్
డొందరవేళలో నిటులు "తొందర నిచ్చితి" నంచు నెంచ కా
నంద మెలర్ప నాసభఁగనందగు మీ కవకాశమున్నచో. ౧౦౫౪

## సభానంతరము చెప్పిన పద్యములు.

1. శా॥ సంతోషించితి సంతసించితిఁ గదన్ సంతోషమున్ గాంచినా
నెంతో తొందరనుండియున్ దరిసెనం బిప్పించి తీవిప్పుడీ
పాంతంబందలి వాఁడఁగాను గడు మూర్ఖుండ వృద్ధుండ నీ
పాంతమ్మందలి వానినిన్ బలె నన్ భావింపఁగాఁగోరెదన్. ౧౦౫౫

2. శా॥ ఎంతో కార్యములున్నగాని వృథగా నే తీరఁగాంబోను నీ
సంతానంబు బారసాలతతి నుత్సాహమ్ముమై వత్తు నే
నంతేవాసులతోఁ దనూభవులతో, నందాఁక నన్నీవు నీ
స్వాంతమ్మందున విస్మరింపవని నిచ్చల్ నమ్మెదన్ భూవరా. ౧౦౫౬

3. ఉ॥ బొబ్బిలి ఱేఁడు నీవొకఁడు పూర్తిగ గౌరవమాచరించి నన్
గొబ్బున నంపినట్టి నృపకుంజరు లింకొక రింతలోన ని
ట్లబ్బురమైన సత్కృతి నృపా? యొనరించిన వారులేరు, నే
నిబ్బడిగా ముదంపడుట కియ్యది యొండొక హేతు వి ట్లగెన్. ౧౦౫౭

## శ్రీరావు వేంకటనరసింహారాయనింగారు, పిఠాపురము.

1. క॥ చిరకాలమిట్టి నీ స్వీకరు గ్రంథస్థం బొనర్చి పనిపిన నిఁక నీ
దు ఋణంబు విడవ వేంకటనరసింహారాయ? తీర్చ నామది నెంచెన్. ౧౦౫౮

చంపకమాలిక.

2. సరసుఁడు సాహితీకవనసారవిహారవిధిప్రసంధనాదిరిభా
సుగతరకీర్తిఁ గీయనుఁగు సోదరుఁడౌ నల సూర్యరావు నన్
గురునిగ నెంచు మేటి కవికోటిపరిగ్రహము వచ్చినప్పు డొం
డొరు వినఁ జెప్ప నొప్ప, దతఁ డాలి స్వయమ్ముగ నాకొసంగిన
బ్బురముగ మున్ను గొంత ధనమున్ మదిఁ దృప్తివహింపఁ డట్లు మా
నరమున నిచ్చియున్ విడప సత్కవియని భావుకన్ యశ

స్వారు నల రామచంద్రనృప కాంతుని నా కనుకర్త చేసి యొ
వ్వరు నిల నేరికిన్ సలుపఁ బాల్పడజాలని యంత మేలొన
ర్చి రహిని దృష్టిఁ జెందె గుణసింధుఁడతండు, గతించియున్ యశః
పరిణతి కల్మి నేఁటికి నభంగురుఁడై వెలుఁగొందు, నాధురం
ధరుఁగన నేను మీ "విరవ" తప్పక వచ్చెడునప్డు నిన్నొగిన్
బరిపరి మెచ్చువాఁడ, గుణభావుకుఁగా మదిఁ గాంచువాఁడ న
ట్లరిగెను జాలకాల మొకయప్పుడు నిన్గని దేనిఁగూర్చి నే
నతిముదిత మాటలాడు పని యప్పటిలో ఘటియింపలేద, నై
నరసెను మీ సలున్ శిరము నాకును నీకును నంతలోన నీ
సరసత నాకుఁ బూర్తిగ వెసన్ గనయ్యెను, శిష్యుఁడై సుహృ
ద్వరమున నన్ను జూచినయది నాకగు లావు, సోదరుఁడు ప
గ్గురుతను లోఁగి చేసిన సుకృష్టు మహానల మేలు పూర్తిగా
మఱచెడి యంతసంతసము మానక యొక్కక్షణంబులోన వా
విరి నొసరించి నాకుఁ గడువేడుక నీవు ఘటించితీతితీ
వురువు నాకుఁ జేసినమహోపకృతిన్ గణియింతు నిన్ను నా
చెలువిలవర్గమున్ మఱియుఁ జెప్ప నెడింబులున్ సమస్తమున్
సురుచిరభంగినై మిగుల నోర్పనెంచుట కీవు చూపునా
దరమె నిమిత్త, మెప్పుడొ యుదారగుణాఢ్యుఁడు లచ్చిరావు నన్
గుఱిపోయిఁ బిల్వనంపియు నసుంగవైఖరి నాదరించి "యీ
శ్వరియగు రామమాంబ యిటు చల్లటికాన్పు యొసంగి" నంచు నా
కరమునఁ గొంత ద్రవ్యమిడి "కైకొనుఁ డీతి సనసనూపమున్
చిరిఁజోరి" నంచుఁ జెప్పె, నటుపోయెను గొన్నొకకాల, మంతలో
నరిగెనతండు స్వర్గమున, కాపయి శ్రీయుతరామమాంబ నా
గరిమ నెఱింగి వార్షికముగా నొకకొంత యొసంగఁ జెప్పె వ
త్సరములుమూఁడు నాలు గిటు సాగను బిమ్మట వార్షికంబు రూ
పఱునసుకొంచునుండ భగవత్కృపఁ బుత్రిల వచ్చె నెండిలున్
కరముఁ దటస్థమై తలుపుఁగా నినుఁగాంచి "భవిష్యదర్థప్రన్
దెరువెటు" లంచు నేనడుగఁ దేఁకువఁ గ్రొన్నని నీదుసాయపున్
గరిమను జేసి వార్షికము క్రిస్మస్ నెప్డు శుభంబు లబ్బిన
త్తఱినొసరించు సాయముగఁ దర్పయు మాటినభంగి దయ్యె నీ

ఏకసతి నోఁచునోములు భవత్సుకృతమ్మను నిన్ని యేకమై
సుకరముగాని రాజకులసోముని వేంకటగిర్యధీశపు
త్రికు నొగి నల్లువానిఁగఁ గరంబు లగింపఁగఁజేసె నింతయొం
దుకు? నతఁడెంత కోఁడయినఁ దొల్లిటిచుట్టము కాఁడె? మేనమా
మకొమిరగాదె? నీకొమిర, మానుదమన్నను మాను టెట్లు? "ము
ద్రికు బుజమెగ్గఁడేనియుఁ బదంపడి వీఁపదియాక్రమించు" పో
లిక యిటుఁ గానఁగాఁబడె ఒలే? కడు మెచ్చఁగవచ్చు నిట్టి పెం
డ్లికిఁ జనుదెంచు కన్నను గడిందిమహోత్సవ మింక నేది? నా
కొక శుభకార్య మింటఁ గల దోకవి మిత్రిమ? మత్తనూజు పెం
డ్లికి మఱినీ కుమారి రమణీమణి పెండ్లికి మూర్తమొక్కటై
ప్రకటితమైన హేతువున రాఘటియింపక పోయె, నందుచే
నికటమునం దొనర్చెడి పనిన్ దవుదవ్వులనుండి చేతు, నీ
దుకొమిరె భాగ్యపుంగతులతోఁ దులదూఁగుటకేల? స్వస్తివా
చకపఠనంబు, లల్లు[illegible] ప్రసన్నగుణాఢ్యుఁడు రాజమౌళి యా
మెకు వినఁజెప్పఁడయ్యెనా? యవేయముభాగ్యము ప్రశ్నెనప్పుడే —
యిఁక సుకవీంద్రవాక్యముల కెయ్యది సాధ్యము దాని కోసమొం
డొక జతసంబు గావలయు నుత్తమురాలగు నీదుకూఁతు రె
న్నికగల పుత్రిలం బడసి నిత్యలసత్సదువరాలునై సు
ద్రికి నెలవై మనోహరుని తియ్యము నెయ్యము చాలఁ గాంచి నూ
టికిఁ బయిగా సుఖమ్ముగఁ గడిందిఁ గాపురమాచరించి నూ
తకవచనంబు సార్థకతమై జగ మెక్కుడుగాఁ జేయుఁగావుతన్. ౧౦౭౯

## శ్రీమన్యంమహాలక్ష్మమ్మ జమీందారుగారు గూటాల- యానాము.

సీ. పోసరించితివి మహాపుణ్యకార్యమ్ముల స్వర్గలోకంపు సోపానములుగ
ఇచ్చిపుచ్చితి వెన్ని యెందఱికో భూమిఖండమ్ములను మహోద్దండగరిమ
కట్టించితివి దేవళము సంతోషించ దేవళమ్ముల నెందు దీప్తి యొసఁగ
చేయించితివి తృప్తిచెన్నారఁగా మేటిసంతర్పణముల ననంతములుగ

గీ. గరువమును మాటెఱుంగవు కలిమి గలిగి, సర్వసామాన్యమౌ మనుష్యగతి నుండు
నఖిలధర్మమ్ము లెఱుఁగు మహాత్మురాలవు, లలితసుగుణకదంబ శ్రీలక్ష్మమాంబ.

2. మ. అన్యాయమ్మరవంత యే నెఱుఁగ వత్యైశ్వర్యపర్యాప్తవ
య్యు న్యత్కించి దపిప్రవృత్తమతి నీవొక్కప్పుడుంగావు వే
లన్యోపిత్తతి నీసమానలు మహాలక్ష్మ్యంబరో? నా స్తి మేల్
మన్యంవంశము నీ కతంబునన సుమ్మా? ధన్యముక్ మాన్యముక్ ౧౦౮౧

3. మ. ఉపవాసమ్ములు తీర్థసేవనము లెన్నో దేవతాపూజ లె
ల్లపురాణమ్ములవిన్కి దానము మహాలక్ష్మ్యంబరో నీవు మ
న్యపువంశమ్మునఁ గాలువెట్టిన దినంబారంభమై నేఁటికిక్
సుపథప్రక్రియ సాగుచున్న వొకహెచ్చున్ దగ్గులేకుండగక్ ౧౦౮౨

4. ఉ. ఎన్నికుటుంబముల్ మనిచి తెందఱుచుట్టల పెండ్లిపేరఁటా
లన్నెఱేఁ జేసితీర్థయువు లక్షల కన్యాకన్యలించి తెంగు నీ
వన్నము నెన్నిలక్షల ధరామరకోటికి మద్రసాస్తసం
పన్నముగాఁ గఁ బెట్టితివి మన్యము వంశము మాన్యమాటకుక్. ౧౦౮౩

5. చ. ఎనుబది యేండ్లదాపు వయసిప్పుడు నీకుఁ బదేడులెట్టులో
జని మొదలేగ నంతట రసాపతిరాణిపదంబుఁ దాల్చి యా
దినమున కీవొనర్చినవితీర్ణని లెక్కయొనర్చ దుర్వ్యయం
బనినది వైసయేనిఁగలదా?" యన "నాస్తి" యటంచుఁ దెల్పెదక్. ౧౦౮౪

6. శా. గోచీవెట్టిన దాది నిన్నెఱుఁగుదుక్ గోషట్లసేకాదు నీ
యాచారమ్మను దాత్వతాగరిమ సత్యాసక్తి నిర్గర్వతా
పారిచర్యమ్మను దీనపోషణము నెప్పట్లన్ గనంబోల దే
లా? చెప్పక్ వలె నిన్నుఁ జెప్పియు మహాలక్ష్మ్యంబ? వేయొక్కరిన్ ౧౦౮౫

7. ఉ. ఎంతవ్యయించి తంతయును నెన్నిక చేసిన స్వార్థమందు నొ
క్కింతయులేదు నీధనము దొంగటికి ఘన్నము చేసిపున్నె నో?
యంతునుబొంతునుంగలదె? యమ్మరొ? నీసుకృతాన కిట్టి నీ
పంతము జీవితావధిగ భాసిలఁగావుత మొక్కగతిగక్. ౧౦౮౬

8. మ. ననుబాల్యంబది యూదిగానె లేఁగి యేనాఁడేని నేవచ్చినం
తనె వెన్వెంటనె దర్శనంబొసఁగి సంతోషంబు కన్నన్ గడున్
ఘనసంప్రీతిని జూచునీయెడల నిక్కమ్మైననా పేర్మిచ
క్కనినీకీర్తికి శాశ్వతింపు గరిమన్ గల్పించె నీరీతిగన్. ౧౦౮౭

9. చ. జరిగెను జీవితం బిటులు స్వఃపురికేగెడు మెట్లుగా నవం
తరభవదీయజీవితము తప్పక యీగతినే మహోయశ
స్కరమగు ఫక్కినై జరుగుఁగాక యటంచును నీకు వేంకటే
శ్వరకవి దీవనల్ సలిపి పద్దెములంపె గ్రహింపు మమ్మరో? ౧౦౩

## శ్రీ తేలప్రోలు జమీందారుగారు—నూజివీడు.

చంపకమాలిక.

1. కొమరుని పెండ్లికష్టమిముఁగోరితిఁ "దోఁచినవట్టు నాకు సా
యము నొనరింపుఁడం చటు సహోదరుమొనర్పఁగఁ దాము నెమ్మితో
సమయమొనర్చి చేయుతతి సందియమొందు తటస్థమై రయం
బమర భవద్వితీర్ణమగు నర్థము ముట్టకయే స్వకీయ గ్రా
మము కడియమ్ము వేచనిసమాట భవన్మనమే యెఱుంగు, నె
ట్లు మొదట విన్నవించితి నటుల్ లవలేశము దప్పకుండఁగాఁ
గొమరు వివాహ మయ్యెదియుఁ గొండొకలోపము లేక యయ్యె లో
పము గనుపట్టుమిఁక దనుదు వ్రాసి ధనంబునుగోరనైతిఁ గా
ర్యమయిపమీఁదఁ గోరి ధనమ్మజ్ఞన చేసెడివాఁడఁగాఁ" నటం
బమునైన మీహృదయ మస్మదుదంత మెఱింగియుంటచే
శ్రీమపతి గాన్కై యిటు సాక్ష్యము నిక్కము నాపనెంచ, నా
క్రియము సమగ్రముఁ దెలియఁగాఁ గలరీ" యని యెంచి; ప్రస్తుత
ప్రమదము విన్నవింతు నగపాలక[illegible]? తేలప్రోలిభూ
[illegible]? కొమరుని[illegible] రాజమైయిఁక దగఁ బెండ్లిసేయు మూ
[illegible]ము దరి[illegible], నిని "దైవకృత"[illegible] యెం[illegible] నేను స్వ
ప్నమునెపుడుగూడ "నిశుభము భావ్యము నేఁ" డని యెంచలేను, "దై
వము న[illegible] సర్వ" మని ప్రా[illegible] యెంచిమాడ స
[illegible]? శోధనాద్రి వసుధాసుము[illegible]? నేఁడు తన్నిమి
[illegible]ము దరిసింపనిచ్చితిని నమ్మకపుమిమ్మలిమాట "మీదుచి
[illegible]ము నుపేయభాగ్యమును దైవమె దానికిఁగూడఁ బూఁట ప్రి
య్యము[illegible] గొన్నచో సుతవివాహము పట్టున దానిఁ గూడ వె
చ్చము నొనరించి యుండుననలు సల్పక నిల్పుటఁజేసి నేను మీ
సముఖము కల్పవృక్షమయి చాలఁగ నా కుపకారియయ్యె, నం
చు మునము పెంచుచుంటి, ననుఁజూడఁగ వేఁడెదఁ బెద్దమాపునన్. ౧౦౪

## శ్రీ వాడరేవు విశ్వసుందరరావు జమీందారుగారు, దొడ్డంపేట.

చంపకమాలిక.

పరిచిత వాడరేవుకులాగ్రణి? దొడ్డపేటవిశ్వసుం
దరధరణీసురప్రభువతంసా? యశస్కరా? రంగనా[illegible]
చిరకృతభాగధేయ? నరసింహనామసూభవా? నీవు పుట్టినిక
స్థిరకీర్తి బలిక్రితాఘణి ప్రభూజని హేతువు వాడరేవుప
ద్వరకులపద్మపాళికి సువాసనఁ గూర్పఁగఁ జాలునట్టినీ
చరితము నాలకించి కడుసంతసముఁ గనుచుంటిఁ జాలద
గ్గఱఁ గడియమ్మ కాపురముగాఁ గలవాఁడనె యయ్యు నెన్నఁడున్
దరిసెనమాచరించుపని దైవవశమ్మునఁ జేసి నాకు జే
కుఱ, దొకసారి వచ్చితిని గొండొక కార్యము మీఁదఁ రెండవ
త్సరములనాఁడు మార్గవశమ్మున నేఁడైన నోర్పపాల? యిం
జరమున నేగుచుఁ దుదకు జాతకపుఁ బలమస్థి చాలమిఁ
దొరకొనదయ్యె దర్శనము, తొందరగాఁ బని యుంటఁ జేసి నే
మరలితి వెంటనే, పిదప మాటికి మాటికి రాఁదలంచి నేఁ
దలఁ చనుకొందు గాని యది దైవవశమ్మన నెక్కుండు నిం
జరమున నేగు చింకనొకసారి యతించితిఁగాని పూర్వపు
త్సాముననఁ బూర్వరీతిగనె దర్శనభాగ్యము నందనైతి, ము
న్నటిమటి దేశముల్ తిరిగి యందుపయిన్ విసువబ్బుటన్ గృహా
దరమున నుండి కొండొకపదమ్మునదున్ జను టిప్పుడంతగా
సరిపడ, దెవ్వరో మిగుల సన్నిటు నర్పర మోసుదెంచి సా
దరమున వెంటఁ బెట్టికొని తప్పనికార్యము లున్న యొప్పు డ
న్నరత గణించి సత్ఫలకుఁ గొనిపోవుట తప్ప సేయుగాఁ
బరిసరవర్తియున్ సకలపట్టణరాజము రాణ్మహేంద్రమే
నరయఁ బ్రయాణముఁ సలుపు నట్టిప్రసక్తియుఁ గూడ లేదు, బం
దరుపురిఁ దక్క వేఱొకటఁ దావకదర్శనభాగ్య మెన్నఁడుఁ
దొరకొనదయ్యె నేఁడు మిముఁ దరిసించెడి కోర్కె వచ్చితిన్
బారి మును నెట్టు లయ్యెననెపో! యిపుడుఁ ఘటించె వేఱొక
ప్పరయఁ దలంచి మున్వలెనె యాత్మపురమ్మున నేగుచుంటి, బల్
గిరువము నొందుమందుఁ గవికల్పధరాజము పండితుండు పో

ల్వగపతి కృష్ణరావు మనబ్రాహ్మణభూపతులందు మేటియై
వెలయుటం జేసి, యాతం డలస్వర్గపురం బొనరించు భాగ్యపుం
గరిమ ధరన్ ద్యజించి చనఁ గర్వము నన్నుఁ ద్యజించె నయ్యనం
తరమున నీగుణాధికత తద్ద వినంబడి "యిట్టివాఁడు భూ
సురకులపుఙ్ జమీన్విభుఁడు శుద్ధచరిత్రుఁ డొకండు గౌతమీ
పరిసరమంద చేకుఱుట భాగ్యము నందును మేటిభాగ్యమం
చదయుచు నుంటి, నీ కిఁక నిరామయదీర్ఘతరాయురున్నతీ
స్థిరతరభాగ్యముల్ గలుగఁజేయుత శ్రీపతి యంచు దీవనల్
నెఱపి ముగింతు నిప్పటికి నిన్ను గుఱించిన పద్యమాలికన్. ౧౧౧౮

## ఇటీవలఁ జెప్పిన పద్యములు.

2. శా॥ నూటార్థుల్ బహుమాన మిచ్చి కడుసంతోషమ్ము దైవాన
తాఁ బ్రాసంగిక మాత్రజాతువడుగున్ దర్పాత్త నాపెండ్లియున్
శ్రీరంజిల్లఁగ నుడించి తగ "విచ్చేయుం"డటంచే నటుల్
కోరంగాఁబడి రాని పోతువును నీవున్ వ్రాయుచుంటి నృపా. ౧౧౧౯

3. క॥ కొమిరెల కిర్వోగకును నో, క్రమాగ్రమునఁ బెండ్లి సేయఁగాఁ దలఁచియు
సముఖమున కపుడు వచ్చితి, సుముహూర్తము వేఱు వేఱ చొప్పడెఁ బిదపన్.

4. ఉ॥ ఒండొకనాఁటు పెండిలిముహూర్తము మీ తనుజాతు పెండ్లియో
క్రొండగు కాల మందగుట కారణమై చను దేర నైతి, మీ
రొండువిధమ్ముగాఁ దలఁపకుండుగాక వహావరుల్ చిరా
ఖండపరాయురున్నతులు కొనసాగుచుగాక యేకమై.

## శ్రీమంత్రిప్రగడ రాజాగారు పలూరు.

1. శా॥ శ్రీమంతుండవునై, కళాకరుఁడవై, స్థిరాఖండుండవై
భూమీదైవతకోటిలోఁ బ్రభుఁడవై పూజ్యారనీయారయు "వా

యామారోగ్యవిశిష్ట మౌత"మని నే నాశీర్వదింతుఁ ద్విజ
స్వామీ? రాజ? భుజంగరాడధిపతీ? సంతానవాణీపతీ.

2. మ. మొన మీదర్శన మాచరించితిని సమ్మోదమ్మునైఁ బుత్రికా
జనకళ్యాణములన్ గుఱించియు భవత్సాహాయ్యసంపత్తికై
మనవిన్ జేసితి జ్ఞాపకార్థమిటు నమ్మాటన్ బొసంగించితిన్
బునరుక్తం బన కాదరించుటకు మిమ్మున్ సారెకున్ గోరెదన్. ౧౧౩

చంపకమాలిక.

3. వినుము భుజంగరాడ్విభుకవిప్రవరా? "శుభమస్తు" శుక్లఫా
ల్గునబహుళద్వితీయ నలగోపతివారమునాఁడు హస్తయం
గున వృషలగ్నమందున, ననుంగుఁగొమార్తల పెండ్లిముహూర్తమం
చును వచియించియుంటిని, శిశుత్వవయస్సున నున్నవాడు నం
దనలకు శారదాఖ్యుఁడు ధర్మవిరుద్ధముగా విధించు శా
సనమునుబట్టి పెండిలి ప్రసక్తికి వచ్చినదయ్యె రాజశా
సనమును బట్టి యీపయి రజస్వల యౌతనుజాతకే మహా
జనులు వివాహముల్ సలుపుసంగతి గాపర మౌనుగాక యం
దున నొక "గోసనుబ్బు"నని తోఁపదు నామది కెందు దైవశా
సనమును రాజశాసనము సర్వజనుల్ శిరసావహించుటల్
చను, నగవంతుశాసనము చాలజనుల్ నిరసింతురు వారికిన్
గనుపడదిందు శాస్త్రి క్షితికాంతునిశాసన మట్లుగామి దీ
నిని నిరసింప రెవ్వరు మనీషులశాస్త్రము లెల్ల దీని వం
చనఁ బడి వాఁడి గోల్పడియె శాసనకర్తృపమ్ము వేలు శా
సనముభరించువారిమతసంతతి వే ఱిది "గోకులాష్టమిన్
ఘనుఁడని సాహెబయ్య నడుగంజను పోలి;—కి" వచ్చెఁ "బేను పె
త్తన"మను నట్టులీ సుతుని ధార్ష్ట్య మదింతటఁబోక యెన్నిగా

4. తే. గీ. అన్నదానసమాజంబునందు బోలె నీసమాజమ్మునకుఁ బ్రజలేలరారు?
అదియు నిదియుఁ బీదలకె సుం డరసికొనుఁడు, గంగరాట్పుత్రి సార్థకగరిమనొందఁ.

5. సీ. గోరక్షణకె కాక గోరక్షణకుఁగూడ విత్త మిచ్చిన యుత్తమోత్తముండు
సాధుకోటికె కాక సాధుకోటికిఁగూడ బాంధవ్యమును జూపుపరమహితుఁడు
సుమనస్తతికె కాక సుమనస్తతికిఁగూడఁ జేయెత్తి మ్రొక్కెడి శ్రీయుతుండు
న్యాయవాదికె కాక న్యాయవాదికిఁగూడఁ జోటిచ్చి మానించుసుగుణగణ్యుఁ
డాగజాంత మైశ్వర్యంబు ననుభవించుచున్నవాఁడు పురీజనుల్ తన్ను మెచ్చ
గంగరా జింతకన్నను ఘనసుకృతము, లాచరించుత దీర్ఘాయు వంగుఁగాత. ౧౧౩౫

## శ్రీ చల్లపల్లిరాజాగారు-ఏలూరు

1. చ. సుగుణములన్, యశోగరిమ, సూరిజనస్తనీయసత్కళా
భిగమతతో, సల్లభంగులను వేరువహించిననీదురాక మ
మ్మగణితమైన గౌరవము నందఁగ జేసెన్నృపాల! స్వాగతం
బగుత శివప్రసాదనృప? యావులపాలిటి కల్పవృక్షమా!

2. చ. నిగమములన్ బురాణముల నిర్మలవస్తువులందు నిర్మలం
బగుననిగోవుచెప్పఁబడు నట్టిపదార్థము విప్రజాతిపై
నుండుట పూర్తిగా నెఱిఁగి నీతివిదూరులు దానిఁజంపున
య్యాఁడునడంచు నీకగుత స్వాగత మోచలపల్లిభూవరా!

3. చ. మముఁగరుణింపఁ గాఁదగినమానిసియొక్కఁడు లేఁడె యంచు దుః
ఖము మెయివార్చుచున్ వధకుఁగాఁగఁగసాయికిలోఁగిపోవు గో
వు మొగము మాడలేముగద; భూపతి మౌళి! శివప్రసాద! ప్రే
మమునటుఁజూపునిన్ను వియె మన్నుత స్వాగతమిచ్చి సర్వదా. ౧౧౩౬

4. ఉ. స్వాగతమో నృపాలమణి! స్వాగతమోయి శివప్రసాద! మేల్
స్వాగతమో కృపానిలయ! స్వాగతమయ్యా! నరేంద్రపుత్ర! నీ
యాగమనంబు మాపురజనాళి యొసర్చెడి ధేనురక్షకున్
స్వాగతమబ్బఁ జేసె, నిగిసత్యము సత్యము సత్యమో నృపా. ౧౧౩౭

శా. గోరక్షాప్రతిబద్ధకంకణుఁడవై గోరాణ్మహావైభవ
శ్రీరంజిల్లెడి వాఁడవై సుకవితాసీమంతినీ భాగ్యరే
ఖారారాజదపారకీర్తినిధివై కళ్యాణపుం గొండవై
పేరందంగలనీకు స్వాగతముగున్ బృథ్వీశమూర్ధామణీ. ౧౧౫౦

## ప్రొఫెసరు శేఖరు వివాహము—బందరు.

1. క. శ్రీయువతియనుగ్రహమున। నీయన్నంబలెనె సిరికినెలవై సతతం
బాయురారోగ్యాదికముల। కాయతనంబగుము శేఖరా! సతితోడన్. ౧౧౫౧

2 క. నీయన్నకు మంగళగిరిరాయుండగు పానకాలరాయఁడు పెండ్లిన్
జేయించె స్వసన్నిధి నీ, కాయన స్వగృహమ్మునంద యదికావించెన్. ౧౧౫౨

3. శా. నీయన్నన్ మనమందుఁ జెట్టుకొనుచున్ మిన్నందు వర్తించుచో
శ్రేయస్సుల్ తమయంత నీకు వశమై చేమోడ్పుగావింపు నా
యీయౌన్నత్యము నీవు నన్నకెటుగా నేర్పడ్డదన్నన్ శిశు
ప్రాయంబాదిగఁ బెద్దలందు మిగులన్ భక్తుండుగానుంటనే. ౧౧౫౩

4. మ. ధనమార్జించినవారు వెక్కురిలలో, దత్తన్మహాభోగులన్
ఘనులేమాత్రముఁ జేరికింగొనరు నిక్కమ్మింత నీయన్నయే
గొనముల్ గల్గి కవిప్రియుండగుచు శ్లాఘ్యుండయ్యెనో, దానియం
దుననే నీమతి సంచరించుమత సముద్యోగుల్ ప్రశంసింపఁగన్. ౧౧౫౪

5. మ. ధనముల్ విద్దెయు నీకు సర్వమును సిద్ధంబై యొసంగెన్ గదా?
వనితారత్నము చెట్టవట్టితివి తద్వాల్లభ్యముల్ గాంచి యు
న్నను శ్రీశేషగిరిన్ గణించి యలసంతానమ్మునుంబోలెఁ జ
క్కనిసంతానము సోమశేఖరవరా? కాంచంగ దీవించెదన్. ౧౧౫౫

## శ్రీబొబ్బిలి పట్టాభిషేక కృతిసమర్పణపద్యములు

1. శా. చేసెన్ దీనిని వేంకటేశుఁడనుమన్ జెప్పంగ నీలోకమం
దేసత్యమ్మను లేద లేశమును నేనేతాదృశంపుంగవి
త్వాసక్తిం దిగఁద్రావియున్నయపు డెట్లబ్బెన్ గృతార్థత్వముల్
నీసంకల్పబలమ్మ నమ్ము నృపతీ? నిక్కమ్ముగా నే జెప్పితిన్. ౧౧౫౬

శా. వ్యాసుం డా జనమేజయుంగుఱిచి సర్వమ్ముం దవించెం గదా?
శ్రీసంపన్నము భారత, మ్మలపరిక్షిత్పుత్రుఁ డేమిచ్చెనా
వ్యాసుం డేమి గ్రహించెఁ గీర్తియుక్తదే వ్యాపించె నద్దిక్కులన్
నీ సామ్రాజ్యము కీర్తి మంతమగుటే నే నెప్పుడుం గోరనన్. ౧౧౬౪

0. ఉ. త్రైలోక్యముండఁ బట్టి వెస రాజకళాశము గల్గవచ్చు నీ
వేలకటంచు నిన్నిపుడు వేలనుగోరుటగాని పూర్వపుం
గాలమ్మెయైనచో నడుగఁగా మనమే తెరువీయఁ గబ్బపున్
బాలికనిచ్చి రాకరొము మానుమయయ్య నృపాల? చెప్పుమా? ౧౧౬౫

1. ఉ. రాజులకిచ్చు కన్యకలు రాణులలంబలెఁ బుట్టినిండ్ల కె
న్నేఁ జనుదెంచుటన్గ్బన నహీనుఁడు భర్తయుఁ దాము వత్తు ర
య్యోగ్య భరింపఁగాఁ గల మహోన్నతులే కవు? లట్లుగాన నో
రాజవరేణ్య? కూఁతు లలరారెడిచోటికి రాకతీరునే? ౧౧౬౬

2. ఉ. శ్రద్ధగనమ్ము గంగనిన విద్వ, సుధామధురానులాప, యే
విధియుఁ గాని నేర్చెఁ వివేకిని, పుట్టినమెట్టినిండ్లకున్
దక్షయుఁ గీర్తిదేఁదగిన ధన్య, కవిత్వపుఁ గన్య నిచ్చితిన్
భిక్షుకు, గిక్కఁ గాఁబడదు, దీనిస్వభావ మెఱుంగఁ జెప్పితిన్. ౧౧౬౭

13. ఉ. దేశముగాని దేశమున దీని నొసంగుటకుం గతంబు నా
దేశపు సేనకూఁతురిట దేవిగ నుండుటయే యెఱుంగు, పృ
థ్వీశ? కూఁతురిటి నాఁరిందు పిలవెరి, చిరంబొసర్చి యు
ర్వ్యాశపు విద్యయుల్ సలుప వారలు మెత్తురె? రంగరాట్ప్రభూ. ౧౧౬౮

14. చ. పురవురఁ గంటెఁ గూఁతుల నహీనులకిచ్చితిఁ బెండ్లిచేసితిన్
నరవ ? దీనినాపయిఁ గనత్కన కాటుక గాత్రిఁ గంటె శ్రీ
కరుణాంతకపూరు నిను గంటు యంత వసంపతుల్య, శ్రీ
వరయఁ గయికొంటి నల్లునిగ బాపురె? నాతపమెంత ధన్యమో! ౧౧౬౯

15. ఉ. దగ్గఱ నున్న భర్త నిది తావరియింపద, యందనందపు
న్నిగ్గులు మాచిక వలయు నిన్నువరించిన దోన్నృపాల? కే
లొగ్గుము, తాతలప్పటిదియున్ గడుపకన్యము, గ పువారి స
మ్యగ్గుణముల్ గణించి మరిగూడదవు వారలపొత్తు నెప్పుడున్. ౧౧౭౦

